# అధికార భాష - తెలుగు చరిత్ర



శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయానికి
పిహెచ్.డి., పట్టం కోసం సమర్పించిన
సిద్ధాంత వ్యాసం


పరిశోధన
గొడుగు నిర్మలాదేవి
ఎం.ఎ.బి.యిడి.,

పర్యవేక్షణ
డా. మాలె విజయలక్ష్మి
రీడర్

తెలుగు అధ్యయన శాఖ
శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం
తిరుపతి - 517 502.


1999

డా. మూలె విజయలక్ష్మి
రీడర్
తెలుగు అధ్యయన శాఖ
శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం
తిరుపతి

## ధ్రువీకరణ పత్రం

*"అధికార భాష - తెలుగు చరిత్ర" సిద్ధాంత వ్యాసం శ్రీమతి జి. నిర్మలాదేవి నా పర్యవేక్షణలో శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం తెలుగు అధ్యయనశాఖలో పిహెచ్.డి పట్టం కోసం చేసిన పరిశోధన కృషి ఫలితం. ఈ సిద్ధాంత వ్యాసం మరే పట్టంకోసం గాని, డిప్లొమా కోసం గాని సమర్పింపబడలేదని ధ్రువీకరిస్తున్నాను.*

*తిరుపతి.*
*తేది :* 12-7-99

డా. మూలె విజయలక్ష్మి

## స్పష్టీకరణ పత్రం

*"అధికార భాష - తెలుగు చరిత్ర" అనే ఈ సిద్ధాంత వ్యాసాన్ని స్వయంగా రూపొందించాను. ఈ సిద్ధాంత వ్యాసాన్ని ఏ విశ్వవిద్యాలయానికి గాని, మరే ఇతర సంస్థకు గాని, ఇతర పట్టంకోసం గాని, డిప్లొమా కోసం గాని సమర్పించలేదని స్పష్టపరుస్తున్నాను.*

*తిరుపతి.*
*తేది :* 12.07.1999

G. Nirmala Devi
గొడుగు నిర్మలాదేవి

## కృతజ్ఞతలు

*పర్యవేక్షణ బాధ్యత వహించి, ఆదరణతో ఉత్సాహపరచి, అవసరమైన సలహాలనిచ్చి, అమూల్యమైన గ్రంథాల నిచ్చి నా పరిశోధనను సుగమం చేసిన సహృదయులు* ***డా. మూలె విజయలక్ష్మి*** *గారికి నమస్సుమాంజలి.*

*పరిశోధనాంశాన్ని సూచించడమే కాక, తమ అమూల్య సలహాలతో ప్రోత్సహించిన గురువర్యులు* ***ఆచార్య కేతువిశ్వనాథరెడ్డి****గారికి వినయాంజలి.*

*నా పరిశోధనకు అవకాశమిచ్చి సహకారాన్నందించిన తెలుగు అధ్యయనశాఖ అధ్యక్షులు* ***ఆచార్య పి. కుసుమకుమారి****గారికి, అధ్యాపకులు* ***డా. డి. కృష్ణకుమారి, డా. పి. శరావతి, డా. కె. మధుజ్యోతి****గార్లకు నమస్సులు.*

*పరిశోధనకు అమూల్యమైన సలహాలనిచ్చి, ముందడుగు వేయడానికి వెన్నుతట్టిన అధికార భాషాసంఘం ప్రథమ అధ్యక్షులు* ***శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య*** *గారికి -*

*అధికార భాష గురించి అవగాహన కలిగించి ఇలాంటి పరిశోధనలు అవసరమని నన్ను ప్రోత్సహించిన* ***డా. బూదరాజు రాధాకృష్ణ****గారికి -*

*అమూల్యమైన సలహాల నందించిన అధికార భాషాసంఘం సభ్యులు* ***సి. ధర్మారావు*** *గారికి, సంస్కృత, ప్రాకృత శాసనాలకు సంబంధించిన అనేక విషయాలను తెలియజేసిన* ***శ్రీతిరుమల రామచంద్ర*** *గారికి,* ***శ్రీ నాగోలు కృష్ణారెడ్డి****గారికి -*

*రాజ భాషగా తెలుగు చరిత్రను తెలియజేసిన* ***కీ.శే. శ్రీతూమాటి దొణప్ప*** *గారికి -*

*అధికార భాషా సంఘం వివరాలను, కృషిని తెలియ జేసిన అధికార భాషాసంఘం మాజీ అధ్యక్షులు* ***శ్రీ వందేమాతరం రామచంద్రరావు*** *గారికి,* ***కొత్తపల్లి వీరభద్రరావు*** *గారికి,* ***శ్రీమతి యశోదారెడ్డి*** *గారికి,* ***కీ. శే. శ్రీ గజ్జెల మల్లారెడ్డి****గారికి -*

*విషయ సేకరణలో కావలసిన గ్రంథాలందించిన సాధారణ పరిపాలనశాఖ ఉద్యోగి* ***శ్రీ కోటేశ్వర రావు****గారికి, రీసెర్చ్ ఆఫీసర్* ***శివరావు*** *గారికి,* ***పి. ఆర్. ఓ. శ్రీనివాసులురెడ్డి*** *గారికి -*

*అధికార భాషకు సంబంధించిన అవగాహనను పెంపొందించిన ఆత్మీయురాలు* ***శ్రీమతి డి. విజయలక్ష్మి*** *గారికి -*

*నా పరిశోధనకు సలహాలనిచ్చి ప్రోత్సహించిన* ***చేకూరి రామారావు*** *గారికి, హైదాబాద్,* ***శ్రీ అనుమాండ్ల భూమయ్య*** *గారికి,* ***శ్రీ బి. అయిలయ్య*** *గారికి (కాకతీయ విశ్వ విద్యాలయం),* ***ఆచార్య పి. నరసింహారెడ్డి*** *గారికి,* ***శ్రీ ప్రసాదరావు*** *గారికి (శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం),* ***డా. బోయి విజయ భారతి*** *గారికి (తెలుగు విశ్వ విద్యాలయం)* ***డా. అండమ్మ****గారికి (కోటి మహిళా కళాశాల హైద్రాబాద్),* ***డా. బేతవోలు***

రామబ్రహ్మం గారికి (తెలుగు విశ్వ విద్యాలయం, రాజమండ్రి), చిలకపాటి విజయరాఘవాచార్యులు గారికి (ఏ.వి. ఆర్. కాలేజి నాగార్జునసాగర్)

పరిశోధనకవసరమైన గ్రంథాలనందించిన శ్రీపద్మావతి మహిళా విశ్వవిద్యాలయం, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, రాష్ట్ర కేంద్రీయ గ్రంథాలయం, శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయం, ఉస్మానియా విశ్వవిద్యాలయం, తెలుగు అకాడమి, కాకతీయ విశ్వవిద్యాలయ గ్రంథాలయాధికార్లకు -

జీవిత లక్ష్య సాధనకు నిరంతరం కష్టపడాలని బోధించి పరిశోధనకు స్ఫూర్తినిచ్చిన అమ్మానాన్నలకు, పరిశోధనలో అడుగడుగునా వెన్నుతట్టి ఆర్థిక సహకారాన్నందించిన అన్నయ్య రవిశంకర్‌కు-

గ్రంధ సేకరణలో తోడ్పడిన చెల్లి శ్రీమతి జయప్రదకు, రమేశ్‌కు, తమ్ముడు చంద్రశేఖర్‌కు -

ఆంగ్లగ్రంధాలను తెలుగులోకి అనువదించి, నా పరిశోధన పూర్తి చేయడానికి తోడు నీడగా సహకరించిన నాజీవన సహచరుడు శ్రీ.కె. వాసు గారికి -

ఈ సిద్ధాంత వ్యాసాన్ని టైపు చేసిచ్చిన కీర్తి ప్రింటర్స్ వారికి -

పరిశోధనకు ప్రత్యక్షంగా, పరోక్షంగా సహాయపడిన పెద్దలకు, ఆప్తులకు కృతజ్ఞతాంజలి.

— గొడుగు నిర్మలాదేవి.

# విషయసూచిక

# ప్రవేశిక

భారతదేశం బహుభాషా ప్రాంతం. భిన్నజాతుల, మతాల కూడలి. భాషాపరంగా, సంస్కృతి పరంగా భిన్నత్వంలో ఏకత్వం సాధించింది. 2000 పై చిలుకు భాషలు వ్యవహారంలో వున్నా, భారత రాజ్యాంగం గుర్తించిన భాషలు 18. ప్రాచీన కాలంలో ప్రధానంగా ప్రాకృతం, సంస్కృతం, బ్రిటిషు యుగంలో ఆంగ్లం రాజభాషగా వర్ధిల్లాయి.

భారత స్వాతంత్ర్యానంతరం 1950 లో భారత రాజ్యాంగాన్ని రూపొందించే సమయంలో అధికార భాషా నిర్ణయ సమస్య వచ్చింది. హిందీని మాట్లాడే ఉత్తరాదివారు హిందీని అధికార భాషగా చేయాలని ప్రతిపాదించగా దక్షిణాది వారు ఆంగ్ల భాషకు ప్రాముఖ్య మిచ్చారు. చివరకు హిందీ అధికార భాషగా నిర్ణయింపబడింది.

తమిళనాడు, ఆంధ్ర 1953 సెప్టెంబరు 'వరకు మద్రాసు రాష్ట్రంగా వున్నాయి. భాషాపరంగా ఆంధ్రులు ప్రత్యేక రాష్ట్రం కావాలని చేసిన డిమాండు భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుకు నాంది అయింది.

పొట్టిశ్రీరాములు బలిదాన ఫలితంగా 1953 అక్టోబరు 1వ తేదీన కర్నూలు రాజదానిగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. ఆంధ్ర, తెలంగాణా సమైక్యతగా 1956 నవంబర్ 1న ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది.

విశాలాంధ్ర ఏర్పడగానే ప్రథమ కర్తవ్యంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగును అన్ని స్థాయిలలో అధికార భాషగా చేసినట్లయితే విశాలాంధ్ర సాధించినందుకు నిజమైన సార్థకత వుండేది. కాని అలా జరుగలేదు.

మద్రాసు రాష్ట్రం నుండి విడివడిన ఆంధ్ర నాయకత్వం ఆంగ్లాన్ని వదలలేక, నైజాం పాలన నుండి బయటపడ్డ తెలంగాణా నాయకత్వం తెలుగును అధికార భాషగా అమలు జరుపటానికి తీవ్ర కృషి చేయనందువల్ల తెలంగాణా, ఆంధ్ర రెండు ప్రాంతాల్లో కూడా ఆంగ్లం అధికార భాషగా, బోధనా భాషగా మిగిలిపోయింది.

"దేశ భాషలందు తెలుగు లెస్స" అని "ఇటాలియన్ అఫ్ ఈస్ట్" గా విశ్వ విఖ్యాతి గణించి, సాంకేతిక పరిజ్ఞానాన్ని ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలకన్న మిన్నగా సమన్వయింప గలిగింది తెలుగు అని ప్రొఫెసర్ హాల్డెన్‌చే గుర్తింపబడింది. భారతదేశంలో వ్యవహారంలో రెండవ స్థానంలో వుంది. అయినా తెలుగు పరిపాలనలో, బోధనలో, సముచితస్థానం పొందలేక పోయింది.

1956లో భాషాప్రాతిపదికపై రాష్ట్ర నిర్మాణం జరిగిన తర్వాత ప్రాంతీయ భాషలు, పరిపాలనా, న్యాయ భాషలుగా, బోధనా మాధ్యమాలుగా రూపొందించే ప్రయత్నాలు సాగాయి. ఆంధ్రప్రదేశ్‌లో కూడా యిలాంటి ప్రయత్నం జరిగింది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1966 మే 14న అధికార భాషా చట్టం చేసింది. 19-3-1974న అధికార భాషా సంఘాన్ని ఏర్పరచింది.

అధికార భాషగా తెలుగు చరిత్రను, అమలు తీరు తెన్నులను సమీక్షించే ఉద్దేశంతో "అధికార భాష - తెలుగు చరిత్ర" పరిశోధనాంశంగా గ్రహించబడింది.

**పరిశోధనలక్ష్యాలు :**

తెలుగు భాష ప్రాచీన చరిత్రను, వివిధ యుగాల్లో తెలుగు స్థానాన్ని వివరించడం.

భాషాప్రాతిపదికపై రాష్ట్రాల విభజనను వివరించడం.

ఇతర రాష్ట్రాలలో, విదేశాలలో తెలుగు వారి స్థితిగతులను వివరించడం.

రాజ్యాంగంలో అధికార భాషా ప్రకరణం - అధికార భాషగా వివిధ స్థాయిల్లో తెలుగు అమలును పరిశీలించడం. వివిధ రంగాలలో తెలుగు అమలును సమీక్షించడం.

సిద్ధాంత వ్యాస ప్రణాళికలో ఆరు అధ్యాయాలున్నాయి

**మొదటి అధ్యాయం :** తెలుగు-భూమిక.

ద్రావిడ భాషలు - తెలుగు స్థానం, ఆంధ్రం, తెనుఁగు, తెలుగు - చరిత్ర, ప్రాఙ్నన్నయ యుగం - తెలుగుభాషాస్థితి, ప్రాక్చాళుక్య యుగం, పూర్వ చాళుక్య యుగాల్లోని రాజభాషలను గురించి వివరించడం, బ్రిటిష్‌యుగంలో తెలుగు భాషా స్థితి ప్రధానాంశాలు.

**రెండో అధ్యాయం :** ఆధునిక భారతీయ భాషలు - జాతీయ, రాష్ట్ర ప్రభుత్వ భాషా విధానాలు.

ఈ అధ్యాయంలో భాషా ప్రయుక్త రాష్ట్రాలు, భారతదేశంలో అధికార భాష - ఆంధ్రప్రదేశ్ ప్రధాన భాష - ఇతర భాషలు, ఆంధ్రప్రదేశ్‌లో అల్పసంఖ్యాక వర్గాల భాషల విశ్లేషణ ప్రధానాంశాలు.

**మూడో అధ్యాయం :** అధికార భాష - తెలుగు చరిత్ర

ఆంధ్రోద్యమం, ఆంధ్ర విశ్వవిద్యాలయం ఏర్పాటు, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రావతరణ, భారతరాజ్యాంగం - భాషా చర్చ, అధికార భాష నిర్వచనం - అధికార భాషగా తెలుగు తీరు తెన్నులు. గ్విన్ రిపోర్టు, అధికారభాషగా తెలుగు అమలు, ఆంధ్రప్రదేశ్ అధికార భాషాచట్టం. తెలుగు అమలుకు జరిగిన కృషి సమీక్షింప బడుతుంది.

**నాల్గో అధ్యాయం :** తెలుగు అమలు - వివిధ రంగాలు

పరిపాలన, న్యాయ, బోధనా రంగాలలో తెలుగు అమలు తీరు తెన్నులను పరిశీలించడం.

**ఐదో అధ్యాయం :** అధికార భాషగా తెలుగు అమలు జరగక పోవడానికి కారణాలు - సూచనలు.

అధికార భాషగా తెలుగు అమలు జరగక పోవడానికి గల కారణాలు, విమర్శలు, అధికార భాష సమగ్రంగా అమలు జరగటానికి సూచనలు ముఖ్యాంశాలు

**ఆరో అధ్యాయం :** ప్రవాసాంధ్రులు

ఇతర రాష్ట్రాలలో, విదేశాలలో ఆంధ్రుల ఉనికి, ప్రాభవం, విద్యా సాంస్కృతిక సమస్యల వివరణ ప్రధానోద్దేశ్యం.

అనుబంధంగా తొలి తెలుగు శాసనాలు, అధికారభాషకు సంబంధించిన చట్టాలు, జి.ఓలు మొదలైనవి.

**1.0** భారతదేశం సువిశాలమైంది. భిన్నజాతుల, మతాల సమిష్టి సంస్కృతి భారతీయ సంస్కృతి. భిన్నత్వంలో ఏకత్వానికి ప్రతీక భారతదేశం. రెండువందల పైగా భాషలు వ్యాప్తిలో ఉన్నాయి. లిపికి, గ్రంథ రచనకు నోచుకున్న భాషలు అల్పం.

భారతదేశంలో అక్షర నిరక్షర భాషలన్నిటిని నాలుగు భాషా కుటుంబాలుగా విభజించారు. అవి ఇండో ఆర్యన్, ద్రావిడ, ఆస్ట్రో ఏసియాటిక్, సినో టిబెటన్ భాషా కుటుంబాలు. ఉత్తర భారతదేశంలో ఇండో ఆర్యన్ భాషలు, దక్షిణ భారతదేశంలో ద్రావిడ భాషలు ప్రధానంగా వ్యవహారంలో ఉన్నాయి.

## 1.1 ద్రావిడ భాషలు-తెలుగు :

ద్రావిడ భాషాకుంటుంబానికి చెందిన భాషలు 21,ఇటీవల మరికొన్ని భాషలను కూడా ద్రావిడ భాషల్లో చేర్చారు. మొత్తం 27.[1]

**ఉత్తర ద్రావిడ భాషలు-3 :** కూడుఖ్, మాల్తో, బ్రాహుయి.

**మధ్య ద్రావిడ భాషలు -15 :** తెలుగు, గోండి, కొండ, పెంగో, మండ, కుయి, కువి, కొలామి, నాయకి, పర్జీ , గదబ, ఒల్లారి, కొరగ, కోయ, సవర.

**దక్షిణ ద్రావిడ భాషలు - 9 :** తమిళం, మలయాళం, కొడగు, కన్నడ, తొద, కోత, తుళు, ఇరుళ్, బదగ.

తెలుగు భాష మీద సంస్కృత ప్రభావం అధికంగా వుంది. చాలా రోజుల వరకు తెలుగు భాష సంస్కృత జన్యమనే అభిప్రాయం వుంది. ఎల్లిస్, బిషప్‌కాల్డ్వెల్ అనే పాశ్చాత్యులు ఈ భాషలను అధ్యయనం చేసి తెలుగును ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన భాషగా ధృవీకరించారు.

ద్రావిడ భాషలన్ని ఒక మూల భాషనుండి పరిణమించినవే. వీటన్నిటికి మాతృక మూల ద్రావిడ భాష. **(Proto Dravidian)** ద్రావిడ భాషల్లో తమిళం, కన్నడం, తెలుగు, మలయాళం. ఈ నాలుగు మాత్రమే సాహిత్య భాషలు. తక్కినవి నిరక్షర భాషలు, మనదేశంలోని గోవా పట్టణాన్ని తూర్పు తీరంలో పూరీ పట్టణాన్ని కలుపుతూ ఒక గీతగీస్తే ఆ గీతకు ఉత్తరాన ప్రధానంగా ఇండో ఆర్యన్ భాషలు, ఇతర భాషా కుటుంబాలకు చెందిన నిరక్షర భాషలు అనేకం వున్నాయి. ఆ గీతకు దక్షిణాన కన్యాకుమారి వరకు వున్నవి ద్రావిడ భాషలు. ఉత్తర భారతదేశంలోని పాకిస్తాన్‌లోను కొన్ని ద్రావిడ భాషలుండడం విశేషం. 1981 గణాంక వివరాల ప్రకారం భారత దేశంలో ద్రావిడ భాషలు మాట్లాడే ప్రజల సంఖ్య 15,78,36,723. భారతదేశ జనాభాలో శాతం 23.86. బర్మా, మలేషియా, మారిషస్ దీవుల్లో, ఫిజీ దీవుల్లో, దక్షిణాఫ్రికాలో కూడా కొన్ని తెలుగు కుటుంబాలున్నాయి.

తెలుగు క్రీ.పూ. 1500 నాటికే మూల ద్రావిడం నుండి ప్రత్యేక భాషగా విడివడినట్లు పరిశోధకుల అంచనా. తెలుగు మధ్య ద్రావిడ భాషా కుటుంబానికి చెందింది. ఈ ఉప కుటుంబంలోని భాషల్లో తెలుగు తప్ప తక్కినవన్ని గిరిజన భాషలే. గోండికి తెలుగు లిపి వాడడం ఈ శతాబ్దంలో ఆరంభమైంది. మిగిలినవన్ని నిరక్షర భాషలు.

తెలుగు మొదట ఎల్.వి. రామస్వామి అయ్యర్ చేత దక్షిణద్రావిడ భాషగానే పరిగణించబడింది. భద్రిరాజు కృష్ణమూర్తి తెలుగు వర్ణనిర్మాణం, దక్షిణ మధ్య ద్రావిడ భాషలకు మధ్యస్థానంలో వుందని, దాని పదనిర్మాణం మధ్య ద్రావిడ భాషకు సంబంధించిందని కుయి, కువి, కొండ ఉప కుటుంబానికి సన్నిహిత జన్య సంబంధముందని నిరూపించారు. మూల మధ్య ద్రావిడం మొట్టమొదట రెండు శాఖలుగా చీలింది. అవి తెలుగు - కువి, మూలకొలామి - పర్జీ, కువి శాఖ నుంచి తెలుగు మొట్ట మొదట ప్రత్యేక భాషగా విడిపోయింది. ఈ విభజన క్రీ.పూ. 5, 6 శతాబ్ధాల నాటికే జరిగిందని భద్రిరాజు కృష్ణమూర్తిగారు భావించారు. తమిళం, మలయాళం, కన్నడం, దక్షిణాంధ్ర భాషలలో తెలుగుకు సాంస్కృతికంగా సాన్నిహిత్యం వున్నప్పటికి జన్యసంబంధంగా కుయి, కువి భాషలతో సన్నిహిత సంబంధం కలిగి వుంది.

**తెలుగు :** ద్రావిడ భాషల్లో ఎక్కువ జనాభా వ్యవహరించే భాష తెలుగు. భారతీయ భాషల్లో హిందీ తర్వాత ఎక్కువ మంది మాట్లాడే భాష తెలుగు. 1961 గణాంక వివరాల ప్రకారం తెలుగు ప్రజల సంఖ్య 76434439 తెలుగు భాషను వ్యవహరించే ప్రజలు ఆంధ్రప్రదేశ్‌లోనే కాక తమిళనాడు, ఒరిస్సా, కర్ణాటక, మహారాష్ట్రలలోనే కాక దేశ వ్యాప్తంగానూ, విదేశాలలోనూ ఉన్నారు.

తెలుగులో ప్రాచీన శాసనాలు క్రీ.శ. 6వ శతాబ్ధం నుంచి వున్నాయి. 11వ శతాబ్దం ఆరంభం నుండి గ్రంథరచన సాగింది. నన్నయ రచించిన భారతం తెలుగులో లభించిన మొదటి గ్రంథం. తెలుగు భాషకున్న తొలి వ్యాకరణం ఆంధ్రశబ్ద చింతామణి. తెలుగు భాష ఆదానభాష. నేడు వేలకొలది అన్య దేశ్యాలతో కూడి వ్యవహార అవసరానికి తగిన విధంగా పరిపుష్టమై వుంది. ప్రాచీన కాలంలో సంస్కృతం, మధ్యయుగాల్లో హిందుస్థానీ భాషల ప్రభావం, ఆధునిక కాలంలో ఆంగ్ల ప్రభావం తెలుగు భాషపై పడింది. తెలుగు భాష అజంత బాష, "దేశ భాషలందు తెలుగులెస్స" "ఇటాలియన్ ఆఫ్ ద ఈస్ట్"గా మన్నన పొందింది.

## 1.2 తెలుగు పదం - వ్యుత్పత్తి వికాసాలు

ఆంధ్రం తెలుగుకు పర్యాయ వాచకం. ప్రాచీన కాలం నుండి తెలుగు వ్యుత్పత్తి వికాసాలను గూర్చి ఆచార్య జి.యన్ రెడ్డిగారు క్రోడీకరించారు.[2]

**ఆంధ్రం, తెనుఁగు, తెలుగు - చరిత్ర :** తెలుగుభాషకు ఆంధ్రం, తెనుఁగు, తెలుగు అని వ్యవహారంలో పేర్లు. తెలుగు కావ్యాలలో తెనుంగు, తెలుగు, తెనుఁగు, తెలుఁగు, త్రిలింగ. తమిళంలో సంగమ వాఙ్మయంలో వడగు, వడుగ అనే పేర్లున్నాయి. పోర్చుగీసువారు తెలుగును జెంతూ **(gentoo)** **(16,17శతాబ్దాలు)**అన్నారు.

మొత్తం మీద తెలుగు భాషకు పేర్లు- అంధ్ర, ఆంధ్రం, తెనుంగు, తెనుఁగు, తెలుంగు, తెలుఁగు, త్రిలింగ, వడగు, వడుగ, జెంతూ.

**అంధ్ర-ఆంధ్ర :** ఇవి రెండూ సంస్కృత పదాలు, రూపాంతరాలు. అతి ప్రాచీన కాలం నుండి ఈ పదాలు జాతిపరంగా వాడబడ్డాయి.

**జాతి వాచకంగా ఆంధ్ర :** క్రీ.పూ.600 ఐతరేయ బ్రాహ్మణంలో శునశ్శేపుని తమ పెద్ద అన్నగా ఒప్పుకోని మొదటి యాభైమంది పుత్రులను అనార్య జాతులైన ఆంధ్ర, పుండ్ర, శబర, పుళింద, మూతిబాది దస్యుల్లో కలిసిపోండని విశ్వామిత్రుడు శపించి బహిష్కరించాడు. ఇది ఆంధ్ర శబ్దానికి సంస్కృతంలో మొదటి ప్రయోగం. పై ఐదు జాతులు ఆర్యావర్త సరిహద్దులో ఉన్న ద్రావిడులు. కాబట్టి అనార్య ద్రావిడ జాతులలో ఆంధ్రులు ఒక తెగగా భావించవచ్చు.

మహాభారతం సభాపర్వంలోని మయసభలో అంగ, వంగ, పుండ్ర, పాండ్య, ఓఢ్ర, ఆంధ్రరాజులు ధర్మజుని కొలిచినట్లు వర్ణన.

మనుస్మృతిలో కారావరస్త్రీకి వైదేహునికి జన్మించిన నిషాదులు ఆంధ్రులు అని పేర్కొనబడింది.

క్రీస్తుశకారంభం భరతుని నాట్యశాస్త్రంలో పాత్రోచిత భాష చర్చలో బర్బర, కిరాత, ఆంధ్ర, ద్రమిలాది జాతులకు శౌరసేని మొదలైన ప్రాకృతాలను ఉపయోగించరాదని సూచన వుంది.

వాయు పురాణంలో ఆంధ్రరాజులైన ఆంధ్ర భృత్యుల పేర్లు పరిపాలనా కాలం క్రీ.పూ. 230 - క్రీ.శ. 225 చెప్పబడింది. ఆంధ్ర భృత్యులే శాతవాహనులు. సంస్కృత భాగవతంలో శుకుడు హరిని స్తుతిస్తూ కిరాత, హూణ, పుళిందాది జాతులు తమ పాప విముక్తికి హరినాశ్రయించినారని వర్ణన. క్రీ.పూ.400 లో గ్రీకు రాయబారి మెగస్తనీస్ మౌర్యుల తర్వాత ఆంధ్రులకే ఎక్కువ చతురంగ బలం వుందని ప్రశంసించాడు. అశోకుని పదమూడవ ధర్మలిపి శాసనంలో ఆంధ్రులు అతని సామ్రాజ్యంలోని వారని అతని ధర్మబోధల్ని అనుసరిస్తున్న వారని ప్రశంస.

తొమ్మిదో శతాబ్దం కువలయమాల అనే ప్రాకృత గ్రంథంలో ఉద్యోతనుడు "ఆంధ్రులు అందమైనవారు, ఆహారప్రియులని అభివర్ణించాడు" ఇలా ఆంధ్ర శబ్దం ఐతరేయ బ్రాహ్మణ కాలం నుండి జాతి వాచకంగా గ్రంథస్థమైంది.

**జాతివాచకంగా, అంధక - ఆంధ్రక :**

**అంధక :** సంస్కృత వాఙ్మయంలో అంధక, ఆంధ్రకజాతుల ప్రశంస ఉంది.

వ్యాస భారతంలో ద్రౌపది స్వయంవరానికి వచ్చిన వారిలో అంధకులున్నారు. పాండవుల వనవాస వార్తవిని దర్శించ వచ్చిన వారిలో భోజులు, వృష్ణులు, అంధకులున్నారు. భాగవత పురాణంలో అంధకులు యాదవ జాతికి చెందిన తెగ, ద్వారకానగర సంరక్షకులు. మత్స్యపురాణంలో అంధకాసురుని సంతతి అంధకులు అని ఐతిహ్యం.

**ఆంధ్రక :** వ్యాసభారతం అరణ్యపర్వంలో శ్రీకృష్ణుడు ధర్మరాజును ఓదారుస్తూ రాజసూయ యాగానికి వచ్చిన రాజుల్లో పాండ్య, ఓఢ్ర, చోళ, ద్రావిడులతో పాటు ఆంధ్రకులున్నారని గుర్తుచేశాడు.

కురుక్షేత్ర యుద్ధంలో ఆంధ్రకులు, పుళిందులు, కిరాతులు మొదలైన మ్లేచ్ఛ జాతులవారు కౌరవులవైపు యుద్ధం చేసిన పరాక్రమవంతులని వుంది.

శాంతిపర్వంలో ధర్మరాజుకు భీష్ముడు సర్వభూతోత్పిని వర్ణిస్తూ దక్షిణా పథంలో జనించిన పుళింద, శబరాది జాతుల్లో ఆంధ్రకులు ఒకరని పేర్కొన్నాడు.

సంస్కృత గ్రంథాల్లో జాతివాచకంగా ప్రయోగించబడిన ఆంధ్ర, అంధక, ఆంధ్రకపదాలు ఏకజాతి వాచకాలు. నేడు కూడ బీరారు ప్రాంతంలో "అంధ" అనే అనార్య జాతి వుంది. అంధ ప్రాకృత రూపాంతరం అంధక. దాని సంస్కృత రూపం అంధ్ర లేదా ఆంధ్ర అని టి. భరో అభిప్రాయం.

ఈ గ్రంధస్థాధారాలతో ఆంధ్ర జాతికి సంబంధించిన అభిప్రాయం యిది. ఆంధ్రులు అనార్య, ఆర్య మిశ్రజాతి, శబర, పుండ్ర, పుళింద, కిరాతాది, మ్లేచ్ఛ జాతుల్లో ఆంధ్రజాతి జమకట్టబడింది, ఆంధ్ర శబ్దానికి సంస్కృతంలో 'వేటకాడు' అనే అర్థం కూడ వుంది.

సంగమ కాలపు తమిళ గ్రంథాల్లో తెలుగువారిని "వడుగరొ" అని పేర్కొని వారు వేట కుక్కలతో సంచరించేవారని చెప్పబడింది.

ఆర్యుల ప్రాబల్యాన్ని ఎదుర్కొనలేని ఆంధ్రులు దక్షిణాపథంలోకి తరలివచ్చి రాజ్యస్థాపన చేసి ఆ ప్రాంత ప్రజలలో కలిసిపోయి వుంటారు. పాలకులైన వారి పేరే ఆ దేశానికి, ప్రజలకు, భాషకు కాలక్రమేణ ఏర్పడి వుంటుంది.

**దేశ వాచకంగా ఆంధ్ర :** దేశ వాచకంగా ఆంధ్ర శబ్దం సంస్కృత వాఙ్మయంలో ప్రయోగింపబడింది. వాల్మీకి రామాయణంలో సుగ్రీవుడు సీతాన్వేషణ కోసం వెళ్ళేవారందరిని దక్షిణ దిక్కుకు పంపుతూ వెతకవలసిన రాజ్యాల్లో ఆంధ్ర, పుండ్ర, చోళ, పాండ్యాది దేశాలను పేర్కొన్నాడు.

వ్యాస భారతంలో సహదేవుడు దక్షిణ దిగ్విజయ యాత్రలో గెలిచిన రాజ్యాల్లో ఆంధ్రదేశం వుంది.

భాగవత పురాణంలో బలిచక్రవర్తి ఆరుగురు కుమారులు తమ పేర్లతో ప్రత్యేక రాజ్యాలు స్థాపించారని వారిలో ఆంధ్రుడు, ఆంధ్రరాజ్యాన్ని స్థాపించాడని వుంది.

బౌద్ధ వాఙ్మయంలో “అందరట్ట” పదం ఆంధ్రదేశ సూచకం.

శివస్కందవర్మ మైదవోలు శాసనంలో (క్రీ.శ.234) 'అంధాపథి యోగామో విరిపరమ్' అనే వాక్య భాగంలో ఆంధ్రపదం దేశవాచకం.

మల్లిదేవనందివర్మ దానశాసనం (క్రీ.శ.340)లో 'ఆంధ్రమండలేద్వాదశే సహస్రగ్రామ సంపాదిత సప్తార్థ లక్ష విషయాధిపతే' అన్న వాక్యంలో - ఆంధ్రపదం దేశవాచకం.

వరాహమికహిరుని బృహత్సంహితలోని(క్రీ.శ.600) 'కౌశిక విదర్భవత్సాంధ్ర చేదికాశ్చోర్ధ్వితండకా' అనివుంది.

ఆంధ్రపదం దేశపరంగా అనేక గ్రంథాల్లో శాసనాల్లో కనిపిస్తుంది. ఆంధ్ర అని నన్నెచోడుని కుమార సంభవంలో వుంది. మొదట జాతి వాచకమైన ఆంధ్ర శబ్దం తర్వాత దేశ వాచకంగా ప్రయుక్తం, క్రీస్తుశకానికి పూర్వమే దేశ వాచకంగా సంస్కృత గ్రంథాల్లో వ్యాప్తికి వచ్చింది.

**భాషా వాచకంగా ఆంధ్ర:** సంస్కృత వాఙ్మయంలో 11వ శతాబ్దం ముందు ఆంధ్రపదం భాషావాచకంగా లేదు. కాని భరతుని నాట్యశాస్త్రంలో నాటకంలో ఉపయోగించాల్సిన విభాషలు శకార, అభీర, చండాల, శబర, ద్రమిల, ఆంధ్ర వనచరుల వ్యవహారంలోనివి అని సూచన. నన్నయ రచించిన నందంపూడి శాసనంలో(11 వ శతాబ్దం) ఆంధ్ర శబ్దం భాషావాచకంగా వుంది.

ఆంధ్ర శబ్ద చింతామణి కర్త నన్నయగా నిర్ణయిస్తే ఆ గ్రంథంలో కూడా 'ఆంధ్ర'శబ్దం వుంది.

ఆంధ్ర భాషా భూషణ కర్త కేతన తెనుఁగు, తెలుగు పదాలతో పాటు ఆంధ్రశబ్దాన్ని భాషపరంగా వాడారు.

తెలుగులో గ్రంథ రచన ఆరంభం అయిన నాటినుండి ఆంధ్ర శబ్దాన్ని భాషాపరంగా కవులు, పండితులు వాడారు. ఇలా మొదట జాతి వాచకం అయిన ఆంధ్రశబ్ధం తర్వాత దేశ బోధకంగా, ఆ తర్వాత భాషావాచకంగా వ్యాప్తి చెందింది. ఇప్పుడు 'ఆంధ్ర' శబ్ధం జాతి, దేశ, భాషలను మూడింటినీ సూచిస్తుంది.

**తెనుంగు, తెనుఁగు భాషాపరంగా :** నన్నయ భారతంలో మొట్టమొదటగా గ్రంథస్థమైనవి తెనుంగు, తెనుఁగు రూపాంతరాలు. తెనుంగుకు నన్నయ ప్రయోగం 'నన్నయభట్టు తెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుడయ్యే' అని ప్రయోగించాడు.

తెనుగు "తెనుఁగున రచియింపు మధిక ధీయుక్తిమెయిన్" నన్నెచోడుడు కుమార సంభవంలో తెనుంగు, పదానికి రెండుసార్లు ప్రయోగం కలదు. దేశికవిత పుట్టించి తెనుంగున నిలిపి రంధ్ర విషయంబున, "సరళముగాఁగ భావములుజానుఁదెనుంగున నింపు పెంపుతో".

నన్నయ, నన్నెచోడులు తెలుంగు, తెలుఁగు పదాలు ప్రయోగించకపోవడం విశేషం.

పాల్కురికి సోమన తెనుంగు, తెలుగు పదాలను భాషాపరంగా

"ఉరుతరగద్య పద్యోక్తుల కంటె................................ సరసమై పరగిన

జానుఁదెనుంగు చర్చింపఁగా సర్వసామాన్యమనుట....................

"తెలుగు మాటలనంగ వలదు" అని ప్రయోగించాడు.

తిక్కన నిర్వచనోత్తర రామాయణంలో" తెలుగు కవిత్వం" 'తెలుగుబడి' అని ప్రయోగించాడు.

భారతావతారికలో 'తెనుంగు బాస', 'తెనుఁగు బాస' అని ప్రయోగించాడు. తెలుంగు, తెలుఁగు రూపాంతరాలు 13వ శతాబ్ది నుండి కావ్యాల్లో ప్రయోగం.

నేడు తెలుగు పదానికే వ్యవహార వ్యాప్తి ఎక్కువ. దేశ, ప్రజ, భాషావాచిగా ప్రయుక్తం.

**తెనుఁగు తద్భవం :** ఇది త్రినగ శబ్దభవం అని చిలుకూరి నారాయణరావు

తెనుఁగు- దేశ్యం- దిగ్వాచి అని గంటి జోగి సోమయాజి

తెన్ శబ్దం దిగర్థం. ద్రావిడ పదాంశం - ంగు|ఁగు ప్రత్యయం పోల్చి చూడు : వడగు, ఒడగు (ఉత్తరం)

క్రింద, కొడగు, (పడమర) తెలుగు భాషల్లో'తెన్' శబ్దం ఇప్పుడు వ్యవహారంలో లేదు. కాని తెమ్మెర (తెన్‌మెరల్) తెన్నేరు, టెంకాయ, తీరుతెన్ను, దిక్కుతెన్నులాంటి సమాసాల్లో వుంది.

ద్రావిడ భాష ప్రాథమిక దశలో ఉత్తర ప్రాంతంవారు దక్షిణ ప్రాంతం వారిని దక్షిణ దిగ్వాచి యైన 'తెన్' శబ్దంలో 'తెనుంగు' అని నిర్దేశించి వుండవచ్చు, ఆ మాండలికం ప్రత్యేక భాష అయినప్పుడు తెనుంగు వారి భాషకు పేరుగా ఏర్పడి వుంటుంది.తెలుగు భాషా పరంగా సంస్కృత గ్రంథాల్లో కనిపించడం లేదు.

తెనుఁగు, తెలుఁగు రూపాంతరాలే కాని భిన్న ధాతు జన్యాలు కావు. ద్రావిడ భాషల్లో న/ల వినిమయం సాధారణం. ఈ మార్పు మూల ద్రావిడంలో జరిగి వుంటుందని భద్రిరాజు కృష్ణమూర్తిగారు నిరూపించారు.

కాబట్టి తెలుగు త్రిలింగ శబ్ధభవం కాదని దేశ్యమైన 'తెనుఁగు' శబ్దరూపాంతరం అని- ఇవి రెండు ప్రాచీన కాలం నుండి తెలుగు దేశంలో వ్యాప్తిలో వున్నాయని నిర్ణయించవచ్చు.

తెలుగుదేశంలో వుండే తెలగలు, తెలగాణ్యాలు అనే తెగల వారి పేర్లను త్రిలింగ శబ్దభవాలుగా నిరూపించలేం.

తెలుగుదేశానికి త్రిలింగ దేశం అనే పేరు గ్రంథాల్లో వుంది. వ్యవహారంలో కనిపించదు. శైవం ప్రబలంగా వున్నప్పుడు పండితులు తెలుంగును త్రిలింగగా ప్రయోగించి వుంటారు.

ఆంధ్రులు- ఆర్య, అనార్య మిశ్రజాతి, ఉత్తరాపథం నుండి దక్షిణాపథానికి వలసవచ్చి, గోదావరి ప్రాంతంలో రాజ్యాన్ని స్థాపించి అక్కడి ప్రజలతో కలిసిపోయారు.

జాతివాచకం అయిన ఆంధ్రశబ్దం క్రమంగా దేశవాచకంగాను, భాషావాచకంగాను రూఢిలోకి వచ్చింది. తెనుగు దేశ్య శబ్దం దిగ్వాచి తెనుగు శబ్దానికి తెలుగు శబ్దం రూపాంతరం. త్రిలింగ శబ్దంభవం కాదు.

## 1.3 ప్రాఙ్నన్నయ యుగం :

ప్రాఙ్నన్నయ యుగం తెలుగు భాషాస్థితిని తెలుసుకోవటానికి ప్రాకృత, సంస్కృత శాసనాలు, ఆరవ శతాబ్ది నుండి లభించిన తెలుగు శాసనాలు ప్రధాన ఆధారాలు.

**తొలి తెలుగు మాట :** క్రీ. శ. 2వ శతాబ్దం గుంటూరు జిల్లాకు చెందిన అమరావతి స్థూపం నందలి ఒక రాతిఫలకం మీద 'నాగబు' పదం తొలి తెలుగు మాటగా పేర్కొంటున్నారు. ఈ పదంలో నాగశబ్దం సంస్కృతం, 'బు' తెలుగు ప్రత్యయం, ఈ 'బు'వర్ణం అమహన్నపుంసకం. విభక్తి వికారమో, తొలి రూపమో అయి వుండవచ్చు, ఈ తత్సమ పదం వల్ల క్రీ. శ. 2వ శతాబ్ధంలో తెలుగుభాష సంస్కృతం నుండి తత్సమ పదాలను తెచ్చుకోగల స్థితిలో వుందనీ అప్పటికే తెలుగులో పద ప్రత్యయ విభాగం ఏర్పడిందని చెప్పవచ్చు.(చూ. అను. 1)

## గాథా సప్తశతిలోని తెలుగు మాటలు :

ఆంధ్ర దేశపు తొలి రాజులైన శాతవాహనుల శాసనాలన్ని 'ప్రాకృత భాష'లో వున్నాయి. శాతవాహన రాజు హాలుడు ప్రాకృత భాషలో గొప్ప కవిపోషకుడు. హాలుని గాథా సప్తశతి ప్రాకృత సంకలన గ్రంథంలో కొన్ని తెలుగు పదాలున్నాయని భాషా పరిశోధకులు గుర్తించారు. దీన్ని బట్టి 1వ శతాబ్ది నాటికే తెలుగు భాష జన వ్యవహారంలో వున్నట్లు చెప్పవచ్చు.

**గాథా సప్తశతిలోని తెలుగు మాటలు**

| మాట | కవి పేరు | గాథ |
|---|---|---|
| అత్త | కుమారిలుడు | 1-8 |
| అత్త | చామీకరుడు | 6-69 |
| అత్త | మాధవుడు | 5-97 |
| అద్దాయే(అద్దం) | రాయవగ్గుడు | 3-4 |
| అవ్వో(అవ్వ, విషాదం) | శాలివాహనుడు | 5-75 |
| అవ్వో(అవ్వ, ఆశ్చర్యం) | సరళుడు | 3-73 |
| అవ్వో(అవ్వ,ఇబ్బంది) | సేహుడు | 4-6 |
| ఓ (సంబోధన) | మహోయేవుడు | 2-5 |
| కరణి(తీరున) | అకముడు | 3-100 |
| కలంబియ(కించు) | మయిరందుడు | 1-80 |
| కుసుంభ(కుంకుమ పువ్వు) | వలాయిచ్చుడు | 2-45 |
| కై( విభక్తి) | మానుడు | 5-32 |
| చుటు అం(చట్టున) | ససిరాయడు | 2-62 |
| చోజ్జం(చోద్యం, విడ్డూరం) | భోజయిడు | 5-6 |
| తాళూర (తకరు) | అవటంకుడు | 1-37 |
| తీరయే (తీరదు) | పావచ్చీలుడు | 2-95 |
| తుప్ప(తువ్వ-నెయ్యి) | అలక్కుడు | 3-88 |
| పలాల (పుల్లి - గడ్డి) | కలసేహుడు | 2-9 |
| పాడి(పడ్డ) | ముహురాయడు | 1-65 |
| పాణవుడి(పాలసు) | హాలుడు | 3-27 |

| | | |
|---|---|---|
| పిలూఅ(పిల్ల) | మాణుడు | 2-2 |
| పేచిరి(హేచ్చారితనం) | | |
| మచ్ఛరపు | వాసుదేవుడు | |
| పేచారి తనంబు" | హాలుడు | 4-71 |
| పోట్టం(పొట్ట) | అలక్కుడు | 3-85 |
| ఫలహి(ప్రత్తి) | కహిలుడు | 2-65 |
| ఫలహి(ప్రత్తి) | ఓణ్ణందసాలుడు | 4-60 |
| ఫలహి (ప్రత్తి) | హాలుడు | 4-59 |
| బోండి(పంది) | విగ్గహుడు | 5-2 |
| బోల(వెళ్లు) | అరికేసరి | 3-20 |
| బోల(వెళ్లు) | నిరువణుడు | 3-32 |
| బోల(వెళ్లు) | వాహనరాయడు | 3-10 |
| మోడి(మోడి-బింకం) | శాలివాహనుడు | 5-65 |
| రూప(రంపం) | హాలుడు | 2-20 |
| ఏలుంకి(ఒల్లెంక-వాలుగ) | అలయిడు(అనీకుడు) | 1-10 |
| సావులి(శాలువ) | ణీలుడు | 3-69 |

ఒక్క శాసనాల వల్లనే కాక ప్రాచీన గ్రంధాల మూలంగా కూడ కొన్ని తెలుగు పదాలున్నాయని తెలుస్తుంది. హాలుని 'గాధాసప్తశతి' లోని 'ప్రాకృతం' మహరాష్ట్రి అని విద్వాంసుల అభిప్రాయం. ఈ మహరాష్ట్రి ప్రాకృతంలో అక్కడక్కడ కొన్ని తెలుగు పదాలు చేరడానికి రెండు అవకాశాలున్నాయి.

శాతావాహన రాజుల కాలంలో రాజభాష 'ప్రాకృతం' కనుక ప్రజలు కూడ ప్రాకృతం వాడి వుండవచ్చు.

అప్పుడు (శాతవాహనుల కాలంలో) తెలుగు దేశాన దేశ భాష కూడ మాట్లాడడం వల్ల అందలి పదాలు కొన్ని ప్రాకృతంలో ప్రవేశించడానికి అవకాశముంది.

రెండు భాషలు వ్యవహారంలో వున్న ప్రాంతంలో ఆ భాషల మధ్య అన్యోన్య ప్రభావం కనిపించడం సహజం.

### ప్రాకృత, సంస్కృత శాసనాలలోని తెలుగు మాటలు :

ప్రాకృత, సంస్కృత శాసనాలలో అనేక తెలుగు పదాలు చోటుచేసుకున్నాయి. గ్రామ నామాలలో వేము, రావి, కొన్న, పఱ్ఱు, పల్లి, కొండ, చెరువు, అరువ, తలవర, కొడుంక వంటి దేశ్య పదాలు గ్రామానామాల చివర బు, ంబు, ళ్, ప్రత్యయాలు, చిన్న, చెన్, ఉరువు వంటి విశేషణాలు కన్పిస్తున్నాయి.

| పదం | శాసనం | కాలం |
|---|---|---|
| అన్నుకూర | అత్తివర్మ గోరంట్ల తామ్ర శాసనం | క్రీ.శ. 350 |
| అచంట | అనంతవర్మ శృంగవరపు కోటదాన శాసనం | క్రీ.శ. 450-550 |
| అఋతొటె | శాలంకాయన పెదనందివర్మ పెదవేగి శాసనం | క్రీ.శ. 390 |
| ఇర్బురి | రెండవ పులకేశి కొప్పరపు శాసనం | క్రీ.శ. 631 |
| ఉరవల్లియే | విష్ణుగోపుని ఉరవపల్లితామ్ర శాసనం | క్రీ.శ. 342 |
| ఏళూర | విజయ దేవవర్మ ఏలూరు తామ్ర శాసనం | క్రీ.శ. 5వ శతాబ్దం |
| ఓమ్గోడు(ఓన్గోడు) | రెండవ విజయస్కందవర్మ ఓమ్గోడు దాన శాసనం | క్రీ.శ. 385 |
| కడాకుదురు | రెండవ సింహవర్మ ఓమ్గోడు శాసనం | క్రీ.శ. 363-385 |
| కంగూర | దామోదరవర్మ మట్టెపాడు తామ్ర శాసనం | క్రీ.శ. 295-315 |
| కంఋూరు | మూడవ మాధవవర్మ పోలమూరు శాసనం | క్రీ.శ. 635 |
| కణ్డకూర | విష్ణుగోపుని ఉరవపల్లి తామ్ర శాసనం | క్రీ.శ. 342-366 |
| కణ్డి | పృధ్వీమూలుని గోదావరి తామ్ర శాసనం | క్రీ.శ. 538 |
| కమ్బురాజ్చెరువే | శాలంకాయన నందివర్మ పెదవేగి శాసనం | క్రీ.శ. 475 |
| క(కు)రు పూర కళిక | సింహవర్మ శాసనం | క్రీ.శ. 310 |
| కుడా వాడ | మాధవవర్మ ఈపూరు(I)తామ్రశాసనం | క్రీ.శ. 495 |
| కుణ్డూరు(కుణ్టూరు) | మాధవవర్మ పోలమూరు శాసనం | క్రీ.శ. 635 |
| కురువాడ | నందివర్మ కన్తేరు దాన శాసనం | క్రీ.శ. 4వ శతాబ్ది |
| కొట్టిశర్మ | అత్తివర్మ గోరంట శాసనం | క్రీ.శ. 4వ శతాబ్ది |
| కొణ్డముడి | జయవర్మ కొండముడి తామ్ర శాసనం | క్రీ.శ. 270-285 |
| కొణ్డవేఋపూర్ | రెండవ పులకేశి కొప్పరపు తామ్ర శాసనం | క్రీ.శ. 631 |
| కొణ్డ మున్చి | పృధ్వీ మహరాజు లొణ్డవాడ దాన శాసనం | క్రీ.శ. 7వ శతాబ్ది |
| కొణ్డ మురువుదు కోహెతూరె | చండవర్మ కోమర్తి తామ్ర శాసనం | క్రీ.శ. 380-395 |
| ఖడవలి(కొడవలి) | చందసతి కొడవలి శాసనం | క్రీ.శ. 3వ శతాబ్ధి |
| గోలశర్మ | విజయస్కందవర్మ ఒంగోడు శాసనం | క్రీ.శ. 4వ శతాబ్ధి |
| చిన్తపురి (చిన్నపురి) | విజయస్కంద వర్మ కంతేరు తామ్ర శాసనం | క్రీ.శ. 4వ శతాబ్ది |
| చీకూర చూలుపాక | పృధ్వీమూలుని గోదావరి తామ్ర శాసనం | క్రీ.శ. 538 |

| పదం | శాసనం | కాలం |
|---|---|---|
| చెజ్చెరువగ్రామె | శాలంకాయన నందివర్మ పెదవేగి శాసనం | క్రీ.శ. 475 |
| చెన్దలూరు | రెండవ కుమార విష్ణుని చెందలూరు తామ్ర శాసనం | క్రీ.శ. 5వ శతాబ్ది |
| ణద తూరె | ఇక్ష్వాకుల శాసనం | క్రీ.శ. 3వ శతాబ్ది |
| తాణ్డివాడ తాణ్డికొన్ట | పృద్వి మహరాజు తాణ్డివాడ దాన శాసనం | క్రీ.శ. 7వ శతాబ్ది |
| లుగుబమ్ఋ | పల్లవ విష్ణుగోపవర్మ చూరదాన శాసనం | క్రీ.శ. 340 |
| తెల్లవల్లి విషయే తాణ్ణాపర | అనంతవర్మ సిరిపుర తామ్ర శాసనం | క్రీ.శ. 528-529 |
| దాలూరే | చారు దేవి బ్రిటిష్ మ్యూజియం తామ్ర శాసనం | క్రీ.శ. 275-285 |
| దేయవాటి | ఉమావర్మ దవళపేట దాన శాసనం | క్రీ.శ. 400 |
| దొడ్డిస్వామి | విష్ణుగోపుని నెడుంగరాయ దాన శాసనం | క్రీ.శ. 5 వ శతాబ్ది |
| నడిప్పి(నడిపి) నఱాచడు | నెడుంగరాయ తామ్ర పట్టిక | క్రీ.శ. 448 |
| నాగోళామినేత్ర పాటివిషయ | విక్రమేందవర్మ చిక్కుళ్ళ దాన శాసనం | క్రీ.శ. 537 |
| పగుహూరు | పల్లవి విష్ణుగోపవర్మచూరదాన శాసనం | క్రీ.శ. 340 |
| పఱికి విషయే | ఇంద్రవర్మ రామతీర్థ శాసనం | క్రీ.శ. 530 |
| పాగుణార విషయే పికిరే | సింహవర్మ పికిర దాన శాసనం | క్రీ.శ. 364 |
| ప్రాలూర | శాలంకాయన నందివర్మ పెదవేగి శాసనం | క్రీ.శ. 475 |
| పురణిసమ | ఇంద్రభట్టారకవర్మ రామతీర్థ తామ్ర శాసనం | క్రీ.శ. 530 |
| పుళిమ్బూరు | మాధవవర్మ పోలమూరు తామ్ర శాసనం | క్రీ.శ. 635 |
| పులోక(పులక) | శరభవరదాన శాసనం | క్రీ.శ. 5, 6 శతాబ్ధులు |
| పెరువాటక | ఇంద్రభట్టారక వర్మ రామతీర్థ తామ్ర శాసనం | క్రీ.శ. 530 |
| పొలంబోర | మూడవ మాధవ వర్మ పోలమూరు శాసనం | క్రీ.శ. 635 |
| మన్ఛణ | మాధవవర్మ ఈపూరు తామ్ర శాసనం | క్రీ.శ. 495 |
| మయిన్దవాటకి | మాధవవర్మ పోలమూరు తామ్ర శాసనం | క్రీ"శ"5వ శతాబ్ధి |
| మహాతలవర | కొండముడి జయవర్మ శాసనం | క్రీ.శ. 270 - 285 |
| మహాతలవర | వీరపురుష భత్తుని నాగార్జున కొండ శాసనం | క్రీ.శ. 239 |
| మణ్డారమరొకకి | మాధవవర్మ ఈపూరు తామ్రశాసనం | క్రీ.శ. 495 |
| మాజ్గడూ(దూ)ర్గమే, | సింహవర్మ మంగదూరుదానశాసనం | క్రీ.శ. 364 |

| పదం | శాసనం | కాలం |
|---|---|---|
| ముదిటితటాక | పల్లవ విష్ణు గోపవర్మ చూందాన శాసనం | క్రీ.శ. 340 |
| ముగమూరు | పృధ్వీ మూలుని గోదావరి తామ్ర శాసనం | క్రీ.శ. 538 |
| మూయెరకూటువ | పల్లవ విష్ణుగోపవర్మ చూర దాన శాసనం | క్రీ.శ. 340 |
| మేలుతాప | పల్లవ విష్ణుగోపవర్మ చూరదానశాసనం | క్రీ.శ. 5వ శతాబ్ది |
| రా కలువ | శక్తివర్మరాజోలు తామ్ర శాసనం | క్రీ.శ. 537 |
| రావిరేవ | విక్రమేంద్రవర్మ చిక్కుళ్ళ తామ్ర శాసనం | క్రీ.శ. 537 |
| రేగొన్లమ్ | విక్రమేంద్రవర్మ చిక్కుళ్ళ తామ్రశాసనం | క్రీ.శ. 537 |
| తెందుళూరవాసక | విక్రయేంద్రవర్మ చిక్కుళ్ళ శాసనం | క్రీ.శ. 5 వ శతాబ్ధి |
| విదేనూర పల్లకా | విజయ నందివర్మ కొల్లేరు దాన శాసనం | క్రీ.శ. 4వ శతాబ్ధి |
| విరిపర | యువరాజు శివస్కందవర్మ మైదవోలు శాసనం | క్రీ.శ. 4 వ శతాతబ్ధి |
| విర్పఱు | రెండవ పులకేశి కొప్పరపు తామ్ర శాసనం | క్రీ.శ. 631 |
| విలెర్పులి | మాధవవర్మ ఈపూరు (I) తామ్ర శాసనం | క్రీ.శ. 420-455 |
| విళవట్టి | సింహవర్మ విళవట్టిదాన శాసనం | క్రీ.శ. 446 |
| వేకుమారి | విజయస్కందవర్మ కంతేరు తామ్ర శాసనం | క్రీ.శ. 4వ శతాబ్ది |
| వేపురకే(వేపూరు) | శ్రీపులోమావిమ్యాకదోని శాసనం | క్రీ.శ. 200 |
| సారపల్లి | ప్రబంజన చికాకోల్ తామ్ర శాసనం | క్రీ.శ. 450-560 |

శాతవాహనుల కాలం నుంచి క్రీ.శ 8వ శతాబ్దం వరకు లభించిన ప్రాకృత, సంస్కృత శాసనాలను పరిశీలిస్తే వాటిలో చాలా తెలుగు గ్రామ నామాలు కనిపిస్తున్నాయి. విఱిపర, కూడూరు, చిల్లరిగె, కొలవాల, దాలూర, అన్తుకూర, ఓన్‌గోడు, ఏలూరు, కురవక, మణ్డూర, తాటికొన్డ, చెన్నెఱువ మొదలైనవి.

విప్పర్తి, తాటికొన్డ, చిన్నపురి, మొదలైన గ్రామనామాలు ఇప్పటికీ ఆంధ్రదేశంలో వున్నాయి.

ప్రాక్చాళుక్యయుగంలోని శాసనాలలో కనిపించే అనేక గ్రామనామాలు క్రీస్తుశకారంభం నాటికే తెలుగు జన వ్యవహారంలో వున్నాయని చెప్పడానికి వీలుంది.

శాసనాలు వేయించిన కాలంలో "రాజభాష" ఏదో ఆ భాషలోనే శాసనాలు వేయించే వారు. ఈ శాసనాలు మొదట ప్రాకృతంలోను, సంస్కృతంలోను ఉన్నాయి. దాదాపు శాసనాలలో 'రాజులు చేసిన దానకార్యాలకు సంబంధించిన విషయం వుంటుంది. విజయ సూచకంగా గాని, దేవునికి గాని, దేవాలయానికి గాని, బ్రాహ్మణునికి గాని, మతాచార్యునికిచ్చే దానాలను సూచించడానికి, యుద్ధంలో మరణించిన వీరుల పరాక్రమాన్ని వర్ణించడానికి గాని పూర్వం శాసనాలను వేయించేవారు. వీటిలో ఎక్కువ భాగం దేవాలయాల

గోడల మీద, కొన్ని రాగి రేకుల మీద వున్నాయి. శాసన గ్రంథాలలో దాత, ప్రతి గ్రహీత, దాన మియ్యబడిన కాలం, దత్తమైన వస్తువులు ప్రధానాంశాలుగా వుంటాయి. దాన మిచ్చింది భూమి అయితే అది ఏ గ్రామానికి చెందిందో, దాని విస్తీర్ణం, సీమల వివరణ వుంటుంది . ఈ శాసనాలలో దానమిచ్చిన పొలాలు, ఊర్లపేర్లు, వాటి సరిహద్దులు దేశ్యపదాలుగా వుండటం విశేషంగా కనిపిస్తుంది .

## 1.4 ప్రాక్చాళుక్యయుగం :

**శాతవాహనులు (క్రీ.పూ 205-క్రీ.శ 225) :** ఆంధ్రదేశాన్ని ఏలిన తొలి రాజవంశం శాతవాహనవంశం. వారి కాలం క్రీ.పూ 205 నుండి క్రీ.శ 225. వీరి విద్వద్భాష 'సంస్కృతం', రాజభాష 'ప్రాకృతం ', ప్రజాభాష 'తెలుగు'. మత ప్రచారానికి, సారస్వత ప్రక్రియలకు, రాజకీయ, వ్యవహారాలకు సంస్కృత ప్రాకృత భాషలే వాడబడ్డాయి.

శాతవాహన రాజులలో ముఖ్యంగా చెప్పకోవలసిన వారు ముగ్గురు. వారు హాలుడు, గౌతమీపుత్ర శాతకర్ణి, గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి.

శాతవాహన రాజులకాలంలో ప్రాకృతభాష సర్వతోముఖాభివృద్ధి చెందింది. హాలుని కాలం ప్రాకృత భాషకు స్వర్ణయుగం అని చెప్పవచ్చు . హాలుని ఆస్థానంలో గుణాఢ్యుడు, శర్వవర్మ అనే మంత్రులున్నారు. గుణాఢ్యపండితుడు పైశాచీ ప్రాకృతంలో' బృహత్కథ' అనే కథాకావ్యాన్ని నిర్మించాడు. బృహత్కథ రచన సందర్భంలో గుణాఢ్యుడు చేసిన శపథం కథా సరిత్సాగరంలో ఈ విధంగా వుంది. శాతావాహన రాజుకు ఆరునెలల్లో సంస్కృత వ్యాకరణం తాను నేర్పుతానని శర్వవర్మ పలుకగా అందుకు ప్రమాణంగా గుణాఢ్యుడు పలికిన విధం -

"షడ్భిర్మాసైర్మైస్యోయా దేవక్షితశ్చేత్తతోమయీ

సంస్కృతం ప్రాకృతం తద్వద్దేశ

భాషాచసర్వథా భాషాత్రయ మిథం త్యక్తం యన్మనుష్యేషు సంభవేత్" (కథా సరిత్సాగరం)

అని ప్రతిజ్ఞ చేసి ఓడిన కారణంగా గుణాఢ్యుడు పైశాచీ ప్రాకృత భాషలో 'బృహత్కథ'ను రాసినట్లుగా వుంది. గుణాఢ్యుడు ఉద్దేశించిన దేశభాష తెలుగు.

**ఇక్ష్వాకులు (క్రీ.శ 225-275) :** శాతవాహన రాజ్యం చితికిపోయిన తర్వాత తెలుగుదేశంలో ఎన్నో చిన్న రాజ్యాలు వెలిశాయి. వాటిలో ముఖ్యమైనవి ఇక్ష్వాకుల రాజ్యం. వీరి రాజభాష 'ప్రాకృతం'. శాతవాహనుల వలె వీరు కూడా తమ శాసనాలను ప్రాకృతంలో వేయించారు. ఇక్ష్వాకుల కాలంనాటి శాసనాలు, ముఖ్యంగా కృష్ణాజిల్లా నందిగామ తాలుకా జగ్గయ్యపేటలోను, గుంటూరు జిల్లా పల్నాడు తాలూకా నాగార్జున కొండలోను లభించాయి. ఈ శాసనాలన్ని బౌద్ధస్తూపాలలోని రాళ్ళమీద, స్థంభాల మీద చెక్కబడి వున్నాయి.

**బృహత్పలాయనులు (క్రీ.శ. 270.285) :** ఇక్ష్వాకుల తర్వాత బృహత్పలాయనులు కృష్ణానదికి దక్షిణ భాగాన్ని పాలించారు. వీరి శాసనాల్లో జయవర్మ కొండముడి తామ్రశాసనం లభిస్తుంది.

**శాలంకాయనులు (క్రీ.శ. 300-420) :** వైంగికేయులని వ్యవహరింపబడే శాలంకాయనులు క్రీ.శ. 325నుండి ఒకటిన్నర శతాబ్దాలకు పైగా పాలించారు. వీరి రాజధాని ఏలూరుకు సమీపంలో ఉన్న పెదవేగి. వీరి శాసనాలు కొన్ని ప్రాకృతంలోను కొన్ని సంస్కృతంలోను ఉన్నాయి.

**ఆనంద గోత్రజులు (క్రీ.శ. 290-630) :** కందరనృపతి కులోద్భవులైన ఆనంద గోత్రరాజులు యిప్పటి గుంటూరు మండలానికి చెందిన ప్రదేశాన్ని క్రీ.శ. 4వ శతాబ్ది ఆరంభం నుండి పరిపాలించినట్లు తెలుస్తుంది. వీరి రాజధాని కపోత కందరపురం. యిది ఇప్పటి నర్సారావు పేట తాలుకాలోని చేజర్ల గ్రామం. వీరి శాసనాల్లో ఒకటి పూర్తిగా సంస్కృతంలోనూ, రెండు సంస్కృత ప్రాకృతాల్లోనూ వున్నాయి.

**పల్లవులు ( క్రీ.శ. 250-620) :** శాతవాహనుల తర్వాత గొప్ప సామ్రాజ్యాన్ని స్థాపించిన వారు పల్లవులు. వీరి రాజధాని కాంచీపురం. కృష్ణానదికి దక్షిణాన వున్న తెలుగు దేశం క్రీ.శ. 3వ శతాబ్దం నుండి వీరి ఆధీనంలో వున్నట్లు తెలుస్తుంది. పల్లవ రాజులు తమ మొదటి శాసనాలను ప్రాకృతంలోను తర్వాత సంస్కృతంలోను రాయించినట్లు తెలుస్తుంది. లభించిన మొత్తం 14 శాసనాలలో 4 ప్రాకృతంలోను, 10 సంస్కృతంలోను వున్నాయి.

ఈ విధంగా క్రీస్తూ పూర్వం నుండి క్రీ.శ. 7వ శతాబ్దం వరకు ఆంధ్రదేశాన్ని పాలించిన రాజుల శాసనాలు కొన్ని ప్రాకృతంలోను, కొన్నిసంస్కృతంలోను, కొన్ని సంస్కృత ప్రాకృతంలోను వున్నాయి. కాని ఈ శాసనాలలో పేర్కొన్న కొన్ని గ్రామనామాలు, కొన్ని ధ్వనులు, కొన్ని అక్షరాలు కొన్ని విశేషాలను వెల్లడి చేస్తూ ఆభాష క్రీస్తు శకానికి పూర్వం జన వ్యవహారంలో వుందనటానికి సాక్షిభూతాలుగా నిలిచాయి.

**విష్ణుకుండినులు (క్రీ.శ. 450-600) :** శాలంకాయనుల తర్వాత రాజ్యానికొచ్చిన వారు విష్ణుకుండినులు. వీరి పరిపాలనా కాలం క్రీ.శ. 450 నుండి 600వరకు. వీరి జన్మస్థానం గుంటూరు మండలంలోని వినుకొండ.

ఆంధ్రదేశాన్ని పరిపాలించిన రాజవంశాలలో విష్ణుకుండినులు సుప్రసిద్ధులు. వీరి శాసనాలన్ని సంస్కృత భాషలో ఉన్నాయి.[3] సుమారు ఒక శతాబ్దికాలం కృష్ణా, నర్మదా నదుల మధ్య ప్రభువులై ప్రజలపై సార్వభౌమాధికారం నెరపి రాజకీయంగా, సాంస్కృతికంగా పెక్కు నూతన సంప్రదాయాలు నెలకొల్పారు.

విష్ణుకుండినుల శాసనాలు ప్రస్తుతానికి పది లభించాయి. అవి గోవిందవర్మ తుమ్మలగూడెం శాసనం:(2.3.4.5) మాధవవర్మ ఈపూరు, ఖానాపూర్, పొలమూరు తామ్రశాసనాలు, వేల్పూరు శిలాశాసనం.[4]

రెండో మాధవవర్మ ఈపూరు శాసనం, ఇంద్రవర్మ రామతీర్థశాసనం.

(8,9,10) విక్రమేంద్ర భట్టారకవర్మ తుండి, చిక్కుళ్ళ, తుమ్మలగూడెం శాసనాలు ఇటీవలనే వెలుగులోకి వచ్చాయి. వీటిని ఇంద్ర పాలనగర శాసనాలని కూడ అంటారు.

## 1.5 పూర్వ చాళుక్యయుగం :

విష్ణుకుండిన రాజుల తర్వాత ఆంధ్రదేశాన్ని రేనాటి చోళులు, తూర్పుచాళుక్యులు పరిపాలించారు. వీరి పరిపాలన ఆంధ్ర భాషా వికాసంలో పరిణామ దశను సూచిస్తుందని చెప్పవచ్చు.

ఆంధ్రదేశంలోని విస్తారమైన భాగాన్ని చాళుక్యులు పాలించారు. కృష్ణానదికి దక్షిణభాగంలో కొంత ప్రదేశాన్ని మాండలికులైన రేనాటి చోళులు, బాణులు, వైదుంబులు పాలించారు.

**రేనాటి చోళులు :** రాయలసీమలోని కడప, కర్నూలు, చిత్తూరు ప్రాంతాలను క్రీ.శ 6,7 శతాబ్దాల్లో చోళులు పరిపాలించారు. రేనాడును పాలించారు కాబట్టి వీరికి రేనాటి చోళులని పేరు. తెలుగు భాషా సాహిత్య చరిత్రలో వీరికి ప్రముఖస్థానం వుంది. సుమారు వీరు 30సంవత్సరాలు పరిపాలించారు. రేనాటి చోళవంశం క్రీ.శ 850 వరకు వుంది. రేనాటి చోళులు వేయించిన 33 తెలుగు శాసనాల్లో ధనంజయుని కలమల్ల శాసనం (క్రీ.శ575) మొదటిది. (చూడు. అను.2) ఇది కడప జిల్లా కమలాపురం తాలూకా కలమల్ల గ్రామంలో లభించింది.

**తూర్పు చాళుక్యులు (క్రీ.శ. 624-1026) :** తూర్పు చాళుక్యులు క్రీ.శ 624 నుండి క్రీ.శ. 1026 వరకు ఆంధ్రదేశాన్ని పాలించారు. శాతవాహనుల తర్వాత యింత సుదీర్ఘకాలం ఆంధ్రదేశాన్ని పాలించిన ఘనత తూర్పు చాళుక్యులదే. వీరిలో జయసింహవల్లభుడనే రాజు తెలుగులో 'విప్పర్లశాసనం' వేయించాడు. సాగరతీరాంధ్రంలో దొరికిన మొదటి తెలుగు శాసనం యిదే.

ఈ శాసనంలో తెలుగు సంస్కృత పదాలు కలిసిన రీతిలో వాక్య నిర్మాణం వుంది. చాళుక్యులలో గుణగ విజయాదిత్యుని పరిపాలనా కాలం తెలుగు సాహిత్యంలో ఒక ప్రముఖ ఘట్టం. గుణగ విజయాదిత్యుని సేనాని పండరంగని అద్దంకి శాసనం (క్రీ.శ. 848) తెలుగులో లభించిన మొదటి పద్యశాసనం. (చూ. అను.3) గుంటూరు మండలంలోని అద్దంకి గ్రామంలో ఒక పొలంలోని రాతిమీద ఈ శాసనం తెలుగులో చంపూ పద్ధతిలో చెక్కబడింది[6]. ఇందులో ఒక తరువోజ పద్యం నాలుగు పంక్తుల వచనముంది. నన్నయకు రెండు వందల ఏళ్ళకు పూర్వమే తెలుగు పద్యశైలిని సంతరించుకున్నదనడానికి ఈ శాసనం ప్రబల నిదర్శనం.

బెజవాడలోని మల్లేశ్వరాలయపు రాతి స్థంభంపై (క్రీ.శ.930) ప్రాంతం వేంగీ చాళుక్య ప్రభువైన యుద్ధమల్లుడు తెలుగులో ఈ శాసనాన్ని చెక్కించాడు. ఈ శాసనంలో ఐదు మధ్యాక్కర పద్యాలున్నాయి. సంస్కృత దీర్ఘ సమాసాలు పదాలు వున్నాయి. "నెగిదీర్చెమతంబు' , లింగంబఱసిన, ఒండుసోటు మెచ్చక ఇడ్డట్లు, తివిరి యిన్నెలవ, నెగెడు, మొగమాడువు" మొదలైన పదాల్లో దేశీయత కన్పిస్తున్నది.

జినవల్లభుని కుర్క్యాల శాసనం కరీంనగర్ జిల్లా కుర్క్యాల గ్రామం వెలుపలి ఒక కొండపైన జిన విగ్రహాలు, చక్రేశ్వరి యను శాసనదేవి ప్రతిమలకు కింద భాగాన సంస్కృత, కన్నడ, తెలుగు పద్యాలతో ఈ శాసనం రాయబడింది. ప్రసిద్ధ కన్నడ కవి పంపని తమ్ముడు జినవల్లభుడు ఈ శాసనాన్ని రాయించాడు.

చాళుక్యరాజులలో కొందరు తమ శాసనాలను తెలుగులో రాయించినప్పటికి కూడ పూర్వ సాంప్రదాయాన్ననుసరించి వాటిని సంస్కృత భాషలో కూడ రాయించారు. ఈ శాసనంలో దాత, ప్రతిగ్రహీతల వంశగుణాభి వర్ణనంతా సంస్కృతంలో వుంది. గ్రామాల పేర్లను తెలిపే సందర్భంలో మాత్రం తెలుగు భాష వాడబడింది.

కాలక్రమాన ప్రాకృత, సంస్కృత భాషల ప్రాభవం సన్నగిల్లి తెలుగు భాష క్రమంగా వృద్ధిపొందింది. కవులు తెలుగులో పద్యాలు, పదాలు రాసారు. తెలుగులో పద్యాలు మొట్ట మొదటి సారి మూడవ విజయాదిత్యమహారాజు (క్రీ.శ 799-843) కాలం నుండి వున్నాయి. అప్పటికే కవిత్వం చెప్పటానికి తెలుగు అనుకూలమైన భాషగా రాటు తేలింది.

రాజరాజ నరేంద్రుని నాటికి తెలుగులో ధారాళంగా పద్యాలున్నాయి. అందువల్లనే రాజరాజ నరేంద్రుని ఆస్థానకవి నన్నయ సంస్కృత మహాభారతాన్ని పద్యకావ్యంగా తెలుగులోకి అనువదించారు. 11వ శతాబ్ది నన్నయ భారతమే తెలుగులో లభించిన మొదటి కావ్యం.

చాళుక్యుల కాలంలోనే తెలుగులో మొదటి పద్యశాసనం వేయబడింది. చాళుక్యుల ఆస్థానంలోనే మొదటి తెలుగు కావ్యం రచింప బడింది. తూర్పున కళింగం నుండి సమస్త తీరాంధ్ర భూమిని పాలించిన చాళుక్య రాజుల శిలాశాసనాలు అనేకం తెలుగులో ఉన్నాయి. కనుక ఆ ప్రజలు వాడిన భాష తెలుగు అని స్పష్టంగా తెలుస్తుంది. రేనాటి చోళుల కాలం నుంచి తెలుగు సామంత రాజ్యాల్లో చిన్న సంస్థానాల్లో కూడా రాజభాషగా వుంటూ వచ్చింది. చాళుక్యుల కాలం నుండే తెలుగు భాషకు రాజాదరణ ఎక్కువగా లభించింది అందువల్ల తూర్పు చాళుక్యుల పాలన తెలుగువారికి చిరస్మరణీయమైంది.

**కాకతీయులు (క్రీ.శ. 1089-1329) :** కాకతీయుల శాసనాలు కొన్ని సంస్కృతంలో ప్రారంభమై మధ్యలో కొన్ని తెలుగు వాక్యాలుండి చివర కొన్ని సంస్కృత శ్లోకాలున్నాయి.

కాకతీయ యుగంలోని శాసనాలలో ప్రాకృత భాషా ప్రభావం కొంచెం కూడా లేదు. వీనిలో సంస్కృతాంధ్ర భాషలు కూడ ప్రాకృత భావ రాహిత్యాలే. అనగా కాకతీయుల కాలంనాటికి ఆంధ్ర దేశంలో ప్రాకృత బాషా ప్రాచుర్యం తగ్గిందని చెప్పవచ్చు.

**రెడ్డిరాజులు (క్రీ.శ. 1330-1450) :** ఆంధ్ర దేశాన్ని పాలించిన యితర రాజులవలెనే కొండవీడు, రాజమహేంద్రవరాలను రాజధానులుగా పరిపాలించిన రెడ్డిరాజులు కూడా కొన్ని శాసనాలను వేయించారు. క్రీ.శ. 13,14,15 శతాబ్దాలలో వెలువడిన శాసనాలలో మూడు విధాలున్నాయి.

1) సంస్కృత శాసనాలు. 2) సంస్కృతాంధ్ర మిశ్రితాలు 3) ఆంధ్రభాషాశాసనాలు

సంస్కృత శాసనాలకు - అమరావతి శాసనం, దృజ్జవరపు శాసనాలను ఉదాహరణగా చెప్పవచ్చు. సంస్కృతాంధ్ర మిశ్రిత శాసనాలలో శాసనం వేయించిన వారి విశేషాలు సంస్కృతంలో వుండి, దానమియ్యబడిన స్థల విశేషాలు, ఎల్లలు మొదలైనవి తెలుగులో వున్నాయి. శాసన విషయాలలో దత్త ప్రదేశం ముఖ్యమైంది కాబట్టి శాసనంలోని విశేషాలు అందరికీ తెలియాలనే అభిప్రాయంలో శాసనాలను తెలుగులో రాయించారు. దీనికి ఉదాహరణ కోడూరు శాసనం.

విజయనగరరాజులు (క్రీ.శ1336-1565) క్రీ.శ. 1336వ సంవత్సరంలో హరిహరుడు, బుక్కరాయలు స్థాపించిన విజయనగర సామ్రాజ్యం క్రీ.శ 1565 వ సంవత్సరంలో తళ్ళికోట యుద్ధం వరకు కొనసాగింది.

ఆంధ్ర దేశాన్ని పరిపాలించిన పూర్వరాజుల వలెనే విజయనగరరాజులు కూడ గ్రామాలను, పొలాలను, బ్రాహ్మణులకు దానంచేసి ఆయా సందర్భాల్లో దానశాసనాలను వేయించారు. ఈ శాసనాలు కేవలం తెలుగులోనే కాక సంస్కృత భాషలో కూడా వున్నాయి సంస్కృత శాసనాల తర్వాత పేర్కోదగినవి సంస్కృతాంధ్ర మిశ్రశాసనాలు. ధ్యానాధిశ్లోకాలు ఒక్కొక్క చోట దాత వంశ నామాలు మొదలైనవి సంస్కృతంలోను, దాన స్థలానికి సంబంధించిన విశేషాలు తెలుగులో వున్నాయి. శాసనం చివర ఫలశ్రుతిలో 'సదత్తాంవా' వంటివి సంస్కృతంలో వున్నాయి. దీనికి ఉదాహరణ భీమవరంలోని భీమేశ్వరాలయ మంటపశాసనం.

## 1.6 కుతుబ్‌షాహిసుల్తానులు :

వీరు తెలంగాణా ఉత్తర తీర ప్రాంతాలు, రాయలసీమ నుండి దాదాపు ఆంధ్ర ప్రదేశ్ నంతటిని పాలించారు. తెలుగు, పర్షియన్, అరబ్బీ భాషలు వాడారు.

గోల్కొండ సుల్తానుల కాలంలో హైదరాబాదులో 'పార్శి' రాజభాషగా వుంది. అయినా వారు స్థానిక భాష తెలుగును గౌరవించి, తగిన స్థానాన్ని యిచ్చారు. కుతుబ్‌షాలు 'సనదులను' పార్శీ భాషలో రాయించినా ఆ విషయాలను తెలుగులో కూడా రాయించారు. తెలుగు మండలంలో తెలుగు భాషలోనే రాజ వ్యవహారాలు జరిపారు.

## 1.7 నిజాంనవాబులు :

క్రీ.శ 1324 నుండి 1948 వరకు సుమారు 625 సంవత్సరాల తర్వాత సుదీర్ఘకాలం ముస్లింల పరిపాలనలో వున్న ప్రాంతం హైద్రాబాదు. దక్షిణ భారతంలో యింత కాలం ముస్లింల పాలనలో వున్న ప్రాంతం హైద్రాబాదు తప్ప మరొకటిలేదు. మొదటి 55 సంవత్సరాల కాలం 'పార్శి' రాజభాషగా అధికారం చెలాయించింది. చివరి 75 సంవత్సరాల కాలం 'ఉర్దూ' రాజభాషగా అధికారంలో వుంది. ఆరవనిజాం 'మీర్ మహబూబ్ అలీఖాన్' క్రీ.శ 1883 లో పార్శి స్థానంలో 'ఉర్దూ'ను రాజభాషగా చేసాడు. ఈ కొత్త అధికార భాషను తండ్రీ కొడుకులిద్దరు మహబూబ్ అలిఖాన్, ఉస్మాన్ అలీఖాన్ లు బలవంతంగా ప్రజలపై రుద్దారు . అందువల్ల తెలుగు పూర్తిగా మరుగునపడింది.

## 1.8 బ్రిటిష్ యుగం :

వ్యాపారం కోసం అడుగు పెట్టిన ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులకు నాటి భారత దేశం పెద్ద ఆకర్షణైంది. ఈ వ్యాపార పోటీలో మొదట ప్రవేశించింది ఫ్రెంచివారు క్రీ.శ 1674 లో పాండిచ్చేరిలో ఫ్రెంచిస్థావరం ఏర్పడింది. యూరప్‌లో ఆంగ్లో- ఫ్రెంచి యుద్ధం క్రీ.శ 1744 లో ప్రారంభమైంది.

మారిషస్ దీవుల నుండి బయలు దేరిన ఒక ఫ్రెంచి నౌకాదళం హిందూ మహాసముద్రాన్ని చుట్టివచ్చి మద్రాసును స్వాధీనపరచుకుంది. క్రీ.శ. 1749 వరకు మద్రాసు ఫ్రెంచివారి అధీనంలో వుంది. యూరప్‌లో క్రీ.శ 1749 లో యుద్ధం ముగిసిన తర్వాత మద్రాసు తిరిగి ఇంగ్లీషు వారికి దక్కింది.

సర్కారు జిల్లాలపై ఫ్రెంచివారి ఆధిపత్యం కొనసాగుతుండగా క్రీ. శ 1757లో బొబ్బిలి యుద్ధం జరిగింది. ఫ్రెంచి సేనాని బుస్సీ, విజయ రామరాజు తరపున బొబ్బిలిపై దాడి చేసాడు. బొబ్బిలి ఓడిపోయింది. ఫ్రెంచివారి గెలుపు నిలవలేదు. విజయరామరాజు మరణానంతరం గద్దెనెక్కిన ఆనంద గజపతి కలకత్తాలోని ఇంగ్లీషు సేనలకు కబురు పెట్టాడు. క్రీ. శ 1753 డిసెంబరుకు 9వ తేదీన పిఠాపురం వద్దనున్న కొండూరుకు ఇంగ్లీషు సేనలు వచ్చి ఫ్రెంచి సేనలను ఓడించాయి.

హైద్రాబాదును పరిపాలిస్తున్న నిజాం అలీఖాన్ క్రీ. శ 1776లో సర్కారు జిల్లాలన్నింటిని ఇంగ్లీషు వారికిచ్చాడు. ఈ విధంగా ఫ్రెంచి పరిపాలన ఆంధ్ర దేశంలోను, దక్షిణాదిన అంతమైంది. ఫ్రాన్సుకంటె బ్రిటన్ పారిశ్రామికంగా బలపడింది. ఈ బలమే ఫ్రెంచి వారిపై గెలుపుకు కారణమైంది.

భారతదేశ పాలన ఈస్టిండీయా కంపెనీకి దక్కింది. వారన్ హేస్టింగ్స్ గవర్నర్ జనరల్గా నియమితుడయ్యాడు. క్రీ .శ 1833లో విలియం బెంటింక్ గవర్నర్ జనరల్ అయ్యాడు. ఇతని కాలంలోనే మెకాలె భారత ప్రభుత్వంలో న్యాయశాఖ సభ్యుడిగా వున్నాడు. భారతదేశంలో ఆంగ్లసంస్కృతిని వ్యాపింపచేయాలని మొదట ప్రతిపాదించింది బెంటింక్. కలకత్తాలో ఆంగ్ల కళాశాలను స్థాపించిన వాడు మెకాలె.

భారతదేశంలో అంతవరకు వున్న పర్షియన్ భాష పదవీ విరమణ పొంది క్రీ. శ 1843లో ఆంగ్ల భాష అధికార భాష అయింది. ఆంగ్లభాష మాధ్యమంగా పాఠశాలలు ప్రారంభింపబడినాయి. నాటినుండి నేటివరకు భారత దేశంలో ఆంగ్ల భాషా ప్రభావం అంతా యింతా కాదు.

1956లో భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పాటయ్యేంతవరకు భారతదేశంలో ఆంగ్లభాష అధికార భాషగా కొనసాగింది. ఇప్పటికి మణిపూర్, మేఘాలయ, నాగాలాండ్, త్రిపుర రాష్ట్రాల్లో ఆంగ్లం అధికార భాషగా కొనసాగుతుంది.

ఈ విధంగా ఆంధ్ర దేశంలో వివిధ కాలాల్లో ప్రాకృతం, సంస్కృతం, తెలుగు, పార్సీ, ఉర్దూ, ఆంగ్లం రాజభాషగా వర్ధిల్లినట్లు తెలుస్తుంది.

## 1.9 శాసనాలు-భాషలు :

భారత దేశంలో లభించిన మొట్టమొదటి శాసనాలు ప్రాకృతంలో ఉన్నాయి. తర్వాత సంస్కృతం ఆస్థానాన్ని పొందింది. మరికొంత కాలానికి సంస్కృతంతో పాటు ప్రాంతీయ భాషలు వాడుకలో వచ్చాయి. భారతదేశ శాసనాలలోని భాషలకు సంబంధించి డా"కె.వి. రమేష్ గారి అభిప్రాయం ఆధారంగా ఆంధ్రదేశంలోని శాసనాల్లో వివిధ యుగాల్లోని దశలను యిలా అన్వయించారు[7].

**ప్రాకృత యుగం :** క్రీ.పూ. 3వ శతాబ్ది నుండి క్రీ.శ. 2వ శతాబ్ది వరకు (ఎర్రగుడి, రాజుల మండగిరి, భట్టిప్రోలు శాసనాల కాలం నుండి ఇక్ష్వాకులు, బృహత్పలాయనులు, ఆనంద గోత్రీకులు, ప్రాచీన పల్లవులు, మొదలైన రాజవంశీయుల కాలం వరకు)

**ప్రాకృత - సంస్కృతయుగం :** క్రీ.శ. 4వ శతాబ్ది (శాలంకాయనుల కాలం)

**సంస్కృతయుగం :** క్రీ.శ. 5వ శతాబ్ధి నుండి క్రీ.శ. 7వ శతాబ్ది వరకు (విష్ణుకుండినుల కాలం నుండి తూర్పు చాళుక్యుల కాలం వరకు)

**సంస్కృత - ప్రాంతీయభాషా యుగం :** క్రీ.శ 6వ శతాబ్ధి నుండి క్రీ.శ. 7వ శతాబ్ది వరకు (రేనాటి చోళుల శాసనాల కాలం)

**ప్రాంతీయ భాష - సంస్కృత యుగం :** క్రీ.శ. 7వ శతాబ్ధి నుండి (తొలి తూర్పు చాళుక్యుల కాలం నుండి)

**శాసనాల్లో ప్రాంతీయ భాషలు :** మధ్యకాలం వరకు భారతదేశంలోని అన్ని ప్రాంతాలలోని శాసనాలలో సంస్కృతం వాడబడింది. అదే కాలంలో ప్రాంతీయ భాషలను శాసనాలలో వాడారు. క్రీ.శ 2, 3 శతాబ్దాల నుండే తమిళంలో శాసనాలున్నాయి. తమిళనాడులో గుహాశాసనాలలో లభించిన భాష మొట్ట మొదటి తమిళ భాషగా గుర్తించబడింది. ఇదే శాసనాలలో కనిపించే మొదటి ద్రావిడ భాష. తర్వాత కాలంలో పల్లవ, చోళ, పాండ్యుల రాగి ఫలకాలలో సంస్కృత, తమిళ భాషలు వాడబడ్డాయి.

తమిళం తర్వాత 6వ శతాబ్దం నుండి శాసనాలలో కన్నడం వాడబడింది. హల్మిడి (బేలూరు తాలూకా షిమోగా జిల్లా శాసనాలు, బాదామి వద్ద (బీజాపూర్జిల్లా) కర్నాటక రాష్ట్రంలో మొట్ట మొదటి కన్నడ భాషలో రాయబడిన శాసనాలున్నాయి. 6,7 శతాబ్దాలకు చెందిన శాసనాలలో తెలుగు వాడబడింది.

ఎరికల్ ముత్తురాజు క్రీ.శ. 575 నాటి ధనుంజయుని కలమళ్ళ శాసనం తెలుగులో రాయబడిన మొట్ట మొదటి శాసనం. ఆంధ్ర ప్రదేశ్లోని అనంతపురం, కడప జిల్లాలలో రేనాటి చోళులకాలంలో శిలాశాసనాలు మొట్ట మొదటి సారిగా తెలుగులో రాయబడ్డాయి. కోస్తాంధ్రలో వేంగీ చాళుక్య మొదటి జయసింహుడు, వేంగీ యువరాజు 7వ శతాబ్దంలో తెలుగు శాసనాన్ని వేయించారు.

కేవలం 15వ శతాబ్దం తర్వాత మాత్రమే మలయాళ భాష శాసనాలలో గుర్తింపబడినప్పటికి 13వ శతాబ్దానికి చెందిన తమిళ శాసనాలలో మలయాళ ప్రభావం గుర్తించబడింది.

క్రీ.శ. 1452 అట్టినగల్, క్రీ.శ.1474 టోనల్ శాసనం మలయాళంలో రాయబడ్డాయి. ఇండో ఆర్యన్ భాషలలో మరాఠి మొట్ట మొదటిగా11వ శతాబ్దంలో రికార్డులలో రాయబడింది. దైవగర్ రాగి ఫలకాలలో ఈ భాష మొదటగా వాడబడింది. (క్రీ.శ. 1060).

ఒరియా భాష 13వ శతాబ్ద నుండి వాడుకలో వుందని శాసనాల ద్వారా తెలుస్తుంది. కొన్ని తామ్ర శాసనాలు సంస్కృతంలో, కొన్ని ఒరియాలో వున్నట్లు తెలుస్తుంది. గజపతిరాజు కపిలేశ్వరుని వెలిగలాని శాసనాలు ఒరియా, సంస్కృతం, తెలుగు భాషలో రాయబడ్డాయి.

11వ శతాబ్దం జైన శాసనాల ద్వారా హిందీ భాషనుపయోగించినట్లు తెలుస్తుంది. ఈ శాసనం మధ్యప్రదేశ్లోని ఘోలాపూర్లో వుంది. మధ్యప్రదేశ్లోని వివిధ ప్రాంతాల్లో 15లేక 16 శతాబ్ధాలలో కూడా ఉపయోగించారని తెలుస్తుంది.

కలియవార్ ప్రాంతంలో గుజరాతీ భాషను క్రీ.శ. 15వ శతాబ్దిలో ఉపయోగించినట్లు తెలుస్తుంది. కలియవార్ ప్రాంతంలోని కొన్ని శాసనాలకు గుజరాతీ మరియు సంస్కృత భాషను ఉపయోగించినట్లు తెలుస్తుంది. త్రిపుర రాజైన గోవింద మానిక్య రాగిపలక శాసనాన్ని బెంగాలీలో రాయించాడు.

భారతదేశం శాసనాలలో మొదట ప్రాకృతం, తర్వాత సంస్కృతం ప్రాధాన్యం పొందింది. ఆ తర్వాత ప్రాంతీయ భాషలు వాడుకలోకి వచ్చాయి. మధ్యయుగాల్లో పార్సీ, ఉర్దూ, ఆధునిక రంగంలో ఆంగ్లం అధికార భాషగా వెలుగొందాయి.

## సూచికలు :


1. ది గ్రోత్ అండ్ జెనెసిస్ ఆఫ్ ద్రవిడన్ R.C Hirameth, పు. 25
2. తెలుగు భాషా చరిత్ర - భద్రిరాజు కృష్ణమూర్తి, పు. 1
3. ఆంధ్రుల చరిత్ర , బి.యస్. యల్. హనుమంతరావు. పు. 104
4. పైదే, పు.104
5. శాసనార్థ ప్రకాశిక, తిరుమలరావు, పు.68
6. పైదే పు. 73
7. శాసన పరిచయం, నాగోలు కృష్ణారెడ్డి పు.51

భారతదేశంలో భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు నేపథ్యం, భారత రాజ్యాంగంలో జాతీయ భాష, రాష్ట్రాల్లో అధికార భాషల స్థానం, మైనారిటీ భాషల స్థాయి, పరిరక్షణ తెలుగు మైనారిటి భాష మొదలైన అంశాలు ఈ అధ్యాయంలో క్రోడీకరింపబడినాయి.

## 2.1. ఆంధ్రప్రదేశ్ అవతరణ :

ప్రాచీన కాలంలో మన దేశంలో "సంస్కృతం" రాజభాషగా వెలుగొందింది. మధ్య యుగంలో మహమ్మదీయుల పాలనలో 'పారశీక' భాష అధికార భాష, ఆంగ్లేయుల యుగం ప్రారంభమైన తర్వాత 1853లో ఇంగ్లీషు అధికార భాషగా ప్రకటించబడింది.

"పరతంత్ర జనముల పాలి కష్టంబు చెప్పంగ నలవియె శివుని కైన "అని శ్రీనాథ మహాకవి తన పల్నాటి వీర చరిత్రలో ఆవేదన పడ్డాడు. భారత ప్రజలు సుమారు మూడు శతాబ్దాలు పరపాలనలో మనో వ్యధననుభవించారు. భారతదేశ భాషలో సంస్కృతి, ఆర్థిక విధానం, రాజకీయ జీవితం మొదలైనవన్ని విదేశీయుల ఆధీనంలో ఉండిపోయాయి. స్వభాషలో పాలన, విద్య, జరగాలని స్వాతంత్ర్య పోరాట సమయంలో ఆశించి ఆందోళన చేశారు. స్వభాషలో పాలనా యంత్రాంగం నడవాలని భాషా ప్రాతిపదికగా రాష్ట్రాలు కావాలని పోరాడారు.

లార్డ్ కర్జను బెంగాలు ప్రజలను చీల్చి హిందూ-ముస్లిం మత ప్రాతిపదికపై 1905లో బెంగాలును విభజించిన తర్వాత భారత ప్రజానీకం జాగృతమైంది. పరపాలన అంతమొందించాలని ఆకాంక్షించింది. బెంగాలు అవిభాజ్యమని సింహగర్జన చేసింది. మహారాష్ట్రలో స్వదేశీ ఉద్యమం సాగింది.

ఆంధ్రలో భాషోద్యమం జాతీయ దృక్పథంగా రూపు దాల్చింది. ఇవన్నీ భారత దేశంలో నవజీవన చైతన్యానికి నాంది ప్రస్తావన అయ్యాయి. అంతాకలసి "వందే మాతరం" ఉద్యమంగా పరిణామం చెందింది. "వందేమాతరం మందే రాజ్యం" అని ప్రజానీకం శంఖారావం చేసింది. వీటన్నిటి ఫలితంగా 1912లో బెంగాలు సమైక్యత సాధించింది.

రాష్ట్రోద్యమాలు స్వాతంత్ర్యానికి, జాతీయతకు ప్రాతిపదికగా ప్రారంభమైనాయి. పరిపాలన ప్రజల భాషలో జరగాలి, విద్యాబోధన మాతృభాషలో జరగాలని ఆంధ్రోద్యమం రూపురేఖలు దిద్దుకుంది.

1913లో బాపట్లలో ప్రథమాంధ్ర మహాసభ జరిగింది. పరిపాలన, విద్యాబోధన మాతృభాషలో జరిగితేను, పరభాషలో జరిగితేనూ తల్లి చనుబాలతో పెరిగిన పిల్లకు, పోతపాలతో పెరిగిన పిల్లకున్నంత తేడా వ్యక్తిత్వంలోను, పటుత్వంలోను ఉంటుందని కొండా వెంకటప్పయ్య పంతులు ఉద్ఘాటించారు.

నాటి నుండి ఆంధ్రోద్యమం, యితర రాష్ట్రాలలో భాషా రాష్ట్రోద్యమాలు భారత జాతీయోద్యమంలో అంతర్వాహినిగా ప్రవహించాయి. స్వరాజ్యం ముందా, స్వరాష్ట్రం ముందా అన్నపుడల్లా స్వరాజ్యమే

ముందని ఆంధ్రులు స్వాతంత్ర్యోద్యమంలో పరుగులు తీశారు. ఆంధ్రులు భారత జాతిలో అంతర్భాగంగా స్వాతంత్ర్య పోరాటంలో భాగస్వాములయ్యారు. మాకొద్దీ తెల్ల దొరతనమన్నారు. 1921లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘాన్ని సాధించుకున్నారు. దానితో పాటు నైజాం సంస్థానంలో, బస్తరు సంస్థానంలో వున్న ఆంధ్ర ప్రాంతాలు కూడా ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ పర్యవేక్షణలో చేర్చబడ్డాయి. భాషా ప్రాతిపదికపై భారతదేశంలోని అన్ని భాషా ప్రాంతాలకు, కాంగ్రెసు సంస్థల నిర్మాణానికి ఆంధ్రులు నాయకత్వం వహించారు. తద్వారా ఆయా రాష్ట్ర భాషా వాదులకు స్వాతంత్ర్య సమరంలో వ్యక్తిత్వం సమకూరింది.

1913లో బ్రిటిష్ పాలనలో వున్న ఆంధ్రులు ఆంధ్ర మహాసభలో ఆంధ్రోద్యమం ప్రారంభిస్తే నైజాం పాలనలో వున్న ఆంధ్రులు 1921లో ఆంధ్ర జనసంఘంగా, ఆంధ్ర జనకేంద్ర సంఘంగా, నిజాం ఆంధ్ర మహాసభగా ప్రవర్థమానమై ఆంధ్రోద్యమం సాగించారు. ఈ విధంగా భారత దేశంలో భాషా ప్రయుక్త రాష్ట్రోద్యమానికి నాంది పలికిన వారు ఆంధ్రులు. 19వ శతాబ్దంలో ఆంధ్ర దేశంలో సాంఘిక, సాంస్కృతిక పునర్జీవన ఉద్యమాలు ప్రారంభమై తెలుగుజాతి జాగృతమైంది. జాతీయోద్యమ ప్రభావం తెలుగు రాజకీయ చైతన్యాన్ని మేలుకొల్పింది. పాశ్చాత్య విద్యా ప్రభావం, వందే మాతరం, స్వదేశీ ఉద్యమాలు, ఆధునిక తెలుగు సాహిత్యం, సమకాలీన సమస్యల పట్ల తెలుగు పరిశ్రమ చూపిన శ్రద్ధ ఆంధ్రులలో నూతన భావాలను, ఉత్సాహాన్ని ప్రోది చేసింది.

ప్రాచీన వైభవాన్ని సంస్మరించుకుంటున్న ఆంధ్రులకు వారి సమకాలీన బలహీనత, మద్రాసు రాష్ట్రంలో వారికి జరుగుతున్న అన్యాయాలు, అవమానాలు, నిరాదరణ భరింపశక్యం కాని వైనాయి. తత్ఫలితంగా ఆంధ్రోద్యమం ప్రారంభమైంది.

రాష్ట్ర రాజధాని అయిన మద్రాసులో కళాశాలలు, పరిశ్రమలు స్థాపించబడ్డాయి. మద్రాసు చుట్టు ఉన్న ప్రాంతం తమిళదేశమే. రైల్వేలు వేయడంలో కూడా సర్కారు జిల్లాలను మద్రాసులో కలిపారు. 19వ శతాబ్దం వరకు ఆంధ్రులు స్టీమర్‌లోనే ప్రయాణించేవారు. ఈ కారణాలవల్ల ఆంధ్రదేశం ఆర్థికంగా, విద్యా విషయంగా బాగా వెనుకబడి పోయింది. పారిశ్రామికాభివృద్ధి తమిళ దేశంలో నిరాకాటంగా సాగింది. కాబట్టి ప్రత్యేక ఆంధ్రరాష్ట్రంలోనే తమకు న్యాయం జరగ గలదని అటువంటి పాలనలోనే తమ భాష, సంస్కృతి పరిరక్షితం కాగలవని తెలుగువారు భావించటం వల్ల ఆంధ్రోద్యమం బయలు దేరింది.

నాడు కేంద్ర శాసన మండలి సభ్యులుగా వున్న జొన్నవిత్తుల గురునాథంగారు 'హిందూ' పత్రికలో తెలుగువారి బడుగుతనంపై అనేక వ్యాసాలు రాసి ఆంధ్రోద్యమ భావనకు అంకురార్పణ చేశారు.

పొట్టి శ్రీరాములు ఆత్మాహుతితో 1953 అక్టోబరు 1న కర్నూలు రాజధానిగా ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాల సమైక్యతతో 1956 నవంబరు 1న ఆంధ్రప్రదేశ్ అవతరించింది.

## 2.2. రాష్ట్రాలు - అధికార భాషలు :

భారతదేశంలో వివిధ రాష్ట్రాలు ఏర్పడిన సంవత్సరం, జనాభా, ప్రధాన భాషలు, అధికార భాషలు కింది పట్టికలో చూపబడినాయి.

| క్రమ సంఖ్య | రాష్ట్రం పేరు | ఏర్పడిన సం\|\| | వైశాల్యం స్క్వేర్ కి.మీ | జనాభా కోట్లు 1991ప్రకారం | రాజధాని | జిల్లాలు | ప్రధాన భాష | అధికార భాష |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | బీహార్ | 1936 | 173,877 | 86,374,465 | పాట్నా | 42 | హిందీ | హిందీ |
| 2. | పంజాబ్ | 1937 | 50,362 | 20,190,795 | చండీఘర్ | 14 | పంజాబీ | పంజాబీ |
| 3. | పశ్చిమ బెంగాల్ | 1947 | 88,752 | 67,982,732 | కలకత్తా | 17 | బెంగాలీ | బెంగాలీ |
| 4. | మణిపూర్ | 1947 | 22,327 | 1,826,714 | ఇంఫాల్ | 08 | మణిపూరి, ఇంగ్లీషు | ఇంగ్లీషు |
| 5. | హిమాచల్ ప్రదేశ్ | 1948 | 55,673 | 5,170,877 | సిమ్లా | 12 | పహారి, హిందీ | హిందీ |
| 6. | ఉత్తర ప్రదేశ్ | 1950 | 294,411 | 139,112,287 | లక్నో | 63 | హిందీ | హిందీ |
| 7. | ఒరిస్సా | 1954 | 155,707 | 31,659,736 | భువనేశ్వర్ | 27 | ఒరియా | ఒరియా |
| 8. | కర్నాటక | 1956 | 191,791 | 44,977,201 | బెంగుళూరు | 20 | కన్నడ | కన్నడ |
| 9. | కేరళ | 1956 | 38,863 | 29,011,237 | త్రివేండ్రం | 14 | మలయాళం | మలయాళం |
| 10. | రాజస్థాన్ | 1956 | 342,239 | 44,005,990 | జైపూర్ | 30 | రాజస్థానీ, హిందీ | హిందీ |
| 11. | ఆంధ్రప్రదేశ్ | 1956 | 275,068 | 66,304,854 | హైద్రాబాద్ | 25 | తెలుగు, ఉర్దూ | తెలుగు |
| 12. | మధ్యప్రదేశ్ | 1957 | 43,466 | 66,135,862 | భోపాల్ | 45 | హిందీ | హిందీ |
| 13. | జమ్ము-కాశ్మీర్ | 1957 | 222,236 | 7,718,700 | శ్రీనగర్ | 14 | కాశ్మీరీ, డోగ్రి, లడకి, ఉర్దూ | ఉర్దూ, |
| 14. | మహారాష్ట్ర | 1960 | 307,713 | 78,937,187 | బొంబాయి | 31 | మరాఠి | మరాఠి |
| 15. | గుజరాత్ | 1960 | 1,96,204 | 41,309,582 | గాంధీనగర్ | 19 | గుజరాతీ | గుజరాతీ |
| 16. | నాగాలాండ్ | 1963 | 16,579 | 1,209,546 | కోహిమా | 07 | ఇంగ్లీషు, ఏఓ, కొనాయక్, అంగామి | ఇంగ్లీషు |
| 17. | హర్యానా | 1966 | 44,212 | 16,463,648 | చండీఘర్ | 15 | హిందీ | హిందీ |
| 18. | తమిళనాడు | 1968 | 130,058 | 55,638,318 | మద్రాసు | 23 | తమిళం | తమిళం |
| 19. | అస్సాం | 1972 | 78,438 | 22,414,322 | డిస్పూర్ | 23 | అస్సామీస్ | అస్సామీస్ |
| 20. | మేఘాలయ | 1972 | 22,429 | 1,774,778 | షిల్లాంగ్ | 05 | కాశీ, గారో, ఇంగ్లీషు | ఇంగ్లీషు |
| 21. | త్రిపుర | 1972 | 10,486 | 2,744,827 | అగర్తలా | 03 | కాక్‌బార్క్, బెంగాలి మణిపురి | ఇంగ్లీషు |
| 22. | సిక్కిం | 1975 | 7,096 | 405,505 | గాంగ్‌టక్ | 04 | లింబూ, లెబ్కా నేపాలి, హిందీ | హిందీ |
| 23. | మిజోరం | 1985 | 21,081 | 686,217 | ఐజ్వాల్ | 03 | మిజో, ఇంగ్లీషు | మిజో |
| 24. | అరుణాచల్ ప్రదేశ్ | 1986 | 83,743 | 858,392 | ఇటానగర్ | 12 | మొంపా, ఆకా, మిజి, నిషి, తగిన్ | మొంపా |
| 25. | గోవా | 1987 | 3,702 | 1,168,622 | పానాజి | 02 | కొంకని, మరాఠి | మరాఠి[1] |

## 2.3. భారత రాజ్యాంగం - భాషల ప్రతిపత్తి :

తరతరాల విదేశీ పాలన నుండి స్వేచ్ఛను పొందిన స్వతంత్ర రాజ్యం తన స్వంత రాజ్యాంగాన్ని నిర్మించుకోవడానికి ఏర్పరచుకునే విశిష్ట సభను రాజ్యాంగ పరిషత్తు అంటారు.[2] రాజ్యాంగ పరిషత్తు ఒక నిర్ణీత కాల పరిధిలో రాజ్యాంగాన్ని రచిస్తుంది.

స్వాతంత్ర్య పోరాటంలో భారతీయులనుత్తేజ పరచిన స్వేచ్ఛ, సౌభ్రాతృత్వం, న్యాయం, సమానత్వమనే ప్రజాసామ్య సిద్ధాంతాల మూలంగా ఒక రాజ్యాంగాన్ని నిర్మించుకోవటానికి భారత ప్రజలు 1946 డిసెంబరు 9వ తేదీన రాజ్యాంగ పరిషత్తు (Constitute Assembly)ని ఏర్పాటు చేసుకున్నారు.[3]

భారత రాజ్యాంగాన్ని నవంబరు 26, 1949లో రాజ్యాంగ సభ ఆమోదించింది. 1950 జనవరి 26 నుండి రాజ్యాంగం అమలులోకి వచ్చింది.

భారత రాజ్యాంగ పరిషత్తు భారత పరిపాలనా భాష మాధ్యమం నిర్ణయానికై సుదీర్ఘ సమావేశం జరిపి ఒక నిర్ణయానికొచ్చింది. ఈ నిర్ణయాలను రాజ్యాంగంలో పొందుపరచటం జరిగింది.

రాజ్యాంగంలోని 17 అధ్యాయం 343 నుండి 351 అధికరణలలో భారత దేశంలో ప్రజలుపయోగిస్తున్న వివిధ భాషలను, వాటి అభివృద్ధికి ప్రభుత్వం తీసుకోవలసిన చర్యలు మున్నగు విషయాలను పేర్కొనటం జరిగింది.

**8వ షెడ్యూల్‌లోని భాషలు :** రాజ్యాంగంలోని 8వ షెడ్యూల్‌లో 15 భాషలను గుర్తించి పొందు పరచటం జరిగింది. వీటిలో 8 భాషలను తీరప్రాంత భాషలుగా గుర్తించారు. వాటిలో బెంగాలీ, ఒరియా, తెలుగు, తమిళ భాషలను తూర్పు తీర భాషలుగా, మలయాళం, కన్నడ, మరాఠి, గుజరాతీ భాషలను పశ్చిమ తీర భాషలుగా గుర్తించటం జరిగింది.

ఈ ఎనిమిది భాషలను దేశ జనాభాలో దాదాపు 55 శాతం పైగా ప్రజలు ఉపయోగిస్తున్నారు. వీటన్నింటిలో తెలుగు భాష అధిక సంఖ్యాకులకు మాతృభాషగా ఉంది.

కాశ్మీరి, పంజాబి, అస్సామి భాషలను హిమాలయ ప్రాంత తూర్పు, పశ్చిమ, ఎల్లలులోని భాషలుగా గుర్తించి ఈ షెడ్యూల్‌లో పొందు పరిచారు. ఈ భాషలు వాటి పేరుమీద రాష్ట్రాలుగా (కాశ్మీరు, పంజాబు, అస్సాం) ఏర్పడిఉన్నాయి.

సింధి, ఉర్దూ భాషల ప్రజలు దేశంలో వ్యాపించి వున్నారని, సంస్కృత భాషను అఖిలభారత శాస్త్రీయ భాషగా గుర్తించి వీటిని 8వ షెడ్యూల్‌లో చేర్చటం జరిగింది. అప్పటికి 14 భాషలను గుర్తించారు.

హిందీని 15వ భాషగా గుర్తించి పొందుపరచటం జరిగింది. ఆ భాషకున్న పరిధి, దానిని దేశ వ్యాప్తంగా ఉపయోగించే వారి సంఖ్యను బట్టి ఆ భాషను కేంద్ర ప్రభుత్వ అధికార భాషగా గుర్తించటం జరిగింది.[4]

1992లో రాజ్యాంగం 71వ సవరణ ద్వారా మణిపురి, నేపాలి, కొంకణి భాషలను గుర్తించింది. ఈ భాషల్లో రాజ్యాంగాన్ని కొత్తగా ముద్రించే పనిని కేంద్ర న్యాయ కంపెనీ వ్యవహారాల శాఖ చేపట్టింది. ఇప్పటికే రాజ్యాంగాన్ని 13 అధికార భాషలలో ప్రచురించారు.

**2.3.1 అధికార భాషా కమీషను :**

భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక కేంద్రంలో రాష్ట్రాలలో పరిపాలనా భాషగా ఏ భాషను ఉపయోగించాలి అనే విషయాలపై సలహాలనిచ్చి, నివేదికలు సమర్పించేందుకు కొన్ని కమీషన్లు, కమిటీలను ప్రభుత్వం ఏర్పాటు చేసింది.

ఈ కమీషనును రాష్ట్రపతికి భాషా విషయమై సూచనలిచ్చేందుకు కేంద్ర ప్రభుత్వం నియమించింది.

కమీషను పరిశీలించాల్సిన విషయాలు :

1. కేంద్ర అధికార వ్యవహారాలకు హిందీ భాషను ఎక్కువగా ఉపయోగించటం.
2. కేంద్రంలోని అన్ని కార్యక్రమాలకు కాని లేదా కొన్ని కార్యక్రమాలకు ఇంగ్లీషు భాషను ఉపయోగించేందుకు ఆటంకాలు.
3. రాజ్యాంగంలోని 348 అధికరణలో తెలుపబడిన ప్రభుత్వ వ్యవహారాలకు అన్నింటికి కాని, కొన్నింటికి కాని ఏ భాషను ఉపయోగించాలి.
4. కేంద్రానికి రాష్ట్రాలకు మధ్య, రాష్ట్రాలకు రాష్ట్రాలకు మధ్య అధికారిక వ్యవహారాలలో ఇంగ్లీషు వాడకాన్ని క్రమంగా తగ్గించి దాని స్థానంలో హిందీని ఉపయోగించేందుకు తగిన కాల నిర్ణయ పట్టిక తయారు.[5]
5. ప్రత్యేకించి ఏయే విషయాలకు హిందీని ఉపయోగించాలనే వాటి సంఖ్యా వాచకాల తయారు.

ఈ విషయాలపై అధికార భాష కమీషను సుదీర్ఘ పఠనం చేసి ఒక భాషను అధికార భాషగా ఉపయోగించటం వల్ల కలిగే సమస్యలన్నిటిని క్రోడీకరించి కేంద్ర అధికార వ్యవహారాలన్నిటికి ఒక సాధారణ భాషా మాధ్యమం ఉండాలని ఇందుకొరకు హిందీ భాషను ఉపయోగించి తద్వారా దేశ సమైక్యత,సమగ్రతకు భంగం కలగకుండా కొనసాగించవచ్చని.[6] కమీషను అభిప్రాయ పడింది.

హిందీని కేంద్ర అధికార భాషగా గుర్తించి, రాష్ట్ర పరిపాలనా రంగంలో కూడా హిందీని అభివృద్ధి పరచి, శాసన సభా కార్యక్రమాలలో హిందీ భాషను ప్రవేశపెట్టి కేంద్ర పబ్లిక్ సర్వీసు కమీషను పరీక్షలలో కూడా హిందీ మాధ్యమాన్ని ఏర్పరిచి దాని అభివృద్ధికి తద్వారా ప్రాంతీయ భాషల అభివృద్ధి సాధించాలని కమీషను సూచించింది.

భాషా ఉపయోగం : ప్రభుత్వ నియమ నిబంధనలు, మాన్యువలు, చేతి పుస్తకాలు, పరిపాలనా సాహిత్యం మొదలైనవిషయాలకు సంబంధించిన ఇతర ముఖ్యమైన అధికార పత్రాలు ముందుగా ఇంగ్లీషు భాష నుండి హిందీ భాషలోకి అనువదించాలి.[7] ఈ విధంగా అనువదించటంలో ఏకరూపత అవసరం.

**ప్రభుత్వ ఉద్యోగులు :** ప్రభుత్వ ఉద్యోగాల నియామకాల్లో ఇంగ్లీషుతో పాటుగా హిందీ భాషకు కూడా సమాన ప్రాతినిధ్యం ఇచ్చి ఆ భాషా ప్రావీణ్యాన్ని బట్టి అర్హత నిర్ణయించాలి. మొదట ఈ భాషలో కొద్దిపాటి ప్రావీణ్యం ఉన్నా మినహాయింపు యివ్వాలి.[8]

అప్పటికే ఉద్యోగాలలో ఉన్నవారికి కొంతకాలం సమయమిచ్చి హిందీ భాషలో తగు ప్రావీణ్యాన్ని సంపాదించాలని నిర్దేశించాలి.[9]

**అఖిల భారత పరిపాలనా సంస్థలు :** అఖిల భారత పాలనా సంస్థలైనటువంటి రైల్వేలు, పోస్టు టెలిగ్రాఫ్, ఎక్సైజ్, కస్టమ్స్, పన్నుల విభాగాలు ప్రజా సంబంధాలను దృష్టిలో వుంచుకొని ద్విభాషా విధానాన్ని పాటించాలి. వారి అంతర్గత పరిపాలనా విషయాలకు హిందీ భాషను ఉపయోగిస్తూ ప్రజా సంబంధ విషయాలకు, సంబంధిత ప్రాంతీయ భాషలను ఉపయోగించాలి.[10]

ఈ సంస్థలకు ఉద్యోగుల నియామకాల్లో కొన్ని అర్హతలు నిర్ణయించాలని, హిందీలో తప్పనిసరిగా ప్రావీణ్యం ఉండి ఇతర భాష వచ్చి ఉండాలని ఒక వేళ హిందీ భాషలో ప్రావీణ్యం తక్కువగా వుంటే ప్రభుత్వం తరపున వారికి పునఃశ్చరణ తరగతులు నిర్వహించి దానిని అభివృద్ధి పరచవచ్చని కమిషను సూచించింది.

**శాసన సభలో భాష :** చట్ట సభలలో సభ్యుల వ్యవహార భాషకు, చట్టం నిర్దేశించిన అధికార భాషకు కొంత వ్యత్యాసం ఉండాలని.[11] కమిషను సూచించింది.

**ఉదా :-** ఒక రాష్ట్రంగాని, లేక కేంద్రం గాని అధికార భాషగా ఇంగ్లీషు నిర్ణయిస్తే చట్టసభలో సభ్యులు ఆ భాషలో తమ అభిప్రాయాలను వ్యక్తం చేయలేనప్పుడు వారి మాతృ భాషలో మాట్లాడే అవకాశం వుండాలి.[12]

అదేవిధంగా ప్రజల సౌకర్యం కోసం ప్రభుత్వ చట్టాలు ఏ అధికార భాషలో ఉన్నప్పటికి వాటిని ఆయా ప్రాంతీయ భాషలలోకి అనువదించి ప్రకటించాల్సిన బాధ్యత ప్రభుత్వానికుంది. ఇది రాష్ట్రాలకు తప్పనిసరి. కేంద్రానికి అంతగా అవసరం ఉండకపోవచ్చు.

కేంద్ర శాసన సభ కాని రాష్ట్రంగాని దాని - ఆర్డర్లు, నిబంధనలు, బిల్లులు, అన్ని కూడా హిందీ భాషలోనే చేయాలి.

**పోటీ పరీక్షల మాధ్యమం :** అఖిల భారత, కేంద్ర ప్రభుత్వ ఉద్యోగాలకు జరిగే పోటీ పరీక్షల మాధ్యమాన్ని ఇంగ్లీషుతో పాటుగా హిందీని కూడా చేర్చాలి.

విశ్వవిద్యాలయాలలో గ్రాడ్యుయేట్ స్థాయివరకు ప్రాంతీయ భాషల్లో బోధనా మాధ్యమాన్ని ఎప్పుడు నిర్ణయిస్తారో అపుడే హిందీని కూడా బోధనా మాధ్యమంగా ప్రవేశ పెట్టాలి.

### 2.3.2 జాతీయ భాషగా హిందీ :

భారత రాజ్యాంగం ఏర్పడక ముందే అధికార భాషకు సంబంధించిన చట్టాల ముసాయిదా తయారు చేయటానికి సంఘం ఏర్పాటైంది. ముసాయిదా సంఘం రాజ్యాంగంలో పొందు పరచవలసిన నిబంధనలను చర్చించి వాటికి తుదిరూపం యివ్వటానికి 1949 అక్టోబరు మొదటి వారంలో సమావేశమైంది.

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, అంబేద్కర్, మౌలానా అబుల్‌కలామ్ ఆజాద్, కె.యం. మున్షి, యన్. గోపాల స్వామి, అయ్యన్‌గార్, బాబూ పురుషోత్తమ దాస్ టాండన్, పండిట్ బాలకృష్ణ శర్మ, సీత గోవిందదాసు, టి.టి. కృష్ణమాచారి, సమితిలోని యితర సభ్యులు హాజరయ్యారు.

కేంద్ర ప్రభుత్వపు అధికార భాషగా కాంగ్రెస్ పార్టీ ఒక ఓటు తేడాతో హిందుస్థానీ బదులు హిందీకి ప్రాధాన్యత నివ్వాలని నిర్ణయించింది. పార్టీ సభ్యులలో పరస్పర భేదాలు కలిగి విడిపోయిన వారు సమాన సంఖ్యలో వున్నారు. నెహ్రూ హిందుస్థానీ పక్షాన్ని సమర్ధించగా, అధిక సంఖ్యాకులు గల సముదాయానికి బాబు పురుషోత్తమ దాస్ టాండన్ నాయకత్వంలో వామ పక్షాన్ని సమర్ధించారు.

స్వాతంత్ర్యోద్యమ సమయంలో హిందీ, హిందుస్థానీ పరస్పర వినిమయ భాషలుగా వున్నాయి. కాంగ్రెసు పార్టీ 1925వ సంవత్సరంలో హిందుస్థానీని అధికార భాషగా ఆమోదించింది.

మహాత్మగాంధీ క్విట్ ఇండియా ఉద్యమానికి ముందు, తర్వాత అనుకూలంగానే ప్రచారం చేశారు. నెహ్రూ వర్గంలోని అధిక సంఖ్యాకులు గాంధీ విధానాన్ని అనుసరించారు. హిందీకి అనుకూలంగా బాబు పురుషోత్తమదాస్ టాండన్ మొదలైనవారు దేశం నలుమూలలా ప్రచారం చేశారు.

శైలిలో కొంత తేడా వున్నప్పటికి హిందీ, హిందుస్థానీ భాషలు సామ్యాన్ని కలిగివున్నాయి. కాని వారి రాజకీయ కార్యకలాపాలలోని రెండు భిన్న సంస్కృతులలో ఏదో ఒకటి ప్రత్యేకంగా వ్యక్తమయ్యేటట్లు ఒకదానిని మాత్రమే బలపరిచారు.

తమ భాష గొప్పదనే భావంతో హిందుస్థానీ స్వచ్ఛమైందని కొందరు, హిందీ స్వచ్ఛమైందని మరికొందరు వాదించారు. తుదకు హిందీని ఆమోదించిన తర్వాత స్వపక్ష దురభిమానానికి దారితీసే ప్రాంతీయతత్వం, ఛాందసత్వమనే సంకెళ్ళ నుండి హిందీని విడిపించాలని హిందుస్థానీయులు ఆశించారు. సమైక్య భావంతో అధికార భాషగా హిందీ సమర్ధనీయమైన సాధనమని నొక్కి చెప్పారు.

అందుచేత దాని అభివృద్ధిని, సుసంపన్నతను, సాధించటానికి అనువుగా ఒక నిబంధనను రాజ్యాంగంలో నిర్దేశించాలని హిందుస్థానీయులు ఆకాంక్షించారు. అంతర్జాతీయంగా సరిపోయే భారతీయ సంఖ్యావాచక రూపాల్ని ఆమోదించి అనుసంధాన భారతీయ భాష **(Pan - Indian link Language)**గా హిందీ విస్తృతి చెందేటట్లుగా వుండాలని హిందుస్థానీయులు పట్టుబడ్డారు. తుది ముసాయిదా తయారు చేసే సందర్భంలో ఈ అభిప్రాయాలన్ని వెలుగులోకి వచ్చాయి.

రాజ్యాంగ పరిషత్తులో భాషా సమస్యను గురించి జరిగిన చర్చాంశంలో యితర భారతీయ భాషీయులు పాల్గొనలేదు. వారి న్యాయ సమ్మతమైన స్థానాన్ని గురించి, ప్రభుత్వంలో గల హోదాను

గురించి, దేశంలో వారి ప్రతిష్టల గురించి ఆ చర్చలో చర్చించలేదు. కానీ ఆ చర్చలో హిందీ, హిందుస్థానీ వారి పరస్పర వ్యతిరేక భావంతో ఎక్కువ సమయం తీసుకున్నారు.

హిందీ భాషేతర వర్గం వారు మొదటి నుంచి స్వంత వ్యవహార భాషా అంశమైన అఖిల భారత భాష (Pan Indian Language)ను పరిశీలించి బలపరిచారు. హిందీ భాషేతరులు (Non-Hindi People) అనుసంధాన ప్రాంతీయ భాషా ప్రచారం, సుసంపన్నత, అభివృద్ధి యిత్యాది విషయాలన్ని వారికి సంబంధించినవిగా విచారించాలి. ఇతర భారతీయ భాషలు వార్తా ప్రసార సాధనం (Communication Medium) కారణంగా ఎక్కువమంది మాట్లాడగల విస్తృతమైన ప్రాంతమని, సాహిత్యంలో భాష పోల్చదగినదని హిందీ, హిందూ స్థానీయులు చర్చించారు.

ఉత్తర మధ్యోత్తర ప్రాంతంలో నివసించే ప్రజలు అంతకు ముందే దేశం మొత్తం ఒకే భాష హిందీని ఎంచుకోవాలనే కోరిక వెలిబుచ్చటం వల్ల, అంతేకాక హిందీని వారి, వారి రాష్ట్రాలు అధికార భాషగా నిర్ణయించుకోవడం వల్ల పదకొండు భాషల జాబితలో హిందీ భాషను పన్నెండవ భాషగా చేర్చారు. రాజ్యాంగంలోని 351వ నిబంధన ప్రకారం హిందీ అభివృద్ధిలో ప్రాంతీయ భాషలే కాక ఆయా భాషా రాష్ట్రాలు సైతం పాల్గొన్నాయి. 344వ నిబంధన ప్రకారం ప్రాంతీయ భాషల ప్రతినిధులను ఎన్నుకుంది. ఈ నిబంధన కింద విలువలో ప్రగతి అభివృద్ధిగల హిందీ భాషే కాక ప్రాతినిధ్యంగల శ్రేష్ఠమైన భాషలున్నాయి. హిందీ భాష ప్రగతి,అభివృద్ధులను అంచనా వేయడానికి పదిహేను సంవత్సరాల కాల పరిమితిలో రాష్ట్రపతి ఒక సంఘాన్ని నియమించాలనుకున్నారు. చివరకు సమైక్య భారతంలో 1965 సంవత్సరంలో శాశ్వత అధికార భాషగా హిందీని ఏర్పరిచారు.

**2.3.3 అధికార భాషా ప్రకరణలు :**

అధికరణం 120 కేంద్ర పార్లమెంటు వ్యవహారాలకు హిందీ, ఇంగ్లీషు భాషలనుపయోగించుకొనే అవకాశం కల్పించింది. పార్లమెంట్ సమావేశాలలో సభ్యులు హిందీ, ఇంగ్లీషు మాట్లాడలేని పరిస్థితులలో విధానసభ చైర్మన్ గాని, స్పీకర్ గాని అతనికి తన మాతృ భాషలో మాట్లాడే అవకాశం ఇవ్వవచ్చు.

అధికరణం 210 ననుసరించి విధానసభలో హిందీని గాని, ఇంగ్లీషుని గాని శాసన సభ వ్యవహారాలకు వినియోగించుకొనే అవకాశం ఆయా రాష్ట్రాలకు కల్పించింది.

అధికరణం 246 ననుసరించి భారత అధికార భాష అనగా అధికార ఉత్తర ప్రత్యుత్తరాలలో కేంద్రం, రాష్ట్రాల మధ్యగాని లేక రాష్ట్రాల మధ్య ఉపయోగించే భాషగాని, రాష్ట్ర ప్రభుత్వాల పరస్పరం అంగీకారంతో హిందీ నుపయోగించుకొనే అవకాశం వుంది.

అధికరణం 341 (2) ప్రకారం రాష్ట్ర గవర్నర్, రాష్ట్రపతి పూర్వా నుమతితో రాష్ట్ర ప్రభుత్వ కార్యక్రమాల్లో హైకోర్టు తీర్పులో గాక మిగిలిన అవసరాలకు హిందీ లేక ఇతర భాషా వినియోగాన్ని అనుమతించవచ్చు.

**అధికరణ 343 (A) :** రాష్ట్రంలో ఆయా ప్రాంతీయ భాషలను గాని, హిందీని గాని అధికార భాషలుగా అమలు చేయవచ్చునని వుంది. పరిపాలనలో దేశ భాషల వాడుక కోసం జరిగే బృహత్తర కృషిలో రాజ్యాంగ నిర్మాణం ప్రధాన ఘట్టం. రాజ్యాంగంలో 17వ భాగం అధికార భాషకు సంబంధించింది. ఇందులో 4 అధ్యాయలున్నాయి. 1949 సెప్టెంబరు 12 నుండి 14 వరకు రాజ్యాంగ సభ వీటిని చర్చించి ఆమోదించింది.

అనుసంధాన భాషగా ఇంగ్లీషు, హిందీ, హిందుస్తానీ, సంస్కృతం, బెంగాలీ పరిశీలనకు వచ్చాయి. చివరకు హిందీ ఆమోదం పొందింది.

అధికరణ 343 (1) సంఘం యొక్క రాజభాష దేవనాగరి లిపిలో హిందీయై ఉండవలెను.

సంఘం యొక్క అధికారిక ప్రయోజనాల కొరకు ఉపయోగించ వలసిన అంకెల రూపం భారతీయ అంకెల అంతర్జాతీయ రూపమై ఉండవలెను.

(2)ఉపవిభాగం (1)లో ఏమి యున్నప్పటికి ఈ సంవిధాన ప్రారంభం నుండి పదునైదు సంవత్సరముల కాలావధి వరకు ఇంగ్లీషు భాష అట్టి ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము అధికారిక ప్రయోజనములలో వేటికొరకు ఉపయోగించబడుచుండెనో అట్టి ప్రయోజనములన్నిటి కొరకు ఉపయోగబడుచుండవలెను.

అయితే రాష్ట్రపతి సదరు కాలావధిలో సంఘం యొక్క అధికారిక ప్రయోజనములలో దేనికొరకైనను, ఇంగ్లీషు భాషతో పాటు హిందీ భాషను మరియు భారతీయ అంకెల అంతర్జాతీయ రూపముతో పాటు దేవనాగరి రూపమును ఉపయోగించుటకు ఉత్తర్వు ద్వారా ప్రాధికారము నొసగవచ్చును.

(3) ఈ అధికరణలో ఏమి ఉన్నప్పటికిని పార్లమెంటు శాసనం ద్వారా, ఆ శాసనంలో నిర్దిష్ట పరచబడ ప్రయోజనముల కొరకు -

(అ) ఇంగ్లీషు భాషను (లేక)

(ఆ) అంకెల దేవనాగరి రూపమును

సదరు పదునైదు సంవత్సరముల కాలావధి తర్వాత ఉపయోగించుటకై నిబంధనలు చేయవచ్చు.

అధికరణం 344 ననుసరించి రాజ్యాంగం అమలు తేదీ నుంచి ఐదు మరియు పది సంవత్సరాలకు అధికార భాషా కమిషనును నియమించే అధికారం రాష్ట్రపతికుంది. అటువంటి కమిషనులో సంబంధిత భాషా చైర్మన్ యితర సభ్యులుంటారు.

ఈ భాషా కమిషను కింది అంశాలపై సూచనలు చేస్తుంది.

1. కేంద్ర ప్రభుత్వ కార్యక్రమాలలో హిందీ భాష వినియోగాభివృద్ధి.
2. కేంద్ర ప్రభుత్వ కార్యక్రమాలలో ఆంగ్ల భాష వినియోగపు నియమాలు
3. సుప్రీంకోర్టు, హైకోర్టు ఉత్తర్వులలో ఉపయోగించే భాష గురించి.

4. కేంద్ర ప్రభుత్వ ప్రత్యేక కార్యక్రమాలలో వినియోగించే సంఖ్యల గురించి.

5. రాష్ట్రపతిచే సూచింపబడిన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల అధికార భాషా విషయాలు.

కమిషను తమ సూచనలు చేసే సందర్భంలో భారత దేశ పారిశ్రామిక, సాంస్కృతిక, వైజ్ఞానిక రంగాల,

ప్రగతిని హిందీ భాషేతర ప్రజల న్యాయ సమ్మతమైన కోరికలు, అభిరుచులు గమనించి అట్టి సూచనలను పరిశీలించి రాష్ట్రపతికి సమగ్ర నివేదికను సమర్పించటానికి విధాన సభనుంచి ఇరవై మంది, విధాన పరిషత్ నుండి 10 మంది మొత్తం 30 మందితో కమిటి నియమించ బడుతుంది. ఆ కమిటి నివేదికపై సమగ్ర, లేక పాక్షిక చర్చకు రాష్ట్రపతి సిఫారసు చేస్తారు.

344 (1) ఈ సంవిధాన ప్రారంభం నుండి ఐదు సంవత్సరములు ముగియగానే. అటు పిమ్మట అట్టి ప్రారంభం నుండి పది సంవత్సరములు ముగియగానే, రాష్ట్రపతి ఉత్తర్వు ద్వారా ఒక కమిషనును సంఘటితం చేయవలెను. ఆ కమిషను రాష్ట్రపతి నియమించే ఒక అధ్యక్షునితో 8వ అనుసూచిలో నిర్దిష్ట పరచబడిన వివిధ భాషలకు ప్రాతినిద్యం వహించు యితర సభ్యులతో కూడియుండవలెను. మరియు ఆ ఉత్తర్వు ఆ కమిషనుచే అనుసరించవలసిన ప్రక్రియను నిర్వచింపవలెను.

(2) ఆ కమిషను ఉపవిభాగం (3) కింద సిఫారసులను చేయుటలో భారత దేశపు పారిశ్రామిక సాంస్కృతిక, వైజ్ఞానిక పురోభివృద్ధిని, మరియు పబ్లిక్ సేవల విషయంలో హిందీ మాట్లాడని ప్రాంతాలకు చెందిన వ్యక్తుల న్యాయమైన క్లెయిములను, హితములను తగినట్లు గమనించవలెను.

(3) ఏకల అంతరణీయ ఓటు ద్వారా అనుపాలక ప్రాతినిధ్య పద్దతి ననుసరించి, లోక సభయొక్క సభ్యులచే ఆ సభనుంచి ఎన్నుకొనబడు ఇరువది మంది సభ్యులతోను, అట్టి పరిస్థితి ననుసరించి రాజ్యసభ సభ్యులచే ఆ సభనుండి ఎన్నుకోబడు పదిమంది సభ్యులతో కూడియుండు ముప్పది మంది సభ్యులు గల కమిటీ ఒకటి సంఘటితం చేయవలెను.

(4) ఉపవిభాగం (1) కింద సంఘటితం చేయబడిన కమిషను యొక్క సిఫారసులను పరిశీలించి, వాటిపై తమ అభిప్రాయములను రాష్ట్రపతికి నివేదించుట కమిటి కర్తవ్యమై యుండవలెను.

(5) 343వ అధికరణలో ఏమి ఉన్నప్పటికి రాష్ట్రపతి ఉపవిభాగం (5) లో నిర్దేశింపబడిన నివేదికను పర్యాలోచించిన మీదట అట్టి పూర్తి నివేదికననుసరించి గాని, అందలి ఏదేని భాగము ననుసరించిగాని ఆదేశములను జారీ చేయవచ్చును.

*అధికరణ 345 :* ఒక రాష్ట్ర శాసన మండలి, ఆ రాష్ట్రంలో వాడుకలో వున్న ఏదో ఒక భాషను కాని, ఇంకా ఎక్కువ భాషలను కాని, హిందీని గాని ఆ రాష్ట్ర అధికార భాషగా స్వీకరించవచ్చు. రాజ్యాంగం గుర్తించిన 18 భాషలలో ప్రజాసంబంధాలు కొనసాగించటానికి అవకాశం ఏర్పరిచారు. ఈ భాషలలో తెలుగు ఒకటి.

అధికరణం 347 ననుసరించి రాష్ట్రపతికి సంతృప్తి కరమైన భాషా వినియోగపు ప్రతిపాదన సమర్పిస్తే రాష్ట్రపతి సంబంధిత రాష్ట్ర ప్రభుత్వాలను అవసరమైన భాషలను గుర్తించమని ఆదేశిస్తారు.

అధికరణం 348 (3) ప్రకారం ఒక రాష్ట్రం ఇంగ్లీషు లేక యితర భాషను అధికారికంగా ఉపయోగిస్తున్నప్పుడు ఆ వ్యవహారాల అనువాదాలన్నీ ఇంగ్లీషులో గవర్నర్ అధీనంలో గెజెట్ రూపంలో ముద్రించాలి.

*అధికరణ 351 :* హిందీని అభివృద్ధి చేస్తూనే 8 వ షెడ్యూల్‌లో పేర్కొన్న తెలుగువంటి ప్రాంతీయ భాషలన్నింటికి హిందీలాగానే సాలుసరి బడ్జెట్‌లోను, పంచవర్ష ప్రణాళికలలో నిరంతర ప్రణాళికలలో సమబుద్ధిలో నిధులు కేటాయించటంలో కేంద్ర ప్రభుత్వం వారు సమ ప్రాధాన్యత నివ్వాలని సూచించటం జరిగింది.

**2.3.4 అధికార భాషా చట్టం :**

కేంద్రం, రాష్ట్రాలు వాటి వాటి అధికార కార్యకలాపాలకు అధికార భాషలను నిర్ణయించి ఉపయోగించటం అధికార భాషా చట్టం ఏర్పాటుకు దారి తీసింది.[13]

1963లో కేంద్రం అధికార భాషా చట్టాన్ని రూపొందించింది.[14] దీని ప్రకారం కేంద్ర అధికారిక కార్యకలాపాలకు, శాసన సభ వ్యవహారాలకు హిందీని అధికారికంగా గుర్తించి దానితో పాటుగా ఇంగ్లీషును కేంద్ర రాష్ట్రాల మధ్య సంబంధ వ్యవహారాలకు అధికారికంగా ఉపయోగించమని ప్రకటించింది.[15]

హిందీ అధికార భాషగా లేని రాష్ట్రాలు పంపే సమాచార ప్రతులను ఇంగ్లీషులో అనువదించి పంపే అవకాశం రాష్ట్రాలకిచ్చింది.[16]

1968 జనవరి 18న కేంద్ర పార్లమెంట్ ఒక తీర్మానం చేసింది. తీర్మానం ప్రకారం హిందీ భాషాభివృద్ధి, ప్రచారానికి కేంద్రం బాధ్యత వహించాలని ఇందుకోసం ప్రభుత్వం నిర్దిష్ట ప్రణాళిక రూపొందించి హిందీ భాషాభివృద్ధికి కృషి చేయాలి. [17]

అదే విధంగా కేంద్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్ నియామకాల్లో అభ్యర్థులకు హిందీ, ఇంగ్లీషు భాషలలో ప్రావీణ్యం ఉండాలని నిర్దేశించింది.

రాజ్యాంగంలోని 8వ షెడ్యూల్డ్‌లోని భాషలన్నింటికి ప్రత్యామ్నాయ మాధ్యమంగా ఇంగ్లీషుని గుర్తించి కేంద్ర ఉన్నత పదవులు, అఖిల భారత స్థాయి ఉద్యోగాలన్నింటికి ఇంగ్లీషు మాధ్యమం ఐచ్ఛికంగా నిర్ణయించటం జరిగింది.

## 2.4 భారత రాజ్యాంగం - అల్ప సంఖ్యాకులు :

భాషాపరంగా కొందరు, మతపరంగా కొందరు అల్పసంఖ్యాకులు. వీరికి రాజ్యాంగ బద్ధంగా కొన్ని హక్కులున్నాయి. వాటిని కాపాడే బాధ్యత ప్రభుత్వానిది. ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు మాట్లాడేవారు అంటే

తెలుగు మాతృభాషగా కలవారు అధికసంఖ్యాకులు. మిగిలిన భారతీయ భాషలు మాతృభాషలుగా ఉన్న వారంతా అల్పసంఖ్యాకులు.

భారత రాజ్యాంగం 8వ అధికరణలో పద్దెనిమిది భాషలను అధికారికంగా గుర్తించి పొందుపరచింది. కాని సుమారు 1,652 భాషలను వివిధ ప్రాంతాలలోని ప్రజలు మాతృభాషలుగా కలిగి వున్నారు. వీటిలో కొన్ని భాషలు ఇప్పటికి లిపిని కలిగిలేవు.[18]

1954 సంవత్సరంలో భారత ప్రభుత్వంచే ఏర్పాటు చేయబడిన రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కమీషను పరిశీలనలో భాషా ప్రయుక్త అల్పసంఖ్యాకుల సమస్యలు, రాష్ట్రాల వాస్తవాధీనలను ఒక భాషా రాష్ట్రాల నియమాల మీదగాని, లేదా ద్విభాషా రాష్ట్రాల నియమాల మీదగాని పునర్వ్యవస్థీకరించినప్పటి సమస్యలను పరిష్కరించటానికి వీలు కలుగ లేదు.అందువల్ల రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కమీషను భాషా ప్రయుక్త అల్ప సంఖ్యాకుల రక్షణ కోసం రాజ్యాంగపరంగా ప్రతినిధిగా వ్యవహరించటానికి, తగిన నియమాలను ఆచరణలోకి తేవడానికి ప్రయత్నించింది.

దీని ఫలితంగా రాజ్యాంగ చట్టం 1956 ప్రకారం కొన్ని సవరణలు చేసింది. ఈ సవరణల ప్రకారం అధికరణ 350 (ఎ) మరియు 350 (బి) రాజ్యాంగంలో చేర్చటం జరిగింది.

*అధికరణ 350 (ఎ) :* ఈ అధికరణ ప్రకారం భాషా ప్రయుక్త అల్ప సంఖ్యాకుల బాల బాలికలకు ప్రాథమిక స్థాయిలో వారి మాతృభాషలో విద్యనందించటానికి తగిన సౌకర్యాలు కల్పించటం.

ఒకవేళ తగినన్ని సౌకర్యాలు అత్యవసరం అనిపిస్తే వాటికి సంబంధించిన సూచనలను రాష్ట్రపతి జారీచేయవచ్చు.

*అధికరణ 350 (బి) :*

1) భాషా ప్రయుక్త అల్పసంఖ్యాక వర్గీయుల కోసం రాష్ట్రపతి ప్రత్యేక అధికారిని నియమించవచ్చు.

2) ఈ ప్రత్యేక అధికారి భాషా ప్రయుక్త అల్పసంఖ్యాకుల రక్షణ విషయంలో రాజ్యాంగ పరంగా తగిన సౌకర్యాలు అమలు చేయటం, పరిశీలించటం ముఖ్యావిధి. రాష్ట్రపతి ప్రత్యేకాధికారికి తగిన సూచనలు, సలహాలు ఇవ్వవచ్చు. ఈ ప్రత్యేక అధికారి పంపిన నివేదికలను రాష్ట్రపతి పార్లమెంటులో వుంచి తర్వాత సంబంధిత రాష్ట్ర ప్రభుత్వానికి పంపుతారు.

3) భాషా ప్రయుక్త అల్పసంఖ్యాకుల కమీషను అధికరణ 350 (బి) ప్రకారం రాజ్యాంగంలోకి వచ్చును. మొట్టమొదటి కమిషను జులై 30 1957 సంవత్సరంలో నియమించటం జరిగింది. 27 అక్టోబరు 1957 నుండి దీనికి సంబంధించిన ప్రభుత్వశాఖ అలహాబాదులో వుంది.

4) భారత దేశంలో భాషా ప్రయుక్త అల్పసంఖ్యాకుల కమీషను ఏర్పాటు చేసిన తర్వాత అధికరణ 350 (బి) (3) ప్రకారం ఇప్పటివరకు పది నివేదికలను అప్పగించింది.

రాజ్యాంగ అధికరణ చట్టం 1956లో ఏడవ సవరణ ఏర్పాటు చేసిన అధికరణతో పాటు యితర రక్షణ చర్యలను దృష్టిలో వుంచుకొని రాజ్యాంగ పరంగా భాషా ప్రయుక్త అల్పసంఖ్యాకుల కోసం కొన్ని అధికరణలను ఏర్పాటుచేసింది. అవి అధికరణ 29 (1), 29 (2) అధికరణ 30 (1), 30 (2) అధికరణ 347, 350 మొదలైనవి. రాజ్యాంగ పరంగా ఏర్పాటు చేసింది.

*అధికరణ 29 (1) :* భారత దేశంలో ఏ ప్రాంతంలో నివసించే పౌరులు వారికి సంబంధించిన భాషలు, లిపులు, సంస్కృతిని కాపాడుకోవలసిన హక్కును కల్పించారు.

*అధికరణ 29 (2) :* ఏ పౌరుడు కూడా రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించే విద్యా సంస్థలలో గాని, లేదా రాష్ట్ర ప్రభుత్వం కల్పించే సహాయం పొందేపుడు కాని కుల, మత, భాషల గూర్చి తప్పుగా చెప్పరాదు.

*అధికరణ 30 (1) :* అన్ని రకాల అల్పసంఖ్యాకులు మత ప్రాతిపదిక మీద కాని భాషా ప్రాతిపదిక మీద కాని విద్యా సంస్థలను ఏర్పాటు చేసుకోవడానికి, నిర్వహించుకోవడానికి హక్కును కల్పించింది.

*అధికరణ 30 (2) :* మత లేదా భాషా ప్రాతిపదికపై ఏర్పాటు చేసిన విద్యా సంస్థల మీద కాని లేదా విద్యా సంస్థల కందవలసిన సహాయంలో కాని రాష్ట్ర ప్రభుత్వాలు వివక్షత చూపకుడదు.

అధికరణ 347 : రాష్ట్రంలో అల్ప సంఖ్యాకులెక్కువగా ఏ భాషనైతే మాట్లాడతారో ఆ భాషను ఆ రాష్ట్ర ప్రభుత్వం (అల్ప సంఖ్యాకులు కోరితే) అధికార భాషగా గుర్తించడానికి రాష్ట్రపతి తగిన సూచనలివ్వవచ్చు.

అధికరణ 350 : అల్పసంఖ్యాకుల భాషల విషయంలో గాని, యితర విషయంలో కాని వారిని ఏ విధమైన బాధలకు గురిచేసినా ఆయా రాష్ట్ర ప్రభుత్వాలకు కాని, స్థానిక అధికారులకు గాని ప్రతి పౌరుడు కూడా విన్నవించుకోవచ్చు. ఇవే కాకుండా నిబంధన 14 ప్రకారం సమానత్వం కల్పించటం, కుల, మత, సెక్స్, పుట్టిన ప్రాంతాల ప్రాతిపదికగా ఏ వ్యక్తినైనా ఎక్కువగా గాని తక్కువగా గాని చూడటం జరగదు. అల్పసంఖ్యాక భాషా వర్గాల వారికి రాష్ట్ర ప్రభుత్వం తమ మాతృభాషలో ప్రాథమిక విద్యను నేర్చుకునే వసతి కల్పించింది.

మైనారిటీలకోసం, వారి విద్యాభివృద్ధికోసం ప్రత్యేక విద్యామండలిని నెలకొల్పాలని జాతీయ మైనారిటీల కమిషన్ (ఎన్.సి.ఎం) సూచించింది. మైనారిటీల అభివృద్ధి, ఆర్థిక సంస్థల పనితీరుని సమీక్షించేందుకు ఒక ఉన్నతాధికార కమిటీని ఏర్పాటుచేయాలని, మొత్తం 63 సూచనలతో 1999లో రాష్ట్రపతికి వార్షిక నివేదిక సమర్పించింది. మైనారిటీ మహిళల కోసం ప్రత్యేక విద్యా పథకాలు ప్రారంభించాల్సిన అవసరం ఎంతైనా వుందని ఎన్.సి.ఎం. చైర్మన్ తాహిర్ మహమ్మద్ చెప్పారు.

## 2.4.1 అల్ప సంఖ్యాకులు - హక్కుల పరిరక్షణ

అల్ప సంఖ్యాకుల న్యాయ సమ్మతమైన హక్కులను కాపాడే ప్రయత్నం మొట్టమొదటి సారిగా 1935లో భారత ప్రభుత్వం చేపట్టింది. అల్పసంఖ్యాకుల న్యాయ సమ్మతమైన హక్కులను కాపాడే బాధ్యత గవర్నర్ జనరల్, రాష్ట్ర గవర్నరుకుంటుంది. అప్పట్లో వివిధ రాష్ట్రాలలోని అల్పసంఖ్యాక వర్గాలు

ఇంకా ఎక్కువ రక్షణ పొందాలని బ్రిటిష్ వారు భారతీయులకు అధికార సంక్రమణ చేసిన విషయం సర్. బి.యన్. రావు సూచించారు. భారత రాజ్యాంగానికి సంబంధించినంతవరకు 29 లేదా 30 ఆర్టికల్ అల్ప సంఖ్యాకులకు రక్షణ మాత్రమే కల్పించింది.

అల్ప సంఖ్యాక వర్గమంటే ఆత్మరక్షణ చేసుకునే స్థితిలో వుండేవారు. సాధారణంగా అల్పసంఖ్యాక పదానికి సంఖ్యా ప్రాధాన్యత వుంది. కొద్దిమంది వ్యక్తులకు చెందే ప్రస్తావన తప్ప జనాభాలో కలిసిపోయేట్లు వీరి విషయం వుండదు.

కొన్ని సందర్భాలలో రాజ్యాధికారం కొద్దిమంది నిర్వహిస్తుండగా వారు తమ భాషను, సంస్కృతిని మిగిలిన వారిపై అమలు పరుస్తారు. అత్యధిక జనాభా అలాంటి సందర్భాలలో పొందికగా వుండే వివిధ మతాలకు చెందవచ్చు.

అల్ప సంఖ్యాక వర్గంలో రెండు విధాల వ్యక్తులున్నారు. పౌరసత్వం వుండి రాజకీయ హక్కులు కోరేవారు ఒక వర్గం కాగా, యిలాంటి వాటితో నిమిత్తం లేకుండా దేశంలో నివసించే వారు మరొక వర్గం.

**అల్ప సంఖ్యాకుల అభ్యర్థనలు**

అల్ప సంఖ్యాక భాషీయులు కొన్ని అభ్యర్థనలు అల్ప సంఖ్యాక భాషా కమిషనరు ముందుంచటం జరిగింది. అవి.

**1. కేంద్ర స్థాయిలో :**

1. మైనారిటీ భాషలలో రేడియో, టి.వి. ప్రసారాలకు కొంత సమయం కేటాయించటం.
2. మనియార్డరు ఫారాలు, రైల్వే టిక్కెట్లు. మైనారిటీ భాషలో ముద్రణ.
3. మైనారిటీ ప్రాంతాలకు వచ్చే ఉత్తరాలు సవ్యంగా అందేందుకు మైనారిటీ భాషలు చదవ గలిగిన పోస్టుమాన్‌ని నియమించటం.
4. మైనారిటీ భాషలపై అవగాహన లేక పోస్టు తగిన సమయంలో చేరటం లేదు. ఈ ఆలస్యం జరగకుండ చర్యలు తీసుకోవాలి.

**2. రాష్ట్రస్థాయిలో :**

1. మైనారిటీ భాషల్లో ప్రభుత్వానికి చేరిన నివేదికలకు అదే భాషలో సమాధానాలు ఇచ్చే ఏర్పాటు చేయాలి.
2. (ఆఫీసు) ప్రభుత్వ కార్యాలయాల బోర్డులను మైనారిటీ భాషలో కూడా రాయించి తగిలించాలి.
3. అధికారులు మైనారిటి భాషలు తెలిసిన వారున్నప్పటికి వారి కింది ఉద్యోగులకు తెలియక పోవటం వల్ల మైనారిటి ప్రజలు ఇబ్బంది ఎదుర్కొంటున్నారు.

4. మైనారిటీ భాషీయులు అధిక సంఖ్యలో గల ప్రాంతాలలో నియమించబడే ప్రభుత్వ ఉద్యోగులు ఆయా భాషలు తెలిసిన వారై యుండాలి.

5. మైనారిటీ భాషలు తెలియని అధికారులు కొందరు పదోన్నతిపై మైనారిటీ ప్రాంతాలకు బదిలి అయివస్తున్నారు.

6. మైనారిటీ భాషీయులు ఉద్యోగాల్లో వుంటే వారికి డిపార్ట్‌మెంటల్ పరీక్ష పాసయ్యేందుకు కాలాన్ని పొడిగించాలి.

7. డిపార్ట్‌మెంటల్ పరీక్షలోని స్థాయిని సరళీకృతం చేయాలి.

8. అల్ప సంఖ్యాకులకు కూడా ఉద్యోగాలలో కోటా నిర్ణయించాలి.

నేపాలి భాషను రాజ్యాంగంలోని 8వ షెడ్యూల్‌లో చేర్చాలని నేపాలి సాహిత్య అధ్యయన సమితి కోరింది.

కొంకణి భాషను కూడా 8వ షెడ్యూల్ చేర్చాలని కొంకణి భాషా ప్రచార సభ కోరింది.

3) అధికార భాషగా గుర్తింపు :- మైసూరులోని ఉర్దూను రెండవ భాషగా గుర్తించమని,

- కేరళలోని కొంకణి భాషను అధికార భాషగా గుర్తించాలని.
- బీహార్‌లో సంతాలీ భాషను రెండవ భాషగా గుర్తించాలని
- కర్నాటకలోని కోలార్ జిల్లాలో తెలుగును అదనపు అధికార భాషగా గుర్తించాలని అల్ప సంఖ్యాకులు కోరారు.

అధికార వ్యవహారాలకు ఉపయోగించే భాషా పదాలలో కొంత సరళత పాటించాలని, రాజ పత్రాలలో మైనారిటి భాషల పేర్లు సక్రమంగా ముద్రించాలి.

ఉదా :- మహారాష్ట్రలో 'కన్నడ' బదులుగా "కన్నడి" అని రాజ పత్రంలో ముద్రించబడింది.

**రికార్డుల నిర్వహణ :** ప్రభుత్వ రికార్డులు కొన్ని మైనారిటీ భాషలలో కూడా నిర్వహించి భద్ర పరచాలి. తెలుగు, తమిళ, గుజరాతీ, మరాఠి మొదలైన భాషలలో మైసూరు ప్రభుత్వం రికార్డులు నిర్వహిస్తుంది.

**భాషాభివృద్ధి :**

1. కొన్ని రాష్ట్రాలలోని ప్రాంతాలలో మైనారిటీ భాషలు అధికార వ్యవహారాలకు ఉపయోగిస్తున్నప్పటికి వాటి అభివృద్ధికి ప్రభుత్వం చర్యలు తీసుకోవటం లేదు. అందువల్ల నోటీసులు, మొదలైనవి తయారు చేయుటంలో జాప్యం జరుగుతుంది.

2. కొన్ని మైనారిటీ భాషలు సాహిత్య పరంగా చాలా వెనుకబడి వున్నాయి. వాటికి సంబంధించిన భాషా సామాగ్రిని ప్రభుత్వం సమకూర్చటం లేదు.

3. మైనారిటీ భాషలు కేవలం మాట్లాడేందుకు ఉపయోగించటం వల్ల వాటిని అధికార భాషలుగా గుర్తించటానికి ప్రభుత్వం చర్యలు తీసుకోవటం లేదు.

ప్రత్యేక అభ్యర్థనలు :

1. అల్ప సంఖ్యాక భాషీయుల కోసం ప్రభుత్వం రాష్ట్రస్థాయి, జిల్లాస్థాయి కమిటీలను ఏర్పాటు చేయాలి. ఈ కమిటీలలో వారినే సభ్యులుగా నియమించాలి.

2. మైనారిటీ భాషల అభివృద్ధికి ప్రభుత్వం కొంత ధనాన్ని కేటాయించాలి.

3. మైనారిటీ భాషల పునరుద్ధరణకు పరిశోధనా కేంద్రాలను స్థాపించాలి.

4. రాష్ట్ర విశ్వ విద్యాలయాలలో అల్పసంఖ్యాక భాషీయులకు ప్రాతినిధ్యం కల్పించాలి.

## విద్యా సంస్థల్లో మైనారిటీ భాషలు

విద్యా సంస్థల్లో మైనారిటీ భాషల ఉపయోగ ప్రణాళిక పరిధి, స్వభావం కోసం విద్యా ప్రాముఖ్యతకు సంబంధించిన విషయాలను మనం తెలుసుకోవాలి. వాటిలో ముఖ్యంగా విద్యారంగంలో మైనారిటి భాషల ఉపయోగ కాలం, వాటి అమలు, స్థితి, అచ్చు పుస్తకాలు, ఉపాధ్యాయుల లభ్యత, సిలబస్ ఉద్దేశ్యం మొదలైనవి.

మైనారిటి భాషల ఉపయోగ కాలం వివిధ రాష్ట్రాలలో, కేంద్రపాలిత ప్రాంతాలలో ఒక్కో విధంగా ఉంది.

విద్యా సంస్థలలో మైనారిటి భాషలను ప్రాథమిక స్థాయికన్న ముందు, ప్రాథమిక, మాధ్యమిక స్థాయిలలో మాత్రమే బోధనా మాధ్యమాలుగా ఉపయోగిస్తున్నారు.

కేవలం ఏఓ, అంగామి, లుషాయి, సాదని, సంతాలి, మైథిలి, మణిపురి మొదలైన భాషలు మాత్రమే పది, పదకొండు సంవత్సరాల వరకు విద్యా బోధనా మాధ్యమాలుగా ఉపపయోగించబడుతున్నాయి.

ఏ ఒక్క మైనారిటీ భాషకూడా విశ్వ విద్యాలయాల స్థాయిలో బోధనా మాధ్యమాలుగా ఉపయోగించ బడుటలేదు. కాని కొన్ని భాషలలో సబ్జెక్ట్‌లు బోధించటం జరుగుతుంది.

ఈ భాషలను విద్యాలయాలలో ఎంతకాలం బోధనా మాధ్యమంగా ఉపయోగించాలి అనేది సంబంధిత అచ్చు పుస్తకాల లభ్యత, ఉపాధ్యాయుల నియామకం, సాంఘిక పరిస్థితులపై ఆధారపడి వుంటుంది.

విద్యా సంస్థలలో మైనారిటి భాషలను బోధనా మాధ్యమంగా కొన్ని పరిమిత సంవత్సరాలు ఉపయోగించాల్సి వచ్చినపుడు రెండు విషయాలు పరిశీలించాలి.

1. సెకండరి స్థాయి తర్వాత మైనారిటి విద్యార్థులు వేరే భాషను బోధనా మాధ్యమంగా తీసుకోవాలి కాబట్టి ఈ విషయంలో వారిపై వత్తిడి పెరిగి, వారికి నష్టం జరగకుండా చూడాలి.

వారు తీసుకునే బోధనా మాధ్యమ భాషకు సంబంధించిన ప్రావీణ్యాన్ని ఆ విద్యార్థికి ప్రాథమిక స్థాయి నుండి కలిగించాలి.

ఈ బోధనా మాధ్యమాన్ని మార్చటం అనేది ఒకే సారిగా జరగకూడదు. అలాగని చాలా ఆలస్యంగా కూడా జరగకూడదు. క్రమక్రమంగా మారే ఏర్పాటు చేయాలి.

ద్విభాషా విద్యాసంస్థలలో బోధనా మాధ్యమంతో పాటు రెండవ మాధ్యమాన్ని కూడా ప్రాథమిక స్థాయి నుండి బోధించి క్రమంగా మాధ్యమాన్ని మార్చటం జరుగుతుంది. అందువల్ల విద్యార్థికి తన మాతృభాషకు సంబంధించిన ప్రశ్న ఏర్పడదు.

2. *బహుభాషా సంబంధమైన విద్యా విధానం :* దీని ప్రకారం విద్యార్థికి ఇంగ్లీషు, హిందీతో పాటు ఏదైనా ఒక ప్రాంతీయ భాష నేర్చుకొనే వీలుంటుంది. ఈ కారణం వల్ల అల్పసంఖ్యాక భాషలు కేవలం మాధ్యమిక స్థాయి వరకు మాత్రమే ఉపయోగించబడి ఆ తర్వాత ఉపయోగించబడటం లేదు.

మాధ్యమిక స్థాయి తర్వాత మైనారిటి భాషలు విద్యా సంస్థలలో ఉపయోగించక పోవటానికి ముఖ్యకారణం అచ్చు పుస్తకాలు లభించినప్పటికి ఆయా భాషల మాధ్యమంలో బోధించే ఉపాధ్యాయులు లేకపోవటం.

1968 బర్మన్ రిపోర్ట్ ప్రకారంగా భారతీయ మైనారిటి భాషలలో సుమారు 60 భాషలలో అచ్చుపుస్తకాలు ముద్రించబడుతున్నాయి. వీటిలో ముఖ్యంగా నిఘంటువులు, పదకోశాలు, అచ్చు పుస్తకాలు, మత సాహిత్యం మొదలైనవి.[19]

ఇవేకాక తండు, తంగకుల్, గారో, కచారి, ఖాసి వంటి గిరిజన భాషలలో అర్థశాస్త్రం, చరిత్ర, తత్వశాస్త్రం లాంటివి కూడా ముద్రించబడుతున్నాయి. ఖాసి, పైటే, తడావు, అంగామి, ఏఓ, కబూయి, ఓరాటన్, సంతాలి మొదలైన భాషలలో నవలలు, నాటికలు, ఇతర సాహిత్య పుస్తకాలు ముద్రించబడుతున్నాయి.

అయితే మైనారిటి భాషలలో ప్రావీణ్యం వున్న వ్యక్తులున్నప్పటికి వారు విద్యారంగం వైపు కాకుండా వేరే ఇతర రంగాలలో ఉద్యోగాలకై ప్రయత్నించటం వల్ల ఈ రంగంలో ఉపాధ్యాయుల కొరత ఏర్పడుతుంది.

సెకండరీ స్థాయి వరకు మైనారిటీ భాషలను ఉపయోగించి తరవాతి స్థాయిలో ఇతర భాషలను ఉపయోగించాలనే అభిప్రాయాన్ని అధిక సంఖ్యాకులు అంగీకరించటం వల్ల ఇతర భాషలకు విలువలు పెరిగి మైనారిటి భాషల సంస్కృతి, ఉనికి, విలువ తగ్గి ఆయా వర్గాల సాంఘిక జీవనం, ఆధునీకరణ, జాతీయ సమగ్రత, చరిత్ర, మతం అణగారిపోయే అవకాశం కలుగుతుంది.

అందువల్ల అల్ప సంఖ్యాకులు, అధిక సంఖ్యాకులు పరస్పరం వారి వారి సంస్కృతి భాష విషయాలలో విశాల దృక్పథాన్ని అలవరచుకుంటే మైనారిటి భాషలకు అభివృద్ధి వుంటుంది.

**మైనారిటీ భాషల అభివృద్ధి :** మైనారిటీ భాషల సమస్యలు, పరిపాలనా, విద్యారంగాలలో వాటిని ఉపయోగించే తీరు, ప్రజా సంబంధాలు, అధిక సంఖ్యాకులతో వారికున్న సంబంధాలు, సాంఘిక భాషా

భావనలు మొదలగు వాటితో ముడిపడి వున్నాయి.

**1.** ప్రధాన సమస్య : ఈ భాషలలో చాలా భాషలు లిపిని కలిగిలేవు. ఇందుకు మార్గాలు :

(ఎ) దేవనాగరి లిపి గాని, రోమన్ లిపిని గాని ఈ భాషలకు ఉపయోగించాలి

(బి) ఆయా ప్రాంతీయ భాషలలోని ఏదో ఒక భాష లిపిని ఈ భాషలకు వినియోగించటం.

(సి) మైనారిటి భాషల కొరకు స్వదేశీ లిపిని ప్రత్యేకంగా కనిపెట్టటం.

అయితే భాషయొక్క విద్య, ఆర్థిక, సాంఘిక విషయాలను దృష్టిలో వుంచుకొని లిపిని కనిపెట్టటం, లేదా నిర్ణయించటం తేలికైన విషయం కాదు. లిపి అనేది ఆ భాష ఔన్నత్యాన్ని, ఆ భాషకి ప్రత్యేక గుర్తింపు కలిగించేదిగా వుండాలి. ఏదో ఒక జాతికి, మతానికి సంబంధిస్తే అది రాజకీయంగా జాతి విభేదాలకు దారితీస్తుంది.

ఉదా :- అస్సాంలో బోడో భాషకు అస్సామి లిపిని ఉపయోగిస్తున్నారు. ఆ లిపి అభివృద్ధిలో కలిగే ఉపయోగాల విషయంలో ఆ రెండు వర్గాల (అస్సాం, బోడో) మధ్య వివాదాలు తలెత్తాయి. [20]

2) భౌగోళిక, చారిత్రిక, సంస్కృతి, కారణంగా మైనారిటి భాషలు ఒకే భాష వివిధ ప్రాంతాలలో, వ్యాకరణంలో గాని, పదాల ఉచ్చారణలో గాని తేడా వుంటుంది. అందువల్ల దాని అభివృద్ధికి ఆటంకం ఏర్పడుతుంది.

మైనారిటి భాషలకు సంబంధించిన లిపిని అభివృద్ధి పరిచేందుకు, వాటికి రాతను నిర్ణయించేందుకు కలిగే ఆటంకాలలో ముఖ్యంగా పదాల ఉచ్చారణ, వాటికి తగిన సమానార్థాలు కలిగిన పదాలు దొరకటం కష్టమౌతుంది.

ఈ పదాల, శబ్ద సముదాయాల విషయం ఈ భాషల అభివృద్ధికి ప్రధాన ఆటంకం, చాలావరకు ఈ మైనారిటి భాషలు కొన్ని పదాలను ఇంగ్లీషు, హిందీ నుండి గ్రహింపబడిన పదాలు, శబ్దాలను రాతలో ఉపయోగించటం జరుగుతుంది.

ఉదా :- త్రిపురి భాషా విద్యార్థులు 4+ విద్యాస్థాయిలో ఎక్కువ శబ్దాలను బెంగాలీ భాష నుండి గ్రహించిన వాటినే ఉపయోగిస్తున్నారు. అదే విధంగా 10+ విద్యార్థులు 8+ విద్యార్థులు కూడా కొన్ని వాక్య నిర్మాణ పదాలైన ఎవరు, ఏది, వరకు, మొదలైనవి, సంఖ్యావాచక పదాలు కొన్నింటిని బెంగాలీ భాష నుండి ఉపయోగిస్తున్నారు. [21] ఈ రకమైన పదాల పొందికతో కొన్ని అచ్చు పుస్తకాలను ముద్రించటం జరుగుతుంది.

ఈ రకంగా ఎక్కువ మొత్తంలో పదాలను గ్రహించి ఉపయోగించటం వల్ల మైనారిటీ భాషల వ్యక్తులలో న్యూనతా భావం ఏర్పడే అవకాశం వుంది.

ఒకవేళ వారు తమ ప్రాంతీయ పదాలకే ప్రాధాన్యతనిచ్చి నిఘంటువులు రూపొందిస్తే ఆ భాషలు మాట్లాడే విధానికి, రాసే విధానికి చాలా తేడాలు ఏర్పడతాయి. మామూలు ప్రజలకు ఈ భాషలను నేర్చుకోవటం కష్టమౌతుంది.

మైనారిటి భాషల అభివృద్ధికి ముఖ్యంగా ఆయా వర్గాలలో నుండి తీవ్రమైన కృషి జరగాలి, రాజ్యాంగ పరంగా, చట్టపరంగా వాటికి రక్షణ, గుర్తింపు లేనిదే అవి అభివృద్ధి కావు.

1955 సంవత్సరంలో రాష్ట్ర పునర్నిర్మాణ శాసనంలో భాషా ప్రాతిపదిక మీద రాష్ట్రాలు విభజిస్తూ. ఆయా రాష్ట్రాలలో వుండే అల్పసంఖ్యాక భాషలు గలవారికి రక్షణ కల్పించి అవి ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు అమలు జరుపుటకు, ఆ రక్షణ భద్రపరచేందుకు అల్పసంఖ్యాక భాషా కమిషనరు లేక ప్రత్యేకాధికారిని రాజ్యాంగరీత్యా యేర్పరచబడింది.

**ముఖ్యమంత్రుల సమావేశం :** 1961 నవంబరు 16న జాతీయ సమగ్రత పై ముఖ్యమంత్రుల జోనల్ కౌన్సిల్ సమావేశం జరిగింది. ఈ సమావేశంలో ప్రాథమిక, మరియు సెకండరి పాఠశాలల్లో అల్పసంఖ్యాక భాషా ప్రయుక్త పిల్లలకు వారి మాతృభాషలోనే విద్యాబోధన జరిగే హక్కు గూర్చి చర్చించి కొన్ని నిర్ణయాలు తీసుకోవడం జరిగింది.

*అవి :* 1) భాషా ప్రయుక్త అల్పసంఖ్యాకులు ప్రాథమిక స్థాయిలో ఒక్కొక్క భాషకు కనీసం 10 మంది చొప్పున, మొత్తం పాఠశాలలో 40 మంది విద్యార్థులు ఆ భాషలో విద్యాబోధన కోరితే వారికోసం ఒక ఉపాధ్యాయుడిని నియమించి వారి మాతృభాషలో విద్యాబోధన చేయించాలి.

2. రాజ్యాంగంలోని 8వ షెడ్యూల్డ్ ప్రకారం ఇంగ్లీషును సెకండరీ స్థాయి వరకు మాధ్యమంగా ఉపయోగించవచ్చు. అస్సాంలోని కొన్ని కొండ ప్రాంతాలలో, పశ్చిమ బెంగాల్, డార్జిలింగ్‌లోని కొన్ని జిల్లాలలో ఇతర భాషలను కూడా మాధ్యమంగా ఉపయోగించవచ్చు.

కాని అల్ప సంఖ్యాక భాషా ప్రయుక్తులకు వారి మాతృభాషలో సెకండరీ స్థాయిలో విద్యాబోధన జరగాలంటే ఆ పాఠశాలలోని చివరి నాలుగు తరగతులలో ఆ భాషను కోరే వారి సంఖ్య 60 కి తక్కువ కాకుండా. కనీసం ప్రతి తరగతిలో 15 మందికి తగ్గకుండా వుంటే సరిపోతుంది అని నిర్ణయించారు.

3. ప్రభుత్వం ప్రత్యేకించి కేటాయించే వరకు ఈ విద్యార్థుల సంఖ్యలో,పాఠశాల సౌకర్యాల విషయంలో, ఉపాధ్యాయుల విషయంలో 1-11-1956 నాటి పరిస్థితులే కొనసాగుతాయి (తమిళనాడులోని తెలుగు విద్యార్థులకు, ఆంధ్రప్రదేశ్‌లోని తమిళ విద్యార్థులకు).

4. ఎ) విద్యా సంవత్సరం ప్రారంభ రోజుకు ముందు అల్ప సంఖ్యాక భాషా విద్యార్థులు వారు ఏ భాషలో బోధన కోరుచున్నారో వివరించే అప్లికేషన్స్ తీసుకొని ముందుగానే రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి.

బి) కొత్తగా ప్రారంభమైన తరగతి లేక సెక్షనులో తగినంత మంది అల్పసంఖ్యాక భాషా విద్యార్థులు లేనప్పుడు ఆ విద్యార్థిని / విద్యార్థులను వేరే పాఠశాలకు మార్చటం జరుగుతుంది. ఈ విషయంలో విద్యార్థులు తిరస్కరించటానికి వీలులేదు.

5. ప్రాథమిక , సెకండరి స్థాయి అల్పసంఖ్యాక భాషా విద్యార్థుల అచ్చు పుస్తకాలను కేంద్ర ప్రభుత్వం తయారు చేయించాలి. వాటి ప్రచురణలు ప్రైవేటు సంస్థలకు యివ్వకుండా రాష్ట్ర ప్రభుత్వాలు చేపట్టాలి.

**అధికార సంబంధ విషయాలలో అల్ప సంఖ్యాక భాషల ఉపయోగం :**

1) భాషా ప్రయుక్త అల్పసంఖ్యాకులు 15 నుండి 20 శాతం వరకు ఉన్నటువంటి జిల్లాస్థాయి, కిందిస్థాయి, మున్సిపాలిటి, మండల స్థాయి ప్రాంతాలలోని ముఖ్యమైన ప్రభుత్వ నోటీసులు, చట్టాలు, ఇతర ప్రచురణల ప్రతులను ఆయా అల్పసంఖ్యాక భాషలలో ప్రచురించాలి.

2) *జిల్లాస్థాయి :* జిల్లాలో అమలులో వున్న అధికార భాష కాకుండా ఇతర అల్పసంఖ్యాక భాష 60 శాతం ప్రజలు కనుక ఉపయోగిస్తున్నట్లైతే ఆ భాషను ఆ జిల్లా అదనపు అధికార భాషగా గుర్తించాలి.

3. రాష్ట్ర ప్రధాన కార్యాలయాలలో అనువాద విభాగాన్ని ఏర్పాటుచేసి దానిద్వారా ముఖ్యమైన చట్టాలు, శాసనాలు, నిబంధనలు మొదలైన వాటిని ఆయా అల్పసంఖ్యాక భాషలలో అనువాదం చేయించి ప్రకటించాలి.

4) అధికార భాషలోనే కాకుండా ఇతర అల్పసంఖ్యాక భాషల్లో ప్రజల నుండి ప్రభుత్వానికి వచ్చిన పిటిషన్లు, మొదలైన వాటికి ఆయా భాషల్లోనే సమాధానాలివ్వడానికి చర్యలు తీసుకోవాలి.

**రాష్ట్ర సర్వీసులలో నియామకాలు :** రాష్ట్ర ప్రభుత్వ నియామకాల్లో అధికార భాష వచ్చివుండటం తప్పనిసరి కారాదు. అభ్యర్థులు పరీక్ష సమయంలో హిందీ లేక ఇంగ్లీషును మాధ్యమంగా ఎంచుకొనే అవకాశం కల్పించి. ఆ రాష్ట్ర అధికార భాషలో ప్రావీణ్యత కోసం ఒక పరీక్షను ట్రైయినింగ్ కాలంలో నిర్వహిస్తే సరిపోతుంది.

## 2.5 ఆంధ్రప్రదేశ్ - అల్పసంఖ్యాక భాషలు :

1991 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో 66,304,854 మంది ప్రజలున్నారని అంచనా. ఆంధ్రరాష్ట్రంలో 1981 లెక్కల ప్రకారం తెలుగు మాట్లాడే వారి సంఖ్య 45.26 మిలియన్లు. ఉర్దూ మాతృ భాష వ్యవహర్తలు 4.16 మిలియన్లు, హిందీ భాష వ్యవహర్తలు 1.3 మిలియన్లు, మరాఠి భాష వ్యవహర్తలు 0.43 మిలియన్లు, ఒరియా భాష వ్యవహర్తలు 0.23 మిలియన్లు మాట్లాడే ప్రజలు రాష్ట్రంలో వున్నారు.

ఇరుగు పొరుగు భాషలైన తమిళం 0.64 మిలియన్లు, కన్నడం 0.48 మిలియన్లు భాషా వ్యవహర్తలున్నారు. సంఖ్యాబలంలో ఒక లక్షకు పైబడో, కొన్ని వేలల్లోనో, కొన్ని వందల్లోనో వుండే యితర భారతీయ భాషా వ్యవహర్తలు మన రాష్ట్రంలో వున్నారు. ఈ భాషల్లో ముఖ్యమైనవి గిరిజన భాషలు.

పైన పేర్కొన్న భాషల్లో కొన్ని లిఖిత సాహిత్య భాషలు, మరి కొన్ని గిరిజన భాషలు. భారతీయ భాషల్లో గిరిజనేతర భాషలన్ని సాహిత్య భాషలే, వాటికి ప్రత్యేక లిపులున్నాయి. అంతర్జాతీయ భాషగా

హిందీకి భారతదేశంలో అధికార భాషా స్థానం వుంది. విద్యావంతుల వ్యవహార భాషగా అది రాష్ట్ర వ్యాప్తమైంది. 'ఉర్దూ'-'హిందీ' రాజధాని నగరంలో చాలా మందికి మాతృభాష. తెలంగాణా ప్రాంతంలోని నగరాల్లో వారి సంఖ్య విలక్షణంగా కనిపిస్తుంది. తక్కిన ఆంధ్ర ప్రాంతంలో ఉర్దూ భాషీయులు కేంద్రీకృతంగా వున్నారు.

ఉత్తర భారత ప్రజలు హిందీ - ఉర్దూలో ప్రసంగించ గలవారే. ముస్లింల పరిపాలన ఫలితంగా సమ్మిళిత సంస్కృతిలో భాగంగా ఇది పుట్టింది. రాష్ట్రంలో మూడవ ప్రధాన భాష విశాఖపట్టణం, విజయనగరం జిల్లాలోని పట్టణాల్లోను శ్రీకాకుళం జిల్లా మొత్తం మీద సరిహద్దుల్లోను నివసించే ఒరియా భాష. దీనికి మరి ఇతర ప్రాంతాల్లో వ్యవహారం లేదు. కన్నడం, తమిళం, మరాఠి, భాషలు రాజధానిలోనే కాక సరిహద్దు జిల్లాల్లో కూడా వ్యవహారంలో వున్నాయి. అనంతపురం, కర్నూలు, మహబూబ్‌నగర్, రంగారెడ్డి జిల్లాల పశ్చిమ సరిహద్దుల్లో కన్నడం వాడుక ఎక్కువ.

నెల్లూరు, చిత్తూరు జిల్లాల్లో తమిళభాష ఎక్కువ. మెదక్, ఆదిలాబాద్, నిజామాబాద్ జిల్లాల్లో మరాఠి వాడుక ఎక్కువ. భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన జరిగినపుడు ఏయే భాషలవారు అత్యధిక సంఖ్యాకులయితే వారిని ఆ భాషా రాష్ట్రంలో కలిపారు. భాషా రాష్ట్ర విభజన ముఖ్యంగా తెలుగు వారికి సంతృప్తికరంగా జరుగకపోయినా కొందరు తెలుగువారు ఇతర రాష్ట్రాల్లో నివసించవలసి వచ్చినా కొందరు ఇతర సరిహద్దు భాషలవారు ఆంధ్ర రాష్ట్రంలో నివసించక తప్పలేదు. అధిక సంఖ్యాకుల భాష ఏదైనా సరిహద్దుల్లోని ప్రజలు ద్విభాష, బహుభాషా వ్యవహర్తలుగా వుండక తప్పదని వుంటున్నారు.

చారిత్రక, రాజకీయ కారణాల వల్ల ఈ పరిస్థితి తప్పదు. సరిహద్దుల్లో స్వభాషా ప్రాంతాలు లేని బెంగాలీలు, గుజరాతీ, మలయాళీలు, సింధీలు, పంజాబీలు వగైరా ఉద్యోగ వ్యాపార రీత్యా ఆంధ్రప్రదేశ్‌లో స్థిర పడ్డవారు, హైదరాబాదు వంటి నగరాల్లో ఎక్కువ సంఖ్యలో నివసిస్తున్నారు.

**2.5.1 ఆంధ్రప్రదేశ్ - వివిధ భాషలు ఉపయోగం :**

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 85.96 శాతం తెలుగు మాట్లాడే వారున్నందువల్ల తెలుగును అధికార భాషగా నిర్ణయించటం జరిగింది. వేరే భాషను అధికార భాషగా నిర్ణయించాలని ఎవరూ కోరలేదు.

రాష్ట్రంలోని యితర భాషలను చూస్తే : వివిధ భాషలను ఉపయోగించే వారి శాతం :

| | | |
|---|---|---|
| ఉర్దూ | 7.10 | శాతం |
| లంబాడి | 1.55 | " |
| తమిళం | 1.20 | " |
| కన్నడం | 1.06 | ,, |
| మరాఠి | 0.77 | " |
| ఓండ్రం | 0.53 | " |
| హిందీ | 0.58 | " |

| | | | |
|---|---|---|---|
| కోయ | 0.30 | " | |
| గోండి | 0.27 | " | |
| ఎరుకల | 0.27 | " | |
| మలయాళం | 0.06 | " | |
| గుజరాతీ | 0.06 | " | |
| ఇంగ్లీషు | 0.04 | " | |
| పంజాబీ | 0.03 | " | |
| యితర భాషలవారు | 0.54 | " | మంది వున్నారు.[22] |

**ఆంధ్ర ప్రదేశ్‌లో 15 శాతానికి పైగా అల్ప సంఖ్యాకులు ఉపయోగించే భాషా వివరాలు**

**1961 జనాభా లెక్కల ప్రకారం**

| | భాష | జిల్లా | తాలుకా/పట్టణం | శాతం |
|---|---|---|---|---|
| 1. | ఖోండు | శ్రీకాకుళం | పార్వతీపురం | 20.0 |
| | | | పాలకొండ | 35.0 |
| | | | సాలూరు | 86.6 |
| | | తూర్పు గోదావరి | భద్రాచలం | 52.0 |
| | | ఆదిలాబాదు | ఉట్నూరు | 61.0 |
| | | | బోద్ | 22.2 |
| 2. | నెవోం | శ్రీకాకుళం | పాలకొండ | 45.5 |
| 3. | ఒరియా | శ్రీకాకుళం | ఇచ్చాపురం | 29.2 |
| | | | షోంపేట | 25.4 |
| | | | ఇచ్చాపురం పట్టణం | 27.5 |
| | | | మందసా పట్టణం | 46.6 |
| | | | టెక్కలి పట్టణం | 25.6 |
| | | | కాశిబుగ్గ పలాస | 40.0 |
| | | | చిన్న మెనాగ్రి పట్టణం | 27.0 |
| | | విశాఖ పట్టణం | శృంగవరవుకోట (ఏజన్సి) | 53.6 |
| 4. | తమిళం | చిత్తూరు జిల్లా | చిత్తూరు జిల్లా | 18.0 |
| | | | చిత్తూరు తాలుకా | 23.9 |
| | | | చిత్తూరు పట్టణం | 46.9 |
| | | | పుత్తూరు తాలుకా | 32.5 |
| | | | పుత్తూరు పట్టణం | 46.0 |

| | | | | |
|---|---|---|---|---|
| | | | తిరుత్తని పట్టణం | 62.3 |
| | | | నూరినగరి | 67.7 |
| | | | రేణిగుంట | 30.0 |
| | | | పొద్దుటూరు పేట పట్టణం | 38.6 |
| | | | పలమనూరు పట్టణం | 20.9 |
| | | | పాకాల పట్టణం | 30.0 |
| | | | కుప్పం పట్టణం | 26.0 |
| 5. | ఉర్దూ | కడప | ఉమర్ గూడా పట్టణం | 26.4 |
| | | | ప్రొద్దుటూరు " | 26.4 |
| | | | బద్వేలు " | 26.4 |
| | | | వెంపల్లె " | 26.4 |
| | | | కమలాపురం " | 26.4 |
| | | | కడప " | 34.5 |
| | | | రాయచోటి | 34.5 |
| | | | రాజంపేట | 34.5 |
| | | | నందలూరు | 34.5 |
| | | అనంతపురం | రాయదుర్గ | 32.5 |
| | | | గుంతకల్లు | 25.9 |
| | | | హిందూపూర్ | 23.9 |
| | | | కదిరి | 23.9 |
| | | | గురవకొండ | 25.9 |
| | | | గుత్తి | 25.9 |
| | | | ధర్మవరం | 23.0 |
| | | | పెనుకొండ | 23.0 |
| | | | మడకశిర | 20.0 |
| | | | పామిడి | 25.0 |
| | | | రాయదుర్గం | 22.0 |
| | | కర్నూలు | కర్నూలు పట్టణం | 40.4 |
| | | | కోడు మూడు | 21.0 |
| | | | గూడూరు | 21.0 |
| | | | ఆదోని పట్టణం | 33.9 |
| | | | ఎమ్మిగనూరు పట్టణం | 22.0 |
| | | | ఆత్మకూరు | 22.0 |

| | | |
|---|---|---|
| | నరిదికొట్కూరు | 21.0 |
| | మార్కాపూర్ | 31.0 |
| | మద్దికెర | 21.0 |
| | పత్తికొండ | 21.0 |
| | డోన్ | 21.0 |
| | నంద్యాల | 31.0 |
| | కంభం పట్టణం | 31.0 |
| | గిద్దలూరు పట్టణం | 31.0 |
| | బంగన పల్లి | 31.0 |
| | కోయిలకుంట | 31.0 |
| ఆదిలాబాదు | ఆదిలాబాదు తాలుకా | 40.0 |
| | భైంసా | 46.0 |
| | మధోల్ | 41.7 |
| | ఖానాపూర్ | 25.0 |
| | నిర్మల్ | 35.0 |
| | బోత్ | 25.0 |
| | సిర్పూర్ | 25.2 |
| | కొత్తపేట | 40.0 |
| | లక్కి శెట్టి పేట | 26.0 |
| | ఆసిఫాబాదు | 21.0 |
| హైద్రాబాద్ | హైద్రాబాద్ జిల్లా | 31.0 |
| | హైద్రాబాద్ దక్షిణం | 43.0 |
| | హైద్రాబాద్ మున్సిపాలిటి కంటోన్మెంట్ | 50.0 |
| | వికారాబాద్ పట్టణం | 22.0 |
| | తాండూరు | 31.14 |
| | నావందగి | 31.14 |
| | పరిగి | 27.8 |
| మహబూబ్ నగర్ జిల్లా | మహబూబ్‌నగర్ పట్టణం | 27.8 |
| | నారాయణ పేట | 27.8 |
| | వనపర్తి | 27.8 |
| | సరూప్ నగర్ | 27.8 |
| | దుఖ్యాన్ | 27.8 |

| | | |
|---|---|---|
| | బరేపల్లి | 27.8 |
| | ఊటుకూరు | 27.8 |
| | కొల్లాపూర్ | 27.8 |
| | అమంగల్ | 27.8 |
| | కల్వకుర్తి | 27.8 |
| | నాగర్ కర్నూల్ | 27.8 |
| | ఆత్మకూర్ | 27.8 |
| | లచ్చంపేట | 27.8 |
| | కోడంగల్ | 27.8 |
| | కొసిగి | 25.5 |
| | గద్వాల | 24.7 |
| | జీజా | 24.7 |
| | అమ్మికంపూర్ | 27.7 |
| మెదక్ | జహీరాబాద్ తాలూకా | 25.1 |
| | మెదక్ పట్టణం | 22.6 |
| | సంగారెడ్డి పట్టణం | 22.6 |
| | సదాశివ పేట పట్టణం | 22.6 |
| | అండోల్ | 22.6 |
| | శంకరంపేట పట్టణం | 22.6 |
| | రామాయణ పేట పట్టణం | 22.6 |
| | సిమిపేట్ పట్టణం | 22.6 |
| | దుబ్బాక | 22.6 |
| | గజ్వేల్ పట్టణం | 22.6 |
| | జహీరాబాద్ | 48.3 |
| | కోహీర్ పట్టణం | 43.3 |
| | నారాయణ ఖేడ్ పట్టణం | 34.5 |
| నిజామాబాద్ | నిజామాబాద్ జిల్లా | 31.2 |
| | నిజామాబాద్ పట్టణం | 24.5 |
| | కామారెడ్డి | 24.6 |
| | ఎల్లారెడ్డి | 24.6 |
| | బాన్సువాడ | 24.6 |
| | దోమకొండ | 24.6 |
| | అర్మూర్ | 24.6 |

| | | | | |
|---|---|---|---|---|
| | | | బాలకొండ | 24.6 |
| | | | బోధన్ | 24.6 |
| | | | యడవల్లి | 24.6 |
| | | | రంజోల్ | 24.6 |
| | | వరంగల్ | వరంగల్ పట్టణం | 20.9 |
| 6. | కన్నడం | కర్నూలు | ఎమ్మిగనూర్ పట్టణం | 33.6 |
| | | | ఆలూరు తాలూకా | 28.4 |
| 7. | మరాఠి | ఆదిలాబాదు | ఆదిలాబాదు జిల్లా | 20.6 |
| | | | సిర్పూర్ తాలూకా | 29.0 |
| | | | ఆసిఫాబాద్ | 24.0 |
| | | | మదోల్ తలూకా | 27.0 |
| | | | సిర్పూర్ పట్టణం | 28.2 |
| 8. | లంబాడి | వరంగల్ | యిల్లందు తాలూకా | 24.11 |
| | | | మహబూబా బాద్ తాలూకా | 20.9 |
| | | | నర్సంపేట తలూకా | 14.99 |
| 9. | కోయ | పశ్చిమ గోదావరి జిల్లా | పోలవరం తాలూకా | 19.37 |
| | | ఖమ్మం | భద్రాచలం తాలూకా | 41.05 |
| | | | కొత్తగూడెం | 22.39[23] |

రాష్ట్రంలోని ఏ ఒక ప్రాంతంలో గాని, జిల్లాలో గాని, నూటికి 50 శాతానికి పైగా ఒకే భాషను మాట్లాడే ప్రజలు లేకపోవడం వల్ల వారి వారి భాషలను ప్రాంతీయ భాషలుగా నిర్ణయించేందుకు వీలుపడక అన్నిచోట్ల అల్ప సంఖ్యాక భాషలుగానే వుండిపోయాయి.

## 2.5.2 అల్ప సంఖ్యాక భాషలు - అధికార భాష :

**1966 అధికార భాషాచట్టం :** కొన్ని అధికార కార్యాల నిమిత్తం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో తెలుగు భాషకు అదనంగా ఉర్దూ లేక ఏదైనా ఇతర భాషల వినియోగం (చూ. అను. 4)

| | జిల్లా పేరు | ప్రాంతం పేరు: మున్సిపల్ ప్రాంతం | ప్రాంతం పేరు: తాలూకాలో మున్సిపల్ కాని ప్రాంతం | భాష పేరు | అధికార కార్యములు |
|---|---|---|---|---|---|
| (1) | (2) | 3(ఎ) | 3(బి) | (4) | (5) |
| 1) | శ్రీకాకుళం | ఇచ్చాపురం సోంపేట | ఇచ్చాపురం | ఒరియా | 1) టెండర్ నోటీసులు, వేలం నోటీసులు తాలూకా లేక అందులో భాగముపై అధికారం గల రోడ్ల, భవనముల శాఖలోని సెక్షను అధికారుల కార్యాలయంలోని భవనముల విభాగమునకు సంబంధించిన పనులన్నింటికీ చిట్ టెండర్ నోటీసులను జారీ చేయుట. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 2) | విశాఖపట్నం | పాడేరు | | ఒరియా | |
| 3) | గుంటూరు | గుంటూరు నగరం | | ఉర్దూ | |
| 4) | నెల్లూరు | నెల్లూరు నగరం | | ఉర్దూ | 2) ఆబ్కారీ సబ్-ఇన్స్పెక్టఇన్స్పెక్టర్లు, సర్కిల్ - ఇన్స్పెక్టర్లు(తెలంగాణా ప్రాంతం) లోని కార్యాలయములలో వేలం నోటీసులు జారి చేయుట. |
| 5) | చిత్తూరు | చిత్తూరు | చిత్తూరు | తమిళం | 3) మత్స్య పరిశ్రమల శాఖలోని ఇన్స్పెక్టర్ల కార్యాలయములోను, వారి తాబేదారి కార్యాయములలోను వేలం నోటీసులను ప్రజలకు సార్వజనీక శ్రేయస్సుకు సంబంధించిన సాధారణ ఉత్తరువులను జారీ చేయుట. |
| | | తిరుపతి | — | తమిళం | |
| | | — | పుత్తూరు | తమిళం | |
| | | చిత్తూరు (తరువాయి) | కాళహస్తి | ,, | 4) తాలూకా స్థాయిలోను, అంతకు దిగువ స్థాయి లోను అటవీశాఖ కింద గల కార్యాలయ ములలోని రేంజి అధికారులు జారీ చేయు విక్రయ నోటీసులు. |
| | | మదనపల్లి | — | తమిళం | |
| | | | కుప్పం(తాలూకా) | తమిళం | |
| | | | బంగారుపాలెం | తమిళం | |
| | | | సత్యవీడు | తమిళం | |
| 6) | కడప | కడప | — | ఉర్దూ | 5) పంచాయితీ సమితుల కార్యాలయాల్లోను, గ్రామ పంచాయితీ కార్యాలయాల్లోను టెండర్ నోటీసులు జారీ చేయుట. |
| | | ప్రొద్దుటూరు | — | ఉర్దూ | |
| | | — | రాయచోటి | ఉర్దూ | |
| 7) | అనంతపురం | అనంతపురం | — | ఉర్దూ | 6) తాలూకా స్థాయిలో పబ్లిక్ వర్క్స్ శాఖ సెక్షను కార్యాలయాల్లో రూ. 10,000 అంతకు తక్కువ చిన్న తరహా పనులకు చిట్ టెండర్ నోటీసులు, టెండరు, వేలం నోటీసులు జారీ చేయుట. |
| | | గుంతకల్లు | — | ఉర్దూ | |
| | | హిందూపురం | — | ఉర్దూ | |
| | | కదిరి | — | ఉర్దూ | |
| | | ధర్మవరము | — | ఉర్దూ | 7) తహసీలుదారుల కార్యాలయాల్లో, తాలూకా స్థాయిలో అంతకు దిగువ స్థాయిలో రెవెన్యూశాఖలోని ఇతర కార్యాలయాల్లో ఏదేని ప్రతిపాదనకు ప్రజల నుండి ఆక్షేపణలను కోరుతూ గ్రామములలో నోటీసులను ప్రచురించుట, టెండరు నోటీసులు జారీ చేయుట. |
| | | — | మడకశిర | కన్నడ | |
| | | రాయదుర్గం | — | ఉర్దూ | |
| | | తాడిపత్రి | — | ఉర్దూ | |
| 8) | కర్నూలు | కర్నూలునగరం | కర్నూలు | ఉర్దూ | |
| | | ఆదోని | — | ,, | |
| | | — | ఆదోని | కన్నడం | |
| | | నంద్యాల | — | ఉర్దూ | |
| | | — | ఆలూరు | కన్నడం | |

| | | | | |
|---|---|---|---|---|
| | | – | ఆళ్ళగడ్డ | ఉర్దూ |
| | | ఆత్మకూర్ | – | ,, |
| | | ఎమ్మిగనూర్ | – | ,, |
| 9) | ప్రకాశం | మార్కాపురం | – | ఉర్దూ |
| 10) | నెల్లూరు | నెల్లూరు | – | ఉర్దూ |
| 11) | మహబూబ్‌నగర్ | మహబూబ్ నగర్ | మహబూబ్ నగర్ | ఉర్దూ |
| | | గద్వాల్ | – | ,, |
| | | నారాయణ్‌పేట్ | – | ,, |
| 12) | హైదరాబాద్ జిల్లాయందలి అన్ని ప్రాంతములు | | | ఉర్దూ |
| 13) | రంగారెడ్డి జిల్లాయందలి అన్ని ప్రాంతములు | | | ఉర్దూ |
| 14) | మెదక్ | మెదక్ | – | ఉర్దూ |
| | | – | నారాయణఖేడ్ | కన్నడం |
| | | సంగారెడ్డి | సంగారెడ్డి | ఉర్దూ |
| | | జహీరాబాద్ | జహీరాబాద్ | ,, |
| | | సిద్దిపేట్ | – | ,, |
| | | సదాశివపేట్ | – | ,, |
| 15) | కరీంనగర్ | కరీంనగర్ | – | ఉర్దూ |
| | | జగిత్యాల | – | ,, |
| 16) | వరంగల్ | వరంగల్ | – | ఉర్దూ |
| 17) | ఖమ్మం | ఖమ్మం | – | ఉర్దూ |
| 18) | నిజామాబాద్ | మద్నూరు | మద్నూరు | మరాఠీ |
| | | నిజామాబాద్ | నిజామాబాద్ | ఉర్దూ |
| | | కామారెడ్డి | – | ,, |
| | | బోధన్ | బోధన్ | ,, |
| 19) | ఆదిలాబాదు | – | ఆదిలాబాద్ | మరాఠీ |
| | | – | ఉట్నూరు | ,, |
| | | | ఆసిఫాబాద్ | ,, |
| | | | సిర్పూర్ | మరాఠీ |
| | | | బోథ్ | ,, |
| | | – | మధోల్ | ఉర్దూ, మరాఠీ |
| | | భైంసా | – | ,, ,, |
| | | ఆదిలాబాద్ | – | ఉర్దూ |
| | | కాగజ్‌నగర్ | కాగజ్‌నగర్ | ఉర్దూ |
| | | నిర్మల్ | – | ఉర్దూ |
| | | సిర్పూర్ | – | ఉర్దూ |
| 20) | నల్గొండ | నల్గొండ | – | ఉర్దూ |
| | | భువనగిరి | – | ఉర్దూ |

### 2.5.3 ఆంధ్రప్రదేశ్‌లో మైనారిటీ భాషల పరిరక్షణ :

ప్రాథమిక విద్యాస్థాయి :

1) ప్రాథమిక పాఠశాలల్లో అల్పసంఖ్యాక భాషా ప్రయుక్త విద్యార్థులు ఆయా భాషలలో ఒక్కో తరగతికి 10 మంది కాని పాఠశాల మొత్తం మీద 30 మందికి తక్కువ కాకుండా సంఖ్య కలిగివుంటే వారి మాతృభాషలోనే విద్యాబోధన గావించేందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆదేశాలు జారీ చేసింది.

2) తమ మాతృభాషలో విద్యాబోధన కోరే మైనారిటీ విద్యార్థుల కొరకు ప్రత్యేక కోటా కింద వారి పేర్లను ముందుగానే రిజిష్టర్‌లో నమోదు చేయడం జరుగుతుంది.

3) శ్రీకాకుళం జిల్లా టెక్కలి గ్రామంలో ఒరియా భాష ఎలిమెంటరీ పాఠశాలను ప్రభుత్వం నిర్వహిస్తూ 200 మంది విద్యార్థులకు 47 మంది ఉపాధ్యాయులతో ఒరియా భాషలో విద్యాబోధన గావించుతుంది.

4) హైద్రాబాద్, కరీంనగర్, మెదక్, అనంతపూర్, నల్గొండ, ఆదిలాబాదు, కడప, నెల్లూరు, మొదలగు జిల్లాలలో ఉర్దూ పాఠశాలలను ప్రాథమిక స్థాయిలో ప్రభుత్వం నడపుతూంది.

సెకండరీ స్థాయి :

1) మైనారిటీ విద్యార్థులు ఆయా భాషలలో ఒక్కొక్క తరగతికి మాధ్యమిక స్థాయిలో కనీసం 10 మంది, ఉన్నత పాఠశాల స్థాయిలో కనీసం 15 మంది వున్నట్లయితే వారి వారి మాతృభాషలో విద్యాబోధనకు ప్రభుత్వం ఆదేశాలు జారీ చేసింది.

2) తమ భాషలో విద్యాబోధన కోరే విద్యార్థుల వివరాలు ముందుగానే ప్రత్యేక కోటా కింద రిజిష్టర్‌లో వారి వారి పేర్లను నమోదు చేయడం జరుగుతుంది.

3) మైనారిటీ విద్యా సంస్థలలో అవసరమైన చోట అదనపు సౌకర్యాలు కల్పించడానికి ప్రభుత్వం ఏర్పాట్లు చేసింది.

4) హిందీ, కన్నడ, ఒరియా, మరాఠి, తమిళం, ఉర్దూ భాషలలో మాధ్యమిక స్థాయి వరకు విద్యాబోధనకు ప్రభుత్వం అవకాశం కల్పించింది.

5) ఒరియా భాషలో ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షలు రాసే విద్యార్థుల ఫలితాలు ఇతర విద్యార్థుల ఫలితాలతో పాటుగా ప్రకటించటానికి ప్రభుత్వం చర్యలు తీసుకుంది.

6) 1966-67 విద్యా సంవత్సరం నుండి ఆదిలాబాద్ జిల్లా సిరిపూర్ జిల్లా పరిషత్ పాఠశాలలో ఉర్దూ సెక్షను ను 8వ తరగతి వరకు ప్రవేశ పెట్టటం జరిగింది.

**అచ్చు పుస్తకాలు :** కన్నడ, మరాఠి, ఒరియా, తమిళం మొదలైన భాషల పాఠ్య పుస్తకాలను ఆయా రాష్ట్రాలలో వాడబడుతున్న పుస్తకాలనే ఆంధ్రప్రదేశ్‌లో కూడా ఉపయోగించటం జరుగుతుంది.

**ఉపాధ్యాయ నియామకాలు :**

1) ఒరియా భాష మినహా మిగతా అన్ని మైనారిటీ భాషలలో ఉపాధ్యాయులను సమృద్ధిగానే ప్రభుత్వం నియమించింది.

   ప్రతి సంవత్సరం 13 మంది ఉపాధ్యాయులను ఒరిస్సా పంపించి అక్కడి పాఠశాలలో విద్యాబోధన శిక్షణ ఇప్పించేందుకు ప్రభుత్వం ఏర్పాటు చేసింది.

2) హైద్రాబాదు, మహబూబ్‌నగర్, కరీంనగర్, మెదక్ అనంతపురం, నెల్లూరు జిల్లాలలో ఉర్దూ ఉపాధ్యాయుల కొరత రాకుండా కొత్త నియామకాలు చేసింది.

3) గిరిజన ప్రాంతాలలోని గిరిజన విద్యార్థులకు వారి భాషలలో విద్యా బోధన గావించేందుకు ఆ భాషలలో ప్రవేశమున్న ఉపాధ్యాయులను నియమించటం జరుగుతుంది.

**మైనారిటీలకు రోష్నీ పథకం :**

1999 జూలైలో రోష్నీ పథకాన్ని మైనారిటీల సంక్షేమానికి, అభ్యున్నతకి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రకటించింది.

రాష్ట్రంలో మహబూబ్‌నగర్, ఆదిలాబాద్, కృష్ణా, చిత్తూరు జిల్లాల్లో ఉర్దూను ద్వితీయ భాషగా అమలు చేయాలని నిర్ణయించింది.

మైనారిటీలు అధికంగా వున్న ప్రాంతాలలో రెండువందాల ఉర్దూ పాఠశాలలను విద్యా సంవత్సరం నుంచి ప్రారంభించాలని, మైనారిటీల కొరకు కడపలో వైద్యా కళాశాలను, మెదక్, గుంటూరు, నెల్లూరులలో బి.యిడి. కళాశాలలను ప్రారంభించాలని.

ఉర్దూను ద్వితీయ భాషగా అమలు చేస్తున్న జిల్లాలలో మైనారిటీ సంక్షేమ అధికారుల పోస్టులను మంజూరి చేసింది.

రాష్ట్రంలోని 802 ఉర్దూ ఉపాధ్యాయ ఖాళీలను భర్తీ చేయాలని మెదక్, ఆదిలాబాద్, నెల్లూరు జిల్లాలలో ఉపాధ్యాయ శిక్షణా సంస్థల్లో 40 నుండి 75 వరకు సీట్లు పెంచాలని ప్రభుత్వం నిర్ణయించింది.

ఏడు నుండి పదవ తరగతి వరకు చదివే మైనారిటీ విద్యార్థులకు స్కాలర్‌షిప్పులు, అందజేయాలని ఐ.ఎ.యస్. ఐ.పి.యస్. లాంటి పోటీ పరీక్షల నిమిత్తం మైనారిటీలకు స్టడీ సర్కిల్స్‌ను ఏర్పాటుచేయటం ద్వారా మైనారిటీలను అన్ని రంగాలలో అభివృద్ధి పరచాలని ప్రభుత్వం సంకల్పించింది.

**అధికార సంబంధ విషయాలలో మైనారిటీ భాషల ఉపయోగం :**

1) ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు అధికార భాష అయినప్పటికి కొన్ని ముఖ్యమైన ప్రభుత్వ శాసనాలు, చట్టాలు, నిబంధనలు కన్నడ, మరాఠి, తమిళం, ఉర్దూ, హిందీ మొదలైన మైనారిటీ భాషలలోకి వాటిని అనువదించి ఆయా భాషల ప్రజలకు తెలియ జేయటం జరుగుతుంది. ఇందుకు ఒక అధికారిక అనువాద సంఘాన్ని ప్రభుత్వం నియమించింది.

2) ఏయే జిల్లాలలో మున్సిపాలిటీ, తాలూకాలలో 15 శాతం భాషా మైనారిటీలు వున్నారో ఆయా ప్రాంతాలలో ప్రభుత్వ నోటీసులు, ప్రకటనలు మొదలైనవి ఆయా భాషలలో కూడా ప్రకటించాలని ప్రభుత్వం ఆదేశాలు జారీచేసింది.

3) అవకాశం వున్న చోట మైనారిటీ భాషలలో ప్రభుత్వం సేకరించే నివేదికలకు, దరఖాస్తులకు అదే భాషలో సమాధానాలు ఇవ్వటం జరుగుతుంది.

**రాష్ట్ర ప్రభుత్వ సర్వీసులలో నియామకాలు :**

ప్రభుత్వ సర్వీసు నియామకాల్లో రాత పరీక్షకు ఇంగ్లీషు మాధ్యమం తప్పని సరైనప్పటకి ఉద్యోగాలకు ఎంపికైన అభ్యర్థులు వారి శిక్షణ కాలంలో తెలుగులో పరీక్ష రాసి ఉత్తీర్ణత సాధించే అవకాశం మైనారిటీ అభ్యర్థులకు ప్రభుత్వం కల్పించింది.

**మైనారిటీ భాషల పరిరక్షణ :** రాష్ట్రంలో అల్పసంఖ్యాక భాషల పరిరక్షణ నిమిత్తం ప్రభుత్వ సాధారణ పరిపాలనా విభాగంలో ముఖ్య కార్యదర్శి, ఉపకార్యదర్శితో కూడిన విభాగం ఏర్పాటు చేయబడింది.

ఇంగ్లీషు, కన్నడ, మరాఠి, తమిళం, ఉర్దూ, ఒరియా మొదలైన అల్పసంఖ్యాక భాషల పరిరక్షణకు సంబంధించిన విషయాలతో కూడిన కరపత్రాలను కూడా ప్రభుత్వం ముద్రించి అన్ని భాషల వారికి అందించటం జరుగుతుంది.

## 2.6 తెలుగు - అల్పసంఖ్యాక భాష :

విద్యా సంస్థలలో మైనార్టి భాషల ఉపయోగాన్ని పరిశీలిస్తే ఎక్కువ శాతం మైనారిటీ భాషలను ప్రాథమిక స్థాయి వరకే బోధనా మాధ్యమంగా వినియోగించటం జరుగుతుంది.

కొన్ని రాష్ట్రాలలో ప్రాథమిక స్థాయి, సెకండరీ స్థాయిలలో కూడా ఈ మైనారిటీ భాషలను బోధనా మాధ్యమంగా ఉపయోగించటం జరుగుతుంది.

ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు అధికార భాషగా ఉన్నప్పటికి అనేక రాష్ట్రాలలో తెలుగు అల్పసంఖ్యాక భాషగా గుర్తించబడి ప్రాథమిక, సెకండరీ స్థాయిలలో బోధనా మాధ్యమంగా పాఠశాలల్లో ఉపయోగించ బడుతుంది.

వివరాలు పట్టికలో చూపిన విధంగా వున్నాయి.

ఇతర రాష్ట్రాలలో తెలుగు అల్పసంఖ్యాక భాషగా ఉపయోగం :

| క్రమ సంఖ్య | రాష్ట్రం పేరు | సంవత్సరం | తెలుగు పాఠశాలల సంఖ్య | ప్రాధమిక స్థాయి విద్యార్థుల సంఖ్య | ఉపాధ్యాయుల సంఖ్య |
|---|---|---|---|---|---|
| 1. | అస్సాం | 1966-67 | 1 | 64 | 2 |
| | | 1967-68 | 1 | 66 | 1 |
| 2. | గుజరాత్ | 1966-67 | 2 | 644 | 15 |
| | | 1967-68 | 3 | 683 | 16 |
| 3. | మధ్యప్రదేశ్ | 1966-67 | 1 | 40 | 1 |
| | | 1967-68 | 1 | 45 | 1 |
| | | 1968-69 | 1 | 45 | 1 |
| 4. | మహారాష్ట్ర | 1966-67 | 96 | 14,998 | 151 |
| | | 1967-68 | 96 | 15,455 | 157 |
| 5. | మైసూరు | 1966-67 | 79 | 16,167 | 524 |
| | | 1967-68 | 81 | 16,484 | 425 |
| 6. | తమిళనాడు | 1966-67 | 464 | 83,419 | 2,915 |
| 7. | పశ్చిమ బెంగాల్ | 1966-67 | 22 | 4,612 | 96 |
| 8. | ఢిల్లీ | 1966-67 | 1 | 104 | 5 |
| | | 1968-69 | 1 | 44 | 6 |
| 9. | పాండిచ్చేరి | 1968-69 | 10 | 1,624 | 55[24] |
| సెకండరీ స్థాయి | | | | | |
| 1. | మధ్యప్రదేశ్ | 1967-68 | 1 | 75 | 3 |
| | | 1968-69 | 1 | 76 | 3 |
| 2. | మహారాష్ట్ర | 1967-68 | 1 | 263 | 4 |
| 3. | మైసూర్ | 1967-68 | 3 | 2408 | 88 |
| | | 1968-69 | 4 | 1653 | 136 |
| | | 1969-70 | 5 | 1695 | 131 |
| 4. | తమిళనాడు | 1967-68 | 63 | 17,798 | 749 |
| | | 1968-69 | 48 | 16,143 | 739 |
| | | 1969-70 | 44 | 17,691 | 815 |
| 5. | అండమాన్, నికోబార్ దీవులు | 1967-68 | 1 | 31 | 2 |
| | | 1968-69 | 1 | 44 | 3 |
| 6. | ఢిల్లీ | 1967-68 | 1 | 127 | 2 |
| | | 1968-69 | 1 | 139 | 2[25] |

పట్టికలో తెలిపిన విధంగా వివిధ రాష్ట్రాలలో తెలుగు అల్పసంఖ్యాక భాషగా గుర్తించబడి ప్రాథమిక, మాధ్యమిక స్థాయి పాఠశాలల్లో ఆయా రాష్ట్రాలు ప్రత్యేక తెలుగు ఉపాధ్యాయులను నియమించడం ద్వారా విద్యార్థులకు తెలుగు విద్యాబోధన గావింపబడుతుంది.

## 2.7 భారతీయ భాషలు - గణాంక వివరాలు :

హిందీయేతర రాష్ట్రాలలో రాజ్యాంగంలోని 8వ షెడ్యూల్డ్ నందలి భాషలు మాతృ భాషగా కలవారు, ఆ రాష్ట్రాల వెలుపల నివసించే మైనారిటీలు

| | తీరప్రాంత రాష్ట్రాలు | భారతదేశంలో మాతృభాషీయుల సంఖ్య | రాష్ట్రంలో మాట్లాడే వారు | ఇతర రాష్ట్రాలలో మాట్లాడే వారు | రాష్ట్రం వెలుపల మాట్లాడే వారి శాతం |
|---|---|---|---|---|---|
| 1. | ఆంధ్రప్రదేశ్ (తెలుగు) | 4,47,52,926 | 3,71,33,338 | 76,14,408 | 17.01 |
| 2. | తమిళనాడు (తమిళం) | 3,76,90,020 | 3,48,17,421 | 24,32,748 | 6.45 |
| 3. | మహారాష్ట్ర (మరాఠి) | 4,22,51,207 | 3,86,16,857 | 34,21,330 | 8.10 |
| 4. | పశ్చిమ బెంగాల్ (బెంగాలీ) | 4,47,92,722 | 3,78,06,508 | 57,08,579 | 12.74 |
| 5. | గుజరాత్ (గుజరాతీ) | 2,58,75,252 | 2,38,67,243 | 7,86,002 | 3.04 |
| 6. | కేరళ (మళయాళం) | 2,12,38,231 | 2,04,96,705 | 14,03,467 | 6.40 |
| 7. | కర్నాటక (కన్నడ) | 2,17,07,918 | 1,93,28,270 | 23,07,189 | 10.63 |
| 8. | ఒరిస్సా (ఒరియ) | 1,98,55,450 | 1,84,60,061 | 13,79,217 | 6.95 |
| హిమాలయ ప్రాంత రాష్ట్రాలు : | | | | | |
| 1. | పంజాబ్ (పంజాబీ) | 1,64,49,573 | 1,20,76,947 | 18,31,533 | 11.13 |
| 2. | అస్సాం (అస్సామీస్) | 89,58,977 | 8,28,406 | 7,691 | 0.09 |
| 3. | కాశ్మీర్ (కాశ్మీరీ) | 24,38,360 | 24,22,869 | 15,550 | 0.64 |

1971 జనాభా లెక్కల ప్రకారం వివిధ భారతీయ భాషలను మాట్లాడే ప్రజల సంఖ్య భారత రాజ్యాంగంలోని 8వ అధికరణంలో పొందు పరచబడింది. దాని ప్రకారం.

| (అ) తీరప్రాంతపు రాష్ట్రాలు | మొత్తం జనాభా | మాతృభాష మాట్లాడే వారు | తెలుగు అల్పసంఖ్యాక భాషా వర్గాలు |
|---|---|---|---|
| తమిళనాడు | 41,199,168 | 34,817,421 | 36,000,78 |
| ఆంధ్రప్రదేశ్ | 43,502,708 | 37,133,338 | - |
| ఒరిస్సా | 21,944,615 | 18,460,061 | 499,447 |
| బెంగాల్ | 44,312,011 | 37,806,508 | 84,492 |
| గుజరాత్ | 26,697,475 | 23,865,243 | 16,793 |
| మహారాష్ట్ర | 50,412,235 | 38,616,857 | 746,257 |
| కర్ణాటక | 29,299,014 | 19,328,270 | 397,557 |
| కేరళ | 21,347,375 | 20,496,705 | 44,282 |
| | 278,714,601 | 230,524,403 | 7,406,906 |
| (ఆ) హిమాలయ ప్రాంతంలోని రాష్ట్రాలు | | | |
| అస్సాం | 14,957,542 | 8,928,406 | 20,475 |
| పంజాబ్ | 13,551,060 | 12,076,947 | 2,855 |
| కాశ్మీర్ | 4,616,632 | 2,422,869 | 789 |
| | 33,125,234 | 23,428,222 | 24,119 |
| (ఇ) కేంద్రీయ హిందీ రాష్ట్రాలు | | | |
| బీహార్ | 56,353,369 | 19,787 429 | 33,300 |
| హర్యానా | 10,036,808 | 10,019,266 | - |
| హిమాచల్ ప్రదేశ్ | 3,460,434 | 3,217 472 | - |
| మధ్యప్రదేశ్ | 41,654,119 | 32,873 079 | 103,743 |
| రాజస్థాన్ | 25,765,806 | 15,672 445 | 1,758 |
| ఉత్తర ప్రదేశ్ | 88,341,144 | 71,924 071 | 6,394 |
| ఢిల్లీ | 4,065,698 | 3,060 681 | 7,556 |
| | 229,677,378 | 156,554,443 | 152,751 |
| (ఈ) కేంద్ర పాలిత ప్రాంతాలు | 6,642,439 | 410,507,068 | 33,838 |

ఆంధ్ర రాష్ట్ర అవతరణ, అధికార భాషాచట్టం, అధికార భాషగా తెలుగు అమలు, ప్రగతి సమీక్ష మూడో అధ్యాయాంశం.

## సూచికలు


1. యునిక్ క్వింటెస్సెన్స్ ఆఫ్ జనరల్ స్టడీస్ 1995 పు. 3-25
2. భారత రాజ్యాంగం - రాజకీయ వ్యవస్థ పు. - 1
3. పైదే - పు. - 1
4. ద పొజిషన్ అండ్ ఫంక్షన్ ఆఫ్ తెలుగు. మోటూరి సత్యానారాయణ. పు. 63 - 64
5. లాంగ్వేజ్ యూజ్ ఇన్ అడ్మినిస్ట్రేషన్ అండ్ నేషనల్ ఇంటిగ్రేషన్ (బి. మల్లిఖార్జున్) పు.-54
6. పైదే పు. - 55
7. పైదే పు. - 55
8. పైదే పు. - 56
9. పైదే పు. - 56
10. పైదే పు. - 57
11. పైదే పు. - 58
12. పైదే పు. - 58
13. పైదే పు. - 37
14. పైదే పు. - 38
15. పైదే పు. - 38
16. పైదే పు. - 39
17. పైదే పు. - 40
18. లాంగ్వేజ్ ప్లానింగ్, ఇన్ ప్రొసీడింగ్స్ ఆఫ్ యాన్ ఇన్స్టిట్యూట్ పు. - 59
19. పైదే పు. - 150
20. పైదే పు. - 160
21. పైదే పు. - 163
22. రిపోర్ట్ ఆఫ్ ద సెలెక్ట్ కమిటి ఆన్ ది ఆంధ్రప్రదేశ్ అఫిషియల్ లాంగ్వేజ్ బిల్ 1964 పు. - 16
23. పైదే పు. 17 - 20
24. ద లెవెన్త్ రిపోర్ట్ ఆఫ్ ద కమిషనర్ ఫర్ లింగ్విస్టిక్ మైనారిటీస్ ఇన్ ఇండియా ఫర్ ద పిరియడ్ 1968-69 పు. - 136
25. ద ట్వెల్త్ రిపోర్ట్ ఆఫ్ ద కమిషనర్ ఫర్ లింగ్విస్టిక్ మైనారిటీస్ ఇన్ ఇండియా ఫర్ ద పిరియడ్ 1969 - 70 పు. 129.

**3.1 ఆంధ్రోద్యమం - ఆంధ్రప్రదేశ్ అవతరణ :** భారత దేశంలో భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణోద్యమానికి నాంది పలికిన వారు ఆంధ్రులు. పరిపాలన, విద్యాబోధన ప్రజల భాషలో జరగాలనే ఆశయం ఈ ఉద్యమానికి మూలం. వందేమాతరం, స్వదేశీ ఉద్యమాలు ఆంధ్రులలో తమ గత సాహిత్యం, భాష, సంస్కృతి పట్ల ఆసక్తిని పెంచింది. క్రీ.శ. 1910లో విజ్ఞాన చంద్రికా మండలి "ఆంధ్రుల చరిత్ర" గ్రంథాన్ని ప్రచురించింది. ఈ గ్రంథం చదివిన ఆంధ్రులు ప్రాచీన వైభవంలో, సాంస్కృతిక, సాహిత్య రంగాలలో, రాజ్యపాలనలో తాము ఎవరికి తీసిపోమని గ్రహించారు.

ఒక వైపు తమ ప్రాచీన వైభవాన్ని తలుస్తూ, మరొక వైపు సమకాలీన దౌర్భాగ్యాన్ని కూడా గుర్తించారు. మద్రాసు రాష్ట్ర జనాభాలో 40శాతం, విస్తీర్ణతలో 58 శాతం వున్న ఆంధ్రులకు రాష్ట్రపాలనలో ఎటువంటి అధికారం గాని, ప్రవేశం గాని లేదు.

రాష్ట్ర ఉన్నతోద్యోగాలలో ఎనిమిది మంది తెలుగు వారుండగా 56 మంది ఆంధ్రేతరులున్నారు. న్యాయశాఖలో జిల్లా జడ్జి పదవులలో 19 మంది ఆంధ్రే తరులుండగా ఒక్క తెలుగు వాడు కూడ ఆ పదవిలో నియమింపబడలేదు.[1] అంతేగాక ఆంధ్ర నగరాలైన బాపట్ల, మచిలీ పట్నం, నర్సాపురం, రాజమండ్రి, విశాఖపట్టణం, పర్లాకిమిడిలలో గల విద్యా సంస్థలు ఆంధ్రేతరులు నిర్వహించేవారు. ఆంధ్రరాష్ట్రం ఒక ప్రత్యేక రాష్ట్రంగా ప్రాతినిధ్యం వహించే సమావేశాన్నేర్పాటు చేయాలని 1911 ఏప్రిల్ నెల హిందూ పత్రిక విలేకరి సూచించాడు. ఈ సూచనను శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులు గారు, ఇంకానేకమంది ప్రతినిధులు బలపరిచారు. తర్వాత వెంకటప్పయ్యగారు భారత జాతీయ కాంగ్రెసు కార్యదర్శిగా ఎన్నికయ్యారు.

ఈ విషయాన్ని గుంటూరు ప్రముఖులైన వి. భావనాచార్యులు, యు. లక్ష్మీనారాయణ, సి. శేషగిరి రావు, జె. గురునాథం గార్లతో చర్చించి ఆంధ్రుల జాతీయ సమావేశాన్నేర్పాటు చేయాలని నిశ్చయించి, కొండా వెంకటప్పయ్య గారు కార్యదర్శిగా ఒక సంఘాన్ని నియమించారు. ఈ సంఘం ఆంధ్రుల జాతీయ సదస్సు ఏర్పాటుకు కావలసిన చర్యలు తీసుకోవాలని, ప్రథమాంధ్ర సమావేశం 1913 మే నెల బాపట్లలో నిర్వహించాలని నిశ్చయించింది.

ఈ సమావేశం జరిగిన తర్వాత 'దేశమాత' అనే పత్రిక ఆంధ్రులు ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడవలెనా? లేదా? అని చర్చించి, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం అవసరమని భావించింది. ఆంధ్ర రాష్ట్రం వెంటనే ఏర్పడక పోవచ్చు. కాని పట్టుదలతో పనిచేస్తే అది అసాధ్యం కాదని అభిప్రాయపడింది.[2]

ఆంధ్రుల ప్రత్యేక రాష్ట్ర కోరిక తమిళుల కిష్టంలేదు. ఆంధ్ర రాష్ట్రానికి ఉన్నతాధికారులెక్కడి నుండి వస్తారు? వారికి రాష్ట్రమిస్తే హైకోర్టు న్యాయమూర్తులు, కార్య నిర్వాహక మండలి సభ్యులను ఎక్కడి నుండి తెస్తారు? ఉన్న ఆంధ్రుల నుండి వారిని నియమిస్తే ఆ పదవులకు నేడున్న యోగ్యతలెలా లభిస్తాయి? స్వంతదైన చిన్న రాష్ట్రాన్ని ఏర్పరచుకునే కన్నా పెద్ద రాష్ట్రమైన మద్రాసుకు న్యాయ మూర్తులను, కౌన్సిలర్లను పంపగల స్థితికి ఆంధ్రులు ఎదగడం మంచిది.[3]

శ్రీ కొండా వెంకటప్పయ్యగారి తర్వాత భారత జాతీయ కాంగ్రెస్ కార్యదర్శిగా ఎన్నికైన శ్రీ ఎన్. సుబ్బారావు ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర కోరిక సరైనది కాదని, అటువంటి రాష్ట్రం చీఫ్ కమిషనర్ పాలనకు

సరిపోయేంత చిన్నది కాగలదని భావించాడు. "చీఫ్ కమీషనర్ పాలనలో వుంటే చిన్న రాష్ట్రానికి బదులు గవర్నర్, కౌన్సిల్ గల ప్రస్తుత ప్రభుత్వ పాలనలో వుండడమే నేను వాంఛిస్తానని" ప్రకటించినాడు.[4]

అంతేకాక ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రావతరణ, తదితర భాషా ప్రయుక్త రాష్ట్రాలు కావాలనే ఆందోళనకు దారి తీస్తుందని భావించారు.

ఆంధ్ర సమావేశంలో చర్చించవలసిన విషయాలను గూర్చిన పత్రాన్ని సంయుక్త కార్యదర్శులు 1912 సెప్టెంబరులో విడుదల చేశారు. ఈ పత్రంలో వివాదస్పదం కాని విషయాలను ప్రస్తావించారు. అవి

ఆంధ్రుల ప్రయోజనాలను కాపాడేందుకు ఒక ఆంగ్ల దిన పత్రిక స్థాపన.

ఆంధ్ర జిల్లాలకు ఒక ప్రత్యేక విశ్వ విద్యాలయం నెలకొల్పడం.

సైన్యం మొదలైన కొన్ని సర్వీసులలో ఆంధ్రులను నియమించడం పట్ల వున్న ఆంక్షలను తొలగించడం.

ఈ మూడు విషయాలను పత్రంలో ప్రస్తావించారు. కాని ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర ప్రస్తావన మాత్రం ఈ పత్రంలో లేదు.

**ప్రథమాంధ్ర మహాసభ :** 1913 మే నెల 26 తేదీన మద్రాసు శాసన మండలి సభ్యులైన బి.యన్ శర్మగారి అధ్యక్షతన ప్రథమాంధ్ర మహాసభ బాపట్లలో జరిగింది. మద్రాసు రాష్ట్రానికి చెందిన తెలుగు జిల్లాల నుండి రెండు వేల మంది పరిశీలకులు, 800 మంది ప్రతినిధులు ఈ సభకు హజరైనారు.

అంతేకాక హైదరాబాదు, వరంగల్, నాగపూర్‌ల నుండి కూడా ప్రతినిధులు వచ్చారు. బి.యన్ శర్మగారు తన అధ్యక్షోపన్యాసంలో ఆంధ్ర రాష్ట్రస్థాపన సమస్యను ప్రస్తావించి ప్రస్తుతానికి ఈ ఉద్యమం వల్ల లాభం కన్న నష్టమే ఎక్కువగా వుందని అభిప్రాయపడ్డారు.

మహాసభ ప్రథమ సమావేశంలో శ్రీ వి. రామదాసు గారు ఆంధ్ర రాష్ట్ర స్థాపన నిర్మాణాన్ని ప్రతిపాదించగా, శ్రీ యన్. సుబ్బారావు, యమ్. ఆదినారాయణన్, యమ్. రామచంద్రరావు వంటి ప్రముఖులు వ్యతిరేకించి ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర సమయం ఇంకా ఆసన్నం కాలేదని వాదించారు. మూడు గంటల తీవ్ర తర్జన భర్జనలో జరిగాక ఈ సమస్య రెండవ ఆంధ్ర మహాసభలో చర్చించాలని తీర్మానించారు.

గత రెండు సంవత్సరాలుగా ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర సాధన కోసం ఎనలేని కృషి చేసిన కృష్ణా, గుంటూరు జిల్లాల ప్రతినిధులు ఈ తీర్మానం విని అసంతృప్తి ప్రకటించారు.

ప్రథమాంధ్ర సభ చర్చలను బట్టి రాయలసీమ జిల్లాల ప్రతినిధులు గంజాం, విశాఖపట్టణానికి చెందిన ఉత్తరాంధ్ర ప్రతినిధులు ప్రత్యేక రాష్ట్ర స్థాపనకొరకు గట్టి పట్టుదలతో లేరని తెలుసుకొన్న శ్రీ కొండా వెంకటప్పయ్య, డా॥ పట్టాభి సీతరామయ్య, ముట్నూరు కృష్ణారావు, వి. సూర్య నారాయణగారు వీరంతా కలసి ఒక సంఘంగా ఏర్పడి రాయలసీమలో పర్యటించి నంద్యాల, గుత్తి, అనంతపురం, బళ్లారి, చిత్తూరు, కడప, నెల్లూరులలో అనేక బహిరంగ సభల్లో ఉపన్యసించి, రాయలసీమ ప్రజలు కూడా ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రాన్ని కోరుతున్నారనే అభిప్రాయానికొచ్చారు.

చిత్తూరులోని తమిళ న్యాయవాదులు మాత్రం తమకు మద్రాసుతో సంబంధాలు తెగిపోతాయనే ఉద్దేశ్యంతో ప్రత్యేక రాష్ట్ర స్థాపనను వ్యతిరేకించారు.

**ద్వితీయాంధ్ర మహాసభ :** 1914 ఏప్రిల్ 11వ తేదీన న్యాపతి సుబ్బారావు గారి అధ్యక్షతన విజయవాడలో రెండవ ఆంధ్ర మహాసభ జరిగింది.

మద్రాసు రాష్ట్రంలో తెలుగు భాష మాట్లాడే ప్రాంతాల్లో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పడాలనే తీర్మానాన్ని శ్రీ యం. సూర్య నారాయణరావు గారు ప్రతిపాదించగా శ్రీ వి. రామదాసు గారు బలపరిచారు. అధిక మెజార్టీతో ఈ తీర్మానం అంగీకరించబడింది.

**తృతీయాంధ్ర మహాసభ :** 1915 మే నెల విశాఖపట్టణంలో రాజా పానుగంటి రామరాయం గారి అధ్యక్షతన తృతీయాంధ్ర మహాసభలు జరిగాయి. ఈ సభలలో ప్రత్యేక అంధ్ర రాష్ట్ర స్థాపన కోరడమే గాక, సెకండరీ పాఠశాలలో మాతృభాష బోధనా భాషగా వుండాలని తీర్మానించారు.

మద్రాసు నుండి వెలువడే "స్వదేశీ మిత్రన్" అనే తమిళ దిన పత్రిక మాతృభాషను బోధనా భాషగా ప్రకటించాలనే తీర్మానాన్ని బలపరుస్తూ రాసింది.

బహిరంగ సభలలో తెలుగులో ఉపన్యాసించడాన్ని ఈ తృతీయాంధ్ర మహాసభలు ప్రవేశ పెట్టాయి.

**నాల్గో ఆంధ్ర మహాసభలు :** 1916 మే నెల కాకినాడలో మోచెర్ల రామచంద్రరావు గారి అధ్యక్షతన నాల్గవాంధ్ర మహాసభలు జరిగాయి.

రామచంద్ర రావు గారు, న్యాపతి సుబ్బారావు గారి వలె ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రోద్యమ నాయకులలో ముఖ్యులు. ఈ సభలలో విశాఖపట్నానికి చెందిన శ్రీ వి. నరసింహరాజు గారు తెలుగు మాట్లాడే జిల్లాలన్నింటిని కలిపి ఒక ప్రత్యేక స్వయం పాలన పూర్తి అధికారాలు గల రాష్ట్రంగా ఏర్పరచటం ఆవశ్యకం, హేతుబద్దమని ఒక తీర్మానాన్ని ప్రతిపాదించినారు. ప్రపంచ యుద్ధం ముగిసిన తర్వాత అటువంటి రాష్ట్రాన్ని ప్రభుత్వం ఏర్పరచగలదనే సవరణ ప్రతిపాదించడం, అంగీకరించడం కూడా జరిగింది.[5]

నెల్లూరుకు చెందిన ఎ.ఎన్. కృష్ణారావు, కడప నివాసి నెమలి పట్టాభి రామారావు ఈ తీర్మానాన్ని వ్యతిరేకించారు. గతంలో వ్యతిరేకించిన బరంపురంకు చెందిన గాదె రామారావు గారు, అనంతపురం ప్రతినిధి శంకర్రావు గారు ఈ తీర్మానానికి అనుకూలత ప్రకటించారు.

**ఐదవ ఆంధ్ర మహాసభలు :** 1917 జూన్ ఒకటవ తేదీన కొండా వెంకటప్పయ్య గారి అధ్యక్షతన నెల్లూరులో ఐదవ ఆంధ్ర మహాసభలు జరిగాయి.

ఈ సమావేశంలో తీవ్రస్థాయిలో చర్చలు జరిగి సర్కారు, రాయలసీమ జిల్లాల మధ్యగల అభిప్రాయ భేదాలు బహిర్గతమయ్యాయి. ఆంధ్రోద్యమం తొలి రోజుల నుండి రాయలసీమ, నెల్లూరు ప్రజలు ప్రత్యేకాంధ్ర పట్ల ఎక్కువ ఆసక్తి చూపలేదు.

ఆంధ్రరాష్ట్రంలో మద్రాసు చేరదు కాబట్టి ఆ పట్టణంతో వున్న సంబంధాలను నెల్లూరు ప్రజలు వదులుకోలేక పోయారు, అంతేకాక రాయలసీమ నాయకత్వం చాలావరకు తమిళ దేశం నుండి వలస వచ్చిన కేశవపిళ్ళే (గుత్తి, అనంతపురం) ఏకాంబర్ అయ్యర్ (నంద్యాల, కర్నూలు) చేతులలో వుంది.

తెలుగు జిల్లాలలో వారి ఆధిక్యతకు భంగం కలుగుతుందనే భావంతో వారు ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రాన్ని వ్యతిరేకించారు. కర్నూలుకు చెందిన హరి సర్వోత్తమరావు వంటి తెలుగు జాతి నాయకులు ప్రత్యేకాంధ్రోద్యమాన్ని బలపరిచారు.

"ఐదవ మహాసభలో ప్రత్యేకాంధ్ర రాష్ట్ర వ్యతిరేకులు ఆ రాష్ట్ర స్థాపన నిర్మాణాన్ని ఓడించాలనే పట్టుదల వహించారు. 740 మంది ప్రతి నిధులలో 450 వరకు నెల్లూరు జిల్లా వారు".[6]

ఒకే జిల్లా ప్రతినిధులతో ఈ తీర్మానం వీగిపోతుందనే భయంతో ప్రతి జిల్లాకు ఒక ఓటు మాత్రమే ఇవ్వాలని ప్రతి నిధులకు బదులుగా జిల్లాల వారిగా ఓటు వేయాలని హరి సర్వోత్తమరావు గారు ప్రతిపాదించారు.

ఆ సమయంలో సర్కారు జిల్లాల నుండి చాలామంది ప్రతినిధులు రావడంతో ఈ తీర్మానాన్ని అంగీకరించారు.

ఆంధ్ర రాష్ట్రస్థాపన వ్యతిరేక వర్గం నిరాశ చెంది టౌనుహాలులో ప్రత్యేక సమావేశం జరిపి మద్రాసు నగరంతో కలిసిన ప్రత్యేక రాష్ట్రం మాత్రమే తమకంగీకారమని తీర్మానించారు.

బి.యన్. శర్మ మరికొందరు నాయకులు ఈ వ్యతిరేక వర్గాన్ని కలిసి వారికున్న అభిప్రాయ భేదాలను తొలగించిన తర్వాత మరుసటిరోజు మహాసభ కార్యక్రమంలో పాల్గొన్నారు.

నెల్లూరు ప్రముఖ నాయకులైన ఎ.ఎస్. కృష్ణారావు, మరికొందరు ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర స్థాపన కొరకు ప్రభుత్వాన్ని అర్థిస్తూ చేసిన తీర్మానాన్ని వ్యతిరేకించినా చివరకు ఆమోదించారు.

ఆంధ్ర రాష్ట్రానికి మద్రాసు రాజధానిగా వుండాలని వ్యతిరేక వర్గం వారి సవరణ వీగిపోయింది. ఆంధ్ర రాష్ట్ర స్థాపనలో రాయలసీమ ప్రజల పూర్తి మద్దతుందనుకోవడం పొరపాటని, వారికున్న అపోహలను తొలగించం తక్షణ కర్తవ్యమని సర్కారు జిల్లా నాయకులు గుర్తించారు.

**అఖిలాంధ్రోద్యమం :** మహోద్యమాలు మహనీయులను సృష్టిస్తాయి, మహనీయులు మహోద్యమాలను సృష్టిస్తారు. ఆంధ్రోద్యమం భారతదేశంలో భాషా ప్రయుక్త రాష్ట్రాల నిర్మాణానికి మాతృపీఠం అయింది.

1956కు పూర్వం ఆంధ్రజాతి-తెలంగాణా, సర్కారు, రాయలసీమగా చీలివుండేది. సర్కారు, రాయలసీమ జిల్లాలు మదరాసు ఉమ్మడి రాష్ట్రంలో వుండేవి. తెలంగాణా నైజాం పాలనలో వుండేది. ఒకరితో మరొకరికి సత్సంబంధాలు లేవు.

**సర్కారు జిల్లాలలో ఆంధ్రోద్యమం :** ఉమ్మడి మదరాసు రాష్ట్రంలోని తెలుగు జిల్లాలు ఎట్టి అభివృద్ధికి నోచుకోలేదు. ఉదాహరణకు 1915లో ఎనిమిది తెలుగు జిల్లాలలో ఆరు ఆర్ట్సు కళాశాలలు మాత్రమే వుండి మిగిలిన 23 జిల్లాలలో 23 ఆర్ట్సు కళాశాలలు వుండేవి.

విద్యా సముపార్జనకు తెలుగుసీమ గగన కుసుమం అయింది. పారిశ్రామికాభివృద్ధి ఎండమావిలా వుంది. మూడు ముక్కలుగా చీలివున్న తెలుగుసీమలో దారిద్ర్యం, నిరక్షరాస్యత, నిరుద్యోగం, నిత్య రుగ్మతలుగా విలయ తాండవం చేసేవి.

భారత దేశంలో తెలుగు మాట్లాడే నాగరిక జాతి వుందని ఎవరికి తెలియదు. తెలుగు వారిని మదరాసి అని ఉత్తర భారతదేశంలో పిలిచేవారు. ఈ పరిస్థితులలో గుంటూరు నివాసి శ్రీ వై. గురునాధంగారు "హిందూ" పత్రికలో తెలుగు ప్రాంతాల అభివృద్ధిని గూర్చి వ్యాసాలు రాసేవారు. "యువజన సాహితీ సమితి" అనే సంస్థను ఏర్పాటు చేసి దాని ద్వారా ప్రత్యేకాంధ్ర నిర్మాణం గూర్చి ప్రచారం చేశాడు.

1911లో ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు "దేశాభిమాని" పత్రికలో వ్యాసాలు రాసి ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకతను చాటారు.

1917లో కలకత్తా కాంగ్రెస్ మహాసభలో దేశాన్ని భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా పునః నిర్మించాలని తీర్మానం ప్రతిపాదించబడింది.

1927లో కేంద్ర అసెంబ్లీలో వరాహగిరి జోగయ్య, వేరురపు రామదాసు పంతులు మద్రాసు శాసన సభలో ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణం గూర్చి తీర్మానాలు ప్రతిపాదించారు.

1928లో అఖిలపక్ష మహాసభ నిర్ణయానుసారం వెలువడిన నెహ్రూ నివేదిక ఆంధ్రరాష్ట్ర విభజన అత్యవసరమని చెప్పింది.

**రాయలసీమలో ఆంధ్రోద్యమం :** సర్కారు జిల్లాలలో కన్న రాయలసీమ ప్రాంతంలో ఆంధ్రోద్యమం ఆలస్యంగా ప్రారంభమైంది.

1930లో "రాయలసీమ యువజన సంఘం" అనే సంస్థ స్థాపింపబడి ఆంధ్రరాష్ట్ర ఏర్పాటు ఆవశ్యకతను ప్రచారం చేసింది. 1934లో రాయలసీమలో కూడా ఆంధ్రరాష్ట్రోద్యమం మొదలైంది. ఈ యువజన సంఘం ఏడవ మహాసభలో జి. లక్ష్మణరెడ్డి, కేశవపిళ్ళై సర్కారు జిల్లా నాయకులపై వున్న అనుమానంతో ఈ సమావేశంలో ఆంధ్రరాష్ట్ర తీర్మానాన్ని వ్యతిరేకించారు.

1937లో ఆనాటి ఆంధ్ర కాంగ్రెస్ కమిటి అధ్యక్షులు భోగరాజు పట్టాభి సీతరామయ్య, కార్యదర్శి గొట్టిపాటి బ్రహ్మయ్యగారు రాయలసీమలో పర్యటించి ఆంధ్రరాష్ట్ర నిర్మాణం గూర్చి విస్తృతంగా ప్రచారం చేశారు.

1937లోనే ఆంధ్ర మహాసభ రజతోత్సవాలు విజయవాడలో జరిగాయి. ఈ మహాసభలో రాయలసీమ నాయకులు కూడా పాల్గొని రాయలసీమ హక్కుల రక్షణ కొరకు కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు

నివాస భవనం 'శ్రీ బాగ్'లో సమావేశం జరిపారు. దీనినే "శ్రీ బాగ్ ఒడంబడిక" అంటారు. అది రాయలసీమకు నీరు - విద్యా సౌకర్యాలకు రక్షణ కల్పించింది.

1952లో రాయలసీమ ప్రాంతంలో ఆంధ్రరాష్ట్ర నిర్మాణ అవశ్యకంపై ఆందోళనలు తీవ్రతరం అయ్యాయి.

**తెలంగాణాలో ఆంధ్రోద్యమం :** నైజాం సంస్థానపాలన కింద తెలుగు, కన్నడ, మహారాష్ట్ర ప్రాంతాలున్నాయి. తెలుగు వారి జీవన స్థితిగతులు అద్వాన్న స్థితిలో వున్నాయి. తెలుగువారు తమ మాతృభాష తెలుగు మాట్లాడడమే అపరాధమైంది.

తెలుగుభాషా వైతాళికుడు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు హైదరాబాదులో "శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయం" పేరుతో గ్రంథాలయాన్ని స్థాపించారు. తెలంగాణాలో యింకా అనేక ప్రాంతాలలో గ్రంథాలయాలను స్థాపించి, ప్రతి గ్రామంలో సభలు పెట్టి భాషాభివృద్ధికి ప్రత్యేక సమగ్ర ఆంధ్ర ఏర్పడాలనే ప్రచారంతో పాటు సాంఘిక, సంస్కరణలను కూడా ప్రచారం చేశాడు.

1930లో తెలంగాణాలో శ్రీ సురవరవు ప్రతాపరెడ్డి లాంటి సంఘ సంస్కరణోద్యమ నాయకులు ఆంధ్ర రాష్ట్ర సాధనకు 'ఆంధ్ర మహాసభ'ను స్థాపించారు. విరివిగా ప్రత్యేక ఆంధ్రను గూర్చి ఆందోళన చేశారు. హైదరాబాద్‌లో 'అర్య సమాజం' సోషలిస్టు నాయకులు యస్.డి. గిరి, మహదేవ్ సింగ్‌లు ఈ ఉద్యమానికి కీలకపాత్ర పోషించారు. తెలంగాణా సాయుధ పోరాటం ఆంధ్ర రాష్ట్రోద్యమానికి శక్తివంతమైన ఆయుధమైంది. ఆంధ్రప్రాంతంలోని మేధావులు కూడా తెలంగాణాతో కలిపి ప్రత్యేకాంధ్ర ఏర్పడాలని విజ్ఞప్తి చేశారు.

ఆంధ్రరాష్ట్రోద్యమ పుట్టుకను, అది బలపడడానికి బంగాళ రాష్ట్ర విభజన రద్దుచేయడం. బంగాళీలు కావించిన ఆందోళన కొంతవరకు కారణమని చెప్పవచ్చు.

ఒకే భాష మాట్లాడే వారి జన్మభూమిని రెండు ముక్కలుగా చీల్చివేయుట ధర్మవిరుద్ధమనే సూత్రాన్నాధారం చేసుకొని వారు తమ ఆందోళనను సాగించారు. దాని ఫలితంగా భాషకు, రాష్ట్రానికి సన్నిహిత సంబంధం వుండాలని ఈ రెండు పరస్పరాశ్రయాలనే ఒక గట్టి అభిప్రాయం దేశంలో వ్యాపించింది.

ఇదిగాక బంగాళ రాష్ట్ర విభజనను రద్దుచేసే సందర్భంలో గవర్నరు జనరల్ హార్డింజి ప్రభువు 1911లో ప్రకటించిన అధికార పత్రం ఈ అభిప్రాయాన్ని. మరింత బలపరిచింది. అందతడు అదివరకు బంగాళ రాష్ట్రంలో చేరిన బీహారు ప్రాంతాన్ని విడదీసి ప్రత్యేక రాష్ట్రంగా నిర్మించవలసిన అవసరముందన్నాడు.

బీహారీలు బంగాళీ భాషను గాక హిందీ భాషను మాట్లడడం వల్ల అది మొదలు భాషా ప్రయుక్త రాష్ట్ర వాదులకీ పత్రమొక గొప్ప ఆధారమైంది. అందులోని వాక్య ప్రభావం ఆంధ్రోద్యమ ప్రారంభకులైన కొండా వెంకటప్పయ్య పంతులు, న్యాపతి నారాయణ రావు, చట్టి నరసింహారావు గారు మొదలైన వారి మీద హత్తుకొనింది.

ఈ పత్రాన్నాధారం చేసుకొని బీహారు వలే ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం నిర్మాణం కావాలని 1911లో నారాయణ రావుగారు ఆంగ్ల పత్రికలో ఒక లేఖను ప్రకటించారు.

**ఆంధ్ర విశ్వ విద్యాలయం ఏర్పాటు :** 1913లో బాపట్ల ప్రథమాంధ్ర మహాసభలో ప్రత్యేకాంధ్ర విశ్వ విద్యాలయం ఏర్పాటు గురించి చర్చించారు. మద్రాసు విశ్వ విద్యాలయంలో తెలుగు భాషకు సరైన గుర్తింపు లేదని, తెలుగు పాఠ్య పుస్తకాలను పరిశీలించే సంఘ సభ్యులకు, పరీక్ష పేపర్లు దిద్దేవారికి సరైన తెలుగు భాష రాదని, మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగు వారి ప్రవేశం కష్టమని అనేకమంది సభ్యులు పేర్కొన్నారు.

తెలుగు వారి విద్యాభివృద్దికి, తెలుగు భాషాభివృద్ధికి ప్రత్యేక ఆంధ్ర విశ్వ విద్యాలయం ఏర్పాటు చేయాలని ఇది ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర స్థాపనకు దారితీస్తుందని భావించారు.

భాషా ప్రయుక్తంగా విశ్వ విద్యాలయాలు ఏర్పాటు కావాలని వారు కోరారు. మద్రాసు ప్రభుత్వం ఆంధ్ర విశ్వ విద్యాలయం ఏర్పాటు వీలుకాదన్నది.

1917 ఫిబ్రవరిలో వెంకటపతిరాజు మద్రాసు, శాసనసభలో తెలుగు జిల్లాలకు ఒక ప్రత్యేక విశ్వ విద్యాలయం ఏర్పరచాలని, ఆంధ్రదేశంలో కొన్ని పాఠశాలలు, కళాశాలలు, స్థాపించాలని ఒక తీర్మానంలో కోరారు.

1919, 1920లో కూడా ఇటువంటి అభ్యర్ధనలే వచ్చాయి. 1920 అక్టోబరు 15 తేదీన మద్రాసు విశ్వ విద్యాలయం సెనెట్ రాష్ట్రంలో కొన్ని విశ్వ విద్యాలయాలు భాషా ప్రయుక్తంగా వుండాలని తీర్మానించింది.

విశాఖపట్నం సభ్యుడు సూర్యనారాయణ శాసన మండలిలో ప్రత్యేక ఆంధ్ర విశ్వ విద్యాలయం స్థాపించాలని కోరుతూ తీర్మానం ప్రతిపాదించారు. ఈ తీర్మానం 1921 సెప్టంబరు 2వ తేదీన శాసన మండలి ఆమోదం పొందింది.[7] కాని విద్యామంత్రి ఎ.వి. పాత్రో మద్రాసు విశ్వవిద్యాలయ పునర్వవస్థీకరణకు బిల్లు ప్రవేశపెట్టారు.

ఈ కారణంగా ఆంధ్ర విశ్వ విద్యాలయం ఏర్పడలేదు. నాలుగు సంవత్సరాల కాల వ్యవధి తర్వాత 1925 ఆగష్టు 20న ఆంధ్ర విశ్వ విద్యాలయ ఏర్పాటుకు సంబంధించిన బిల్లు శాసన మండలిలో ప్రవేశపెట్టబడి సెలెక్ట్ కమిటీకి నివేదించటం జరిగింది.[8]

1926 ఏప్రిల్ 16వ తేదీన విజయవాడలో ఆంధ్ర విశ్వ విద్యాలయం ప్రారంభమైంది. మద్రాసు రాష్ట్రంలోని తెలుగు జిల్లాలకు ప్రాతినిధ్యం వహించే ఈ విశ్వ విద్యాలయానికి కట్టమంచి రామలింగారెడ్డి ప్రథమ కులపతిగా నియమితులైనారు. ఇది భాషాపరంగా పేరుపెట్టిన భారతదేశపు ప్రథమ విశ్వ విద్యాలయం.

అంతేకాక తెలుగు, కన్నడ, ఒరియా మొదలైన ప్రాంతీయ భాషలలో భావన, పరీక్షల నిర్వహణకు అనుమతించిన మొదటి విశ్వ విద్యాలయం కూడా ఇదే 1928 డిసెంబర్‌లో సుబ్బరాయన్ ప్రభుత్వం విశాఖపట్నాన్ని విశ్వ విద్యాలయ కేంద్రంగా చేసింది.

**సైమన్ సంఘం :** 1919 సంస్కరణలు ఏ విధంగా పనిచేస్తున్నయో పరిశీలించడానికి 1927 నవంబరు 8వ తేదీన సైమన్ కమీషన్‌ను బ్రిటీష్ ప్రభుత్వం నియమించింది.

ఈ సంఘంలో భారతీయులెవరికి సభ్యత్వం ఇవ్వనందున ఆంధ్ర మహాసభ ఈ సంఘాన్ని బహిష్కరించింది.

1928లో రాజ్యాంగ సంస్కరణల విషయ విచారణ కోసం సైమన్ కమీషన్ మనదేశానికి వచ్చినపుడు ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటుకు నూతన రాజ్యాంగంలో వీలు కల్పించమని కోరుతూ ఆందోళన జరిగింది.

1930 మే నెలలో సైమన్ సంఘం తమ నివేదికను ప్రకటించారు. అందులో ఒరిస్సా, సింధు రాష్ట్రాలను ఏర్పాటు చేయమని సిఫారసు చేశారు. కాని ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటు గురించి ఎట్టి ప్రస్తావన చేయలేదు.

**రౌండ్ టేబుల్ సమావేశాలు :**

**మొదటి రౌండ్ టేబుల్ సమావేశం :** 1930 నవంబర్‌లో మొదటి రౌండు టేబుల్ సమావేశం లండన్‌లో జరిగింది. ఈ సమావేశాన్ని కాంగ్రెస్ బహిష్కరించినందువల్ల ప్రత్యేకాంధ్ర రాష్ట్రం కావాలని వాదించటానికి ఏ ఆంధ్రుడు వెళ్ళలేదు.

**రెండవ రౌండ్ టేబుల్ సమావేశం :** 1931 సెప్టెంబరు 6వ తేదీన రెండవ రౌండ్ టేబుల్ సమావేశం లండన్‌లో జరిగింది. గాంధీగారు ఈ సమావేశానికి హాజరైనారు. ఆంధ్రులు తమ అలక్ష్యం వల్ల ప్రత్యేక రాష్ట్ర కోరిక దెబ్బతిన్నదని తెలుసుకొన్నా, చేసిన తప్పును సవరించుకోవడానికి ఏప్రయత్నం చేయక వారు గాంధిపై నమ్మకముంచారు.

స్వతంత్ర భారతదేశంలో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చేయటం జరుగుతుందని గాంధీజి వారికి వాగ్దానం చేశారు.

**శ్రీబాగ్ ఒప్పందం :** ఆంధ్ర విశ్వ విద్యాలయ కేంద్ర విషయంలో ఏర్పడిన వివాదం మూలంగా అంధ్రరాష్ట్రంలో తమకు న్యాయం జరగదనే రాయలసీమ ప్రజల అనుమానం ధ్రువవడి రాయలసీమ ప్రాంత ప్రయోజనాలకై 1934లో కాంగ్రెస్ పార్టీ ప్రముఖులైన సి.ఎల్. నరసింహారెడ్డి, సుబ్రహ్మణ్యం మొదలైన వారు రాయలసీమ మహాసభ ఏర్పరిచారు.

కడపకు చెందిన నెమలి పట్టాభిరామారావు గారు ఈ సభకు అధ్యక్షులుగా, ఆంధ్రులంటే గిట్టని సత్యమూర్తిగారు సభను ప్రారంభించారు ఈ సభ మరొక తీర్మానం ద్వారా తిరుపతిలో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం నెలకొల్పాలని కోరింది.

1937 ఆగష్టు నెలలో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సంఘ అధ్యక్షులుగా డా॥ పట్టాభి సీతరామయ్య గారు ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర స్థాపనకై అఖిల భారత జాతీయ కాంగ్రెస్ ఒక తీర్మానం చేయవలెనని పట్టుబట్టారు.

బ్రహ్మయ్యగారు, బులుసు సాంబమూర్తి గారు ఆంధ్రరాష్ట్రం వెంటనే ఏర్పడాలని తమ కార్యక్రమాలను తీవ్రతరం చేశారు. అంతర్జాతీయ సమస్యలు ఏమి లేనందువల్ల ఆంధ్రనాయకులు ఈ ఉద్యమం పట్ల శ్రద్ద వహించారు.

ఆంధ్ర మహాసభ రజతోత్సవాలను విజయవాడలో జరపాలని అపుర ప్రముఖులు ఆహ్వానించారు. ఆంధ్ర రాష్ట్ర స్థాపన పట్ల ప్రతిచోట ఉత్సాహం ప్రదర్శితమైంది. ఈ విషయంలో రాయలసీమ ప్రజలకున్న అనుమానాలను నివృత్తం చేయాలనే ప్రయత్నాలు జరిగాయి.

రాయలసీమ ప్రజలకున్న అనుమానాలను, ఆందోళనలను సర్కారు నాయకులు అర్థం చేసుకొని వారు కోరిన హక్కులు ఇచ్చి సర్కారు. రాయలసీమ మధ్యగల విభేదాలను తొలగించి ఆంధ్ర రాష్ట్ర స్థాపనకై సమైక్య ప్రయత్నాలు జరపాలని ప్రయత్నించారు. ఈ ప్రయత్నం ఫలితమే "శ్రీ బాగ్ ఒప్పందం"

1936 నవంబర్ 16వ తేదీన సర్కారు. రాయలసీమ నాయకులు ఆంధ్రపత్రిక సంపాదకులైన కాశీనాథుని నాగేశ్వరరావు గారి నివాసం 'శ్రీ బాగ్' నందు సమావేశమైనారు, వారిమధ్య జరిగిన శ్రీబాగ్ ఒప్పందంలో ఈ షరతులు అంగీకరించారు.

1. ఆంధ్ర విశ్వ విద్యాలయం కింద వాల్తేరు, అనంతపురంలో రెండు కేంద్రాలు స్థాపించడం.
2. నీటిపారుదల ప్రణాళికలో పదేళ్ళు లేదా ఎక్కువ కాలం రాయలసీమకు ప్రాధాన్యాతనివ్వటం.
3. శాసనసభ స్థానాలలో జిల్లాల వారీగా సమానసంఖ్య వుండటం. శ్రీ బాగ్ ఒడంబడికపై సంతకాలు చేయగానే అందరు ఆంధ్రరాష్ట్ర ఏర్పాటుకు తీర్మానం ప్రతిపాదించవలసిందని ముఖ్యమంత్రిని కోరటం జరిగింది.

1938 ఏప్రిల్ 21న తీర్మానాన్ని భారత ప్రభుత్వానికి నివేదించటం జరిగింది. భారతదేశంలో కొత్త రాష్ట్రాల ఏర్పాటు జరగదనే బ్రిటిష్ వారి ప్రకటన ఆంధ్రులను దిగ్భ్రాంతికి గురిచేసింది.

1939లో జరిగిన రెండో ప్రపంచ యుద్ధం కారణంగా ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర స్థాపన మరుగున పడింది.

**సర్ విజయ ఆంధ్రమహాసభ :** ప్రత్యేకాంధ్ర రాష్ట్ర విషయంలో జరిగిన వైఫల్యాల వల్ల ఆంధ్రసభను పూర్తిగా కాంగ్రెస్ వారి అధీనంలో ఉంచుకొన్నారు.

1941లో సర్ విజయ్‌గా ప్రసిద్ధి చెందిన మేటి క్రికెట్ ఆటగాడైన విజయానంద్ తిరిగి ఆంధ్రసభకు పునర్జీవనం పోసి రాయలసీమ ప్రాంతాన్ని పర్యటించి బ్రిటిష్ పాలకులను కలిసి ఆంధ్రుల కష్టనష్టాలను నివేదించి 1942 ఏప్రిల్ 2వ తేదీన సర్ స్టాఫర్డ్ క్రిప్స్‌కు ప్రత్యేకాంధ్ర రాష్ట్ర స్థాపనకై నివేదిక సమర్పించారు.

1947 ఆగష్టు 15వ తేదీన భారతదేశానికి స్వాతంత్ర్యం రావటంలో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పడుతుందనే ఆశ చిగురించింది. ఆంధ్రనాయకులైన ప్రకాశం పంతులు, రంగాగార్లు నాటి భారత ఉప

ప్రధాని, హోంమంత్రి అయిన సర్దార్ పటేల్ గారిని కలిసి రాజ్యాంగ రచనకు పూర్వమే తమకు ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు చేయమని కోరారు.

భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు సిద్ధాంతాన్ని ప్రభుత్వం ఆమోదించిందని 1947 నవంబర్ 27న తేదీన ప్రధాని నెహ్రూ ప్రకటించారు.

1947 ఆగష్టు 19వ తేదీన భారత ప్రభుత్వం ఆమోదించిన 1935 గవర్నమెంట్ ఆఫ్ ఇండియా చట్టపు 290 విభాగం కింద ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర స్థాపన జరుగుతుందన్నారు.

గవర్నర్ల పాలనా రాష్ట్రాల జాబితాలో ఆంధ్ర రాష్ట్రం పేరును చేర్చారు. కాని రాజ్యాంగ రచనకు ముందే ఈ షెడ్యూల్ నందు చేర్చాలంటే రాజ్యాంగం ఆమోదించక ముందే వాటిని 1935 ఇండియన్ చట్టం 290 విభాగం ప్రకారం ప్రత్యేక రాష్ట్రాలుగా రూపొందించే అవకాశాలు పరిశీలించి చర్యలు తీసుకోవాలి.[9] ఈ కారణంగా ఈ షెడ్యూల్ నుండి ఆంధ్ర రాష్ట్ర పేరును తొలగించారు.

1948 మార్చి నెలలో విశాఖపట్నం దర్శించిన నెహ్రూ ఆంధ్రులను సమాధాన పరచడానికి త్వరలోనే భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటును పరిశీలించేందుకు కమిటీని నియమిస్తామని ప్రకటించాడు.

**థార్ సంఘం :** హైకోర్టు నుండి పదవీ విరమణ చేసిన కె. థార్ అధ్యక్షులుగా 1948 జూన్ 17న రాజ్యాంగ సభ అధ్యక్షునితో ఒక భాషా ప్రయుక్త రాష్ట్ర సంఘాన్ని ఏర్పరిచారు. ఈ సంఘంలో సభ్యులు - డా॥ పన్నాలాల్. ఐ.సి.యస్., జగత్ నారాయణ్‌లాల్ ఏయే రాష్ట్రాలను ఏర్పాటు చేయవలెనో, ఏర్పాటువల్ల ఉత్పన్నమయ్యే సమస్యలేవో తెలియచేయాల్సిందిగా ఈ సంఘాన్ని కోరడం జరిగింది. ఈ సంఘం మద్రాసు వచ్చిన సందర్భంగా విశాలాంధ్ర స్థాపించమని ఆంధ్ర మహాసభ ఒక వినతి పత్రాన్ని సమర్పించింది. 1948 డిసెంబర్ 10వ తేదీన థార్ సంఘం సమర్పించిన తమ నివేదికలో ప్రస్తుతానికి కొత్త రాష్ట్రాల ఏర్పాటు చేయకూడదని భావించింది.[10]

భాషా ప్రయుక్త రాష్ట్రాల గూర్చి "రాష్ట్రాలను కేవలం భాషా ప్రాతిపదికపై ఏర్పాటు చేయడం భారతీయ ప్రయోజనాలకు అనుగుణం కానందున వాటిని గూర్చి ప్రస్తుతం ఆలోచించనవసరం లేదు.[11] అని అభిప్రాయపడింది.

థార్ సంఘ నివేదిక దేశంలో తీవ్ర అలజడికి కారణమైంది. ఆంధ్ర దేశంలో మరీ ఎక్కువైంది. ప్రజలను సమాధాన పరచడానికి కాంగ్రెస్ పార్టీ భాషా ప్రయుక్త రాష్ట్రం ఏర్పాటు పరిశీలనకై జవహర్‌లాల్‌నెహ్రూ, వల్లభాయి పటేల్, పట్టాభి సీతారామయ్య గార్లతో ఒక సంఘాన్ని నియమించారు. దీనినే జె.వి.పి. సంఘం అంటారు. ఈ సంఘం సిఫారసు ప్రకారం ఆంధ్రులు మద్రాసును వదులుకుంటే వారికి ఆంధ్ర రాష్ట్రం ఇవ్వవొచ్చని పేర్కొంది.

**1951-52 జనరల్ ఎన్నికలు :** 1951-52లో జరిగిన సాధారణ ఎనికల్లో ఆంధ్ర ప్రాంతాలలోని రాజకీయ పక్షాలు ఆంధ్ర రాష్ట్ర సాధన ఒక అంశంగా ప్రకటించి పోటీ చేశాయి. ముఖ్యంగా కమ్యూనిష్టు పార్టీ ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం ప్రధానాంశంగా ప్రజలముందుంచింది. ఆంధ్ర కమ్యూనిష్టు సభ్యులు శాసనసభలో

ప్రవేశించినప్పటి నుండి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఆంధ్రులకు జరిగే నష్టాన్ని వివరించి ప్రత్యేక రాష్ట్ర అవసరాన్ని పదే పదే నొక్కి చెప్పారు.

ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసన సభలో ఆంధ్ర కమ్యూనిష్టు శాసన సభ్యులు తెలుగులో ప్రసంగించాలని తీర్మానించి తెలుగులోనే మాట్లాడారు. మద్రాసు నగరం కోసం పట్టుబట్టకుండా దాన్ని మినహాయించి తెలుగు మెజారిటీ ప్రాంతాలైన 11 జిల్లాలు 3 తాలూకాలతో వెంటనే ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు కావాలని కమ్యూనిష్టువారు కోరారు.

శ్రీ నీలం సంజీవరెడ్డి ప్రోత్సాహంతో రాయలసీమలోని కాంగ్రెస్ స్వతంత్ర శాసన సభ్యులు 21 మంది ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని వాయిదా వేయాలని ప్రధాని నెహ్రూకు ఒక విజ్ఞప్తిని పంపారు. మరి కొందరు మద్రాసులోని రాష్ట్రం వద్దన్నారు.

కాంగ్రెస్ నాయకుడు స్వామి సీతారాం ఆంధ్ర రాష్ట్రసాధన కోసం 1952 ఆగష్టు 15 నుండి సత్యాగ్రహం ప్రారంభించి 32 రోజులు ఏకధాటిగా నిరసన వ్రతం చేశారు.

స్వామి సీతారాం నిరసన వ్రతాన్ని నెహ్రూ ప్రభుత్వం అసలు పట్టించుకోలేదు.

**పొట్టి శ్రీరాములు ఆత్మాహుతి :** నిరాడంబర, నిస్వార్ధ జీవితం గడిపిన పొట్టి శ్రీరాములు గాంధేయ మార్గాన్నెన్నుకొని ఆంధ్ర రాష్ట్ర స్థాపన కోసం మద్రాసు నగరంలోని బులుసు సాంబమూర్తి గారింట్లో 1952 అక్టోబరు 19వ తేదీన ఆమరణ నిరాహారదీక్ష ప్రారంభించారు. ఆంధ్రరాష్ట్ర సత్వర స్థాపన, ఆంధ్రనాయకులలో సమైక్యత వారి దీక్ష ఆశయాలు.

శ్రీరాములు గారి నిరాహార దీక్షను మొదట కేంద్ర ప్రభుత్వం అసలు పట్టించుకోలేదు. ఆంధ్ర రాష్ట్ర సమస్యను పరిశీలిస్తామని నెహ్రూ చెప్పారు. అటువంటి ప్రకటనలెన్ని జరిగినా ఆంధ్రరాష్ట్రం ఏర్పడలేదు. కాబట్టి నెహ్రూ హామీని శ్రీరాములు నమ్మలేదు. నిరాహారదీక్ష 50వ రోజు కూడ నెహ్రూ శ్రీరాములు గారి దీక్షను విమర్శించారు. 58 రోజుల నిరాహార దీక్ష అనంతరం పొట్టి శ్రీరాములు 1952 డిసెంబర్ 15వ తేదీ రాత్రి స్వర్గస్థులయ్యారు.

శ్రీరాములు గారి ఆత్మాహుతి ఆంధ్రదేశాన్ని అగ్నిగోళంగా మార్చింది. ఆంధ్రదేశంలో కనీవినీ ఎరుగని రీతిలో మూడు రోజుల పాటు ప్రదర్శనలు, దౌర్జన్య కాండలు జరిగాయి. రైల్వేస్టేషన్లు, పోస్టాఫీసులు, ప్రభుత్వ కార్యాలయాలు ధ్వంసమయ్యాయి. అనేక చోట్ల పోలీసు కాల్పులు జరిగాయి. ఏడుగురు మరణించారు. ఎందరో గాయపడ్డారు. అప్పుడు కేంద్రానికి కనువిప్పు కలిగింది.

1952 డిసెంబర్ 19వ తేదీన వివాదాస్పదం గాని తెలుగు ప్రాంతాలతో ఆంధ్రరాష్ట్రం వెంటనే ఏర్పాటవుతుందని నెహ్రూ లోక్‌సభలో ప్రకటించారు. ప్రకటన తర్వాత ఆంధ్ర దేశంలో సాధారణ పరిస్థితులు ఏర్పడ్డాయి.

**వాంఛూ కమిటి :** పార్లమెంటులో చేసిన ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటు కనుగుణంగా ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి సంబంధించిన అన్ని విషయాలను పరిశీలించి నివేదిక సమర్పించమని రాజస్థాన్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి కైలాస్‌నాథ్ వాంఛూని కేంద్ర ప్రభుత్వం నియమించింది.

కైలాస్ నాథ్ వాంఛూ ఆంధ్రదేశంలో పర్యటించి 1953 మార్చి 23వ తేదీన నివేదికను కేంద్ర ప్రభుత్వానికి సమర్పించాడు. నివేదికననుసరించి కేంద్ర ప్రభుత్వం శ్రీ కాకుళం, విశాఖపట్నం ఉభయ గోదావరులు, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు జిల్లాలు, బళ్ళారిలోని ఆలూరు, ఆదోని, రాయదుర్గ తాలూకాలతో కొత్త ఆంధ్ర రాష్ట్రంగా ప్రకటించింది.

కేంద్ర ప్రభుత్వ ప్రకటనానంతరం రాయలసీమ ప్రతినిధులు ఆంధ్ర రాష్ట్ర రాజధానిని శ్రీ బాగ్ ఒప్పందం ప్రకారం రాయలసీమలో ఏర్పాటు చేయాలని కోరారు.

ఆంధ్ర శాసన సభ్యులు రాజధాని నిర్ణయం కోసం మద్రాసులో సమావేశమయ్యారు. కాంగ్రెస్, ప్రకాశం ప్రజా సోషలిష్టు పార్టి రంగా కృషికార్ లోక్‌పార్టీ. కర్నూలు రాజధానిగా అంగీకరించాయి.

టంగుటూరి ప్రకాశం ముఖ్యమంత్రిగా, నీలం సంజీవరెడ్డి ఉపముఖ్యమంత్రిగా, చందూలాల్ త్రివేది ప్రధమ గవర్నర్‌గా 1953 అక్టోబర్ 1వ తేదీన కర్నూలు రాజధానిగా ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. నెహ్రూ దీనికి ప్రారంభోత్సవం చేశారు.

**ఆంధ్రప్రదేశ్ అవతరణ (విశాలాంధ్ర) :**

హైద్రాబాద్ రాజ్యంలో విస్తీర్ణంలోనూ, జనాభాలోనూ తెలుగు మాట్లాడే ప్రజల తెలంగాణా ప్రాంతం సగానికి పైగా వుంది. కాని వారి భాషా సంస్కృతులు ఎటువంటి ఆదరణకు నోచుకోలేదు.

**మొదటి విశాలాంధ్ర మహాసభ :** 1950లో వరంగల్లులో విశాలాంధ్ర మహాలాంధ్ర మహాసభ. పధమ సమావేశం జరిగింది. ఆంధ్ర తెలంగాణా నాయకులనేక మంది ఈ సమావేశంలో పాల్గొని హైద్రాబాద్ రాజధానిగా విశాలాంధ్ర నిర్మాణం జరగాలని తీర్మానించారు.

**రెండవ విశాలాంధ్ర మహాసభ :** 1954లో హైద్రాబాద్‌లో రెండవ విశాలాంధ్ర మహాసభ జరిగింది. దేవుల పల్లి రామానుజ రావు, పాగా పుల్లారెడ్డి. కోదాటి రాజలింగం, హయగ్రీవాచారి మొదలైన వారు విశాలాంధ్ర వాదాన్ని ప్రచారం చేశారు.

ఆంధ్ర జనత, తెలుగు దేశం, కాకతీయ మొదలైన తెలంగాణా పత్రికలు కూడా విశాలాంధ్ర ఆవశ్యకాన్ని తెలియచేస్తూ ప్రచారం చేశాయి. ఈ విధంగా విశాలాంధ్రకు కావలసిన భావ ప్రచారం జరిగింది.

ప్రజలలో సాంఘిక, రాజకీయ, భాషా చైతన్యం ఏర్పడి పొరుగు తెలుగు వారితో కలిసిపోవాలనే, ఆసక్తి, ఆకాంక్ష అధికమైంది. ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల మధ్య సన్నిహిత సంబంధాలేర్పడి అవి చివరకు రెండు ప్రాంతాల మధ్య సమైక్యతకు దారితీయగా 1956లో హైద్రాబాద్ రాజధానిగా ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం ఏర్పడింది. దీనినే విశాలాంధ్ర అని వ్యవహరిస్తారు.

## 3.2 అధికార భాష తెలుగు :

రాజకీయ పరిపాలనలో, న్యాయస్థానాల్లో సాధికారంగా వ్యవహృతమైన భాషను పూర్వం రాజభాష అనేవారు. ఇప్పుడు అధికార భాష అంటున్నారు.

ప్రభుత్వం తన నిర్ణయాలను, నిబంధనలను పంపడానికి వాడే భాష అధికార భాష. రాజ్యతంత్రానికి సంబంధించిన సమస్త విషయాలకు వాహకమైన భాష రాజ్యాంగ భాష లేక అధికార భాష.

ప్రభుత్వం -ప్రజలు, ప్రజలు-ఉద్యోగులు, పరస్పరం వారి అవసరాలను తెలియజేసే భాష రాజ్యాంగ భాష, లేక అధికార భాష.

భారత దేశంలో సంస్కృతం, ప్రాకృతం, ఉర్దూ, ఇంగ్లీషు భాషలు ఆయా కాలాల్లో రాజభాషలుగా వున్నాయి.

| | | | |
|---|---|---|---|
| శాతవాహనులు | (క్రీ.పూ. 225 - క్రీ.శ. 225) | - | ప్రాకృతం |
| ఇక్ష్వాకులు | (క్రీ.శ. 225 - 275) | - | ప్రాకృతం |
| బృహత్పలాయనులు | (క్రీ.శ. 275 - 285) | - | ప్రాకృతం |
| శాలంకాయనులు | (క్రీ.శ. 300 - 470) | - | ప్రాకృతం |
| పల్లవులు | (క్రీ.శ. 250 - 620) | - | సంస్కృతం |
| తూర్పుచాళుక్యులు | (క్రీ.శ. 624 - 1020) | - | సంస్కృతం |

తూర్పు చాళుక్యులలో గుణగ విజయాదిత్య మహారాజు పరిపాలనలో అతని సేనాని వేయించిన పండరంగని అద్దంకి శాసనం (శా.శ. 770) మొట్టమొదటి తెలుగు పద్యశాసనం. తూర్పు చాళుక్యుల కాలం నుండి తెలుగు భాషకు రాజాదరణ ఎక్కువగా లభించింది.

కాకతీయుల కాలంలో చిన్న చిన్న మాండలికులు, సామంతులు, సంస్థానా ధీశులు తెలుగును పరిపాలనా భాషగా వాడారు. రెడ్డిరాజుల కాలంలో తెలుగు రాజస్థానాల్లో ప్రవేశించగలిగింది కాని రాజభాష కాలేకపోయింది.

తెలుగుకు వాడుక భాషగానే కాక పరిపాలనా భాషగా కూడా చాలా ప్రాచీన చరిత్ర వుంది.

సంస్కృత ప్రాబల్యం వున్న రోజులలో కూడా తెలుగు భాషకు అధికార భాషా ప్రతిపత్తిని కల్పించి భాషాభివృద్ధికి దోహదం చేసిన ఘనత క్రీ.శ. 625 నుండి 1070 వరకు తెలుగు దేశాన్ని పరిపాలించిన తూర్పుచాళుక్య వంశానికి చెందిన రాజులకు దక్కుతుంది.

తెలుగు భాషలో రాజశాసనాలు చేయడమే గాక సమస్త పరిపాలనా వ్యవహారాలు వారు తెలుగు భాషలోనే నడిపేవారు. క్రీ.శ. 892-921 సంవత్సరాల మధ్య మొదటి చాళుక్య బీముని "కొరవి" శాసనం ఇందుకుదాహరణ.

విజయనగర చక్రవర్తుల కాలంలో, మధుర, తంజావూరు సామంతుల కాలంలో సంస్కృతం కన్న ఎక్కువ గౌరవాన్ని తెలుగు సంతరించుకొన్నది. చక్రవర్తులు సంస్కృతానికి రాజపూజలు చేస్తున్న రోజుల్లో సామంతులు తెలుగుకు పాదపూజలు చేశారనటానికి నిదర్శనాలున్నాయి.[12]

విజయనగర చక్రవర్తుల కాలంలో దాన శాసనాలైన తామ్ర పత్రాలలో కూడా తెలుగుకు స్థానం దొరికింది. కర్నూలు జిల్లా పెదబెళగల్లు తామ్రశాసనం, (క్రీ.శ. 1492) బళ్ళారి జిల్లా అప్పరి తామ్రశాసనం ఇందుకు నిదర్శనాలు.[13]

క్రీ.శ. 6-11 శతాబ్దాల మధ్య కేవలం తెలుగు శాసనాలలో 74 రాయలసీమలోను, 4 మాత్రం తెలంగాణాలో, 155 సాగర సీమలోను దొరికాయి.[14]

క్రీ.శ. 972 నాటి తన పట్టాభిషేకాన్ని వైదుంబరాజు గండ త్రినేత్రుడు తెలుగులో ప్రకటించుకున్నాడు.[15]

ప్రాంతాలలో నలుంబిరాజు "చస్తమనదడి"ని "ముదుమడవు" కయ్యంలో వధించిన వైదుంబరాజు తన విజయాన్ని పేర్కొన్నాడు.[16] క్రీ.శ. 825 ప్రాంతాలలో జరిగిన "సోరమడి" "మడువ" యుద్ధాలను పేర్కొని అందులో వీరస్వర్గం పొందిన వారిని స్మరించిన శాసనాలు 20 దాకా దొరుకుతున్నాయి.[17]

పన్నులు రాయితీ యిస్తూ క్రీ.శ. 972లో భువన త్రినేత్ర ఇరుగెయ మహారాజు వేయించిన తెలుగు శాసనం.[18] సుప్రసిద్ధమైన కాకతి గణపతి దేవుని మోటుపల్లి శాసనం ఇటువంటిదే.

సంఘధర్మాలను వ్యతిరేకించే వారికి వేసే శిక్షలను నిరూపించే తెలుగు శాసనాలు కొన్ని వున్నాయి. అవి.

క్రీ.శ. 892-922 మధ్యకాలం నాటి వరంగల్ జిల్లా మహబూబాబాద్ తాలూకా కొరవి శాసనం.[19]

అఖిల దేశాల తెలికవేవురు చేసుకున్న "వివాహమర్యాద"ను వివరించే క్రీ.శ. 1553 నాటి బెజవాడ శాసనం.[20] గుంటూరు జిల్లా నరసరావు పేట తాలూకా నాదెండ్లలో వేయించిన శాసనం.[21]

గోల్కొండలో కుతుబ్‌షాహి పరిపాలన వచ్చిన తర్వాత పరిపాలన భాషగా తెలుగు కొత్త గుర్తింపు పొందింది. ఆ కాలంలోని అనేక ఉర్దూ పదాలు నిత్య పరిపాలన పరిభాషగా తెలుగులోకి చేరి యిప్పటికి ఉన్నాయి. ఇందుకు నిదర్శనంగా మహమ్మద్‌కులీ కుతుబ్‌షాహి పరిపాలనలో క్రీ.శ. 1593లో గుంటూరు జిల్లా మంగళగిరిలో వేయించిన శాసనాన్ని చెప్పవచ్చు.[22]

బ్రిటిష్ అధికారం మనదేశం మీద, మన రాష్ట్రం మీద ప్రబలి తెలుగు భాషా స్థానాన్ని ఆంగ్లం ఆక్రమించడంలో క్రీ.శ. 650 నుండి 17వ శతాబ్దాల వరకు సుమారు వేయి సంవత్సరాల కాలం ప్రకాశించిన తెలుగు భాష మరుగున పడిపోయింది. అధికారికంగా తెలుగుభాష వాడుక క్రమంగా తగ్గింది.

అయినప్పటికి బ్రిటిష్ వారు దిగువ న్యాయస్థానాల్లో తెలుగునుపయోగించటానికి అనుమతించే వారు. గ్రామ రికార్డులు కూడా తెలుగులో కొనసాగేవి.

విదేశీ పాలనలో ప్రాంతీయ భాషలకు సముచిత స్థానం లేదు. తెలుగు భాషకొక గుర్తింపు కోసం, తెలుగు వారికొక వ్యక్తిత్వం కోసం కృషి చేయాలనే ఆలోచన 1913 బాపట్లలో జరిగిన ప్రథమాంధ్ర మహాసభలో వెల్లడైంది.

మద్రాసులో కాంగ్రెస్ పార్టీ అధికారంలోకి వచ్చినపుడు విద్యాబోధన మాతృభాషలో జరపాలని నిర్ణయించి ఆంధ్రదేశంలోని తూర్పుగోదావరి జిల్లాలో తెలుగును, తమిళ ప్రాంతంలోని తంజావూరు జిల్లాలో తమిళాన్ని బోధనా భాషగా ప్రవేశపెట్టింది.

1948లో తూర్పు గోదావరి జిల్లాలో అధికార సంబంధమైన ఉత్తర ప్రత్యుత్తరాలన్ని తెలుగులో రాయాలని ప్రభుత్వం ఆదేశాలిచ్చింది.

ఒక జిల్లా లేదా తాలూకాలో ఉండే కింది కార్యాలయాల మధ్య వీలైనంతవరకు ఆ జిల్లా లేదా తాలూకా భాషలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరగాలని 1950లోను, 1951లోను హైద్రాబాదు ప్రభుత్వం ఆదేశాలు జారీచేసింది. కాని ఈ రెండు ప్రాంతాలలో తెలుగు ఎక్కువగా వాడుకలోకి రాలేదు.

1953 అక్టోబరు 1న ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన వెంటనే ఆంధ్ర శాసనసభ అధికార భాష 'తెలుగు' అని ప్రకటించి వుండాల్సింది.

అతిసాహసంతో, అతి త్వరలో ప్రభుత్వమేర్పడిన వెంటనే తమ అధికార భాష బెంగాలీ అని ప్రకటించిన కీర్తి మొదట బంగ్లాదేశ్‌కి దక్కింది.

'దేశ భాషలందు తెలుగు లెస్స' అని ఖ్యాతి గాంచి, 'ఇటాలియన్ ఆఫ్‌ది ఈస్ట్'గా విశ్వ విఖ్యాతి గణించి, సాంకేతిక పరిజ్ఞానంలో ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలకన్న మిన్నగా సమన్వయంప గలిగినది తెలుగని ప్రొఫెసర్ హాల్డన్‌చే గుర్తించబడి భారత దేశంలో రెండవ భాషగా గణుతి కెక్కిన తెలుగు పరిపాలనలో సముచిత స్థానం పొందకపోవటం దురదృష్టకరం.

భాషా ఉద్యమాల్లో కర్ణాటక, మహారాష్ట్రుల కన్న ముందే ప్రారంభించి తెలుగును అధికార భాషగా అమలు పరుచుకోవటంలో అందరికన్న వెనుకబడి పోయారు.

అపుడు శాసన సభ్యులుగా వున్న శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య గారు "రాజ్యాంగ నిబంధనలకు అసంగతంగా లేనంతవరకు ప్రభుత్వ వ్యవహారాలన్ని తెలుగులో నిర్వహించాలనే" తీర్మానాన్ని ప్రవేశ పెట్టారు.

కాని శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు దానికొక "సాధ్యమైనంత త్వరలో" అనే చిన్న సవరణ చేర్చారు.

1955 సెప్టెంబరు 29వ తేదీన అయ్యదేవర కాళేశ్వర రావుగారి సవరణ ఏకగ్రీవంగా ఆమోదింపబడి వావిలాల ప్రవేశపెట్టిన బిల్లు తోసివేయబడింది.

ఆంధ్రప్రదేశ్ శాసన సభాపతిగా శ్రీ అయ్యదేవర కాళేశ్వరావు ఎన్నికైన తర్వాత శాసన సభ తరపున ప్రముఖులతో ఉపసంఘాలు నియమించి 1963లో ఒక బృహత్తరమైన "తెలుగు పారిభాషిక పదకోశం" తయారు చేయించి ప్రకటించారు. కాని తెలుగు అధికార భాష కానందువల్ల అందులోని మాటలను వాడవలసిన అవసరం కలుగలేదు.

అప్పటికి మన దేశంలో పది రాష్ట్రాల్లో ప్రాంతీయ మాతృభాషలను అధికార భాషలుగా నిర్ణయిస్తూ శాసనాలు చేయబడ్డాయి. బీహర్‌లో 'హిందీ', అధికార భాషగా శాసనం చేయబడింది.

1957లో మధ్య ప్రదేశ్‌లో అధికార భాషా చట్టం ద్వారా 'హిందీ' అధికార భాషగా చేయబడింది.

హిమాచల్ ప్రదేశ్‌లో 1952లో భాషా (బిల్లులు - చట్టాలు) శాసనం ద్వారా 'హిందీ' అధికార భాషగా చేయబడింది. రాజస్థాన్‌లో రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణ జరగకముందే హిందీ అధికార భాషగా చేయబడింది.

ఉమ్మడి బొంబాయి రాష్ట్రంలో, గుజరాత్ ప్రాంతంలో గుజరాతీ, మహారాష్ట్ర ప్రాంతంలో మరాఠీ అధికార భాషగా నిర్ణయిస్తూ బిల్లు రూపొందించబడింది.

1960లో మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రాలను వేరు చేసిన తరువాత మహా రాష్ట్రంలో మరాఠీ, గుజరాత్ రాష్ట్రంలో గుజరాతీ అధికార భాషగా శాసనం చేయబడింది.

పూర్వ పంజాబ్ రాష్ట్రంలో హిందీ మాట్లాడే ప్రాంతాలలో హిందీని పంజాబీ మాట్లాడే ప్రాంతాలలో పంజాబీ అధికార భాషలుగా చేయబడ్డాయి.

1960లో అస్సాంలో అస్సామీ భాషను అధికార భాషగా చేస్తూ అధికారభాషా చట్టం శాసనరూపం దాల్చింది. అందులో పరిపాలనా కార్యాలకోసం కచారు జిల్లాలో పరిపాలన కార్యాలకోసం బెంగాలీ భాషకూడా ఉపయోగించబడుతుందని చట్టంలో పేర్కొనబడింది.

తమిళనాడు (మద్రాసు) రాష్ట్రంలో తమిళంను అధికార భాషగా చేస్తూ 1956లో అధికార భాషా చట్టం చేయబడింది.

1957 జనవరి 19వ తేదీన ఆ చట్టం గవర్నర్ ఆమోదం పొంది శాసనం అయింది.

దేశంలో ఈ పోకడలు ఒకవైపు ఇలా జరుగుతుంటే శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య మొదట కర్నూలులోను, తర్వాత హైద్రాబాదులోను ఆంధ్రప్రదేశ్ శాసన సభలో తెలుగును అధికార భాషగా శాసనం చేయటానికి బిల్లు రూపంలోను, తీర్మానం రూపంలోనూ దాదాపు తొమ్మిదిసార్లు ప్రతిపాదించారు.

చివరకు బిల్లు రూపంలో అచ్చు కావటానికి నోచుకునేందుకు వీలులేని స్థితి నుండి 1964 డిసెంబరు 7వ తేదీన ఆంధ్రప్రదేశ్ 'గెజెట్'లో ప్రకటించబడింది. ప్రభుత్వం దీనిని ప్రజాభిప్రాయ సేకరణకు పంపింది. ప్రజాభిప్రాయ ప్రకటన సందర్భంలో తెలుగు దిన పత్రికలలో ఒక్కఆంధ్రప్రభ తప్ప తక్కిన పత్రికలేవి ఈ విషయంలో శ్రద్ధ చూపించలేదు.

ప్రజాభిప్రాయం తర్వాత ఈ బిల్లు సెలెక్ట్ కమిటీకి పంపబడింది. సెలెక్ట్ కమిటి స్థాయిలో ఆనాటి ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డి, విద్యామంత్రి, అధికార భాషా శాఖను చూస్తున్న శ్రీ పి.వి. నరసింహారావు ఇరువురు కలసి బిల్లును గురించి సమూలంగా చర్చించిన తర్వాత అనధికార బిల్లు బదులు అధికార బిల్లు తేదలచామని ఈ అనధికార బిల్లు ఉపసంహరించుకోమని ప్రతిపాదన చేశారు.

వావిలాల గోపాల కృష్ణయ్య అనధికార బిల్లుండాలనే పట్టుదల తనకు లేదని, అధికార భాషగా శాసనం కావడమే ప్రధానమని ప్రభుత్వం శాసన సభలో బిల్లు ప్రతిపాదించడానికి ముసాయిదా అందజేసిన వెంటనే తన బిల్లును ఉపసంహరించుకొంటానన్నాడు.

ప్రభుత్వం వెంటనే తమ బిల్లుకు నోటీసు ఇవ్వడం, బిల్లు ముసాయిదా ప్రతిపాదించటం శాసన సభ 1966 మార్చి 27న, శాసన పరిషత్తు 1966 ఏప్రిల్ 1వ తేదీన తెలుగును అధికార భాషగా అంగీకరించటం జరిగింది.

ఆంధ్రప్రదేశ్ అధికార భాషగా తెలుగు 1966 మే 14వ తేదీ ఆంధ్రప్రదేశ్ గెజెట్‌లో ప్రకటింపబడటంతో శాసనరూపం దాల్చింది. (చూ. అను. 5)

**తెలుగు అధికార భాషగా - అమలు**

అధికార భాషగా, బోధన భాషగా ఉండవలసిన తెలుగు భాషా స్వరూపం ఎలా వుండాలో నిర్ణయించడానికి 1965 జూన్ 20వ తేదీన పింగళి లక్ష్మీకాంతం అధ్యక్షతన ఒక సంఘం నియమించబడింది. (జి.ఓ.యం.యస్.నెం. 2265) అనేక వాదోపవాదాల తరువాత ప్రభుత్వ కర్తవ్యం నిరూపించడానికి అప్పటి విద్యాశాఖ కార్యదర్శి జె.పి.యల్. గ్విన్ అధ్యక్షుడిగా ప్రభుత్వం 3-9-66న మరో సంఘం నియమించింది.

**3.2.1 గ్విన్ రిపోర్టు :** ప్రభుత్వ భాషగా తెలుగును ప్రవేశ పెట్టటానికి ప్రభుత్వం రాష్ట్రంలో 1965 మార్చి 15న జె.పి.యల్. గ్విన్ అధ్యక్షుడిగా ఒక సంఘాన్ని నియమించింది.

**ఆ సంఘంలోని సభ్యులు :** ప్రొ॥ వెంకట రంగయ్య, ప్రొ॥ కృష్ణమూర్తి, సెక్రటరీ ఆఫ్ ఎడ్యుకేషన్, డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్స్టిట్యూషన్, డైరెక్టర్ ఆఫ్ హయ్యర్ ఎడ్యుకేషన్, ప్రతి విభాగపు ప్రతినిధి, మూడు విశ్వ విద్యాలయాల నుండి భాష కమిటిలో న్యాయనిపుణుడు, డిప్యూటి సెక్రటరీ ఆఫ్ ఎడ్యుకేషన్, నవీన భారత దేశ భాషలు, శ్రీ దీక్షితులు డిప్యూటి సెక్రటరి.

**గ్విన్ కమిటి సూచనలు :**

1) తెలుగేతర అధికారులకు తెలుగు శిక్షణగా తరగతులు పునరుద్ధరించటం వాంఛనీయమని, శిక్షణ పొందిన ఉపాధ్యాయుల సేవలను ఉపయోగించుకోవాలని బి.హెచ్. కృష్ణమూర్తి చెప్పారు. తెలుగునభివృద్ధి పరచటానికి భాషా శాస్త్ర సూత్ర దృక్పథంతో వయోజన విద్యా సంస్థలకోసం సరైన పద్ధతులు అవసరమని ఈ కమిటి సూచించింది.

2) తెలుగు, హిందీ, ఆంగ్లం, ఉర్దూ, ఈ నాలుగు భాషల నిఘంటువులు తెలుగు లిపిలో వుండటం వాంఛనీయం.

3) అనువాద విభాగాన్ని ఏర్పరచటం.

4) తెలుగు భాషాభివృద్ధికి ఒక సంస్థ స్థాపన.

5) విద్యా సంస్థలలో భాషా స్థానాలలో సిబ్బందిని భర్తీ చేయాలి. ఈ సిబ్బంది విషయంలో డిగ్రీ చదివిన వారికంటే. ప్రాచ్య భాష చదివిన వారికి అవకాశం కల్పించాలి. ఈ అంశాలు తక్షణం అమలు పరచటానికి తగిన చర్యలు తీసుకోవాలని కార్యదర్శి ఆదేశించారు.

1967లో ఈ కమిటీ సభ్యుడైన బిహెచ్. కృష్ణమూర్తి అమెరికా వెళ్ళబోయే ముందు కమిటీకి కొన్ని సూచనలు చేశారు. అవి : 1) ఆధునిక భావాలకనుగుణంగా భాష వుండాలని ఆయన అభిప్రాయపడ్డారు. పరిపాలనా రంగంలో, విశ్వ విద్యాలయాలలో, తెలుగును మాధ్యమంగా ఉపయోగిస్తే అది క్రమంగా వృద్ధిచెంది జ్ఞానవాహికగా భావాలను తెలుపటానికి ఉపయోగపడుతుంది.

2) విశ్వ విద్యాలయాలలో ఆంగ్ల స్థానంలో తెలుగునుపయోగించటానికి పాఠ్య పుస్తకాలు ప్రచురించాలి.

ప్రసార మాధ్యమంగా ఉచ్చారణ విధేయమైన భాషను అన్ని రంగాలలో నవీకరించాలి. 35 సంవత్సరాల క్రితం ఆధునిక ప్రామాణిక భాషగా తెలుగు తనంతట తాను కాలానుగుణంగా ఏర్పడి రేడియో, వార్తా పత్రికలు మొదలైన అన్ని రంగాలలో వాడుకలో వుంది.

ఆధునిక ప్రామాణిక భాష అయిన తెలుగు ఏ ఒక్క ప్రాంతానికి చెందదు. అదేవిధంగా కోస్తా జిల్లాలోని ఒక వర్గం మాండలికం ఆధారంగా, ప్రబలంగా రూపొందించబడలేదు.

3) పాలనా రంగంలో ప్రభుత్వ సహకారంతో ఆంగ్ల స్థానంలో తెలుగును త్వరితగతిన అమలు పరచాలి. ఏ భాషైనా పెరుగుదలకు మూలకారణం ఆదానం, పర్యాయ పదాలను అభివృద్ధి పరచటం.

4) విశ్వ విద్యాలయాల ద్వారా వార్తా పత్రికలు, రేడియోలలో తెలుగు శైలి ఏ విధంగా వున్నదో ఈ ఎంపిక చేసిన సంస్థల ద్వారా పరిశీలనలు, పరిశోధనలు చేయాలి.

అంతేకాక ఈ సంస్థ ఉన్నత విద్యా సంస్థలలో తెలుగును మాధ్యమంగా ప్రవేశ పెట్టాలి.

5) ఆంగ్ల పుస్తకాలకు అనువాదాలు తయారు కాకముందే విశ్వ విద్యాలయ స్థాయిలో ప్రాంతీయ భాష బోధనా మాధ్యమంగా వుండటం ద్వారా భాష సహజంగా అభివృద్ధి చెందుతుందే కాని విద్యాప్రమాణాలు క్షీణించవు. పాఠ్య పుస్తకాలు ఆంగ్లంలో వున్నప్పటికి ఆంగ్ల పదాలను, అంతర్జాతీయ పదాలను ప్రాంతీయ భాషలలో చెప్పటానికి అధ్యాపకులు ఉన్నతంగా అభివృద్ధి చెందాలి. ఆంగ్ల భావాలను ప్రాంతీయ భాషలలో మిళితంచేసి చెప్పాలి. త్రిభాషా చట్రంలో అంతర్జాతీయ, శాస్త్ర సాంకేతిక పదాలను సమీకరించటం వల్ల కొన్ని సాంకేతిక పదాలను స్వభాషా పరంగా వృద్ధి చేస్తే ఆ స్థితికి తెలుగు ఎదుగుతుంది.

5, 6, సంవత్సరాల తర్వాత ద్విభాషీయులు వారి బోధనానుభవం ద్వారా శాస్త్ర, సాంకేతిక, వివిధ రంగాలకు సంబంధించిన అంశాలను ప్రామాణికంగా రాయటానికి పూనుకొన్నారు. వారిని ఆకర్షించేందుకు ప్రాంతీయ భాషలలో శాస్త్ర సాంకేతిక అంశాలకు సంబంధించిన రచనలు చేసిన వారికి బహుమతులు, రాష్ట్ర స్థాయిలో శాస్త్ర సాంకేతిక పదాలను ప్రమాణీకరించేందుకు కొన్ని కమిటీలుంటాయి.

ఈ పథకాల ద్వారా ఆంగ్ల భాష ఏమౌతుందోనని కొంతమంది ఆందోళన చెందారు. సెకండరీ స్థాయి కంటే తక్కువ ప్రాథమిక స్థాయిలో మాతృ భాషను తప్పని సరిగా అమలు జరపాలి. హయ్యర్ సెకండరీ స్థాయిలో ఆంగ్లబోధనను ప్రవేశ పెట్టాలి.

ఈ సంస్థల ద్వారా ఈ పథకాన్ని అమలు పరచటానికి స్వల్పకాలిక శిక్షణా తరగతులు నిర్వహించాలి. ఈ సంస్థలోని శిక్షణా విభాగాల ద్వారా అధ్యాపకులచే ప్రదర్శనా తరగతులలోని విషయాలను ప్రాంతీయ భాషా మాధ్యమంలో బహుముఖ ప్రయోజనాల కోసం బోధించాలి. ఈ సంస్థలో పరిశోధనా విభాగం వుండాలి ఈ సంస్థ ద్వారా సూచించిన విషయ సూచికలోని సాంకేతిక పదాలు సెకండరీ స్థాయిలోని అన్ని విభాగాలలో ఉపయోగించాలి. ప్రస్తుతం పాఠ్యపుస్తకాలు ప్రాంతీయ భాషా మాధ్యమంగా బహుముఖ ప్రయోజన స్థాయిలో క్రమంగా రచించబడాలి.

1967-68 పి.యు.సి. స్థాయిలో ప్రారంభించబడిన లక్ష్యాలను ఆధారంగా చేసుకొని, రాష్ట్రంలోని నాలుగు ప్రాంతీయ విశ్వ విద్యాలయాలలో ఆంగ్ల స్థానంలో తెలుగును బోధనా మాధ్యమంగా ప్రవేశపెట్టటానికి పై అంశాలను ఆధారంగా చేసుకొని అంగీకరించాయి.

**3.2.2 ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం :** ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అధికార కార్యాలకు, రాష్ట్ర శాసన మండలి వ్యవహార నిర్వహణకు తెలుగు భాషనుపయోగించాలని 1966 సంవత్సరం మే 14వ తేదీన ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం తెలుగు భాషకు రాష్ట్ర అధికార భాషగా శాసన ప్రతిపత్తిని కల్పించింది.

భారత రిపబ్లిక్ పదునేడవ సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసన మండలిచే దిగువ రీతిగా శాసించబడింది.

**1) సంగ్రహ నామము వర్తింపు :** (1) ఈ చట్టం 1966 ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం అని వ్యవహరింపబడును.

(2) ఇది ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమంతటికి వర్తించును

**2) తెలుగు రాష్ట్ర అధికార భాషగా ఉండుట :** ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అధికార భాష తెలుగై ఉండవలెను.

**3) తెలుగును ఏయే అధికార కార్యాలకు ఉపయోగించవలెనో ప్రకటించుటకు ప్రభుత్వ అధికారము :** (1) రాష్ట్ర ప్రభుత్వం ఆయా సమయములందు ఆంధ్రప్రదేశ్ గెజెట్‌లో ప్రకటన ద్వారా తెలుగు భాషను ఆ ప్రకటనలో నిర్దిష్ఠ పరచునట్టి రాష్ట్ర అధికార కార్యాలకు, అట్టి తేదీ నుండి ఉపయోగించవలెనని ఆదేశించవచ్చు.

(2) (i) (ఎ) రాష్ట్ర శాసన మండలి ఉభయసభలలో దేనియందైన ప్రవేశ పెట్టుబడు బిల్లులన్నిటిలోను, వాటికి ప్రతిపాదించబడు సవరణలన్నిటిలోను రాష్ట్రశాసన మండలి చేసిన చట్టములన్నిటిలోను.

(బి) రాజ్యాంగంలోని 213వ అనుచ్ఛేదం కింద రాష్ట్ర గవర్నరు జారీచేసిన ఆర్డినెన్స్ లన్నిటిలోను, రాజ్యాంగమునకు గల అయిదవ అనుసూచి 5వ పేరా క్రింద ఆయన చేసిన రెగ్యులేషన్లన్నిటిలోను :

(ii) రాజ్యాంగం కింద లేదా పార్లమెంటు లేక రాష్ట్ర శాసనమండలి చేసిన ఏదేని శాసనము కింద రాష్ట్ర ప్రభుత్వం గాని, రాష్ట్ర ప్రభుత్వ అధికార వర్గం లేక అధికారిగాని జారీచేసిన ఉత్తరువులు, నియమములు, రెగ్యులేషన్లు, నిబంధనావళి అన్నిటిలోను, ఉపయోగించవలసిన భాష, రాష్ట్ర ప్రభుత్వము ఆంధ్రప్రదేశ్ గెజెట్‌లో ప్రకటన ద్వారానిర్దిష్ట పరచు తేదీనను, ఆ తేదీ నుండియు తెలుగు భాషయై ఉండవలెను.

అయితే ఈ ఉప విభాగపు (i) (ii) ఖండములలోని వేర్వేరు అంశములకు రాష్ట్ర ప్రభుత్వం వేర్వేరు తేదీలను నిర్దిష్ట పరచవచ్చును.

**4) రాష్ట్రము యొక్క కొన్ని అధికార కార్యాలకు, శాసన మండలిలో ఉపయోగమునకు ఆంగ్లభాష కొనసాగింపు :** రాష్ట్ర ప్రభుత్వము 3వ విభాగము క్రింద ప్రకటన ద్వారా అన్యదా ఆదేశించునంతవరకు -

(i) ఈ చట్టపు ప్రారంభమునకు సద్యఃపూర్వము ఆంగ్ల భాష రాష్ట్రం లోపల ఏయే అధికార కార్యాలకు ఉపయోగించబడుచుండెడిదో ఆ కార్యాలకు దాని వాడుక కొనసాగవలెను.

(ii) రాష్ట్ర శాసన మండలిలో వ్యవహార నిర్వహణకు ఆంగ్ల భాష వాడుక కొనసాగవచ్చును.

**5) అధికార భాషా సంఘం :** (1) ఈ చట్టపు ప్రారంభం నుండి అయిదు సంవత్సరాలు గడచిన మీదట రాష్ట్ర ప్రభుత్వం ఉత్తరువు ద్వారా ఒక రాష్ట్ర అధికార భాషా సంఘంను ఏర్పాటు చేయవలెను. అందులో ఒక అధ్యక్షుడు, నలుగురు ఇతర సభ్యులు ఉండవలెను. వారిని రాష్ట్ర ప్రభుత్వము నియమించును. సంఘం అనుసరించవలసిన కార్య విధానమును ఆ ఉత్తరువు నిర్వచించవలెను.

(2) రాష్ట్ర అధికార కార్యాలకు తెలుగు భాషను ఉపయోగించుటలో సాధించిన ప్రగతిని సమీక్షించుట. ఈ క్రింది వాటిని గురించి రాష్ట్ర ప్రభుత్వానికి సిఫారసు చేయుట. సంఘము కర్తవ్యమై ఉండవలెను.

(ఎ) రాష్ట్ర అధికార కార్యములకు తెలుగు భాషను క్రమాధికంగా ఉపయోగించుట.

(బి) రాష్ట్ర అధికార కార్యములన్నింటిని లేదా అందు వేటికైన ఆంగ్ల భాష ఉపయోగంపై నిర్బంధములు.

(సి) తెలుగు భాష ఉపయోగమునకు సంబంధించి రాష్ట్ర ప్రభుత్వము సంఘమునకు నిర్దేశించిన ఏదైనా ఇతర విషయము.

(3) సంఘం (2)వ ఉప విభాగంలో తెలిపిన విషయములపై తన సిఫారసులతో పాటు రాష్ట్ర ప్రభుత్వమునకొక నివేదికను సమర్పించవలెను. రాష్ట్ర ప్రభుత్వముల నివేదికను రాష్ట్ర శాసనమండలి ప్రతి సభ సమక్షమందు ఉంచుటకు ఏర్పాటు చేయవలెను.

(4) సంఘం, అట్లు సమర్థించిన నివేదికలో చేసిన సిఫారసులను పరిశీలించిన మీదట రాష్ట్ర ప్రభుత్వము ఆ నివేదిక అంతటికి లేక అందలి ఏదేని భాగమునకు అనుగుణంగా ఆదేశములు జారీ చేయవచ్చును.

**6) కేంద్ర, రాష్ట్ర చట్టములు మున్నగు వాటి అధీకృత తెలుగు అనువాదము :** (1) ప్రకటన ద్వారా నిర్దిష్ట పరచిన తేదీనను, ఆ తేదీ తరువాత గవర్నరు అధికారము కింద :

(i) 3వ విభాగపు (2)వ ఉప విభాగములోని (i)వ ఖండము విషయములో ఏదేని కేంద్ర చట్టము లేక రాజ్యాంగమునకు గల ఏడవ అనుసూచి యొక్క 3వ జాబితాలో పేర్కొనిన విషయములలో దేనికి సంబంధించియైనను రాష్ట్రపతి జారీచేసిన ఏదేని ఆర్డినెన్సు లేదా ఏదేని రాష్ట్ర చట్టము లేదా గవర్నరు చేసిన ఏదేని రెగ్యులేషను లేదా రాష్ట్రములో అమలునందున్న ఏదేని శాసనమునకు, లేక

(ii) 3వ విభాగపు (2)వ ఉప విభాగములోని (ii)వ ఖండము విషయములో రాజ్యాంగము కింద లేక ఏదేని కేంద్ర చట్టము లేక రాష్ట్ర చట్టము లేక రాష్ట్రంలో అమలునందున్న ఏదేని ఇతర శాసనము కింద రాష్ట్ర ప్రభుత్వం గాని రాష్ట్ర ప్రభుత్వ అధికార వర్గం లేక అధికారి గాని జారీచేసిన ఏదేని ఉత్తర్వు నియమము, రెగ్యులేషను లేక నిబంధనకు -

ఆంధ్రప్రదేశ్ గెజెట్‌లో ప్రచురించిన తెలుగు భాషానువాదమును తెలుగు భాషలో దాని అధికార పూర్వక పాఠముగా భావింపవలెను.

(2) రాష్ట్ర శాసన మండలిలో ప్రవేశ పెట్టిన బిల్లులన్నిటిలోను, వాటికి ప్రతిపాదించు సవరణలలోను, అది ఆమోదించిన చట్టములలోను ఏ తేదీ నుండి తెలుగు భాషను ఉపయోగించవలెనో నిర్ధిష్ఠ పరచుచు రాష్ట్ర ప్రభుత్వము 3వ విభాగపు (2)వ ఉప విభాగములోని (i) (ఎ) ఖండము కింద ప్రకటన జారీ చేసినపుడు రాష్ట్ర శాసన మండలి ఉభయ సభలలో దేనియందైనను ఆంగ్ల భాషలో గల చట్టములను సవరించుటకు ప్రవేశ పెట్టబడు బిల్లులు లేదా వాటికి ప్రతిపాదించబడు సవరణలు అన్నిటి యొక్క అధికార పూర్వక తెలుగు భాషా పాఠముతో పాటు ఆంగ్ల భాషలో దాని అనువాదము కూడా ఉండవలెను.

**(7) రాష్ట్రమందలి కొన్ని ప్రాంతములలో ప్రకటన ద్వారా నిర్ధిష్ఠ పరచబడునట్టి అధికార కార్యములకు, అట్టి కాల పరిమితుల వరకు తెలుగు భాషకు అదనముగా ఉర్దూ లేక ఏదేని ఇతర భాష లేక భాషల ఉపయోగమునకు సంబంధించిన ప్రత్యేక నిబంధన :** రాష్ట్ర ప్రభుత్వము ఆయా సమయములందు ఆంధ్రప్రదేశ్ గెజెట్‌లో ప్రకటన ద్వారా తెలుగు భాషకు అదనంగా ఉర్దూను లేక ఏ ఇతర భాష లేక భాషల నైనను అట్టి భాష లేక భాషలను మాట్లాడు వ్యక్తుల ప్రయోజనముల దృష్ట్యా ప్రకటనలో నిర్ధిష్ఠ పరచబడునట్టి ప్రాంతములలోను, అట్టి రాష్ట్ర అధికార కార్యముల కొరకును, అట్టి కాలపరిమితుల వరకును ఉపయోగించవలెనని. మే 25, 1967న తెలుగుకు అదనంగా కొన్ని అధికార వ్యవహారాలలో ఉర్దూ, తదితర భాషలను ఉపయోగించవచ్చని ప్రభుత్వం ఆదేశాలు జారీచేసింది.

**8) నియమములు చేయుటకు అధికారము :** (1) రాష్ట్ర ప్రభుత్వము ఈ చట్టపు కార్యములన్నింటిని లేక వాటిలో వేటినైనను నెరవేర్చు నిమిత్తము ఆంధ్రప్రదేశ్ గెజెట్‌లో ప్రకటన ద్వారా నియమములు చేయవచ్చును.

(2) ఈ చట్టము క్రింద జారీచేసిన ప్రతి ప్రకటనను లేక చేసిన ప్రతి నియమమును, దానిని జారీచేసిన వెంటనే లేక రాష్ట్ర శాసనమండలి సమావేశమై ఉన్నచో అప్పుడు, లేనిచో సద్యానంతరము జరుగు సమావేశములో ప్రతి సభ సమక్షమందు మొత్తం పదునాలుగు దినముల పాటు వుంచవలెను. ఈ పదునాలుగు దినములు ఒకే సమావేశములోనివి కావచ్చును. లేదా రెండు వరుస సమావేశముల లోనివి కావచ్చును. దానిని అట్లుంచిన సమావేశము లేక సద్యానంతర సమావేశము ముగియులోగా ఆ ప్రకటనలో లేక నియమములో ఏదేని మార్పు చేయుటకు లేక ప్రకటనను లేక నియమమును రద్దుచేయుటకు ఉభయ సభలు అంగీకరించిన యెడల ఆ మీదట ఆ ప్రకటన లేక నియమము సందర్భమును బట్టి అట్లు మార్పు చేయబడిన రూపములో మాత్రమే అమలు నందుండవలెను. లేదా రద్దు కావలెను. అయితే అట్టి ఏదేని మార్పు లేక రద్దు ఆ ప్రకటన లేక నియమము క్రింద లోగడ చేసిన యేదైన కార్యపు చెల్లుబడికి భంగకరముగా వుండకూడదు.

**9) 1964లో 16వ ఆంధ్రప్రదేశ్ చట్టము రద్దు :** 1964 ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనమండలి (ఆంగ్ల భాష కొనసాగింపు) చట్టము ఇందు మూలముగా రద్దు చేయబడినది.

**3.2.3 తెలుగు అధికార భాషగా ప్రవేశపెట్టబడిన శాఖలు :** 1966 డిసెంబరు 22 తేదీన 23 ప్రభుత్వశాఖల్లో ఉత్తర ప్రత్యుత్తరాలలో తెలుగు వాడాలని ప్రభుత్వం ఉత్తర్వు జారీచేసింది.(చూ. అను.6)

1966 మే 14న శాసన రూపం దాల్చిన ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం ప్రకారం తాలూకా అంతకు తక్కువ స్థాయిలో తెలుగు అధికార భాషగా ప్రవేశ పెట్టబడిన శాఖలు :

అవి :
1. వ్యవసాయశాఖ,
2. పశు సంవర్ధక శాఖ
3. రోడ్లు, భవనాల శాఖ
4. వాణిజ్య పన్నుల శాఖ
5. సహకార శాఖ
6. విద్యాశాఖ
7. అబ్కారి, మద్యనిషేధ శాఖ
8. మత్స్య శాఖ
9. అటవీ శాఖ
10. దేవాదాయ, ధర్మాదాయ శాఖ
11. భారతీయ వైద్యశాఖ
12. కార్మిక శాఖ
13. మున్సిపల్ పరిపాలన శాఖ
14. పంచాయితీ రాజ్ శాఖ
15. పోలీస్ శాఖ
16. జైళ్ళ శాఖ
17. పౌర నిర్మాణాల శాఖ
18. పౌర గ్రంధాలయ శాఖ
19. రిజిష్ట్రేషను, స్టాంపుల శాఖ
20. రెవెన్యూ శాఖ
21. ట్రెజరీలు, అక్కౌంట్ల శాఖ
22. గిండగుల శాఖ
23. తూనికలు, కొలతల శాఖ

అంతేకాక కొన్ని కార్యాల నిమిత్తం జిల్లా స్థాయిలో దిగువ శాఖల్లో అధికార భాషగా తెలుగును ప్రవేశపెడ్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది.

అవి. 1. పశు సంవర్ధక శాఖ

2. వ్యవసాయ శాఖ

3. పంచాయితీ రాజ్ శాఖ (జిల్లా పరిషత్‌లు)

4. దేవాదాయ, ధర్మాదాయ శాఖ

5. విద్యాశాఖ

6. అగ్నిమాపక శాఖ

7. ఓడరేవుల శాఖ

8. స్త్రీ సంక్షేమ శాఖ

**పి.వి. నరసింహారావు సమీక్ష సంఘం :** పై శాఖలలో జరిగిన పనిని సమీక్షించేందుకు 1967లో శ్రీ పి.వి. నరసింహారావు అధ్యక్షులుగా ప్రభుత్వం ఒక సమీక్షా సంఘాన్ని నియమించింది.

1. పి.వి. నరసింహారావు, అధ్యక్షులు, సభ్యులుగా 2. వావిలాల గోపాలకృష్ణయ్య, 3. తులాబందుల నాగేశ్వరరావు, 4. టి. రంగారెడ్డి, 5. సుల్తాన్ సలావుద్దీన్ ఒవైసీ (శాసన సభా సభ్యులు), 6. పి. చెంగల్ రెడ్డి, 7. యస్. సోమయాజులు (శాసన పరిషత్ సభ్యులు), 8. యస్. ఆర్. రామమూర్తి. ఐ.ఎ.యస్ (విద్యాశాఖ కార్యదర్శి), 9. వై. శ్రీనివాసరావు (ప్రభుత్వ అనువాదకులు).

ఈ సంఘం పలు ప్రాంతాలు పర్యటించి అప్పటికమలులో ఉన్న శాఖలకే గాక తాలూకా, జిల్లా, రాష్ట్ర స్థాయిలలో తెలుగునమలు జరపాలని, శాసనమండలి చర్చలు, కోర్టులలో పని, ప్రభుత్వోద్యోగాల పరీక్షలు తెలుగులో అమలు జరపాలని, ఈ పని చూచేందుకు సాధరణ పరిపాలన శాఖలో ఒక ప్రత్యేక విభాగాన్ని ఏర్పాటు చేయాలని, శాసనంలో పేర్కొన్న అధికార భాషా కమిషన్‌ను వెంటనే ఏర్పాటు చేయాలని ఈ సంఘం 1971లో తన నివేదికను ప్రభుత్వానికి సమర్పించింది.

**3.2.4 అధికార భాషా కమీషను :** ప్రభుత్వం 5-3-1974న సాధారణ పరిపాలన శాఖలో అధికార భాషా విభాగాన్ని ఏర్పాటు చేస్తూ ఉత్తర్వులు జారీ చేసింది. దీని పర్యవేక్షణకు శ్రీ మండలి వెంకట కృష్ణారావుని ప్రత్యేక అధికారిగా నియమించింది.

శ్రీ జలగం వెంగళరావు నాయకత్వాన మంత్రి వర్గం ఏర్పడిన తరువాత ఆనంద నామ సంవత్సర ఉగాది (24-03-1974) నుండి రాష్ట్రమంతటా, తాలూకా అంతకు క్రింది స్థాయిలో శాసనేతరమైన ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటికి అన్ని శాఖలలోనూ పూర్తిగా తెలుగునుపయోగించాలని ప్రభుత్వం ఉత్తర్వులిచ్చింది.

అధికార భాషా చట్టం చేయబడి 5 సంవత్సరాలు గడచిన తర్వాత అధ్యక్షుడు, నలుగురు సభ్యులు గల అధికార భాషా కమీషన్‌ను ఏర్పాటు చేయాలని అధికార భాషా చట్టంలోని 5వ విభాగం నిబంధిస్తున్నది. ఈ నిబంధన ప్రకారం దిగువ తెలిపిన వారిలో ప్రభుత్వం అధికార భాషా కమీషన్‌ను ఏర్పరుస్తుంది. 19-3-1974వ తేదీన సాధారణ పరిపాలన (అధికార భాష) శాఖ జి.ఓ.యమ్.యస్. నెం. 199లో ఉత్తర్వును జారీ చేసింది. (చూ. అను.7, 7ఎ.బి.)

1. శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య, అధ్యక్షులు, సభ్యులుగా 2. శ్రీ. వి.పి. రాఘవాచారి, యమ్.యల్.సి., 3. శ్రీమతి టి.యన్. అనసూయమ్మ, యమ్. యల్.ఏ., 4. శ్రీ యన్. శ్రీనివాసులు రెడ్డి (యమ్.యల్.ఎ) 5. శ్రీ తులాబందుల నాగేశ్వర రావు.

సాధారణ పరిపాలన శాఖలో అధికార భాషా వ్యవహారాలు చూసే ప్రత్యేక అధికారి ఈ కమిషనుకు కార్యదర్శిగా నియమింపబడ్డారు.

ఈ కమిషను రాష్ట్రంలో అధికార కార్యాల నిమిత్తం తెలుగు అమలు జరిగిన ప్రగతిని సమీక్షించి ప్రభుత్వానికి ఈ విషయాలలో సిఫారసు చేయాలి.

1) రాష్ట్రంలోని అధికార కార్యాల నిమిత్తం తెలుగును క్రమాధికంగా వాడుకలోకి తీసుకు రావడం.

2) రాష్ట్రంలోని అన్ని లేక, ఏవైనా అధికార కార్యాల నిమిత్తమై ఇంగ్లీషు ఉపయోగం పై నిర్బంధాలు.

3) (i) రానున్న ఐదు సంవత్సరాలలో జిల్లా, రాష్ట్రస్థాయిలందు క్రమాధికంగా అమలు పరిచే నిమిత్తం తగినంత మంది తెలుగు టైపిస్టులకు శిక్షణ ఇవ్వటం.

(ii) ప్రభుత్వ కార్యాలయాలలో ఉపయోగించే నిమిత్తం తగినన్ని తెలుగు టైపురైటర్లు సేకరించడం.

(iii) న్యాయ స్థానాలలో కూడా అధికార భాషను అమలు పరచే నిమిత్తం అవసరమైన శాసనాలను అనువాదం చేయడం.

(iv) తెలుగులో వివరణలు, ముసాయిదాలు రాయటంలో తెలుగురాని ఉద్యోగులకు శిక్షణ ఇవ్వటం.

(v) ప్రభుత్వ ముద్రణాలయంలో లినో టైపు యంత్రాలను నెలకొల్పడం.

రెండు సంవత్సరాల లోపు పైన తెలిపిన విషయాలపై కమిషను తన సిపారసుతో నివేదికను సమర్పించాలి.

ప్రభుత్వం కమిషను కోరినపుడు మధ్యకాలిక నివేదికలను కూడా సమర్పించవలసి వుంటుంది.

రాష్ట్ర ప్రభుత్వం 5-9-1975 సాధారణ పరిపాలన (అధికార భాష - 1) శాఖ నె. 1008 లేఖ ద్వారా మధ్యకాలిక నివేదికను కోరింది.

**అధికార భాషా కమిషను - పర్యటనలు**

రాష్ట్రంలోని వివిధ కార్యాలయాలు తెలుగు ఎంతవరకు ఉపయోగిస్తున్నాయో పరిశీలించేందుకు అధికార భాషా కమిషన్ రాష్ట్రంలోని 21 జిల్లాలలో పర్యటించింది. పర్యటనలోని ఆయా ప్రాంతాలలో అధికార్లను, సిబ్బందిని, పౌరులను కలుసుకొని వారితో చర్చించింది.

కార్యాలయాలు సందర్శించినపుడు కమిషన్ వివిధ భాగాలలో నిర్వహిస్తున్న రిజిష్టర్లు, ఫైల్లు, రికార్డులు మొదలైన వాటిని స్వయంగా పరిశీలించి వాటిలో ఏయే అంశాలకు ఎంతమేరకు తెలుగు ఉపయోగించబడుతున్నదో తెలుసు కొని ప్రతి కార్యాలయంలోని సిబ్బందిని సమావేశ పరచి తెలుగు

వాడుక చేయడంలో ముసాయిదాలు, వివరణలు మొదలైనవి రాయడంలో గాని, నమూనాలను నింపడంలో గాని వారికేమైన ఇబ్బందులు ఎదురౌతున్నాయా? అని అడిగి తెలుసుకొని, తెలుగు వాడుక చేస్తూ ప్రభుత్వం ఉత్తర్వులను విధిగా పాటించాలని కమిషన్ సిబ్బందిని హెచ్చరించింది.

అధికార బాధ్యతగా మాత్రమే కాక దేశ భక్తితోనూ, మాతృభాషాభిమానంతోనూ ఈ కార్యక్రమం నిర్వహించాలని కమిషన్ సిబ్బందిని కోరింది.

అదే విధంగా ప్రభుత్వాదేశాలను పకడ్బందీగా అమలు పరచటానికి కార్యాలయాధికారులు తీసుకోవలసిన చర్యల గురించి వివరించింది.

కమిషన్ పౌరులను కలుసుకొని తమ ప్రాంతంలోని కార్యాలయాలు తెలుగు భాషనుపయోగించటం వల్ల ఎంతవరకు ప్రయోజనం కలుగుతుందని తెలుసుకుంది.

కమిషన్ జరిపిన పర్యటన వివరాలు అధికార భాషా కమిషన్ పర్యటించిన జిల్లాలు 21

- సందర్శించిన స్థలాలు 155;
- పరిశీలించిన కార్యాలయాలు 331 ;
- పర్యటించిన తాలూకాలు 85
- సందర్శించిన పంచాయితీ సమితులు 81;
- జిల్లాస్థాయి అధికారుల సమావేశం 21;
- పర్యటనలో గడిపిన రోజులు 63;
- ప్రయాణం చేసిన దూరం 16,505 కి.మీ.[23]

**ప్రధానికి కమిషన్ విజ్ఞాపన :** 16-11-1974న అధికార భాషా కమిషన్ అధ్యక్షులు శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధిని, కేంద్ర హోం మంత్రిని, కేంద్ర అధికార భాషా కమిషనును ఢిల్లీలో కలుసుకొని ప్రాంతీయ భాషల విస్తరణకు ప్రోత్సహం ఇవ్వాలని, కేంద్ర సర్వీసు కమిషనులో తెలుగును కూడా పరీక్ష భాషగా వాడే ఏర్పాటు చేయాలని, కేంద్ర శాసనాలకు తెలుగు అనువాదాలు త్వరలో ప్రచురించాలని కోరారు.

**దక్షిణ రాష్ట్రాలలో అధికార భాషా కమిషన్ పర్యటన :**

అధికార భాషా కమిషను అధ్యక్షుడు శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య దక్షిణాది రాష్ట్రాలు (తమిళనాడు, కర్నాటక, కేరళ) తమ ప్రాంతీయ భాషలను అధికార భాషలుగా ఏ విధంగా అమలు జరుపుతున్నాయో తెలుసుకోవడానికి ఆ రాష్ట్రాలను సందర్శించారు.

కమిషను 1974 అక్టోబరు 18 నుండి 22 వరకు కర్నాటక రాష్ట్రంలో పర్యటించింది. కర్నాటక ప్రభుత్వ న్యాయశాఖ కార్యదర్శితోనూ, భాషల శాఖ ప్రధానాధికారితోను, అనువాదాల సంఘంతోనూ, అధికార భాషా వ్యవహారాలు చూసే రాష్ట్రప్రభుత్వాధికారులతోనూ చర్చలు జరిపి, ప్రభుత్వ ముద్రణాలయంలో కన్నడ లినోటైపు యంత్రాలు ఎలా పనిచేస్తున్నాయో తెలుసుకోవడానికి కమిషను మన ప్రభుత్వ ముద్రణా శాఖ డైరెక్టరు, వారి సిబ్బంది అక్కడి ముద్రణాలయం సందర్శించింది.

కమిషను 1974 డిసెంబరు 6, 7 తేదీలలో తమిళనాడు సందర్శించినపుడు మద్రాసులో తమిళ భాషాభివృద్ధి శాఖ ప్రధానాధికారితోనూ, ఇతర అధికారుల తోనూ, విద్యాశాఖ కార్యదర్శితోనూ, సచివాలయాధికారులతోనూ, తమిళనాడు అధికార భాష (శాసన) కమిషనుతోను చర్చలు జరిపి ముద్రణశాఖ డైరక్టరు వారి సిబ్బందిలో కలిసి ప్రభుత్వ ముద్రణాలయం సందర్శించి తమిళంలో లినోటైపు యంత్రాలు ఎలా పనిచేస్తున్నాయో పరిశీలించింది.

కమిషను అధ్యక్షులు 1975 జూలై 24 నుండి 26 వరకు కేరళ సందర్శించారు. రాష్ట్ర రాజధాని తిరువనంతపురం కేరళ అధికార భాషా కమిషన్ అధ్యక్షులతోనూ, సభ్యులతోనూ, న్యాయశాఖ కార్యదర్శితోను, అధికార భాష వ్యవహారాలు చూస్తున్న పబ్లిక్ శాఖ ఉపకార్యదర్శితోను, మళయాళ సర్వ విజ్ఞానకోశం ముఖ్య సంపాదకులతోనూ, భాషల సంస్థ సహాయ ప్రధానాధికారితోనూ, శాసన సభ కార్యదర్శితోనూ చర్చలు జరిపారు.

**విశ్వహిందీ సమ్మేళనం :** నాగపూర్‌లో 1974 డిసెంబర్‌లో జరిగిన విశ్వ హిందీ సమ్మేళనానికి అధికార భాష కమిషన్ అధ్యక్షులు శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య సభ్యులు శ్రీ॥ వి.పి. రాఘవాచారి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రతినిధులుగా వెళ్లి పాల్గొన్నారు.

**ప్రపంచ తెలుగు మహాసభలు :**

హైద్రాబాదు నగరంలో రాక్షస ఉగాది (12-4-1975) నుండి జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలలో ఏర్పాటైన గోష్ఠి సంఘానికి అధికార భాషా కమిషను అధ్యక్షులు శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య అధ్యక్షత వహించారు. ఈ గోష్ఠిలో "అంతర్జాతీయ తెలుగు సంస్థ" నిర్మించాలని తీర్మానింపబడింది.

ఈ మహాసభల సందర్భంగా ప్రచురించిన "తెలుగు వాణి" ప్రత్యేక సంచిక సంఘానికి అధికార భాషా కమిషను సభ్యులు శ్రీ వి.పి. రాఘవాచారి ఉపాధ్యక్షులుగాను, కమిషన్ కార్యదర్శి శ్రీ జి.రామకృష్ణారావు సమావేశ కర్తగా వ్యవహరించారు.

**అధికార భాషా కమిషను సమావేశాలు - తీర్మానాలు**

అధికార భాషా కమిషను సుమారు 48 సమావేశాలు జరిపింది. వాటిలో ముఖ్య సమావేశాలు :

**మొదటి సమావేశం :** 24-3-1974 ఆనంద నామ సంవత్సర ఉగాది నాడు హైద్రాబాద్‌లో ప్రథమ సమావేశం జరిగింది. ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ఈ సమావేశాన్ని ప్రారంభించారు. కమిషను అధ్యక్షులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య సభ్యులు, ప్రభుత్వ కార్యదర్శులు, శాఖాధి పతులు హాజరైనారు.

ఈ సమావేశంలో కమిషను అనుసరించవలసిన కార్యవిధానం గురించి చర్చించ బడింది.

**రెండవ సమావేశం :** 25-3-1974న రెండవ సమావేశం జరిగింది. ఈ దిగువ తెలిపిన అంశాలపై చర్య కోసం ప్రభుత్వాన్ని కోరాలని కమిషను తీర్మానించింది. అవి :

ప్రభుత్వ అధికార భాషకు సంబంధించిన ఉత్తర్వులను తెలుగులో అనువదించి. క్రోడీకరించి కమిషనుకు పంపటం.

జిల్లాల్లో టైపురైటర్లు అందజేసిన కార్యలయాలు, శిక్షణ పొందిన టైపుస్టుల సంఖ్య, వారెక్కడెక్కడ పని చేస్తున్నారనే వివరాలు కమిషనుకు తెలియచేయటం.

ఈ తీర్మానమనుసరించి మునిసిపాలిటీలు, పంచాయితీ సమితులు, పంచాయితీలు ఉత్తర ప్రత్యుత్తరాలు తెలుగులోనే జరపాలని సాధారణ పరిపాలన (అధికార భాష - I) శాఖ 4-8-1975 తేదీ నాటి జి.ఓ.మిస్ నెం. 476, 477లలో ఆదేశాలు జారీ అయ్యాయి. (చూ. అను.8)

**మూడవ సమావేశం** : 23-4-1974న కమిషను మూడవ సమావేశం జరిగింది. ఈ సమావేశంలో ఆమోదించిన తీర్మానాలు.

శిక్షణ పొందిన తెలుగు టైపుస్టు గల పంచాయితీ సమితి కార్యాలయాలకు టైపు మిషనులు సరఫరా చేయాలి.

ప్రభుత్వ కార్యాలయాలలోని ఉద్యోగులకే కాకుండా మున్సిపాలిటీలు, పంచాయితీ సమితిలు మొదలైన వాటిలో పనిచేస్తున్న ఇంగ్లీషు టైపిస్టులకు కూడా తెలుగు టైపింగు నేర్పించాలి.

**పదకోశాలు** : అధికారిక ఆంగ్ల పదాలకు తెలుగు సమానార్థకాలు గల పుస్తకాలను తెలుగు అధికార భాషగా ప్రవేశ పెట్టిన అన్ని కార్యాలయాలకు అందచేయాలి.

కమిషను సూచన మేరకు ఆంగ్ల పదాలకు తెలుగు సమానర్థకాలు పుస్తకాలను సరఫరా చేసే నిమిత్తం జిల్లా కలెక్టర్లకు ప్రభుత్వం అందజేసింది.

**నాలుగో సమావేశం** : 28-6-1974న కమిషన్ ఏర్పాటు చేసిన నాలుగో సమావేశంలో చేసిన తీర్మానాలు.

న్యాయశాఖలో జరిగే అనువాదాలను గురించి న్యాయశాఖ కార్యదర్శితో చర్చించాలి.

న్యాయస్థానాలలో తెలుగు అధికార భాషగా ప్రవేశ పెట్టేందుకు చట్టాలు కోడ్‌లు, మున్నగువాటి అనువాదాలు, సిద్ధం చేయాలి.

తెలుగు టైపురైటర్లు, లినో టైపు మిషనులు సేకరించాలి.

ఇకపై ప్రతి శాసనానికి తెలుగు అనువాదం ప్రకటించాలి.

**ఐదవ సమావేశం** : 10-1-1975న కమిషను ఐదవ సమావేశం ఏర్పాటు చేసి ఈ తీర్మానాలను ఆమోదించింది.

అనువాద విభాగంలో జరిగిన పనిని సమీక్షించిన మీదట శాసనాల అధికార పాఠాలను త్వరితగతిన తయారుచేసే నిమిత్తం తెలుగు అనువాద సంఘాన్ని పునర్ వ్యవస్థీకరించటం అవసరం.

ఈ సంఘం అధికార భాషా కమిషనుతో సన్నిహిత సంబంధాలు కలిగి పని చేయాలని సూచించింది.

**ఆరో సమావేశం :** 12-5-1975న కమీషను ఆరో సమావేశం ఏర్పాటు చేసి చేసిన తీర్మానాలు.

మాన్యువల్లు, కోడ్లు, స్థాయీ ఉత్తర్వులు మొదలైన వాటి తెలుగు అనువాదాలు ప్రచురించటం.

ఇకముందు ప్రభుత్వం వెలువరించే ఉత్తరువులు, ప్రకటనలు, గెజెట్ ప్రకటనలు తెలుగులో ప్రచురించాలి.

ఇకముందు శాసన సభ ఆమోదించే ప్రతి శాసనం తెలుగు ప్రతి కూడా అధికారికంగా ప్రచురించటం.

వివిధ ప్రభుత్వశాఖల్లో వాడే తెలుగు పదాల పట్టికను శాఖల వారీగా ప్రచురించడం.

ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడక ముందు వున్న శాసనాల తెలుగు అనువాదాలు చేసి వాటిని ధ్రువీకరించటం.

శాసన సభ సమావేశంలో

a) ప్రశ్నోత్తరాలు, b) ప్రతిపాదనలు c) తీర్మానాలు, d) ప్రకటనలు e) బిల్లులు మున్నగు వాటిని తెలుగులో ప్రవేశ పెట్టడం.

భాషా కమీషను సచివాలయ సిబ్బందిని పటిష్ఠం చేయటం

ఇతర రాష్ట్రాలలో అధికార భాషా అమలు గురించి తెలుసుకొనేందుకు కమీషనును కొన్ని రాష్ట్రాలకు పర్యటన నిమిత్తం పంపించటం.

తాలూకా, జిలా స్థాయిల్లో ప్రకటనలు ఉత్తరువులు, మొదలైనవి తెలుగులో అనువదించి ప్రచురించాలని ప్రభుత్వ సాధారణ పరిపాలన (అధికార భాష - I) శాఖ 10-10-74 తేదీ జి.ఓ. యం.యస్. నెం. 670లో ఉత్తరువులు జారిచేసింది. (చూ. అను.9)

**ఏడవ సమావేశం :** 4-3-1975న కమీషను సమావేశమై మాన్యువళ్ళు. కోడ్లు మున్నగు వాటి అనువాదం కోసం ఏర్పాటైన విభాగాన్ని సచివాలయానికి తరలించ వలసిందిగా కోరింది.

దీని ప్రకారం ప్రస్తుతం ఈ విభాగం సచివాలయంలో పని చేస్తుంది.

**ఎనిమిదవ సమావేశం :** 12-5-1975 కమీషను సమావేశమై పరిపాలనా పదకోశాన్ని తయారు చేయాలని తీర్మానించింది.

ఈ కార్యక్రమం 2-6-1975న ప్రారంభమై సుమారు 3,000 పదాలకు సమానార్థకాలు నిర్ణయించి, శాసన మండలికి చెందిన పదకోశానికి తుది రూపమిచ్చి, సూచనల నిమిత్తం శాసనమండలి కార్యదర్శికి పంపటం జరిగింది.

**అధికార భాషా కమీషను మధ్యకాలిక నివేదిక :**

ఆంధ్ర ప్రదేశ్‌లో తెలుగును అధికార భాషగా అమలు జరుపుటలో జరిగిన కృషి, తాము పర్యటించిన వివిధ రాష్ట్రాలలో జరుగుచున్న కార్యక్రమాలన్నింటిని సమీక్షించి, అధికార భాషా కమీషను అధికార భాషా అమలుకు తీసుకోవలసిన చర్యలు వివరిస్తూ కొన్ని సూచనలతో 25-9-1975న ప్రభుత్వానికి ఒక మధ్యకాలిక నివేదికను సమర్పించింది.

నివేదిక అంశాలు : శాసనేతర అంశాలు : 1) 1966 ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం కింద వివిధ స్థాయిలలో తెలుగును అధికార భాషగా ప్రవేశ పెడ్తూ ప్రభుత్వం జారీచేసిన ఉత్తరువులను సవరించి, శాసనేతర అంశాలకే తెలుగును పరిమితం చేసిన షరతులను తొలగించి అన్ని అంశాలకు తెలుగును అధికార భాషగా ఉపయోగించడానికి ఆదేశాలు జారీ చేయాలి.

## 3.3 అధికార భాషగా తెలుగు అమలు, ప్రగతి :

1. రాక్షస ఉగాది నుండి జిల్లా స్థాయిలో తెలుగు అధికార భాషగా అమలు జరిపే ప్రకటనను ప్రభుత్వం జారీచేసింది. కావున జిల్లా స్థాయిలోని అన్ని కార్యాలయాలలోని అన్ని శాఖలలో తెలుగు అధికార భాషగా ప్రవేశపెడ్తూ ప్రభుత్వం వెంటనే ఉత్తర్వులు జారీ చేయాలి.

   నల ఉగాది నుండి రాష్ట్ర స్థాయి కార్యాలయాలలో కూడ తెలుగును అధికార భాషగా ప్రవేశ పెట్టాలి.

2. అధికార భాష అమలును ఎప్పటి కప్పుడు పరిశీలన సమీక్షించేందుకు ప్రతి జిల్లాకు ఒక జిల్లా భాషాధికారిని నియమించాలి. ఈ అధికారి జిల్లా అధికార భాషా సమీక్ష సంఘానికి కార్యదర్శిగా వ్యవహరించాలి.

3. ప్రతి కార్యాలయంలోని కార్యాలయాధికారి, కీలక స్థానంలోని ఉద్యోగి, హెడ్ గుమస్తా, సూపరింటెండెంట్, మేనేజరు మొదలైన వారికి తెలుగు వచ్చివుండాలి.

4. కార్యాలయాలలో ఆయా భాషలలో జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాల సంఖ్యలు, నివేదికలు ప్రతినెలా ప్రభుత్వానికి పంపాలి.

5. సాధారణ పరిపాలనా శాఖలో ఇప్పుడున్న ప్రత్యేక అధికారికి భాషా పరమైన పని అప్పజెప్పి, అధికార భాష అమలుకు డిప్యూటి కార్యదర్శిని నియమించాలి, సిబ్బందిని బలపరచాలి.

6. జిల్లా సమీక్షా సంఘాలు నెలకొకసారి ఒక్కొక్క తాలూకా కేంద్రంలో సమావేశం జరపాలి. ప్రతి మూడవ సమావేశం జిల్లా కేంద్రంలో జరపాలి.

7. తెలుగు బోధనా భాషగా చదివిన వారికి ఉద్యోగాలలో ప్రాధాన్యత ఇస్తామని ప్రభుత్వం చేసిన ప్రకటనను వెంటనే అమలు జరుపటానికి ఉత్తర్వులు జారీ చేయాలి.

8. భారత రాజ్యాంగం 8వ అనుసూచిలో తెలిపిన భాషలన్నింటిలో యూనియన్ పబ్లిక్ సర్వీసు కమిషన్ ను పరీక్షలు జరుపవలసిందిగా కేంద్ర ప్రభుత్వం 1968లో చేసిన తీర్మానం ప్రకారం తెలుగును పరీక్ష భాషగా యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషను ప్రవేశపెట్టి అమలు జరుపటానికి రాష్ట్ర ప్రభుత్వం తగు చర్యలు తీసుకోవాలి.

**తెలుగు వాడుక :**

1. ప్రజలు తెలుగులో ప్రభుత్వానికి రాసుకున్న లేఖలకు, విన్నపాలకు ఏ స్థాయిలోనైనా సమాధానాలను ప్రభుత్వం తెలుగులోనే పంపాలి.
2. ఉత్తర ప్రత్యుత్తరాలు, వివరణలు, ముసాయిదాలు, లేఖలు, ఉత్తరాల నివేదికలు, తీర్పులు మొదలైన అంశాలు తెలుగులో రాయదలచిన ఉద్యోగులకు సచివాలయం వరకు ఏ స్థాయిలోనైనా ఆ ఉద్యోగి తెలుగులో రాసే విధంగా స్వేచ్ఛ వుండాలి.
3. రోడ్లు, వీధులు, గ్రామాలు, పట్టణాలు, నగరాలు, మోటారు వాహనాలు, గమ్యస్థానాలు మొదలైన వాటి పేర్లు తెలుగులో వుండాలి.
4. భవనాలు, సంస్థలు, వంతెనలు, డ్యాములు, మొదలైన వాటి శంఖుస్థాపనలు, ప్రారంభోత్సవ ఫలకాలు, తెలుగులో వుండాలి.
5. అన్ని కార్యాలయాల పేర్లు తెలిపే బోర్డులన్ని తెలుగులో వుండాలి.

**వాడుక పదాల నిఘంటువు :** ప్రజల వాడుకలో వుండి నిఘంటువులలో, పరిపాలనా వ్యవహారాలలో రాని తెలుగు పదాలను గ్రంథస్థం చేయడం అవసరం.

**న్యాయస్థానాల్లో తెలుగు :**

1. హైకోర్టుకు దిగువన వున్న అన్ని సబార్డినేటు (సివిల్, క్రిమినల్) న్యాయస్థానాలలో సివిల్, క్రిమినల్ వ్యవహారాలన్నింటికి తెలుగును అధికార భాషగా వెంటనే ప్రవేశపెట్టాలి.
2. వాద, ప్రతివాద పత్రాలు, అర్జీలు, అఫిడవిటులు మొదలైనవి తెలుగులో వుండాలి.
3. న్యాయ పీఠాధికారులు సాక్ష్యం తెలుగులో రాసుకోవాలి.
4. తెలుగు వచ్చిన న్యాయవాదులు తమ వాద ప్రతివాదాలు తెలుగులో సాగించాలి. తీర్పులు, ఉత్తర్వులు డిక్రీలు తదితరమైనవి తెలుగులో రాయాలి.

**టైపిస్టులకు శిక్షణ :**

1. ఇంగ్లీషు టైపిస్టులుగా పనిచేస్తున్న వారికి తెలుగు టైపులో శిక్షణ ఇవ్వాలి.
2. ఇకముందు సాధ్యమైనంత వరకు ప్రభుత్వం కార్యాలయాలలో తెలుగు టైపిస్టులనే నియమించాలి.
3. తెలుగు టైపురైటింగులో శిక్షణ పొందిన అభ్యర్థులకు పరీక్ష నిర్వహించే సాంకేతిక విద్యాశాఖ వారు పరీక్షలైన రెండు నెలలోపు ఫలితాలు ప్రకటించి యోగ్యత పత్రాలందించే ఏర్పాటు చేయాలి.
4. తెలుగు టైపురైటింగులో శిక్షణ పొందిన ఉద్యోగిని ఒక కార్యాలయం నుండి మరొక కార్యలయానికి బదిలీ చేసినపుడు ఆ కార్యాలయంలో తెలుగు టైపు పనికి భంగం కలగకుండా చూడాలి.

5. టైపు రైటర్లు ఉపయోగించటంతో పాటు చేతివ్రాత ప్రతులు లేక డూప్లికేటింగ్ ద్వారా తీసిన ప్రతులు ఉపయోగించుటకు ప్రభుత్వం ఏర్పాట్లు చేయాలి. అధికార భాష - రాష్ట్ర ప్రభుత్వ యాజమాన్యం లేదా నియంత్రణలో ఉన్న కార్పోరేషన్లు, కంపెనీలు ఇంగ్లీషు టైపిస్టులకు, స్టెనోలకు తెలుగు టైపురైటింగ్‌లో శిక్షణనివ్వాలని 27-7-1990న ఆదేశాలు జారీ అయ్యాయి. (చూ. అను.10)

**తెలుగు సంక్షిప్త లేఖనం :** భవిష్యత్తులో తెలుగు సంక్షిప్త లేఖనం అవసరమెక్కువగా వుంటుంది. కాబట్టి ఇప్పుడున్న ఇంగ్లీషు స్టెనో గ్రాఫర్లకు తెలుగు సంక్షిప్త లేఖనం శిక్షణనివ్వాలి. తెలుగు సంక్షిప్త లిపి పుస్తకం, దాని కీలక పుస్తకం కొనాలనుకున్న వారికి అవి అందుబాటులో వుండేలా ప్రభుత్వం ఏర్పాటు చేయాలి.

**టైపురైటర్లు సరఫరా :** రాష్ట్రస్థాయిలో తెలుగునధికార భాషగా అమలు జరుపటానికి తెలుగు టైపురైటర్లు అధిక సంఖ్యలో అవసరం కనుక ఒక ప్రభుత్వాధీన సంస్థ ద్వారా తెలుగు టైపురైటర్లు ఉత్పత్తి కార్యక్రమం చేపట్టే విషయాన్ని ప్రభుత్వం పరిశీలించి తగు చర్య తీసుకోవాలి.

**శాసనాల అనువాదం :**

1. 1973 కేంద్ర శాసనాల (అధికార) అనువాదాల చట్టం అమలులోకి వచ్చినట్లు కేంద్రం చేత ప్రకటన చేయించటానికి రాష్ట్ర ప్రభుత్వం కృషి చేయాలి.

2. కేంద్ర శాసనాల తెలుగు అనువాదాలు అయినంతవరకు ఆమోదం పొంది ప్రకటించాలి, మిగిలిన వాటిని త్వరలో ఆమోదింపచేసి ప్రకటించాలి.

3. కేంద్ర శాసనాల తెలుగు అనువాదాలు కేంద్ర భాషా కమీషన్ అంగీకారం పొందేందుకు మన రాష్ట్ర సభ్యుడు లేనందువల్ల రాష్ట్ర ప్రభుత్వం మన రాష్ట్ర సభ్యుని పేరు వెంటనే సూచించి పని వెంటనే జరిగేలా చూడాలి.

4. ప్రస్తుతం న్యాయశాఖలో వున్న తెలుగు అనువాద సంఘం స్థానంలో ఒక సమగ్ర శాసన అనువాద సంఘాన్ని ఏర్పాటు చేయాలి. ఈ సంఘం అధికార భాషా కమీషన్‌తో సన్నిహిత సంబంధం కలిగి పనిచేయాలి.

5. ఇంతవరకు ప్రచురించిన తెలుగు అనువాదాలను అధికార భాషా చట్టం 6వ విభాగం ప్రకారం అధికార పాఠాలుగా ప్రకటించాలి.

**తెలుగులో బిల్లులు వగైరాలు :** శాసనమండలి (ఉభయ సభలలో) ప్రవేశపెట్టే బిల్లులు రాష్ట్ర గవర్నరు జారీ చేసే ఆర్డినెన్సులు, రెగ్యులేషన్‌లు, రాష్ట్ర ప్రభుత్వంగాని, ప్రభుత్వాధికార వర్గం, లేక అధికారి గాని జారీ చేసే ఉత్తరువులు, నియమాలు, నిబంధనలు, తెలుగులో వుండాలని ప్రభుత్వ అధికార భాషా చట్టం 3 (2) విభాగం కింద ప్రకటించాలి.

**న్యాయశాస్త్ర గ్రంధాలు :** న్యాయస్థానాలలో తెలుగు ప్రవేశ పెట్టటానికి అవసరమైన న్యాయ సంబంధ గ్రంధాలు న్యాయశాఖ అనువాద విభాగం నుండి అనువదింపచేసి ప్రకటించాలి.

**నమూనా తీర్పుల గ్రంథం :** 1) న్యాయస్థానాలలో తెలుగు ప్రవేశపెట్టే కార్యక్రమాన్ని సులభం చేయటానికి న్యాయాధిపతుల సహాయంతో తెలుగులో "నమూనా తీర్పుల గ్రంథం" న్యాయశాఖ ద్వారా తయారు చేయించాలి.

2) తెలుగులో యింతవరకు ప్రత్యేక న్యాయశాస్త్ర పదకోశం లేనందువల్ల న్యాయశాఖ అనువాద సంఘం ఈ పదకోశాన్ని వెంటనే రూపొందించే ఏర్పాటు చేయాలి.

**నమూనాలు (ఫారాలు) :** 1) ప్రభుత్వ కార్యాలయాలు, ప్రజలు ఉపయోగించే శాసన పరమైన నమూనాలు తెలుగులో లేకపోవడం వల్ల తెలుగునధికార భాషగా అమలు జరపటంలో అవరోధం కలుగుతుంది కావున న్యాయశాఖలోని అనువాద సంఘాన్ని వెంటనే సమావేశ పరచి ఆ నమూనాల అనువాదాన్ని ధృవీకరించే ఏర్పాటు చేయాలి.

2) వివిధ ప్రభుత్వ కార్యాలయాలలో వాడుకలో వున్న 5000 నమూనాల సంఖ్యను వాటి పరిమాణాన్ని తగ్గించి ప్రమాణీకరించేందుకు ప్రభుత్వ ముద్రణా శాఖలో ఒక అధికారిని నియమించి ఆ పనిని పూర్తి చేయించాలి.

**ఉద్యోగులకు శిక్షణ :**

1. ప్రభుత్వ కార్యాలయాలలో తెలుగు అధికార భాషగా అమలు పర్చటానికి సిబ్బందికి తగ్గిన శిక్షణ ఇవ్వాలి.
2. తెలుగు వచ్చిన వారికి కార్యాలయ వ్యవహారాలు తెలుగులో నిర్వహించటానికి అవసరమైన నేర్పు కలిగించాలి.
3. తెలుగు రాని వారికి లేదా తెలుగు వచ్చి అభ్యాసం లేక మర్చిపోయిన వారికి భాషాభ్యాసం కలిగించాలి.
4. తెలుగు రాని ప్రభుత్వోద్యోగులు తెలుగు భాషా పరీక్షలో ఉత్తీర్ణత పొందేందుకు సంబంధించిన నియమ నిబంధనలు కట్టుదిట్టంగా అమలు పరచాలి.

**లినో టైపు యంత్రాలు :** లినో టైపు కంపెనీ నుంచి లినో టైపు యంత్రాలు తెప్పించి పని ప్రారంభింప చేయటానికి ప్రభుత్వం తగు చర్య తీసుకోవాలి.

ఈ మధ్యకాలిక (1975) నివేదికను ప్రభుత్వం పరిశీలించింది.

**తెలుగు అమలుకు జరిగిన కృషి :**

శ్రీ నండూరి రామకృష్ణమాచార్యులు 1987 వ సంవత్సరం అధికార భాషా కమిషన్ అధ్యక్షులుగా ఎన్నికైన నాలుగు నెలలో పది జిల్లాల్లో పర్యటించారు. ఈయన సమయంలోనే హైద్రాబాదు నగర

ప్రభుత్వ కార్యాలయాలలో వున్న 1600 మంది ఇంగ్లీషు టైపిస్టులకు తెలుగు టైపురైటింగులో శిక్షణ యిచ్చారు. ప్రభుత్వ కార్యాలయాల్లో పనిచేసే తెలుగురాని ఉద్యోగులకు తెలుగు శిక్షణ ఇచ్చే నిమిత్తం ప్రభుత్వం ఉత్తరువులు జారీచేసింది. జి.వో. మిస్ నెం. 584 (చూ. అను.11)

1987 చివరలో 1988 ఆరంభంలో సచివాలయంలోని అన్ని శాఖల సిబ్బందికి, అధికారులకు 35 రోజుల పాటు అధికార భాషా సంఘం అధ్యక్షులు నండూరి రామకృష్ణమాచార్య, కార్యదర్శి తెలుగు అమలు విషయంలో గోష్ఠులు నిర్వహించి, 3500 మంది ఉద్యోగులను కలిశారు.

అధికార భాషా సంఘ అధ్యక్షులు, ప్రధాన కార్యదర్శి ఆధ్వర్యంలో అధికార భాష ఉప మంత్రి శ్రీ దాడి వీంభద్రరావు ప్రభుత్వ కార్యదర్శులందరితో ఫిబ్రవరి 6వ తేదీనాడు సమావేశాన్ని జరిపాడు.

ఈ సమావేశంలో ఓ ప్రధాన తీర్మానాన్ని ఆమోదించారు. పరిపాలనలో తెలుగు వాడకానికి ప్రభుత్వ తీసుకొన్న నిర్ణయాల ప్రభావం రాష్ట్ర కార్యాలయాలపై చాలావరకు వున్నప్పటికి గమ్యం చేరుకోవడానికి ఉన్నత పాలనా యంత్రాంగానికి కొంత చైతన్యం అవసరమని అందుకోసం ముఖ్యమంత్రి గారి సమక్షంలో సమావేశాన్ని ఏర్పాటు చేయాలని తీర్మానించారు.

**ముఖ్యమంత్రితో అధికార భాషా కమీషను సమావేశం :**

శ్రీ నందమూరి తారక రామారావు గారు ఈ సమావేశాన్ని ప్రారంభించి తమ ఉపన్యాసంలో తమ పరిపాలన ప్రారంభమై 5 సంవత్సరములు పూర్తి అయినప్పటికి తెలుగు ఒక్క అడుగు కూడా ముందుకు వెళ్ళలేదని, సచివాలయం అంతా ఇంగ్లీషు మయంగా కన్పిస్తుందని, తమకు ఒక్క ఫైలు కూడా తెలుగులో రావటం లేదని, తెలుగు ప్రజలకు పరిపాలనను తెలుగులో అందించలేక పోతున్నా మని ఆవేదన చెందారు.

ఉన్నతాధికారులు జిల్లా కార్యాలయాలలో నూటికి నూరు పాళ్ళు తెలుగు అమలులో శ్రద్ధ వహించి కట్టుదిట్టమైన ఏర్పాటు చేస్తామన్నారు.

అధికార భాషా సంఘం అధ్యక్షులు, సభ్యులు, తాము పర్యటించిన జిల్లాలలోని కొన్ని విషయాలు ముఖ్యమంత్రికి విన్నవించారు. ఇవేమి ముఖ్యమంత్రిని సంతృప్తి పరచక పోగా, సచివాలయం సంగతేమిటని నిలదీశారు.

తాము 1983 వ సంవత్సరంలో ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన వెంటనే సచివాలయంలో తెలుగును ప్రవేశపెడ్తూ ఉత్తరువులిచ్చామన్నారు, వీటిని అమలు పరచటంలో ఎవరూ పట్టించుకోలేదని విచారం వ్యక్తం చేశారు.

1988 ఏప్రిల్ 1 నాటికి సచివాలయంలో ఇంగ్లీషులో ఒక్క ఫైలు కూడా కనిపించకూడదని, తాను ఒక్క ఇంగ్లీషు ఫైలును కూడా చూడనని నిష్కర్షగా చెప్పారు.

ఈ సమావేశంలో అధికార భాషా సంఘం అధ్యక్షులు మరో నాలుగు రోజులలో రానున్న తెలుగు కొత్త సంవత్సరం (విభవ) అధికార భాషా సంవత్సరంగా ప్రభుత్వం ప్రకటించాలనే వినతి పత్రాన్ని ముఖ్యమంత్రికి సమర్పించారు.

**అధికార భాషా సంవత్సరం :**

పరిపాలనా రంగంలో తెలుగు అమలు ఒక ప్రజాస్వామిక వాఙ్మయ యజ్ఞం. ఇది ప్రజాస్వామ్య ప్రభుత్వం నిర్వహించాల్సిన పవిత్ర కర్తవ్యం. ఈ కర్తవ్య నిర్వహణకు దోహదం సమకూర్చి తెలుగు అమలుకు ముఖ్య కారకులైన వ్యక్తి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారక రామారావు.

1966వ సంవత్సరం మే 14 నుండి అమలులోకి వచ్చిన ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం తెలుగు భాషకు రాష్ట్ర అధికార భాషగా శాసన ప్రతిపత్తి కల్పించింది.

అప్పటినుంచి రాష్ట్రపాలనా యంత్రాగపు వివిధ స్థాయిలలో వివిధ వ్యవహారాలకు తెలుగును అమలు చేయాలన్న కృషికి నూతన స్ఫూర్తిని కలుగజేసి 1988వ సంవత్సరం ఒక విశిష్ఠ స్థానాన్ని సంతరించుకుంది.

1988 మార్చి 18వ తేదీన రాష్ట్ర కార్యాలయాన్నింటికి "విభవ తెలుగు సంవత్సరాన్ని ప్రభుత్వం అధికార భాషా సంవత్సరంగా ప్రకటిస్తూ ఉత్తర్వులు జారీ చేసింది.[24] (చూ. అను.12, 12A)

ఈ ఉత్తర్వులో ఏ రాష్ట్ర ప్రభుత్వం తలపెట్టని ఒక ఆసక్తికరమైన అంశం. "ఇంగ్లీషులో చేరిన ఏ ఉత్తరువు అయినా ప్రతిపాదననైనా, చర్యతీసుకోకుండా అవి పంపిన కార్యాలయానికి తిప్పి పంపే అధికారాన్ని" ప్రభుత్వం రాష్ట్రంలోని ప్రతి గెజిటెడ్ అధికారికి ఇచ్చింది.

ఈ విధంగా తిప్పి పంపడం వల్ల జరిగే నష్టానికి, ఆలస్యానికి బాధ్యత ఆ విధంగా ఇంగ్లీషులో పంపిన కార్యాలయానిదేనని ప్రభుత్వం స్పష్టం చేసింది.

మార్చి నెల ఉత్తరువులలో ఈ అంశం ప్రత్యేకంగా రాష్ట్రంలోను, రాష్ట్రం వెలుపల కొంత సంచలనం కలిగించింది.

"ఇంగ్లీషును ఒక తాపు తన్నిన ఆంధ్రప్రదేశ్" అంటూ వార్తను ది హిందూ" ఇంగ్లీషు దినపత్రిక సంచలనాత్మకంగా ప్రచురించింది.

హిందూస్థాన్ టైమ్స్ ఇంగ్లీషు దిన పత్రిక ఆంధ్రప్రదేశ్ భాషా విధానం మీద సంపాదకీయ విమర్శ చేసింది.

రాజస్థాన్, కర్నాటక ప్రభుత్వాలు ఈ చర్యను ప్రశంసిస్తు వివరాల కోసం రాష్ట్ర ప్రభుత్వానికి లేఖలు రాశాయి.

ప్రతినెల జిల్లా కలెక్టరు జిల్లాలోని 10 కార్యాలయాలను ఆకస్మిక తనఖీ చేసి తెలుగు అమలు గురించి సమీక్షించి ప్రభుత్వానికి నివేదికలు పంపాలని ఈ ఉత్తర్వులో ప్రభుత్వం పేర్కొంది.

అధికార భాషా అమలు విషయంలో ప్రభుత్వ ఉత్తరువులను ఏ స్థాయిలో పాటించక పోయినా ప్రభుత్వం దానిని తీవ్రమైన విషయంగా పరిగణిస్తుందని హెచ్చరిస్తూ పాలనా రంగంలో తెలుగు అమలును జయప్రదం చేసేందుకు అన్ని స్థాయిలలోను అధికారులు పూర్తి శ్రద్ధ వహించాలని ప్రభుత్వం ఆదేశించింది.

**ప్రభుత్వ వ్యూహం :** ఈ చారిత్రాత్మక మైన ఉత్తరువును జారీ చేయడంలో అధికార భాషా అమలుకు మొత్తం ప్రభుత్వ యంత్రాంగపు కృషిని ఏకోన్ముఖం చేయాలనేది ప్రభుత్వ ఆశయం

తెలుగు టైపురైటరు యంత్రాలు సమర్ధవంతంగా రూపుదిద్దుకొన్నాయి. రాష్ట్రం నలుమూలలా సుమారు 10,000 తెలుగు టైపురైటర్లు కార్యాలయాలకు పంపబడ్డాయి.

సర్వీసులో వున్న టైపిస్టులకు తెలుగు టైపు రైటింగులో పట్టుదలతో శిక్షణ నిర్వహించారు.

అన్ని కార్యాలయాల్లో ఉమ్మడిగా వాడుకోవడానికి తెలుగు అకాడమి "న్యాయ పరిపాలనా పదకోశం", అధికార భాషా సంఘం వారు "కార్యాలయ పదావళి" అన్న చిన్న పుస్తకాన్ని ప్రచురించి పంపిణీ చేశారు.

ఆయా శాఖలలో వాడే ప్రత్యేకమైన ఇంగ్లీషు పదాలకు తెలుగు సమానార్ధకాలను సూచిస్తూ సుమారు 50 శాఖా పదకోశాలు తయారు చేయించి ప్రభుత్వం ఆయా శాఖల సిబ్బందికి అందించింది.

కొత్త మార్పుకు అవసరమైన సన్నద్దత వున్నందువల్ల 1988 విభవ నామ సంవత్సరాన్ని అధికార భాషా సంవత్సరంగా పరిగణించి ఈ సంవత్సరంలో తమ ధ్యేయం నెరవేరాలన్నది ప్రభుత్వ ఆశయం.

**న్యాయస్థానాల్లో తెలుగు :** జిల్లా కోర్టుల స్థాయి వరకు తెలుగును వెంటనే ప్రవేశ పెట్టాలని ముఖ్యమంత్రి రామారావు గారు అభిప్రాయపడి హైకోర్టు అధికారులతో ప్రాధమిక చర్చలు జరిపి ఒక నివేదికను సమర్పించమని న్యాయశాఖ కార్యదర్శిని ఆదేశించారు.

**తెలుగు అధికార భాషా అమలులో 1988 సంవత్సరం సాధించిన మరికొన్ని విజయాలు :**

అధికార భాషా రంగంలో 1988వ సంవత్సరం మరికొన్ని విజయాలను సాధించింది

**తెలుగు టైపులో శిక్షణ :** 1. 1988 మార్చి నెలాఖరుకు తెలుగు టైపురైటింగు శిక్షణ ముగిసిన వెంటనే హైద్రాబాద్‌లో తెలుగు షార్ట్‌హ్యాండ్ శిక్షణా పథకం ప్రారంభమైంది.

2. గతంలో 10 మంది కూడా లేని తెలుగు స్టెనోల సంఖ్య 1988వ సంవత్సరంలో 150కి పెరిగి మరో 60 మందికి శిక్షణ ప్రారంభమైంది.

**మీటల ఫలక రూప కల్పన :** ప్రభుత్వ ముద్రణా శాఖకు అనుబంధంగా వున్న అధికారా భాషా విభాగపు ఆధ్వర్యంలో పనిచేసే "తెలుగు పరిశోధనా విభాగం" తెలుగు, ఇంగ్లీషు రెండు భాషలకు పనికి వచ్చే విద్యుత్‌ప్రేరక మీటల ఫలకం (బైలింగ్వల్ ఎలక్ట్రానిక్ కీ బోర్డు)ను రూపొందించింది.

ఇది కేవలం యాంత్రికంగా గాక శబ్దాను గుణంగా (ఫోనోటికల్) రూపొందింది.

596 రూపాలున్న తెలుగు లిపిని, 52 రూపాలన్న ఇంగ్లీషు లిపిని ఈ మీటల ఫలకలో ఒద్దిగించారు.

**ఉద్యోగులకు ప్రోత్సాహకాలు :**

"విద్యుత్ ప్రేరక మీటల ఫలక" విజయానికి, టైపురైటింగ్ శిక్షణ పథక విజయానికి కారకులైన 19 మంది ఉద్యోగులకు ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవమైన నవంబర్ 1న ముఖ్యమంత్రి పోత్సహకాలను అందించారు. (చూ. అను.13)

ఒకే అంశంలో ప్రభుత్వం ఇన్ని ప్రోత్సహాకాలను ఒకేసారిగా ఇవ్వడం ఆంధ్రరాష్ట్ర పాలనా చరిత్రలో పేర్కొన దగిన విశిష్టాంశం. అన్ని ప్రభుత్వ కార్యాలయాలకు తెలుగు ఇంగ్లీషు భాషల విద్యుత్ ప్రేరక పరికరాలు సరఫరాచేస్తూ ప్రభుత్వం జి.వో. మిస్ నెం. 299. 23-3-1988న జారీ చేసింది.(చూ. అను.14)

**తెలుగు పేర్లు :** సచివాలయ ప్రాంగణంలోని వివిధ భవనాలకు ఎ.బి.సి.డి. మొదలైన పేర్ల స్థానాల్లో సమత, సుజల, స్రవంతి, సంక్షేమ, సర్వహిత, సంప్రీతి, సుబోధ, సుగమ, సురక్ష వంటి ముచ్చటైన పేర్లు వచ్చాయి.

**డైరీలు :** కేవలం ఇంగ్లీషులో ముద్రణ అవుతున్న ప్రభుత్వ డైరీలు 1989వ సంవత్సరంలో తెలుగు, ఇంగ్లీషు రెండు భాషలలో వెలువడ్డాయి.

**ఆఖరు నోటిఫికేషను :** రాష్ట్ర ప్రభుత్వ కార్యాలయాల్లో తెలుగు అమలు గురించి ఆఖరుది అని చెప్పదగ్గ ఒక చట్టపరమైన నోటిఫికేషనును 1988 అక్టోబరు 28న ప్రభుత్వం జారీ చేసింది.

ఇది 1988 నవంబరు 1 నుండి అమలులోకి వచ్చింది. దీని ననుసరించి అన్ని ప్రభుత్వ ఉత్తరువుల జారీకి ఉత్తర, ప్రత్యుత్తరాలకు తెలుగు భాషను వాడాలి. ఇంగ్లీషును వాడకూడదు. తెలుగుకు అదనంగా రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో ఆయా మైనార్టీ భాషల వాడకానికి ఈ ఉత్తరువు భంగకరం కాదని ప్రభుత్వం ప్రకటించింది. (చూ. అను.15)

అంతేకాక కొన్ని ప్రత్యేక పరిస్థితులలో ఇంగ్లీషు వాడకాన్ని ప్రభుత్వం అనుమతించింది. అవి.

1. భారత ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు,
2. ఇతర ప్రభుత్వాలతో ఉత్తర ప్రత్యుత్తరాలు
3. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం వెలుపల గల ఆంధ్రేతర చిరునామా దారులతో జరిపే ఉత్తర ప్రత్యుత్తరాలు.

శాసనపరమైన అంశాలకు తెలుగును వాడాలనేది ఈ ప్రకటన ముఖ్య ఆశయం.

**అధికార భాషా సంఘం పర్యటనలు :**

1988 సంవత్సరాంతానికి నండూరి రామకృష్ణమాచార్యులు అధ్యక్షులుగా వున్న అధికార భాషా సంఘం 21 జిల్లాలలో పర్యటించింది.

ఒక్కో జిల్లాలో 3, 4 రోజులు చిన్న, పెద్ద కార్యాలయాలను తనిఖీ చేయడం, చివరి రోజు కలెక్టర్ గారి అధ్యక్షతన గెజిటెడ్ అధికారులతో తెలుగు అమలు గురించి సమీక్షించటం, తెలుగు భాషా అమలుకు కట్టుదిట్టమైన చర్యలు తీసుకోమని హెచ్చరించింది.

**తెలుగు భాషకున్న సమస్య :** కార్యాలయాధికారులకు ఫైళ్ళలో, ఉత్తర ప్రత్యుత్తరాలలో ఎలాంటి తెలుగు రాయాలో (ప్రాంతాల వారీగా ఉద్యోగులుండటం, ప్రాంతీయ భాష వత్యాసం) అనేది ఒక సమస్య అని భాషా సంఘాధికారులకు రాష్ట్ర పర్యటనలో తేలింది.

అందుచేత గతంలో సచివాలయ ఉద్యోగులతో జరిపిన గోష్ఠులలో అధికార భాష సంఘాధ్యక్షులు, కార్యదర్శులు ఉపయోగించిన భాషాపరమైన సూత్రాలను ప్రభుత్వం కొత్తగా ఇచ్చిన ఆదేశాలలో చేర్చటం ఒక విశేషం.

ప్రభుత్వ శాఖలలో ఎలాటి తెలుగు వాడాలో మార్గదర్శకంగా ఆరు సూత్రాలను ప్రభుత్వం ఆదేశాల ద్వారా ప్రచారం చేసింది.

**ప్రభుత్వ యంత్రాంగం వాడవలసిన తెలుగు ఒరవడికి ఆరు సూత్రాలు :**

1. ఫైళ్ళలో మాట్లాడే భాష రాయాలి. ప్రజలకు అర్థం కావడమే పరిపాలనా భాష ప్రథమ ప్రయోజనం.
2. తెలుగులో అనుకొని, తెలుగులో రాయాలి. ఇంగ్లీషులో ఉన్న పూర్వ దృష్టాంతపు కాగితాలను మార్గదర్శకంగా ముందుంచుకోవాలి. కాని వాటిని అనువాదం చేయరాదు.
3. ఫైళ్ళు రాస్తున్నపుడు తెలుగు పదం వెంటనే స్ఫురించనపుడు ఇంగ్లీషు మాటను తెలుగు లిపిలో రాయవచ్చు.
4. ఒక ఇంగ్లీషు మాటకు మన పదకోశాలలో తెలుగు మాట లభించనపుడు దానికి సరైన అనువాదం అనుకొని మనం ఒక తెలుగుమాట రాసినపుడు ఆ ఇంగ్లీషు మాటను బ్రాకెట్లలో చూపించాలి.
5. అధికార భాషా విభాగం బయటపెడుతున్న సమాచారాన్ని ఎప్పటికప్పుడు (కార్యాలయ సిబ్బంది, అధికారులు) తెలుసుకోవాలి.
6. ప్రతి ఉద్యోగి తెలుగు దిన పత్రిక చదవటం అలవాటు చేసుకోవాలి. దీనివలన అన్ని సమస్యలకు పరిష్కారం దొరుకుతుంది.

**జిల్లా, డివిజను, మండల స్థాయి కార్యాలయాలలో తెలుగు అమలు :**

మండల, డివిజను, జిల్లాస్థాయి కార్యాలయాలలో తెలుగు భాషా అమలును పరిశీలించటానికి 1993వ సంవత్సరంలో అధికార భాషా సంఘం అధ్యక్షులు వివిధ జిల్లాలను పర్యటించి 1993 జూన్ నుండి 1994 ఫిబ్రవరి వరకు 20 జిల్లాస్థాయి సమావేశాలను. 32 డివిజన్ స్థాయి సమావేశాలను జరిపారు.

సమావేశాలనంతరం 279 కార్యాలయాలను సందర్శించి వాటిలో తెలుగు అమలును పరిశీలించి తెలుగు భాషా అమలు అభివృద్ధికి తీసుకొనవలసిన చర్యలను సూచించింది.

1993వ సంవత్సరంలో జిల్లాస్థాయి కార్యాలయాలలో తెలుగును అమలు పరచిన శాతం ఈ విధంగా వుంది.

## జిల్లాలలో నెలల వారి నివేదికల శాతం (1993)

| క్రమ సంఖ్య | జిల్లాపేరు | జనవరి | ఫిబ్రవరి | మార్చి | ఏప్రిల్ | మే | జూన్ | జులై | ఆగస్టు | సెప్టెంబరు | అక్టోబరు | నవంబరు | డిసెంబరు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | మెదక్ | 76 | - | 64 | - | - | 64 | 63 | 63 | 62 | - | - | 64 |
| 2. | వరంగల్ | 63 | - | 65 | 67 | 68 | - | - | 65 | 63 | 57 | 69 | 79 |
| 3. | ఖమ్మం | 52 | 54 | 60 | 51 | 61 | 52 | 65 | - | 57 | 63 | 60 | 60 |
| 4. | అదిలాబాదు | 45 | - | 35 | 47 | 55 | 51 | 55 | 47 | 47 | - | - | - |
| 5. | కరీంనగర్ | 63 | 65 | 69 | 63 | 63 | - | 68 | 68 | 50 | 72 | - | 68 |
| 6. | రంగారెడ్డి | 50 | 60 | - | 60 | 50 | 55 | 60 | 60 | 60 | - | - | - |
| 7. | నిజామాబాద్ | 57 | 48 | 46 | 48 | 68 | 46 | - | - | - | 40 | - | 40 |
| 8. | నల్గొండ | 79 | 77 | 80 | 75 | 79 | - | 86 | - | 87 | 82 | 81 | 77 |
| 9. | మహబూబ్ నగర్ | - | 47 | - | - | 40 | - | 52 | 53 | 66 | 40 | 67 | - |
| 10. | కృష్ణా | 73 | - | 78 | 74 | 76 | 69 | 79 | 72 | 72 | 88 | 70 | 76 |
| 11. | గుంటూరు | 51 | 58 | 81 | - | 90 | 16 | 19 | 12 | 70 | 66 | 59 | 73 |
| 12. | తూర్పు గోదావరి (కాకినాడ) | - | 84 | - | - | 78 | - | 71 | 68 | 78 | - | 10 | 77 |
| 13. | పశ్చిమ గోదావరి | 73 | 71 | 72 | 69 | 65 | 70 | 70 | - | 74 | 72 | 84 | 74 |
| 14. | విజయనగరం | 70 | 70 | 65 | 60 | - | 70 | 60 | - | 60 | - | - | - |
| 15. | విశాఖపట్నం | - | - | 55 | - | 60 | 50 | - | 68 | - | 68 | 67 | - |
| 16. | నెల్లూరు | 54 | 50 | 71 | 59 | 64 | 58 | 58 | 61 | 51 | - | 52 | 63 |
| 17. | కర్నూలు | 67 | 59 | 54 | 49 | 57 | 51 | 58 | 58 | 63 | 59 | 65 | 60 |
| 18. | ప్రకాశం | 31 | 31 | 37 | 33 | 36 | - | 45 | 32 | 40 | - | 72 | 67 |
| 19. | అనంతపురం | 50 | 60 | 50 | 60 | 55 | 50 | 65 | 50 | - | - | - | - |
| 20. | చిత్తూరు | 70 | 72 | 66 | 63 | 39 | 62 | 69 | 62 | - | 72 | 54 | - |
| 21. | కడప | 55 | - | - | 55 | - | 40 | 40 | 40 | 45 | 40 | - | - |
| 22. | శ్రీకాకుళం | 72 | 81 | 77 | 73 | 74 | - | 75 | 76 | 72 | 78 | 80 | 80 |

**కార్యాలయాల తనిఖీ :** అధికార భాషా సంఘం అధ్యక్షులు వివిధ కార్యాలయాలను తనిఖీ చేశారు. అధికార భాషగా తెలుగు అమలును గురించి ఈ కార్యాలయాల సిబ్బంది. ముఖ్య కార్యదర్శులతో సమావేశాలు జరిపి తెలుగును అధికార భాషగా అమలు చేయటంలో సహకరించాలని, పటిష్ఠమైన చర్యలు తీసుకొని తెలుగును అమలు పరచాలని ఉద్బోధించారు.

**పదకోశాలు :** తెలుగులో పరిపాలన నిర్వహించేందుకు అవసరమైన సాధనాలలో పదకోశాలు ముఖ్యమైనవి. అధికార భాషా కమిషన్ ఆధ్వర్యంలో ఈ పదకోశాలు రూపొందించబడుతున్నాయి.

ఈ పదకోశాలు అన్ని కార్యాలయాలలోను తెలుగును సమర్థవంతంగా ఉపయోగించటానికి దోహదపడతాయి.

రాష్ట్ర సచివాలయంలోని అధికార భాషా విభాగం నుండి సేకరించిన పదకోశాల వివరాలు.

పశు సంవర్ధక శాఖ పదకోశం; ఓడరేవుల శాఖ పదకోశం; దేశీయ వైద్య - హోమియోపతి శాఖ పదకోశం; ట్రెజరీలు - అకౌంట్లశాఖ పదకోశం; జాగీర్లు నిర్వహణ శాఖ పదకోశం; అగ్నిమాపక శాఖ పదకోశం; భూగర్భ జల శాఖ పదకోశం; మత్స్యశాఖ పదకోశం; దేవాదాయ - ధర్మాదాయ శాక పదకోశం; ఉపాధి కల్పన శిక్షణ శాఖ పదకోశం; మెకానికల్ శాఖ పదకోశం; అటవీశాఖ పదకోశం; అవినీతి నిరోధక శాఖ పదకోశం; పురపాలక శాఖ పదకోశం; సాగునీటి శాఖ పదకోశం; ఆబ్కారీ శాఖ పదకోశం; పర్యటన శాఖ పదకోశం; జైళ్ళ శాఖ పదకోశం; స్త్రీ, శిశు సంక్షేమ శాఖ పదికోశం; మార్కెటింగ్ శాఖ పదకోశం; తూనికలు, కొలతల శాఖ పదకోశం; రిజిస్ట్రేషన్, స్టాంపుల శాఖ పదకోశం; అర్థ గణాంక శాఖ పదకోశం; ప్రభుత్వ భీమా శాఖ పదకోశం; సాంకేతిక విద్యాశాఖ పదకోశం; పురావస్తు శాఖ పదకోశం; కర్మాగారాల శాఖ పదకోశం; రవాణా శాఖ పదకోశం; ముద్రణ, స్టేషనరీ, సామాగ్రి కొనుగోలు శాఖ పదకోశం; పోలీస్ శాఖ

**అధికార భాషా సంఘం అధ్యక్షులు :**

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య | 1974 నుండి 1976 |
| 2. | శ్రీమతి అనసూయమ్మ గారు | 1976 నుండి 1977 |
| 3. | వందేమాతరం రామ చంద్రరావు గారు | 1978 నుండి 1981 |
| 4. | డా॥ సి. నారాయణ రెడ్డి గారు | 1981 నుండి 1985 |
| 5. | ఆచార్యకొత్తపల్లి వీర భద్రరావు గారు | 1985 నుండి 1986 |
| 6. | నండూరి రామకృష్ణమాచార్యులు గారు | 1987 నుండి 1990 |
| 7. | శ్రీమతి యశోదా రెడ్డి గారు | 1990 నుండి 1993 |
| 8. | అబ్బూరి వరదరాజేశ్వర రావు గారు | 1993 మార్చి 17 |
| 9. | గజ్జెల మల్లారెడ్డి గారు | 1993 మే 17 |
| 10. | తూమాటి దొణప్ప గారు | 1995 జులై మొదటి వారం |
| 11. | మాడుగుల నాగఫణి శర్మ | 1999 మే 5 నుండి (25) |

ఇటీవల అధికార భాషా సంఘం అధ్యక్షులుగా నియమితులైన శ్రీ మాడుగుల నాగఫణి శర్మ తెలుగు ఆశించిన స్థాయిలో అన్ని రంగాలలో అమలు జరగటం లేదని, తెలుగు కంప్యూటర్లు అందుబాటులో ఉండి అన్ని కార్యాలయాలకు ప్రభుత్వం వాటిని సరఫరా చేయగలిగితే వాటి ఉపయోగం ద్వారా తెలుగును అంతర్జాతీయ స్థాయికి తీసుకెళ్ళవచ్చని అభిప్రాయపడ్డారు.

తెలుగు భాషా నిష్ణాతులతో జిల్లాస్థాయి కమిటీలను ఏర్పాటుచేసి తెలుగు అమలుకు కృషి చేయాలని భావిస్తున్నట్లు తెలిపారు. ప్రభుత్వం జారీచేసే జి.వోలు ఉత్తర్వులు తెలుగులో జారీ అయి అన్ని శాఖల పదకోశాలు తెలుగులో ముద్రించబడి ప్రజలకు, కార్యాలయాలకు అందుబాటులో వుంటే తెలుగు తప్పక అభివృద్ధి అవుతుందన్నారు.

మే 30, 1999న హైద్రాబాదులో జరిగిన నంది అవార్డుల పురస్కార సభలో శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య మాట్లాడుతూ ప్రభుత్వం కృషి. ప్రజల తోడ్పాటుతో తెలుగు పూర్తిగా అమలు జరిగితే తనకు పురస్కారం వచ్చినందుకు సార్థకం వుంటుందని, ప్రస్తుత ప్రభుత్వం కృషి చేయటం లేదని తెలుగు అధికార భాషగా చేయటానికి ప్రభుత్వం చిత్తశుద్ధితో కృషి చేయాలని అభ్యర్థించారు.

అధికార భాషా సంఘం ప్రథమ అధ్యక్షులుగా శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య అధికారభాష అమలుకు కృషి సల్పారు. ఆ తర్వాత అధ్యక్షులు కూడా తమవంతు బాధ్యతను నిర్వర్తించినా తెలుగు సమగ్రంగా అన్ని స్థాయిల్లో అమలు అందని మాని పండు.

## సూచికలు


1. ఆంధ్రులు వెనుక బడిన వారా? ది హిందూ (మద్రాసు) 15-4-1911
2. దేశమాత 9 అక్టోబర్ 1912
3. విశ్వామిత్ర రాసిన లేఖ ది హిందూ 29 ఆగష్టు 1912
4. శ్రీ యన్. సుబ్బారావు రాసిన లేఖ ది హిందూ 4 ఫిబ్రవరి 1913
5. ది హిందూ (మద్రాసు) 1916 మే 11
6. ది హిందూ (మద్రాసు) 1917 జూలై 2
7. మద్రాసు శాసన మండలి చర్చా కార్యక్రమాలు రెండవ సంపుటి పు. 713 - 737
8. పైదే పు. 713-737
9. రాజ్యాంగ నిర్మాణ సభ తయారు చేసిన ముసాయిదా రాజ్యాంగం. న్యూఢిల్లీ, 1948 పు. XI పు. 159
10. భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుకై రిపోర్టు న్యూఢిల్లీ 1948 పు.2
11. పైదే పు. 152 (1)
12. హిస్టరీ ఆఫ్ రెడ్డి కింగ్‌డమ్స్, మల్లంపల్లి సోమశేఖర శర్మ పు. 492 - 93
13. సురవరం ప్రతాపరెడ్డి గారి ఆంధ్రుల సాంఘిక చరిత్ర పు. 352-355
14. ప్రాచీనాంధ్ర శాసనాలు బూదరాజు రాధాకృష్ణ 1917 పు. VI, VII
15. తెలుగు అధికార భాష-ప్రాంతీయ మహాసభలు (కర్నూలు - ఏలూరు) సంచిక. పు. 63

16. పైదే పు. 63

17. పైదే పు. 63

18. పైదే పు. 63

19. పైదే పు. 63

20. పైదే పు. 63

21. పైదే పు. 63

22. పైదే పు. 63

23. అధికార భాషా కమిషన్ మధ్యకాలిక నివేదిక 1975 పు. 6

24. అధికార భాష తీరుతెన్నులు సి. ధర్మారావు పు. 7

25. సుప్రభాత పక్ష పత్రిక సెప్టెంబరు 1975 పు. 5 - 20

ఆంధ్రప్రదేశ్‌లో పరిపాలన, న్యాయబోధనా రంగంలో తెలుగు అమలు తీరుతెన్నులను సమీక్షించటం ఈ అధ్యాయాంశం.

## 4.1 పరిపాలనా రంగంలో తెలుగు :

పరిపాలనా భాష అంటే ప్రభుత్వ వ్యవహారాలకు శాసనాల న్యాయ విషయాలు, పరిపాలనా మొదలైన కార్యక్రమాలన్నింటికీ ఉపయోగించే భాష, దీనినే అధికార భాష అనవచ్చు. కాని ఈ రెండింటికి స్వల్ప తేడా వుంది. ఉదా: 1966 లో తెలుగును అధికార భాషగా అమలుపరుస్తూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చట్టం చేసినప్పటికి కొన్ని పరిస్థితులలో, కొన్ని ప్రాంతాలలో పరిపాలనా సౌలభ్యం కోసం అక్కడి ప్రాంతీయ భాషలైనటువంటి కన్నడం, తమిళం, ఒరియా, ఇంగ్లీషు ఉర్దూ ఉపయోగంచవచ్చని తెలిపింది.[1]

అంటే అధికార భాష తెలుగు అయినప్పటికి పరిపాలనా సౌలభ్యం కోసం కొన్ని భాషలను పరిపాలనా భాషలుగా నిర్ణయించింది.

చరిత్రను పరిశీలిస్తే ఆయా కాలాలలో కూడా పరిపాలన, రాజభాషలుగా వేర్వేరు భాషలు చెలామణి అయ్యాయి.

| | అధికారభాష | పరిపాలనా భాష |
|---|---|---|
| అశోకుని కాలంలో | ప్రాకృతం | గ్రీకు, సంస్కృతం |
| మౌర్యులు | మగధి | ప్రాకృతం, సంస్కృతం |
| కాదంబులు | సంస్కృతం | ప్రాకృతం |
| టిప్పుసుల్తాన్, హైదర్అలీఖాన్ | పర్షియన్, కన్నడ, | దన్నిభాష |
| మొగలులు | పర్షియన్, ఉర్దూ | హిందీ, సంస్కృతం. |
| బ్రిటిష్ | ఇంగ్లీషు | కొన్ని భారతీయ భాషలు |

ఈ విధంగా భారతదేశంలో వివిధ కాలాలలో వివిధ భాషలు పరిపాలనా భాషలుగా ఉపయోగించ బడినాయి. ఒకే భాష పూర్తిగా పరిపాలనా రంగంలో ఉపయోగించబడిందనేందుకు ఆధారాలు లేవు. ప్రతి చోట దాదాపు అధికార భాషతో పాటు పరిపాలనా భాషలుగా వేర్వేరు భాషలు అమలులో ఉండేవి.[2]

భారత రాజ్యాంగం కూడా కేంద్రం, రాష్ట్రాలకు ఒకటి కన్న ఎక్కువ భాషలను పరిపాలనలో ఉపయోగించుకొనే అవకాశం కల్పించింది.[3]

1947లో స్వాతంత్ర్యం వచ్చినా పాలనా వ్యవహారంలో ప్రాంతీయ భాషల వాడుకకు అవసరమైన తోడ్పాటు లభించలేదు. ఇందుకనేక కారణాలున్నాయి. ఈ విషయం ప్రస్తావిస్తూ **Sri Gopal Rao Ekbote** ఇలా అన్నారు. **"India even today, is seriously lacking in forging a linguistie unity which is so vital for its free people"**.[4] అయితే ఈ విషయంలో తెలుగువారు తమ చొరవను ప్రదర్శించారు.

**ఆంధ్రప్రదేశ్‌లో పరిపాలనా భాషగా తెలుగు :** 1946-47లో తూర్పు గోదావరి జిల్లాలో, 1950-52లో తెలంగాణా తూర్పు ప్రాంతంలో తెలుగును తాలూకా స్థాయిలో పరిపాలనలో ప్రవేశ పెట్టేందుకు కొంత ప్రయత్నం జరిగింది.

1948వ సంవత్సరంలో తూర్పు గోదావరి జిల్లాలో తెలుగును పరిపాలనా భాషగా ప్రభుత్వం ప్రవేశ పెట్టింది.

1950-51లో హైద్రాబాద్ రాష్ట్రం (నైజాం)లో జిల్లా, తాలూకాలలో రెండో స్థాయి కార్యాలయాలలో, వీలైనంత వరకు ఉత్తర ప్రత్యుత్తరాలు తెలుగులోనే జరగాలని ఆదేశించారు. 1959లో శ్రీ.పి.సి. జేమ్స్ ఐ.ఏ.యస్.ను తూర్పు గోదావరి జిల్లాలలో, తెలంగాణా జిల్లాల్లో అమలులో వున్న ప్రణాళికలను పరిశీలించేందుకు ప్రత్యేక అధికారిగా ప్రభుత్వం నియమించింది.

తెలుగు జిల్లా, తాలూకా స్థాయిలో అమలు జరగటం లేదని, తెలుగు టైపు రైటర్లు లేకపోవటం, తెలుగులో పదకోశాల కొరత. తెలుగు భాషా అమలుకు అవరోధాలుగా వున్నాయని, ఈ స్థాయిలో తెలుగును అమలు పరచటానికి తగిన సమయం కాదని తాలూకా కింది స్థాయిలో, మొదట ఆంధ్రా జిల్లాలలో వాటి పక్కనున్న మూడు తెలంగాణా జిల్లాల్లో (వరంగల్, ఖమ్మం, నల్గొండ) ప్రవేశపెట్టాలని సూచించారు. ఇది పది శాఖలకు మాత్రమే పరిమితం కావాలన్నారు.

| | | |
|---|---|---|
| అవి : | రెవెన్యూ కార్యాలయం; | విద్యాశాఖ; |
| | నీటిపారుదలశాఖ; | పంచాయితీరాజ్ శాఖ; |
| | వ్యవసాయ శాఖ; | గ్రామ పంచాయితి; |
| | పశు సంవర్థక శాఖ; | జిల్లా పంచాయితి; |
| | దేవాదాయ, ధర్మాదాయశాఖ; | పంచాయితీ సమితులు; |

ప్రభుత్వం ఈ సిఫారసును అంగీకరించి అమలు చేయటానికి 25 జనవరి 1960న జి.ఓ.నెం. 141ని జారీ చేసింది.

ఆధునిక యుగంలో వైజ్ఞానిక విప్లవం, సాంఘిక, రాజకీయ పరిణామాలు ప్రజలకర్థమై తాము అనుకున్న పరిణామాలను సాధించుకోవాలంటే వారిని పరిపాలనలో భాగస్వాములను చేయాలి. దానికి ఒక్కటే మార్గం. వారిభాషలో పరిపాలన నందించటం పరిపాలన మాతృభాషలో సాగాలంటే విద్యాబోధన కూడా మాతృభాషలో జరిగినప్పుడే పరిపాలనకు కావలసిన సిబ్బంది, పారిభాషిక పదాలు, అలవాట్లు, అవసరాలు తీర్చుకొనే అవకాశం ఉంటుంది.

ఆ ఆశయంతోనే 1924లో ఏర్పడ్డ ఆంధ్ర విశ్వకళా పరిషత్తు శాసనంలో బోధన, పరీక్షలు తెలుగులో జరగవలెనని నిర్ధేశించింది. ప్రజాపాలన ప్రజల భాషలోనే జరగాలనే వాదన పుట్టినప్పటి నుంచి ప్రాంతీయ భాషలను కూడా అభివృద్ధి పరచాలనే సంకల్పం బలపడుతూ వచ్చింది.

ప్రజాస్వామ్యంలో ప్రజలే పాలకులు. వారి భాషే పరిపాలన భాష, పరభాషలో పరిపాలన సాగిస్తే అది ప్రజాస్వామ్యానికి విరుద్ధం. ప్రజలు ఒకరికొకరు సంబంధం లేని వర్గాలుగా ఉండిపోతారు.

ప్రజలకు రాజ్యాంగబద్దమైన, చట్టబద్దమైన తమ హక్కులేవో, బాధ్యతలేవో తెలుసుకోవడానికి ఆ చట్టాలు తమ భాషలో లేకపోవడం అవరోధంగా వుంటుంది. ఈ విషయాన్ని మహాత్మాగాంధిగారు అనేక పర్యాయాలు బోధించారు.

గాంధీగారి నిర్యాణం తర్వాత భాషా ఉద్యమం సాగుతూనే ఉంది ఆంధ్రులు భాషా ప్రయుక్త రాష్ట్రాలు కావాలని ఆందోళన చేశారు. స్వాతంత్ర్యానంతరం ఏర్పడిన భాషా రాష్ట్ర నిర్మాణంలో ఆంధ్రరాష్ట్రం ప్రధమంగా నిలిచింది.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తర్వాత ఆయా ప్రాంతాలలో ఆయా భాషలు పరిపాలన భాషలుగా. న్యాయస్థాన భాషలుగా, బోధన మాధ్యమాలుగా రూపొందే ప్రయత్నాలు జరిగాయి.

అయినప్పటికి మన రాష్ట్రంలో తెలుగు భాషకు అధికారహోదా కలగలేదు. ఆ తర్వాత ప్రభుత్వం అధికార భాషా సమీక్షా సంఘాన్ని ఏర్పాటు చేసింది. ఆ సంఘం చేసిన సిఫారసులు అమలు పరచటంలో ప్రభుత్వం విఫలమైంది.

తాలూకా స్థాయి వరకు పరిపాలనా విషయాలలో తెలుగునే ఉపయోగించాలని ఉత్తర్వులు వెలువడినా వాటిని అమలు పరచటం జరగలేదు.

పరిపాలనా రంగంలో మాతృభాష అధికార భాషగా చేసిన ఘనత తమిళనాడుకే దక్కింది . బస్సుల పేర్ల నుంచి రాష్ట్రం పేరు వరకు మాతృభాషలోకి మార్చివేశారు.

ఆ తర్వాత మన రాష్ట్ర మంత్రివర్గం తెలుగుభాషను శాసన సభ చర్చలలోనూ, ప్రభుత్వంలోనూ ప్రవేశపెట్టాలని తీర్మానించింది.

1966వ సంవత్సరంలో తెలుగును అధికార భాషగా ప్రకటించటం జరిగింది.

1974వ సంవత్సరంలో వెంగళరావు ప్రభుత్వం ఉగాది నాడు తాలూకాస్థాయిలో తెలుగును అధికార భాషగా నిర్ణయించి దీని అమలు పరిశీలనకు శ్రీవావిలాల గోపాల కృష్ణయ్య అధ్యక్షతన ఒక కమీషన్ను నియమించింది.

1976 ఉగాది నుండి జిల్లాస్థాయికి తెలుగు పరిపాలనా భాషగా అమలుచేస్తూ వుత్తర్వులు జారీచేశారు. ప్రభుత్వ ఉద్యోగాలలో, రాష్ట్ర పబ్లిక్ సర్వీసు కమీషను పరీక్షలలో తెలుగు బోధనాభాషగా చదివిన వారికి ప్రతి అంశానికి ఐదు మార్కులు అదనంగా కలుపుతామని ప్రభుత్వం ప్రకటించింది. (చూ. అను.16)

తాలూకా, జిల్లాస్థాయిలో తెలుగు అమలు జరపటంతో పాటు విద్యాశాఖ, అధికార భాషాశాఖలోని రాష్ట్ర స్థాయిలో తెలుగు అమలుకు ఉత్తర్వులు జారీ చేశారు.

శ్రీ వందేమాతరం రామచంద్రరావు గారు తెలుగు అధికార భాషా సంఘం అధ్యక్షులుగా వున్న సమయంలో (1978-81) తెలుగు అధికార భాషగా ముఖ్యంగా కలక్టరేట్ స్థాయి వరకు బాగా అమలు జరిగింది. దానిని సచివాలయ స్థాయి వరకు అమలుకు ప్రయత్నాలు జరిగాయి.

అధికార బాషా సంఘం అధ్యక్షులుగా డా. సి. నారాయణరెడ్డిగారి కాలంలో(1981-85)సచివాలయ స్థాయిలో తెలుగు అమలు జరపడానికి కృషి జరిగింది. దానికి సంబంధించిన ఉత్తర్వులు కూడా జారీ అయినాయి.

అధికార భాషా సంఘం ఏర్పడి దశాబ్దం పూర్తయిన తర్వాత 1984లో అధికాం భాషా సంఘ అధ్యక్షులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, డా. సి. నారాయణరెడ్డి. శ్రీ వందేమాతరం రామచంద్రరావు గార్లు పరిపాలన భాషగా తెలుగును అమలు పరచటంలో కలిగిన సమస్యలను క్రోడీకరిస్తూ ఈ విధంగా స్పందించటం జరిగింది.

**విషయం :** పరిపాలన భాషగా తెలుగు అమలులో ఎదురయ్యే అవరోధాలు ప్రభుత్వ పరంగా లేక ప్రజల పరంగానా?

**స్పందన :** i) ప్రభుత్వ పరంగానే ఎక్కువ అని, తెలుగు తమ జీవితాలకు ఎక్కువ ఉపయాగ పడదేమోనని ప్రజలు ఒకప్పుడు చలించేవారని కాని ఇప్పుడు వారే తెలుగు అమలుపట్ల శ్రద్ధ కనపరుస్తున్నారని శ్రీవావిలాల తెలిపారు.

ii) ప్రభుత్వపరంగా ప్రయత్నాలు సంతృప్తిగా లేవని శ్రీ వందేమాతరం రామచంద్రరావు అభిప్రాయపడ్డారు.

iii) ప్రజల పరంగా అవరోధం లేదని, ఎవరైనా అధికారులు తెలుగు ఉపయోగించక పోతే ప్రజలే ఫిర్యాదు చేస్తున్నారని శ్రీ డా. సి. నారాయణరెడ్డి స్పందించారు.

**విషయం :** అధికార భాషా చట్టంలో మార్పులేమైనా అవసరమా :

**స్పందన :** i) ప్రత్యేకించి మార్పులేమి అవసరం లేదని డా..సి. నారాయణ రెడ్డి

ii) "రాజ్యాంగంలో భాషలకు సంబంధించిన అనుసూచిక వుంది దానిలో మార్పు అవసరం" అని వందేమాతరం రామచంద్రరావు.

iii) అవసరమైన మార్పులు చేయాలి అని శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య అభిప్రాయ పడ్డారు.

**విషయం :** పరిపాలన భాషగా తెలుగు అమలుకు తీసుకొన్న చర్యలు:-

**స్పందన :** i) తను అధ్యక్షునిగా వున్నపుడు ప్రభుత్వధికారులంతా తెలుగు రాసేలా చర్య తీసుకొని తెలుగు అమలు పరచని అధికార్లను సస్పెండ్ చేయడం జరిగిందని శ్రీ వందేమాతరం రామచంద్రరావు తెలిపారు.

ii) ఇతర భాషా కలెక్టర్లు వున్నప్పటికి తెలుగు నేర్చుకున్నారని, తనతో ఉత్తర ప్రత్యుత్తరాలన్ని తెలుగులో జరిపేవారు, మళ్ళీ కింది అధికారులంతా తెలుగు అమలుకు కృషిచేశారని శ్రీవావిలాల గోపాల కృష్ణయ్య తెలిపారు.

iv) పారిభాషిక పదకోశాలు 31వరకు తయారయ్యాయని, ప్రతి జిల్లా నుంచి ముగ్గురు అధికారులను తీసుకొని జి.ఓ.లు, ప్రభుత్వ లేఖలు, వ్యవహారాలు తెలుగులో జరిపేందుకు వారికి ఆరు రోజుల పాటు అధ్యయన తరగతులు జరిపించామని శ్రీ సి. నారాయణరెడ్డి తెలిపారు.

**తెలుగు సదస్సు సూచనలు :**

పరిపాలనా భాషగా తెలుగుకు ఉండవలసిన స్థానం చర్చించటానికి ఉస్మానియా విశ్వవిద్యాలయ రజతోత్సవం సందర్భంగా ఏర్పాటు చేసి తెలుగు సదస్సులో కొన్ని సూచనలు చేయటం జరిగింది.

**అవి :** గ్రామాలలో, గ్రామ పంచాయితీ స్థాయిలో తెలుగు అధికారభాషగా వుండటానికి ఎక్కువ ప్రతిబంధకాలుండవు. ఏమైనా వుంటే వాటిని తొలగించుకొనే మార్గాలు ఆలోచించటం.

2) జిల్లా స్థాయిలో అధికార భాషగా తెలుగును పటిష్టం చేయటానికి అవలంబించవలసిన పద్ధతులు అధిగమించవలసిన అడ్డంకులు తెలుసుకొని సరియైన నిర్ణయాలు తీసుకోవడం.

3) బహూభాషా ప్రాంతమైన హైద్రాబాదులో తెలుగును అధికారభాషగా చేయటానికి తీసుకోవలసిన జాగ్రత్తలు, ఆచరణ యోగ్యమైన నిర్ణయాలు తీసుకోవాలి

4) విద్యాలయాల్లో చదువుకొనే తెలుగు - పరిపాలనా యంత్రాగంలోని తెలుగు మధ్య వ్యత్యాసం లేకుండ ఈ రెండింటికి సామరస్యం కలిగే పద్ధతి ఆలోచించాలి.

5) అధికార యంత్రాంగానికి పనికి వచ్చే తెలుగును విద్యార్థి దశనుండి ఉద్యోగ ప్రవేశ దశ వరకు ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని విద్యాలయాల్లో నేర్పించాలి.

6) పరిపాలనా భాషగా తెలుగును ఉపయోగించే మెళకువలన్ని విద్యార్థి దశలోనే నేర్పే ఏర్పాటు ప్రభుత్వం చేయాలి. అందుకోసం తెలుగు భాషా పరంగా ఒక పరిశోధనా కేంద్రాన్ని ఏర్పాటుచేసి ఈ విషయమై దృష్టి నిలపాలి.

**అవి : 1)** తెలుగును నేర్పే ప్రణాళికను సిద్ధం చేయడం.

2) ఆ ప్రణాళిక ప్రకారం తెలుగు నేర్పే అధ్యాపకులకు శిక్షణ శిబిరాలు నిర్వహించడం.

3) అవసరమైన ఆదర్శ పాఠాలను, విషయాలను సమాచారాన్ని పుస్తక రూపంలో అంద చేయడం.

4) హిందీ, ఇంగ్లీషు, భాషల నుండి తెలుగులోకి, తెలుగు నుండి హిందీ, ఇంగ్లీషులోకి అనువాద విద్య శిక్షణ ఇవ్వటం కోసం డిప్లొమా కోర్సు ఏర్పాటు చేయటం.

తెలుగు భాషలో పరిపాలన సాధ్యమా? ఈ నాడు ఈ ప్రశ్నకు తావులేదు. ఎందువల్ల నంటే నాటి అయ్యదేవర కాళేశ్వరరావు నుండి ఈ నాటి వరకు అనేక పారిభాషిక నిఘంటువులు, పదకోశాలు వెలువడ్డాయి. పాఠ్యగ్రంథాలు విరివిగా ప్రచారంలోకి వచ్చాయి.

తెలుగు మాతృభాష కాని వారందరూ తక్కువ కాలంలో తెలుగు నేర్చుకునే పథకాలు ప్రభుత్వం చేపడుతుంది. ప్రజలందరు మాట్లాడే భాషలోనే ప్రజాపాలన జరగడం వల్ల ప్రభుత్వానికి ప్రజలకి మధ్య సన్నిహిత సంబంధాలు పెరుగుతాయి.

పరిపాలన భాష ప్రయోజనాలు : ఇతరులపై ఆధారపడకుండా ప్రజలు స్వయంగా తమ విన్నపాలను ప్రభుత్వానికి పంపవచ్చు.

పరిపాలనలో తెలుగు అమలు పరచటం వల్ల వివిధరంగాలలో తెలుగు అమలు జరిగి భాషాభివృద్ధి సాధ్యమవుతుంది.

రాసే భాష, మాట్లాడే భాష ఒకటైనప్పుడు లిపిని నేర్చుకుంటే పరిపాలనా భాషలో తెలుగున అమలు పరచటం ద్వారా అక్షరాస్యతను సాధించవచ్చు. పూర్తి అక్షరాస్యతను సాధించేందుకు పాలనా భాషగా తెలుగు అమలు ఒక మార్గం.

నిరక్షరాస్యులు ప్రభుత్వ కార్యకలాపాలు తెలుసుకోవటం ద్వారా వ్యక్తుల మధ్య వర్తకం, సన్నిహిత సంబంధాలు, పెరిగి వీటి ద్వారా భావ సమైక్యత సాధ్యమవుతుంది.

మాతృభాషలో పరిపాలన వుండటం వల్ల సామాన్య ప్రజలందరూ పరిపాలనలో భాగస్వాములయ్యే అవకాశం వుంటుంది.

## 4.2 న్యాయ రంగంలో తెలుగు :

ప్రాచీన కాలంలో 'న్యాయ' అంటే 'ధర్మ' ప్రచారానికి ఒక విలక్షణ, శక్తివంతమైన మార్గాన్ని అవలంభించారు. ధర్మసూత్రాలను కథారూపంలో రచించి ప్రచారంలోకి తెచ్చారు. పురాణాలు అందుకు సాధనాలుగా ఉపయోగపడ్డాయి.

ధర్మ శాస్త్రానుసారం రామాయణ, భారతాలు ప్రజలకందరకు అందించాయి. చదువురాని వారికి కూడా ఆ విధంగా ధర్మమార్గ నిర్దేశం జరిగింది. అట్టి ప్రయత్నం ఇప్పుడులేదు.

19వ శతాబ్దంలో న్యాయపాలనా భాషగా తెలుగును అధికంగా వాడారు. 20వ శతాబ్దం మొదటి భాగంలో కూడా మనకు స్వాతంత్ర్యం వచ్చేవరకు కింది న్యాయస్థానాలలో తెలుగును తగినంతగా వాడారు.

కాని వింత ఏమిటంటే స్వాతంత్ర్యం వచ్చాక న్యాయస్థానాల్లో తెలుగు వాడకం తగ్గుతూ వచ్చింది.

1953లో ఆంధ్రప్రదేశ్ ప్రత్యేక రాష్ట్రంగా అవతరించిన తర్వాత న్యాయపాలనలో తెలుగును ఉపయోగించటం మరింత తగ్గింది. నిజంగా తెలుగును న్యాయపాలనా రంగంలో అమలు పరచడానికి

ప్రోత్సహం ఇవ్వదలచుకొంటే పూర్వం తెలుగులో దాఖలైన దావాలను, దస్తావేజులను, న్యాయమూర్తుల తీర్పులను,పత్రికలలోని తీర్పుల ఉదాహరణలను శ్వేతపత్రం అనుబంధంలో ఇచ్చివుండాల్సింది. కాని ఇవ్వలేదు. మారుతున్న పరిస్థితులను దృష్టిలో వుంచుకొని ప్రభుత్వం మరో శ్వేతపత్రాన్ని ప్రకటించవలసిన అవసరం ఉంది.

ప్రస్తుతమున్న న్యాయశాస్త్రం, న్యాయవిధానం, దాని చట్టాలు, నియమాలు చాలా వరకు ఇంగ్లీషు పరిపాలకుల రెండు వందల సంవత్సరాల సామ్రాజ్య శిథిలాల చిహ్నాలు. ఇవి ప్రజా జీవితంలో ప్రబలంగా నాటుకొని పోయి ఉన్నవి. వాటిని పెకిలించి వేయటం సులభం కాదు.

ఈ ఇంగ్లీషు వట వృక్షాన్ని కొమ్మలు- రెమ్మలు కొట్టి నిదానంగా తొలగిస్తూ దాని పక్కనే చిగురిస్తున్న తెలుగు మొలకను అతి సుకుమారంగా, జాగ్రత్తతో పైకి తెస్తే అది పెరిగి న్యాయపాలనా రంగంలో, తదితర రంగాలలో దాని స్థానాన్ని ఆక్రమించ గలుగుతుంది.

న్యాయశాస్త్రం అనగానే న్యాయ నిర్వహణ గుర్తుకు వస్తుంది. నిజానికి న్యాయ నిర్వహణ కూడ న్యాయశాస్త్రంలో ఒక భాగమే. న్యాయనిర్వహణ లేని న్యాయశాస్త్రం నిరుపయోగ మవుతుంది. మనిషికీ మనిషికీ మధ్య మనిషికీ ప్రభుత్వానికి మధ్య వుండవలసిన సంబంధాలు, ప్రజలకున్న హక్కులు, ప్రభుత్వ బాధ్యత వారు నిర్వహించవలసిన కర్తవ్యాలు అందుకు న్యాయ నిర్వహణ జరగవలసిన తీరు మొదలైన విషయాలను న్యాయశాస్త్రం నిర్ధేశిస్తుంది.

సమాజ పరిణామంలో అనగా న్యాయ వ్యవస్థ ఏదో ఒక రూపంలో ఉంటూ వచ్చింది . మార్పు చెందుతూ వచ్చిన సమాజాన్ని నడిపేందుకు న్యాయశాస్త్రం కూడా తదనుగుణంగా మారుతూ వచ్చింది.

వ్యక్తిగత ఆస్థిని మానవుడు కలిగి వుండటం మొదలైనప్పటి నుండి దానిని కాపాడేందుకు తగు ధర్మ శాస్త్రం రూపొందిపబడుతూ వచ్చింది. ఆ ధర్మశాస్త్రం అమలు జరిగేలా చూసేందుకు తగు సాధకులు కావలసి వచ్చారు. బలవంతులు బలహీనుల శ్రమ శక్తిని తమ స్వప్రయోజనాలకు వినియోగించుటకు తమ కనుకూలమైన ధర్మ సూత్రాలతో కూడిన న్యాయశాస్త్రం రూపొందించేవారు. బలహీనులు తమ హక్కులకు పోరాటం జరిపిన కొద్ది కొంత వరకు వారికి న్యాయం కల్పిస్తూ ధర్మసూత్రాలను మార్పుచేస్తూవచ్చారు.

పూర్వం హైద్రాబాదులో ఉర్దూభాషలో శాసనాలు చేసేవారు. అవి ఇప్పటికి మన రాష్ట్రంలో అమలులో వున్నాయి. అలా ఉర్దూ"ఖానూను" ఇంగ్లీషులోకి తర్జుమా చేశారు. తర్జుమా చేయడం వల్ల ప్రజలకు ప్రతి అక్షరం తెలుస్తుందనే ఆశలేదు. ఆ తర్జుమా చేసిన అనువాదాలు అధికారికంగా ఆమోదింపబడిన చట్టాలుగా పరిగణించాలని ప్రభుత్వం శాసనం చేయాలి.

మన దేశంలో బ్రిటీష్ వారు అడుగుపెట్టే సమయానికి ఒక రకమైన పంచాయితీల వంటి న్యాయస్థానాలు న్యాయ నిర్వహణ జరుపుతుండేవి అప్పుడు సహజంగానే ప్రజల మాతృభాషలలో న్యాయశాస్త్రం వుంటూ ఆ భాషలోనే న్యాయ నిర్వహణ జరుపబడేది. అందుచేత ప్రజలకు వారి వారి ఆచార వ్యవహారాలు, కట్టుబాట్లు, హక్కులు, కర్తవ్యాలు సులభంగా తెలియడానికి వీలుండేది.

న్యాయశాస్త్రం తెలియక పోవడం క్షంతవ్యం కాదనే న్యాయసూత్రం ప్రకారం ప్రతి మనిషికి న్యాయ శాస్త్ర అవగాహన వుండాలి. కాని భారతదేశపు న్యాయశాస్త్రం తమ ప్రజల విషయంలో అన్యాయం చేస్తుందని చెప్పక తప్పదు.

1781వ సంవత్సరంలో మొట్ట మొదటి సారిగా ఈస్ట్ ఇండియా కంపెని వారిచే చేయబడిన "బెంగాలు రెగ్యులేషన్" అప్పటి వరకు మన దేశంలో అమలులో వున్న న్యాయ వ్యవస్థను మొట్ట మొదటి సారిగా దెబ్బతీసింది. ఆతర్వాత బ్రిటీష్ ప్రభుత్వం మన దేశంలో స్థిరపడి పోయిన తర్వాత 1837లో ఇండియన్ లా కమిషన్ లార్డ్ మెకాలే క్రిమినల్ నేరానికి సంబంధించిన చట్టాలకు చెందిన ఓ చిత్తు ప్రతిని తయారు చేసి అప్పటి గవర్నర్‌కు పంపగా అది1860 వ సంవత్సరం అక్టోబరు 6వ తేదీన గవర్నర్ చేత ఆమోదింపబడి 1862 వ సంవత్సరం జనవరి 1వ తేదీ నాటికి ప్రచురించబడి అమలులోకి వచ్చింది.

అంతకు ముందు అమలులో వున్న 'ఖురాన్ 'ను ఆధారంగా చేసిన "ముస్లిం క్రిమినల్ లా", 'ఇంగ్లీషు క్రిమినల్ లా' రద్దయినాయి.

పైవిధంగా ఏర్పడిన భారతీయ న్యాయశాస్త్రంలో బ్రిటీష్‌వారు స్థాపించిన ఇంగ్లీషు క్రిమినల్ లా కొద్ది సవరణలతో నేటికి మన రాజ్యాంగంలో న్యాయ నిర్ణయ వ్యవస్థను, న్యాయ స్థాన నిర్వహణ పద్ధతిని పొందుపరచటం జరిగింది.

స్వాతంత్ర్యం వచ్చిన వెంటనే మూకుమ్మడిగా న్యాయస్థానంలోని భాషా విషయంలో మార్పు తేవాలని నిర్ధేశించారు. కాని స్వాతంత్ర్యం వచ్చి 50 సంవత్సరాలు పూర్తయి స్వర్ణోత్సవాలు జరుపుకొన్నప్పటికీ నేటికి న్యాయరంగంలో భాష విషయంలో ఏ మాత్రం మార్పుగాని, ఎదుగుదల గాని చవి చూడలేక పోవడం శోచనీయం.

స్వాతంత్ర్యం రాకముందే బ్రిటీష్ వారి పాలనలోనే కింది కోర్టులలో అంటే తాలూకా స్థాయి, జిల్లాస్థాయి కోర్టులలో తెలుగుభాష ఉపయోగంలో వుండేది. వాదోపవాదాలు, తీర్పులు, సాక్ష్యాలు మొదలైన వన్ని ఇంగ్లీషు భాషలో వుండేవి. కోర్టులో దాఖలు చేసే దావా పత్రం **(Plaint)** జవాబు దావా **(Written Statement)** కాని చాలా వరకు తెలుగులో వుండేవి.

భారతదేశ చరిత్రలో న్యాయ పంచాయితీలు అనాదిగా వున్న కారణంగా న్యాయస్థానాలలో మామూలుగా వాడే పదాలు చాలా వరకు తెలుగులోనే వుండేవి. వాదోపవాదాలు తెలుగులోనే జరిగేవి. కాని కోర్టుతీర్పులు, సాక్ష్యాలు, కోర్టు రికార్డులు మొత్తం ఇంగ్లీషు భాషలో తప్పక నిర్వహించవలసి వచ్చేది.

ఉన్నత న్యాయ స్థానం (హైకోర్టు) స్థాయిలో మాత్రం రికార్డు మొత్తం ఇంగ్లీషు భాషలోకి అనువాదం చేసి అప్పీలు విచారణ సమయానికి ముందుగా సిద్ధంచేయటానికి చట్టరీత్యా ఉత్తర్వు వుండేది.

**రాజ్యాంగం - న్యాయ రంగంలో భాష :** 1950 జనవరిలో అమలులోకి వచ్చిన భారత రాజ్యాంగంలో అన్ని రాష్ట్రాలలోనూ ఆయా ప్రాంతీయ భాషలను, పరిపాలనకు, న్యాయ పాలనకు వాడుకొనే హక్కు

కల్పించారు. కేవలం హైకోర్టు డిక్రీలు, తీర్పులు మాత్రం ప్రాంతీయ భాషల్లో ఉండకూడదనే నియమం వుంది.

1963లో కేంద్ర ప్రభుత్వం ఆమోదించిన అధికార భాషా చట్టం ప్రాంతీయ భాషను మరింత విస్తృత పరిచింది. హైకోర్టు కూడా వారి డిక్రీలు తీర్పులు ప్రాంతీయ భాషలో ఇవ్వవచ్చునని, అలా యిచ్చేటట్లయితే ఇంగ్లీషు అనువాదం అవసరమనే నియమాన్నేర్పాటు చేసింది.

1950 లో వచ్చిన రాజ్యాంగం ప్రకారంగాకాని 1963 లో కేంద్ర ప్రభుత్వ అధికార భాషా చట్టం ప్రకారంగా కాని హైకోర్టు వరకు తెలుగు న్యాయస్థానాల్లో భాషగా అమలు చేయడానికి ఎలాంటి అడ్డంకులు లేవు.

**న్యాయ రంగంలో భాషగా తెలుగును ప్రవేశపెట్టే ముందు తీసుకోవలసిన చర్యలు :**

1. ప్రస్తుతం అమలులో వున్న చట్టాలు, ఆదేశాలు మొదలైన వాటికి తెలుగు అనువాదాలు తయారు చేయించడం.

2. ఇక ముందు చేసే చట్టాలు, బిల్లులు, మౌలిక ముసాయిదాలు తెలుగు భాషలో విధానమండలిలో ప్రవేశపెట్టటం.

3. 1964 లో ప్రభుత్వం న్యాయశాఖలో కొంతమంది సిబ్బందిని చట్టాలు, మొదలైన వాటి తెలుగు తర్జుమాలు చేయించటానికి నియమించింది. ఆ అనువాదాలను పరిశీలించి ఆమోదించటానికి ఒక అనువాద కమిటిని ఏర్పాటు చేసింది. న్యాయ శాఖలోని అనువాద విభాగంలో పెక్కు రాష్ట్ర కేంద్ర చట్టాలను తెలుగులోకి అనువదించినట్లు చెప్పబడుతుంది కాని ఆ అనువాదాలు, అనువాద కమిటి పరిశీలించి ఆమోదించినవే తమ అధికారిక అనువాదాలు కావు. కనుక ఈ కమిటి స్థానంలో ఒక ప్రత్యేక అధికారిని ప్రభుత్వం నియమించాలి.

4. న్యాయ శాస్త్రం సాంకేతికమైనది. ఇది యితర విజ్ఞాన శాస్త్రాలకన్న ఎక్కువ సాంకేతిక లక్షణం గల శాస్త్రం కనుక చట్టాలలో వాడబడే సాంకేతిక పదజాలాన్ని ఎంచుకోవటం లోనూ, వాక్య నిర్మాణంలోను, స్పష్టమైన సూత్రాలను పాటించటం అవసరం కాబట్టి ప్రభుత్వం ఆ సూత్రాలను రూపొందించటానికి న్యాయ శాస్త్రజ్ఞులతోను, భాషావేత్తలతోను కూడిన ఒక నిపుణుల సంఘాన్ని నియమించాలి.

5. అన్ని చట్టాలలోను సర్వ సామాన్యంగా ఉపయోగించబడే కొన్ని నిబంధనలకు నమూనా తర్జుమాలను నిపుణుల సంఘం తయారు చేయాలి.

6. న్యాయశాఖలోని చట్టాల అనువాదాలకు అట్టి సూత్రాలు, నమూనాలు ఆధారంగా వుండాలి.

7. అనువాదాలకు తుది రూపమిచ్చే బాధ్యతను ప్రభుత్వం న్యాయ శాఖలో ఒక ప్రత్యేకాధికారికి అప్పగించాలి.

8. ఏదేని చట్టంలో మౌలికమైన మార్పులు చేయాలని ప్రభుత్వం తలచినప్పుడు ఆ మార్పులతో సహా ఆ మొత్తం ఆంగ్ల చట్టంలోని నిబంధనలను పొందు పరుస్తూ విధాన మండలిలో తెలుగులో బిల్లును ప్రవేశపెట్టాలి.

ఆ బిల్లు చట్ట రూపం దాల్చిన తర్వాత ఆ చట్టం రద్దు కావడానికి నిబంధన చేయాలి. ఈ విధంగా ఒక నిర్ణీత కాలవ్యవధిలో ప్రస్తుత ఆంగ్ల చట్టాలను రద్దుచేసి వాటి స్థానంలో తెలుగు చట్టాలు వచ్చినప్పుడు అనువాదాలు అవసరం వుండదు.

**తెలుగులో మౌలిక ముసాయిదా రచనల గురించి పరిశీలన :**

రాష్ట్ర విధాన మండలిలో ప్రవేశ పెట్టే బిల్లులు. గవర్నరు జారీ చేసే ఆర్డినెన్స్ మొదలైన వాటికి అధికార గెజెట్‌లో ప్రకటన ద్వారా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయించే తేదీ నుండి తెలుగు ఉపయోగించాలని ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం 1996 3వ సెక్షను నిబంధన చేస్తున్నది.

అయితే చట్టాలను తెలుగులో చేసినప్పటికి సుప్రీం కోర్టులో, హైకోర్టులో ఉపయోగించే భాషలో కూడా అధికార పాఠాలను సమకూర్చక తప్పదు.

సుప్రీంకోర్టు, హైకోర్టు భాష ఇంగ్లీషు కాని, హిందీ కాని అయివుండవచ్చు. విధాన మండలి అందుకు ఇంగ్లీషు, హిందీ భాషలలో లేదా ఏదేని యితర భాషలో ఒక చట్టాన్ని ఆమోదించినట్లయితే ఆ చట్టాన్ని ఇంగ్లీషు, హిందీ భాషలలోకి అనువదించి గవర్నరు అధికారం మీద ప్రచురించాలని, ఆ అనువాదాలను చట్టం ఇంగ్లీషు, హిందీ, అధికారిక పాఠాలుగా భావించాలని రాజ్యాంగంలోని 348 ఆర్టికల్ లోనూ, కేంద్రం చేసిన అధికార భాషల చట్టం 6వ సెక్షనులోనూ నిబంధన చేయబడింది కనుక తెలుగులో చేయబడిన చట్టాలను ఇంగ్లీషు లేక హిందీలోకి విధిగా అనువదించవలసి వుంటుంది.

చట్టాలు ఏ భాషలో రచించినప్పటికి ముసాయిదా రచనకు సంబంధించిన ప్రాతిపదిక సూత్రాలు మారవు. కాబట్టి ఆంగ్ల భాషలో చట్టాల రచనకు స్థిరపడిన సూత్రాలనే తెలుగులో చట్టాల ముసాయిదాగా రచనా దృష్టిలో వుంచుకొని తెలుగు భాషా సాంప్రదాయాన్ని, విశిష్టతను, సాధ్యమైనంత వరకు పాటించాలి.

ఇప్పుడు అమలులో వున్న ఆంగ్ల భాషా చట్టాలను అనువదించే అనువాదకుని కంటే తెలుగులో మౌలిక రచనకు పూనుకునే ముసాయిదాదారునికి ఎక్కువ స్వేచ్ఛ వుంటుంది.

అనువాదాలలో తుది రూపం పొందిన తెలుగు శబ్దాలను, పదబంధాలను మౌలిక ముసాయిదా రచనలో కూడా అదే అర్థంలోఉపయోగించాలి.

చట్టాల అనువాదంలోను మౌలిక ముసాయిదా రచన ప్రక్రియలోను తెలుగు భాషలో కొంతవరకు కొత్త పారిభాషిక పదజాలం, కొన్ని పదాలకు కొత్త అర్థాలు ఏర్పడతాయి.

**న్యాయస్థానాల్లో భాష :** న్యాయస్థానాల దైనందిన కార్యకలాపాలను తెలుగు భాషలో నిర్వహించే విషయంలో రాజ్యాంగంలో 345 అధికరణం ననుసరించి రాష్ట్ర విధాన మండలి ఆ రాష్ట్రంలో వాడుకలో వున్న భాషలలో దేనినైనా గాని లేక హిందీని గాని అధికార భాషగా అంగీకరించవచ్చు.

348 అధికరణ ప్రకారం పార్లమెంటు ఆదేశించేంతవరకు సుప్రీంకోర్టులలోని అన్ని కార్యకలాపాలు ఇంగ్లీషులో వుండాలి కాని 348(2)అనుబంధం ప్రకారం రాష్ట్రపతి ఆమోదంతో రాష్ట్ర గవర్నర్ హిందీని గాని, ఆ రాష్ట్రంలో ప్రభుత్వ కార్యకలాపాలలో ఉపయోగించుబడుతున్న భాషను గాని రాష్ట్ర హైకోర్టులోని కార్యకలాపాలలో ఉపయోగించడానికి అనుమతించవచ్చు.

కాని ఈ విషయాలు హైకోర్టు ఇచ్చే తీర్పులు ఉత్తర్వులలో మాత్రం వర్తించవు. అంటే హైకోర్టు తీర్పులు, ఉత్తర్వులు ఇంగ్లీషులోనే వుంటాయి.

1963వ సంవత్సరంలో కేంద్ర అధికార భాషా చట్టం రూపొందించబడింది. ఆ చట్టంలోని మూడవ పరిచ్ఛేదం ప్రకారం 26.1.1965 తర్వాత కూడా ఇంగ్లీషును ప్రభుత్వ కార్యకలాపాలలో కాలవ్యవధితో నిమిత్తం లేకుండా ఉపయోగించటానికి వసతి కల్పించబడింది. చట్టం యితర ఉపబంధములను బట్టి చూస్తే రాష్ట్ర గవర్నరు, రాష్ట్రపతి ఆమోదంతో హైకోర్టు తీర్పులు ఇంగ్లీషులోనే కాక హిందీలో గాని ఆ రాష్ట్రానికి సంబంధించిన అధికార భాషలో గాని ఉండటానికి అనుమతించవచ్చు.

1963వ సంవత్సరం కేంద్ర అధికార భాషా చట్టానికి 1967 లో వచ్చిన సవరణనుసరించి హిందీ అధికార భాషగా లేనట్టి రాష్ట్రాల విధాన మండలి తీర్మానాలు ఇంగ్లీషులోనే వుంటాయి.

ప్రభుత్వ కార్యకలాపాల నిర్వహణ కోసం ఇంగ్లీషు నుండి హిందీలోకి అన్వయించుకొనే అవకాశం వుంది. ఇది సుప్రీంకోర్టు, హైకోర్టు కార్యకలాపాలకు అన్వయించదు.

కాని 348(2) ప్రకరణ ప్రకారం హైకోర్టు తీర్పులు, డిక్రీలు, ఉత్తర్వులు తప్ప హైకోర్టులోని యితర కార్యకలాపాలు, హిందీలో గాని లేక ఆయా రాష్ట్రాధికార భాషలో గాని వుంటున్నట్లు రాష్ట్రపతి ఆమోదంచే గవర్నరు అనుమతించవచ్చు.

వ్యవహార ప్రక్రియ 137 ప్రకరణం ప్రకారం హైకోర్టు అధీనంలో గల యితరన్యాయస్థానాలలో ఏ భాషనుపయోగించవలెనన్న విషయాన్ని నిర్ణయించే అధికారం ఆ రాష్ట్ర ప్రభుత్వానికి వున్నది.

ఈ విషయాన్ని బట్టి మన న్యాయ వ్యవస్థ ఇంగ్లీషు భాషను విడనాడి మాతృ భాషలో న్యాయ శాస్త్ర కార్యక్రమాలు చేబట్టుట అత్యంత కష్టమనిపిస్తుంది. అందుకు రాజ్యాంగాన్ని కూడా అవసరమైన మేరకు సవరించవలసివుంది.

## ప్రస్తుత న్యాయస్థాన కార్యకలాపాలలో తెలుగు :

**సాక్షులు** : న్యాయ పరిపాలన న్యాయస్థానాలలో జరుగుతుంది. వాద, ప్రతివాదుల భాష వేరుగా వుండటం విశేషం, పాక్షికులు న్యాయస్థానానికి తమ హక్కుల నిశ్చయానికి వెళుతున్నారు న్యాయాధిపతికి ఈ పాక్షికులకు మధ్య న్యాయవాదులుండి సంధానం చేస్తున్నారు.

మన రాష్ట్రంలోని అన్ని జిల్లాలలోని న్యాయస్థానాలలో నూటికి తొంబైశాతం పైగా సాక్షులు వారి వాఙ్మూలాన్ని తెలుగులోనే ఇస్తున్నారు. న్యాయమూర్తులు వాటిని ఇంగ్లీషులోకి అనువదించి రాసుకుంటున్నారు.

హైదరాబాదు నగరంలో సాక్ష్యం చెప్పేవారిలో 60 శాతం పైగా తెలుగులోనే చెప్తున్నారు. తెలుగు పరిచయం లేనివారు పది శాతం కూడా లేనప్పటికి వారు స్పష్టత కోసమో, తెలుగు కన్న ఉర్దూ, హిందీ, ఇంగ్లీషులో సాక్షమివ్వటం సులభమౌతుందనో వారు ఆ భాషల్లోనే సాక్ష్యమిస్తున్నారు.

అవి ఏ భాషలో వున్నప్పటికీ న్యాయమూర్తి వాటిని ఇంగ్లీషులోకి తర్జుమా చేయించి రాసుకోవటం జరుగుతుంది.

1962లో తెలుగును కోర్టు భాషగా ప్రభుత్వం ప్రకటించిన తర్వాత కూడా న్యాయమూర్తులు సాక్షుల వాఙ్మూలాన్ని ఇంగ్లీషులో తర్జుమా చేసి రాసుకుంటున్నారు. వీరిని హైకోర్టు గాని, ప్రభుత్వంగాని ప్రశ్నించటం లేదు.

**కోర్టులో దాఖలవుతున్న పత్రాలు :**

కోస్తా రాయలసీమ జిల్లాలలో దావాలు, కొన్ని రకాల ఎఫిడవిట్లు, మెమొలు కొంతమంది తెలుగులోనే దాఖలు చేయటం జరుగుతుంది. తెలంగాణా జిల్లాలలో కొంతమంది పూర్వం ఉర్దూలో దాఖలు చేసేవారు. ప్రస్తుతం ఉర్దూలో దాఖలు చేసేవారి సంఖ్య తగ్గి ఇంగ్లీషు విరివిగా వాడుకలోకి వచ్చింది.

హైద్రాబాదు నగరంలో దాఖలయ్యే దావాలు, పిటిషన్లు, మొదలైన వన్ని దాదాపు ఇంగ్లీషు లోనే వుంటున్నాయి.

ప్రభుత్వం తెలుగును అధికార భాషగా ప్రకటించిన తర్వాత రాష్ట్రస్థాయి కార్యాలయాలలోను జిల్లాస్థాయి కార్యాలయాలలోను, పంచాయితీ స్థాయి కార్యాలయాలలోను ముఖ్యంగా ఉత్తర ప్రత్యుత్తరాలకు నోటీసులు వగైరా జారీ చేయడానికి తెలుగు భాష ఉపయోగించబడింది: ఉపయోగించబడుతుంది.

కాని న్యాయ పాలనా రంగంలో మాత్రం తెలుగు భాషనుపయోగించే విధానం సమగ్రంగా అమలు జరగలేదు.

దీనికి ప్రధాన కారణం రాష్ట్రంలోని న్యాయ స్థానాలలోను, రాష్ట్ర ఉన్నత న్యాయస్థానానికి (హైకోర్టు) న్యాయ పరిపాలనా విషయంలో ప్రత్యేకాధికారం వుంది కాని రాష్ట్ర ప్రభుత్వానికధికారం లేదు.

1981 వ సంవత్సరంలో ప్రప్రథమంగా న్యాయపాలనా రంగంలో తెలుగు భాషను అమలుపరచడానికి చర్యలు తీసుకున్నట్లు కన్పిస్తుంది. 1982 సంవత్సరంలో రాష్ట్ర ఉన్నత న్యాయస్థానం నుంచి జిల్లా మున్సబులకు, మెజిస్ట్రేట్‌లకు ఉత్తరువులు జారీ అయ్యాయి.

న్యాయ పాలనా రంగంలో తెలుగు భాషను అమలుపరచటానికి కొన్ని అడ్డంకులున్నాయి. వాటిలో ముఖ్యమైనవి ప్రస్తుతం అమలులో వున్న చట్టాలు, ఆ చట్టాల పరిధిలో చేసిన నియమాలన్ని ఇంగ్లీషు భాషలోనే వుండటం వలన న్యాయస్థానాలలో కక్షి దారులకు, న్యాయమూర్తులకు, న్యాయ వాదులకు తెలుగు భాషలో సమాన పదాలు అందుబాటులో లేకపోవటం వలన ఇబ్బంది కలిగింది.

న్యాయస్థానంలో ఉపయోగించే ఇంగ్లీషు పదాలకు శాసన , న్యాయపాలనా పదజాలానికి సంబంధించిన పదకోశం 900 పుటలు కలిగిన బృహత్ గ్రంధం కావటంలో తెలుగు భాషలో సరియైన అర్థాన్ని సూచించే పదాలను కూర్చి అరవై పుటలున్న"పారిభాషిక పదకోశాన్ని "శాసన సభ సచివాలయం 1963 ప్రచురించింది. ఈ పదకోశంలో శాసనసభలలోను, సచివాలయంలోనూ, పరిపాలనా విషయాలలో ఉపయోగపడే పదాలు పొందుపరచి వున్నాయి. ఆ తర్వాత తెలుగు అకాడమి వారు 1980 వ సంవత్సరంలో "పరిపాలనా న్యాయపదకోశం" తయారు చేసి ప్రచురించారు. ఈ పదకోశంలో చాలా వరకు న్యాయ స్థానాలలో తరచుగా వాడే అనేక ఇంగ్లీషు పదాలకు తెలుగు సమానార్థకాలు పొందుపరచబడి వున్నాయి.

న్యాయపాలనలో తెలుగు భాష పూర్తిగా అమలు జరగాలంటే న్యాయమూర్తులు, న్యాయవాదులే కాక న్యాయస్థానాలలో పనిచేసే ఉద్యోగులందరూ తెలుగు భాషను ఉపయోగించటం అలవాటు చేసుకోవాలి.

జిల్లాస్థాయిలో అనేక పర్యాయాలు శిక్షణా శిబిరాలు నడపడం ద్వారా తరచుగా న్యాయస్థానాలలో వాడే పదాలు, వాటికి తెలుగులో సమానార్థకాలు, వాటి ప్రయోగం మొదలైన విషయాలలో న్యాయవాదులకు శిక్షణ ఇవ్వవలసి వుంటుంది.

అలాగే న్యాయమూర్తులకు తెలుగులో తీర్పులిచ్చే విధం, ఇతర ఉద్యోగులకు వారివారి విధి నిర్వహణలో నోటీసులు పంపటం, రికార్డులు తయారు చేయటం వంటి వ్యాజ్యంలోని అన్ని దశలలోనూ తెలుగుభాషనెలా ఉపయోగించాలో శిక్షణ నివ్వవలసి వుంటుంది.

సాధారణంగా న్యాయస్థానాల వ్యవహారంలో ఉపయోగించే నమూనా పత్రాలు, రిజిష్టర్లు, రికార్డుల వంటి వివరాలన్ని ముందుగా తెలుగులోకి తర్జుమా చేయించి ఉంచడం ఎంతైనా అవసరం.[1]

కింది కోర్టులలో తీర్పులు తెలుగులో ఇవ్వడం అమలులోకి వచ్చినప్పటికీ ఆ తీర్పులు ఇంగ్లీషులో తర్జుమా చేయడం అవసరం. కింది కోర్టు తీర్పులపై అప్పీలు ఉన్నత న్యాయస్థానంలోనూ, ఆపైన మహోన్నత న్యాయస్థానంలోనూ నిర్ణయించవలసివచ్చినపుడు ఆ కేసు తాలూకు రికార్డు మొత్తం ముఖ్యంగా తీర్పు నకళ్ళు ఇంగ్లీషు భాషలో వుండాలి.

ప్రస్తుత పరిస్థితుల్లో ఉన్నత న్యాయస్థానంలో కొంత మంది న్యాయమూర్తులు ముఖ్యంగా ప్రధాన న్యాయమూర్తి తెలుగు తెలియని వారై ఉండడం చేత ఇంగ్లీషు తర్జుమాలు చాలా అవసరం.

న్యాయపాలనలో తెలుగు వాడకం పెరగడానికి పదకోశాలు, నిఘంటువులు హెచ్చుగా రావాలి. ఇంగ్లీషు నుండి తెలుగులోకి శాసనిక పారిభాషిక పదాలనందించే బృహత్ ప్రయత్నాన్ని శ్రీ పడాల రామారెడ్డిగారు 1993 లో కార్యాచరణలో పెట్టి "ఇంగ్లీషు-తెలుగు శాసనిక పరిభాష నిఘంటువు"ను రచించారు.

ఈ నిఘంటువులో భావ విశదీకరణ చక్కగా వుంది. ప్రతి తెలుగు పదంలోనూ స్పష్టత వుంది నిర్దిష్టత వుంది. తెలుగులో శాసన నిర్మాణానికి, న్యాయపరిపాలనకు, చివరకు తీర్పుల రచనకు కూడా అనువుగా వుంది.

ఈ నిఘంటువులో తెలుగు పారిభాషిక న్యాయ పదజాలం మాత్రమే కాక న్యాయవాదులకు, న్యాయమూర్తులకు, న్యాయశాస్త్ర అధ్యాపకులకు, విద్యార్థులకు ఉపయోగపడేలా ఒక్కొక్క పదానికి అర్థాన్ని నిర్దేశించిన న్యాయస్థానాల తీర్పులు, చట్టాలు సందర్భానుసారంగా వివరించబడ్డాయి.

న్యాయ వాదులు తరచుగా ఉపయోగించే డైజెస్టులు, విషయసూచిక తీర్పుల సంకలనం (Subject Notes Index)గా ఈ నిఘంటువు బాగా ఉపయోగపడుతుంది.

న్యాయపాలనారంగంలో తెలుగు సమగ్రంగా అమలు జరగలంటే ఆంధ్ర ప్రదేశ్ న్యాయస్థానం - హైకోర్టు పైన ఎక్కువ బాధ్యత వుంటుంది. కారణం ఆంధ్రప్రదేశ్ న్యాయపాలనా విషయంలో హైకోర్టు ప్రమేయం లేకుండా ప్రభుత్వం ఎటువంటి చర్య తీసుకొనే వీలు లేదు. దీని వల్ల తెలుగు అమలుకు అనేక రకాలుగా జాప్యం కలుగుతుంది.

**తెలుగు అమలులో అనవసరమైన జాప్యం :**

**1) చట్టాల అనువాదాలు :** న్యాయస్థానాలు ఏదైనా చట్టంలోని అంశాలను పరిశీలించిన, పదానికి అర్థం చెప్పిన ఆ చట్టం ఏ మూల భాషలో వుందో దానినే పరిగణలోకి తీసుకొంటాయి. అనువాద పాఠాలు, ఇంగ్లీషు భాష తెలియని వారికి చట్టాన్ని తెలియజేసే ప్రయోజనానికి ఉపయోగపడతాయి.

కనుక ఈనాడు ఇంగ్లీషులో వున్న చట్టాల తెలుగులోకి అనువదించే వరకు న్యాయపాలనలో తెలుగు అమలు పరచవచ్చు. మన రాష్ట్ర ప్రభుత్వం చట్టాలను తెలుగులోనే తయారు చేస్తే వాటి అధికారిక ఇంగ్లీషు అనువాద పాఠాన్ని తయారు చేసి ప్రభుత్వ గెజెట్‌లో అచ్చు వేయాలనే నియమాన్ని కేంద్ర ప్రభుత్వం విధించింది.

మనదేశంలో సుప్రీంకోర్టు, హైకోర్టులు చట్టాలలోని అంశాలను పరిశీలించి అర్థం చెప్పేటప్పుడు, అన్వయించేటప్పుడు ఎంతో శ్రద్ధతో, బాధ్యతతో తమ తీర్పులనిస్తున్నాయి.

తెలుగులో వున్న దస్తావేజులు మొదలైన వాటిని పరిశీలిస్తూ హైకోర్టు తెలుగు ప్రజలు వాడుతున్న చాలా మాటలకు సాధికారంగా అర్థవివరణ ఇచ్చింది

అధీనములు, అన్నసత్రం, కవులు, దేవాదాయం, ఇల్లరికం, ఈనాం, సంతతి, కట్టుబడి , నిత్యానైవేద్య దీపారాధన, పుత్ర సంతతి, చేరదీయు, చలామణి, అసలు, మినహా మొదలైనవి.

నిజానికి ఇంగ్లీషు వారు మన దేశానికొచ్చిన కొత్తలో మన దేశ ప్రజల ఆచారాలు వారికి తెలియవు. బ్రిటీష్ న్యాయస్థానాలు ఏర్పడగానే హిందూ ముస్లింలకు వర్తించే న్యాయ సూత్రాలను అవగతం చేసుకొన్నారు. అప్పటికి హిందువులకు వర్తించే న్యాయశాస్త్రం క్రోడీకరింపబడలేదు. అయినా సంస్కృత గ్రంధాలు పరిశీలించి వారసత్వం, దత్తత, సమిష్టి కుటుంబం మొదలైన విషయాలపై బ్రిటీష్ వారు తీర్పులివ్వగలిగారు.

ఆ సందర్భంలో సంస్కృత పదాలకు ఇంగ్లీషులో అర్థం చెప్పవలసివచ్చింది. అప్పటి వరకు భారతీయ సంస్కృతితో, సంస్కృత భాషతో పరిచయం లేని జాన్ డి. మెయినీ ఇంగ్లీషులో హిందూ న్యాయశాస్త్ర గ్రంథాన్ని రాశాడు.

మనకు తెలుగులో చట్టాలు నిర్మించటానికి, అనువాదం చేయడానికి సాధ్యం అవుతుంది. భవిష్యత్తులో చట్టాలు తెలుగులో చేస్తే ఆ చట్టాలలోని అంశాలకు, పదాలకు న్యాయస్థానాలు మంచి సమర్థతతో అన్వయర్థం చెప్పడంలో తమ పని నిర్వహించగలమనీ చెప్పవచ్చు.

**కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు :**

1962లో సివిల్ ప్రొసీజర్ కోడ్ కింద కోర్టు భాషగా తెలుగును ప్రభుత్వం గుర్తించి జి.ఓ. జారీచేసింది. ఆ జి.ఓ. ప్రకారం కింది కోర్టులలో దాఖలు చేసే దావాలు మొదలైనవి తప్పని సరిగా తెలుగులో దాఖలు చేయాలా? లేక ఇంగ్లీషులో దాఖలు చేయవచ్చా! అనే అంశంపై 1966 లో హైకోర్టుకు తీర్పు చెప్పవలసి వచ్చింది.

కింది కోర్టులో దావాలు ఇంగ్లీషులో దాఖలు చేయడానికి ఎలాంటి నిషేధం పెట్టలేదు కనుక పూర్వం లాగా ఇంగ్లీషుని వాడుకోవచ్చునని హైకోర్టు తెలిపింది.

కాని 1962 జి.ఓ. ప్రకారం న్యాయస్థాన భాష తెలుగు కాబట్టి ప్రతివాది ఇంగ్లీషులో దాఖలైన తెలుగు తర్జుమా కోరే అధికారం వుంది. అయినా మన రాష్ట్రంలో న్యాయపాలనా రంగంలో వున్న కార్యక్రమాలన్ని ప్రస్తుతం ఇంగ్లీషులోనే నడపడం వల్ల తెలుగులో దావాలు మొదలైనవి దాఖలు చేయడానికి న్యాయవాదులు ఉత్సాహం చూపించడం లేదు.

1966 ఆంధ్రప్రదేశ్ అధికార చట్టంలోని 3(1)వ విభాగం కింద కింది న్యాయస్థానాల్లో తెలుగును ప్రవేశపెట్టాలని ఏప్రిల్ 9, 1981న ప్రభుత్వం ఆదేశాలు జారీచేసింది. (చూ. అను. 17).

న్యాయపాలనా భాషగా ఆయా ప్రాంతీయ భాషలను అమలు పరచడంలో మన పొరుగు రాష్ట్రాలు ఎంతో అభివృద్ధిని సాధించాయి .

**న్యాయ రంగంలో తెలుగు అమలు జరగకపోవడానికి కారణాలు :**

న్యాయరంగంలో తెలుగును అమలుపరచడానికి కలిగే ఆటంకాలు -

1. కేంద్ర, రాష్ట్ర చట్టాలు ఇంగ్లీషులో వున్నాయి. వాటి అనువాదాలు త్వరితంగా తయారు కావాలి చట్టాలను అనువాదం చేయడానికి రాష్ట్ర ప్రభుత్వానికి ప్రోత్సాహకంగా వుండడానికి కేంద్ర ప్రభుత్వం ప్రతి రాష్ట్రంలోనూ న్యాయశాఖలో అనువాద విభాగం ఏర్పాటు చేసింది. ఈ విభాగం ఏర్పాడి 25 ఏండ్లయినా. రెండు చట్టాలు మాత్రమే అనువదించి పుస్తక రూపంలోకి తెచ్చింది. అంటే కృషి ఫలితం అత్యల్పమని చెప్పవచ్చు. కనుక అనువాద శాఖపై పూర్తిగా ఆధారపడితే ప్రయోజనం వుండదు.

2. ప్రామాణికమైన పరిభాషను గూర్చి ఏకాభిప్రాయం లేదు.

3. తెలుగు టైపు రైటర్లు న్యాయస్థానాలలో తగినన్ని లేవు. వీటిని ఉపయోగించే అర్హత గల సిబ్బంది తగినంత మంది లేరు.

4. న్యాయమూర్తులకు, న్యాయవాదులకు తెలుగును న్యాయపాలనగా వాడటానికి సరియైన శిక్షణ లేదు.

5. 1984 సంవత్సరంలో అధికార భాషా సంఘం సమావేశంలో తీసుకొన్న నిర్ణయం ప్రకారం హైకోర్టు వారు న్యాయస్థానాల్లో ప్రస్తుతం ఉపయోగంలో వున్న కొన్ని ఇంగ్లీషు నమూనాలు, రిజిష్టర్లు తెలుగులోకి తర్జుమా చేయమని పంపారు. అవి తిరిగి రావడంలో తీవ్ర జాప్యం జరిగింది.

**న్యాయ రంగంలో తెలుగును అమలు చేయడానికి సూచనలు :**

1. న్యాయస్థానాలన్నిటిలోనూ వున్న టైపిస్టులకు తెలుగు టైపు నేర్పించాలి. వారికి తగినంత ప్రోత్సాహం, అవకాశం ఇవ్వాలి. అదేవిధంగా తెలుగు షార్ట్‌హ్యాండ్‌లో శిక్షణ ఇవ్వాలి.

2. దావాలు, పిటిషన్లు, జడ్జిమెంట్లు మొదలైన అన్ని రకాల పత్రాలకు అనుభవజ్ఞులైన న్యాయమూర్తులు, న్యాయవాదుల చేత నమూనాలు తయారు చేయించాలి. అవి న్యాయస్థానాలతో సంబంధం వున్న వారికందరికీ అందుబాటులో వుంచాలి.

3. విధానసభలో నూతనంగా ప్రవేశపెట్టబడే చట్టాలన్ని తెలుగులోనే ఉండాలని ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది కనుక ఇంతకు ముందున్న చట్టాలను, నూతనంగా వచ్చే కేంద్ర చట్టాలను అనువాదం చేసే కార్యక్రమం న్యాయశాఖలో అనువాద విభాగానికి అప్పగిస్తే పని జరుగుట లేదు కనుక ప్రత్యామ్నాయాలోచన చేయాలి.

4. కేంద్ర ప్రభుత్వ న్యాయ పాలనా రంగంలో ప్రాంతీయ భాషలు అమలు పరచటానికందిస్తున్న సహాయ సహకారాలను సద్వినియోగ పరచుకోవాలి.

5. న్యాయ మూర్తులందరికీ తెలుగులో కార్యకలపాలు సాగించటానికి, తీర్పులివ్వడానికి తగిన శిక్షణ నివ్వాలి.

6. హైకోర్టు న్యాయ రంగంలో తెలుగునమలుపరిచే కార్యక్రమంలో అవసరమైన సహకారాన్ని ప్రభుత్వానికంద చేయాలి

7. తెలుగుభాష వచ్చిన న్యాయవాదులు తమ వాద ప్రతివాదాలను తెలుగులోనే సాగించాలి తెలుగు రాని వారు అందుకు ప్రయత్నించాలి.

8. న్యాయవాదులు తీర్పులు, ఉత్తరువులు డిక్రీలు తదితరమైన కాగితాలు తెలుగులోనే రాయాలి.

9. న్యాయస్థానాలలో తెలుగును ప్రవేశ పెట్టటానికవసరమైన న్యాయశాస్త్ర గ్రంథాలను హైకోర్టు న్యాయశాఖ అనువాద విభాగంచేత అనువదింప చేసి ప్రకటించాలి.

10. తమిళనాడు, కర్నాటక, రాష్ట్రాలవలె నమూనా తీర్పులు, న్యాయశాస్త్రం వివరాలు మొదలైన వాటిని మన రాష్ట్ర ప్రభుత్వం సంశ్లేషణ చేసి పుస్తకాల రూపంలో ముద్రించి కోర్టులకందించాలి.

11. న్యాయ కళాశాలల్లో బోధన కూడా తెలుగులోనే జరగాలి న్యాయవాద వృత్తి స్వీకరించదలచిన ప్రతి విద్యార్థి అందుకు తగిన తెలుగు భాషా పాటవాన్ని, న్యాయపారిభాషిక పదజాలాన్ని సముపార్జించుకొంటాడు.

12. హైకోర్టుస్థాయిలో ఒక జడ్జిని, ఒక జిల్లాకోర్టు జడ్జిని, ఒక న్యాయవాదిని కలిపి ఒక సంఘంగా ఏర్పాటు చేసి - దానికి హైకోర్టు రిజిస్ట్రార్ ను సెక్రటరీగా వుంచి దైనిక చర్యలు తీసుకోవడానికి రిటైర్డైన ఒక జిల్లా జడ్జిని ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా వుంచి ఒక ప్రత్యేక విభాగాన్ని న్యాయశాఖలో (special cell) స్థాపించి చురుకుగా చర్యలు తీసుకుంటే తప్ప న్యాయపాలనా రంగంలో తెలుగు అమలు జరగదు.

13. రాష్ట్ర చట్టాలకు తెలుగు అధికార పాఠాలు వెంటనే రూపొందించాలి.

14. న్యాయస్థానాలలో తెలుగు ఉపయోగించేటపుడు సివిల్ ప్రొసీజర్ కోడ్, క్రిమినల్ ప్రొసీజర్ కోడ్, ఇండియన్ పీనల్ కోడ్, సివిల్, క్రిమినల్ ప్రాక్టీసు నియామకాలు మున్నగు గ్రంథాలు, వాటి నమూనాలు తెలుగులో ఉండడం అవసరం.

### సాక్ష్యాన్ని రికార్డు చేయడం :

సాక్షులు ఎలాంటి కష్టం లేకుండా తమ సాక్ష్యంపై సంతకం చేయడానికి వీలు కల్పించే నిమిత్తం సాక్ష్యాన్ని తెలుగులోనే రికార్డు చేయాలి. లేదా వాంగ్మూలాన్ని చదివి వివరించి చెప్పి సాక్షి సంతకం తీసుకోవాలి.

చదివి వివరించి చెప్పినా సంతకం చేసే వ్యక్తి దాన్ని స్వయంగా చదవలేడు కాబట్టి అతనికి పూర్తి సంతృప్తినియ్యదు. కనుక సాక్ష్యాన్ని తెలుగులో రికార్డు చేయాలి .

కక్షిదారుల అడ్వకేట్లు సాక్ష్యాన్ని ఇంగ్లీషులో రికార్డు చేయాలని కోరుతున్న కారణంచేత సాక్ష్యాన్ని తెలుగులో రికార్డు చేయడం లేదు. హైకోర్టుసుప్రీంకోర్టులు తప్ప ఇతర కోర్టులలో వెంటనే తెలుగు భాష వాడాలని, సాక్ష్యాన్ని తెలుగులో రికార్డు చేయడానికి కృషిచేయాలని సమీక్షా సంఘం అభిప్రాయపడింది.

తెలుగుకు సంబంధించిన ప్రామాణిక భాష లేకపోవడం వల్ల న్యాయవాదులు ఏ తెలుగును అమలు చేయాలో, ఏ తెలుగులో వాదించాలో, తీర్పులు ఎలా ఇవ్వాలో నిర్ణయించుకోలేక పోతున్నారు. అంతేకాక న్యాయవాదులు "లా" చదువు ఇంగ్లీషులో చదవడం వల్ల శాసనాలు, చట్టాలు ఇంగ్లీషులోనే వుండడం వల్ల ఇంగ్లీషులో వాదించడం, ఇంగ్లీషులోనే తీర్పులివ్వడం జరుగుతుంది. న్యాయాధికారులు కూడా తెలుగు రాని వారై వుండడం, హైకోర్టుకు పంపే కేసులన్ని ఇంగ్లీషులో రూపొందడం, హైకోర్టులో ఇంకా ఇంగ్లీషు అమలులో వుండడం మొదలైన కారణాల వల్ల న్యాయపాలనా రంగంలో తెలుగు అమలు సరిగా జరగడంలేదు.

**తెలుగు అమలుకు ప్రచారం :** ప్రజలకు అర్థంకాని ఇంగ్లీషు భాషలో న్యాయవాదులు వాదించడం, న్యాయమూర్తుల తీర్పులు ఇంగ్లీషులో వుండడం వల్ల ప్రజలకు అర్థం కాక సతమతమవుతున్నారు. ఇదే అవకాశంగా తీసుకొని కొందరు న్యాయవాదులు ప్రజలనుండి ఎక్కువ డబ్బు లాగుతున్నారు.

అదే తెలుగు న్యాయస్థానాలలో ఈ ఇబ్బందులు ప్రజలకుండవు. కావున ముందుగా పరిపాలనా, న్యాయస్థానాలలో తెలుగు ఉండడం వల్ల ప్రజలకు కలిగే లాభాలను ప్రచారం చేయాలి. న్యాయపాలన తెలుగులో వున్నపుడే రాష్ట్రం అంతటా తెలుగు అమలు జరుగుతుంది.

**పిటిషన్లు :** తెలుగులో పిటిషన్లు రాసే ఉద్యోగులు కాని, వాటిని కోర్టులో ప్రవేశపెట్టే న్యాయవాదులు కాని, ఇరువురూ కనిపించటం లేదు. తెలుగులో రాయటం వచ్చినా ఇంగ్లీషులో రాసి టైపు చేయించి కోర్టులో పిటిషన్లు పెడుతున్నారు. ఇలా ఇంగ్లీషులో రాయడంవలన సౌలభ్యం, గౌరవం ఉంటుందని ప్రజల, న్యాయవాదుల భావన. కనుక ఈ పద్దతి మారాలి.

**తీర్పులు :** హైకోర్టులో ఏ భాష ఉపయోగించాలనేది స్పష్టంగా తేలలేదు. కాని కింది కోర్టులలో మాత్రం తీర్పు తెలుగులో ఇవ్వవచ్చు. న్యాయాధిపతులు తెలుగులో తీర్పు వినిపించి కావాలంటే ఇంగ్లీషులో రికార్డు చేసుకోవచ్చు. అయినా కాని రికార్డులు ఇంగ్లీషులో ఉండడం వల్ల అవి సామాన్య ప్రజలకు అర్థంకాక ఇబ్బంది పడుతున్నారు.

**శాసనాలు :** కోర్టులలో శాసనంలోని వాక్యాలను వ్యాఖ్యానించేటపుడు అవి అనువాదం అయివుంటే వ్యాఖ్యానించటంలో ఇబ్బంది వుండదు. కాని రెండర్థాలు కలిగి ఒకదానికొకటి భిన్నంగా వున్నపుడు ఆ శాసనం మొదట ఏ భాషలో రాయబడిందో ఆ భాషలోని వాక్యాలే వ్యాఖ్యానించి దానిని స్థిరం చేయడం జరుగుతుంది.

కనుక ఇక నుండి రాసే ప్రధాన చట్టాల ముసాయిదా అంటే ఇంగ్లీషులో వున్న పాత చట్టాల సవరణకు సంబంధం లేని చట్టాల ముసాయిదాలను తెలుగులో తయారు చేసి తెలుగులో చర్చించి. తెలుగులోనే స్థిర పరచాలి.

అలా కాకపోయినట్లైతే పాత ఇంగ్లీషు చట్టాన్ని సవరించాల్సిన అవసరం కలిగినప్పుడు అప్పటికప్పుడు ఆ పాత ఇంగ్లీషు చట్టాన్ని అనువాదం చేసి దానిని అధికార భాషా చట్టంలోని 6వ పరిచ్ఛేదం కింద అధికార పాఠంగా ప్రకటించి తర్వాత సవరించిన చట్టాన్ని తెలుగులో ప్రవేశపెట్టాలి.

అన్నిటికన్నా ముఖ్యం ప్రజలు తెలుగు చదవాలి. రచయితలు తెలుగులో శాసనాల ఆంతర్యాలు రాయాలి. పత్రికలు ఈ చట్టాలలో వున్న విశేషాల స్వరూపాన్ని దిగ్రేఖారూపం (బ్లూప్రింట్) ఎప్పటికప్పుడు ప్రజలకు తెలియజేయాలి. అపుడు తెలుగు భాష ప్రయోజనాత్మకంగా అమలవుతుంది.

## న్యాయశాస్త్ర అనువాదం - ఆవశ్యకత

న్యాయశాస్త్రానికి సంబంధించిన అనేక గ్రంథాలు ఆంగ్లంలో వుండటం చేత న్యాయస్థానాలలో న్యాయవాదులు ఆంగ్లంలో వాదోపవాదాలు జరపడం వల్ల సామాన్య మానవులకు న్యాయస్థానాల్లో ఏం జరుగుతుందో, న్యాయనిర్ణేతలు ఏం చేస్తున్నారో అర్థంకాక న్యాయ వ్యవస్థపై అనేక అనుమానాలను పెంచుకొంటున్నారు.

అంతే కాక ప్రజలకు ఏమాత్రం అన్యాయం జరిగినా దానిని న్యాయస్థానానికి తీసుకురావడానికి వెనుకాడుతున్నారు. కోర్టుల్లో ఆంగ్ల భాషను ఉపయోగించడం చేత న్యాయవాదులు ఏం మాట్లాడింది తమకు తెలియని కారణంగా తమకు చాలా వరకు అన్యాయం జరుగుతున్నదని ప్రజలు భావిస్తున్నారు.

మనదేశంలో ఎక్కువ మంది గ్రామవాసులుగాను, నిరక్షరాస్యులుగాను వున్నందువల్ల ఈ పరిస్థితి ఏర్పడింది. కాబట్టి సాధ్యమైనంత వరకు కోర్టులు ప్రాంతీయ భాషనుపయోగించాలి. అపుడే అక్కడి విషయాలను ప్రజలు అవగాహన చేసుకోగలుగుతారు.

దీని ద్వారా ప్రజలకు జరుగుతున్న న్యాయాన్యాయాలను స్వయంగా తెలుసుకోగలుగుతారు. స్త్రీ పరంగా ఆలోచిస్తే సమాజంలో జరిగే అన్యాయాలను ప్రత్యేకించి సామాన్య జీవనం సాగిస్తున్న స్త్రీలు అనుభవిస్తున్న కష్టాన్ని గమనిస్తే వాళ్లకు సామాన్య పౌరుని మొదలు శక్తివంతమైన ప్రభుత్వ వ్యవస్థ వరకు న్యాయ నిర్ణయ విషయంలో నిష్పాక్షికంగా వారిని సమానంగా చూడడంలేదు.

స్త్రీలకు న్యాయరంగానికి సంబంధించిన అన్నీ విషయాలు క్షుణ్ణంగా తెలియాలంటే న్యాయశాస్త్ర రచన అంతా తెలుగులోకి అనువాదం కావాలి. అనువాదం జరగడమే కాక తగవుల పరిష్కారానికి చెందిన వ్యవహారాలన్ని తెలుగులోనే జరగాలని జరిపించాలని ప్రతి ఒక్కరూ ఆశించాలి

అధికార భాష సంఘం తనంతటతానుగా న్యాయరంగంలో తెలుగు భాష అమలు పరచాలనే సదుద్దేశంతో న్యాయపరిపాలనా రంగానికి సంబంధించిన పదకోశాలను, నిత్య జీవితంలో అత్యంత ఆవశ్యకమైన కొన్ని చట్టాలను అనువదించటానికి ప్రయత్నించింది. కాని అనుకున్నంతగా ఫలితాన్ని సాధించలేక పోయింది

న్యాయశాస్త్ర రచనలోని కర్మణి ప్రయోగాలు, యత్తదర్థక ప్రయోగాలు, గర్భివాక్యాలు అనువాదంలో లేకపోతే న్యాయశాస్త్ర విరుద్ధమైపోతుందనే భయాన్ని చాలా సార్లు ప్రభుత్వంవారు, న్యాయ శాస్త్రజ్ఞులు వ్యక్తపరిచారు.

ఈ భయం కారణంగా తెలుగు భాషకు సహజంగా న్యాయశాస్త్ర సూత్రాలని అనువదించ గలిగిన ప్రభుత్వ శ్వేత పత్రాలు, పరిశీలన పత్రాలు (శ్వేత పత్రం 1968:52,65, పరిశీలనా పత్రం 1969:2.5,3.1,5.6,4.2,6.) నొక్కి చెప్పటం చేత తెలుగమలు అనుకున్నంత ఫలితాన్ని ఇవ్వలేదు.

మూలంలోని భావాన్ని తెలుగు వాక్యాలలో ప్రతిపాదిస్తే వాక్యరచనసులభంగా, సజీవంగా వుంటుందని న్యాయశాస్త్రజ్ఞులు, ప్రభుత్వంవారు అర్థం చేసుకొంటే న్యాయరంగంలో తెలుగు అమలు అనుకున్నంత విజయాన్ని సాధించగలదు.

## 4.3 విద్యారంగంలో తెలుగు :

**విద్య సాంఘిక మార్పులు :** స్వాతంత్ర్యానంతరం భారతదేశంలో వచ్చిన అనేక విప్లవాత్మక మార్పులలో అతి ముఖ్యమైంది మన విద్యా విధానంలో ప్రాంతీయ భాషను బోధనా భాషగా ప్రవేశపెట్టడం. ఈ మార్పు శక్తివంతమైన ప్రజల భాషను న్యాయవంతమైన స్థానానికి తీసుకురావడానికి ఉద్దేశించింది.

చారిత్రక కారణాల వల్ల భారతదేశంలో విజ్ఞాన, రాజకీయ, సామాజిక రంగాలన్నింటిలోనూ ఆంగ్ల భాష వేళ్ళూనుకొని పోయింది. భారతీయ భాషలకు న్యాయమైన స్థానాన్ని తిరిగి తీసుకురావడానికి తీవ్ర చర్యలు, అనేక ప్రయత్నాలు జరిగాయి.

ఈనాడు మన భాషలు సాంఘిక జీవనంలోనే కాక సమాజ పునర్నిర్మాణంలో కూడా ప్రముఖ స్థానాన్ని ఆక్రమించాయి. ఆధునికులు తెలుగుకిచ్చిన ప్రత్యేక స్థానం తెలుగును సాంప్రదాయ స్థితి నుండి ఆధునిక వైజ్ఞానిక స్థాయికి తీసుకొచ్చిన మహానుభావులెంతో మంది వున్నారు.

**ఆధునికులు తెలుగుకిచ్చిన ప్రత్యేక స్థానం :**

ఆధునిక మేధావులు కొందరు తెలుగులో సహజపండితులై బెంగుళూరు నుండి "సత్యదూత"అనే మొట్ట మొదటి తెలుగు పత్రిక (1835)ను నడిపారు.[2] అలా క్రమంగా తెలుగు ద్వారా ఆధునిక విజ్ఞానం అందించిన మహానుభావులు, పరిశోధకులు, వయోజన విద్యాధరులు, పత్రికా సంపాదకులు మొదలైన మేధావులైన రచయితలు తెలుగుకు ఆధునిక యుగంలో ప్రత్యేక స్థానం కల్పించారు.

ఆధునిక శాస్త్రాలను తెలుగులో రచించటం సాధ్యమేనని నిరూపించారు. తెలుగును పాఠశాల మాధ్యమంగా పెట్టించారు.[3] గ్రాంధికవాదులను ఓడించి వ్యవహారిక రచనలు చేసి మెప్పించారు. 1947కు పూర్వమే ఆధునిక భాషగా తెలుగును తయారు చేసినవారు.

**గిడుగు మెమొరాండం : గురజాడ డిసెంట్ పత్రం :**

తెలుగు వాడుక భాష, "ప్రామాణిక భాష"గా గుర్తింపు పొందడానికి, అది అన్ని రంగాలలోనూ వ్యాపించడానికి ప్రధాన కారకులు గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావు. వీరిద్దరు ఆధునిక భాషావాదులు కావడం వల్ల ఆ కాలపు పండితులంతా ఒక్కటై వీరి వాదానికి వ్యతిరేకంగా సభలు జరిపి, తీర్మానాలు ప్రకటించి, ప్రభుత్వానికి అర్జీలు పంపుకొని ప్రాచీన కావ్య భాషను బడి పిల్లల పుస్తకాల్లోకొనసాగించడానికి తీవ్రంగా ప్రయత్నించారు.

గిడుగు, గురజాడల ఆధునిక భాషోద్యమం అంతకన్నా తీవ్రంగా సాగింది. గిడుగువారు ప్రత్యేకంగా మద్రాసు, నెల్లూరు, గుంటూరు, మచిలీపట్నం, కాకినాడ, విశాఖపట్నం, విజయనగరం పట్టణాలకు వెళ్ళి అక్కడి విద్యావంతులతో చర్చించి తమ వాదాన్ని విస్తృతంగా ప్రచారం చేసారు. అప్పటికి ఆయనకు ముప్పై సంవత్సరాలుగా ప్రాథమిక పాఠశాల స్థాయి నుండి కళాశాల స్థాయి వరకు బోధనానుభవం వుంది.

అంతేకాక పర్లాకిమిడి మున్సిపల్ కౌన్సిల్ సభ్యుడుగా, గ్రామీణ పాఠశాలల మేనేజరుగా, పురపాలక సంఘ పాఠశాలల సూపరింటెండెంట్‌గా తదితర విద్యాసంస్థల సంబంధిగా పొందిన అనుభవం ఆయన వాదానికెంతో బలాన్నిచ్చింది.

గురజాడ ప్రధానంగా భావుకుడు, కవి, రచయిత, పరిశోధకుడు. గిడుగు ప్రధానంగా భాషా శాస్త్రవేత్త. వీరిద్దరు ఒకే లక్ష్యంతో వేర్వేరుగా రెండు పుస్తకాలు ప్రచురించారు. "ఎ మెమోరాండం ఆన్ మోడరన్ తెలుగు"(1913) గిడుగువారిది."మినిట్ ఆఫ్ డిసెంట్" (1914)గురజాడ వారిది.

ఆధునిక వ్యవహారిక భాషను ప్రామాణిక భాషగా గుర్తించడం వలన ప్రాథమిక పాఠశాలల్లోనూ, సెకండరీ పాఠశాలల్లోనూ దీనిని బోధనా భాషగా వాడడం వలన కలిగే లాభాలు వివరించడం వీరిద్దరి ప్రధాన ఉద్దేశ్యం.

ప్రాచీన కావ్య భాషావాదుల వాదాలను వీరిద్దరు సహేతుకంగా ఖండించారు. శబ్దస్వరూప నిర్ణయంలో పండితులు చేసిన పొరపాట్లను తెలిపారు. అంతర్జాతీయ స్థాయిలో ప్రామాణిక భాషాశాస్త్రవేత్తలుగా గుర్తింపు పొందిన వారి అభిప్రాయాలు పరిశీలించి వాటిని వాదానికి ఉపబలంగా చేర్చుకున్నారు.

వీరిద్దరు శబ్దస్వరూపాలను వివరించే పట్టికలతో, విమర్శలతో అనుబంధాలు చేర్చారు. అయితే రెంటికీ ఒక తేడా వుంది. గురజాడ వారిది "డిసెంట్ పత్రం " ఇది మద్రాసు విశ్వ విద్యాలయం వారు భాషా వివాద పరిష్కారం కోసం నియమించిన "తెలుగు కాంపోజిషన్ సబ్‌కమిటీ మెజారిటీ". సభ్యులు ఇచ్చిన నివేదికకు అనంగీకారం ప్రకటిస్తూ సమర్పించిన పత్రం. అందువల్ల కమిటి సమావేశాల్లో ఆయా సందర్భాల్లో చర్చకు వచ్చిన అంశాలు, ఆయా వ్యక్తుల ధోరణులు గురజాడ స్పష్టంగా వెల్లడించడం జరిగింది.

ఈ రెండు పుస్తకాలు తెలుగు వ్యవహారిక భాషోద్యమ చరిత్రలో నిలిచే తోరణ స్థంభాలని చెప్పవచ్చు.

**మెమొరాండం :** మాతృభాషలో బోధించవలసిన బడిపిల్లల పుస్తకాల్లోనే కాకుండా ప్రభుత్వం కాని, ప్రభుత్వాధికారులు కాని తెలుగు ప్రజలకు రాసే ఉత్తరాలలో, పంపే వర్తమానాల్లో, ప్రచురించే పుస్తకాల్లో, కరపత్రాల్లో, వ్యవసాయం, వాణిజ్యం, పారిశుధ్యం మొదలైన విషయాలు జన సామాన్యానికి తెలియడానికి ప్రచురించే వాటన్నింటిలోనూ వాడుక భాష వాడడానికి అనుమతించాలని గిడుగువారు చెప్పారు.

1903 మార్చి 11న గవర్నర్ జనరల్ కౌన్సిల్ వారి తీర్మానంలో పేర్కొన్నట్టు దేశ భాషలనుపేక్షించటం జరుగుతుందని, ఈ దుస్థితికి మూలకారణం ప్రజలు మాట్లాడే అసలు భాషను - మాతృభాషను ఉపేక్షించడమే అని చెప్పారు.

1822లో సర్ థామస్ మన్రో మద్రాస్ ప్రెసిడెన్సీలో అమలులో వున్న భాషాబోధన సామాగ్రి గురించి చెప్పిన మాటలు.

విద్యార్థి తాను సులువుగాను, బలంగాను, సరిగాను ఏదైనా చెప్పడానికి, రాయడానికి భాషాబోధన తోడ్పడాలి.

మనసులో అనుకున్నది సొంతంగా చెప్పగలిగేలా చెయ్యాలి.

నిర్ధిష్ఠ శ్రోతలకు నిర్ధిష్ఠ లక్ష్యంతో చెప్పగలిగేటట్టు చెయ్యాలి.

క్రమబద్ధమైన ఆలోచనకు విద్యార్థి అలవాటు పడేట్టు చెయ్యాలి.

వాస్తవ విషయాల గురించి ఊహించగల శక్తి, లోకజ్ఞానం విద్యార్థిలో పెరగాలి.

ఒక విషయం మీద నుండి దృష్టి మళ్ళకుండా నిలకడగా కొనసాగే అలవాటు కావాలి.

మనసుకు విషయగ్రహణశక్తి బాగా అలవడాలి.

విద్యార్థిలో సమగ్ర వికాసం కలగడానికి భాషా బోధన తోడ్పడుతుందని ఆంగ్లభాషావేత్త చెప్పిన అంశాలు గిడుగు రామమూర్తి తెలుగు పండితుల దృష్టికి తెచ్చారు.

"విద్యార్థులకు నిర్ణయించే పాఠ్య పుస్తకాలు సులువుగా, అర్థమయ్యే భాషలో రాసినవే కావాలి గాని పరిచయం లేని కావ్య భాషలో రాసినవి కాదు." అని "ది ఇండియన్ ఎడ్యుకేషనల్ పాలసీ"లో స్పష్టంచేయటం జరిగింది.

ఇంగ్లండులో కింది వర్గాల వారి పిల్లలు తమతమ మాండలికాల్లో మాట్లాడుతున్నప్పటికీ వారికి ప్రామాణిక భాషలో బోధన జరుగుతుందనీ అదేవిధంగా తెలుగుదేశంలో కూడా ప్రామాణికభాష - వాడుకభాషను బోధించవచ్చని గిడుగు అభిప్రాయపడ్డాడు.

తెలుగు భాషా బోధన సామాన్యం, ఐచ్ఛికం అనే రెండు విధాలని "ఐచ్ఛికం" కేవలం ప్రాచీన సాహిత్యాన్ని చదవదలుచుకొన్నవారికి బోధించి "సామాన్యం" నిర్బంధంగా విద్యార్థులందరికి బోధించాలని తెలిపారు. "సామాన్యం"ఆధునిక భాషలోనే వుండాలని చరిత్ర, పౌరశాస్త్రం , భూగోళశాస్త్రం ఇందులో చేర్చాలని ఆయన సూచించారు.

**డిసెంట్ పత్రం :** విద్యార్థుల వ్యాస రచనకుపయోగకరమైన ప్రామాణిక శైలిని నిర్ధారణ చేసి చెప్పేందుకు మద్రాసు విశ్వ విద్యాలయం 1910 జులై నెలలో దక్షిణాది భాషల్లో ఒక్కొక్క భాషకు ఒక్కొక్క కమిటి వేశారు. తెలుగు భాషకు సంబంధించిన కమిటీలో ఎమ్. రంగాచార్యులు సమావేశ కర్త.

**కమిటి సభ్యులు :**

కందుకూరి వీరేశలింగం, కొమర్రాజు లక్షణరావు, పి.టి. శ్రీనివాస అయ్యంగార్, పి. రామారాయణి, రెవరెండ్ జె.ఆర్. స్టిల్‌వెల్, గుమ్ముడూరి వెంకట రంగారావు.

గురజాడ అప్పారావు ఈ కమిటి చాలా సార్లు సమావేశాలు జరిపి ఇంటర్మీడియట్ విద్యార్థులు శిష్ట వ్యవహారికంలో రాయడానికి అనుకూలించే విధంగా తీర్మానించారు. ప్రాచీన కావ్య భాషాభిమానులకు యిది దుర్భరమైంది.

వ్యవహారిక భాషా వాదాన్ని ఎదుర్కోవడానికి ఆంధ్ర సాహిత్య పరిషత్తు (తెలుగు ఆకాడమి) స్థాపించారు. శిష్ట వ్యవహారికాన్ని గ్రామ్యమని నిరసించారు. అన్ని రంగాలలో మాదిరిగానే విద్యారంగంలో కూడా రాజకీయ తంత్రం ప్రయోగించి విశ్వ విద్యాలయం నియమించిన ఉపసంఘంలో రాయలసీమకు ప్రాతినిధ్యం కోసం వ్యవహారిక భాషా వ్యతిరేకులకు స్థానం కల్పించారు. వీరి అభిప్రాయానికి గురజాడ అప్పారావు అనంగీకారం ప్రకటించిన ఫలితమే 'డిసెంట్' పత్రం.

'డిసెంబర్' పత్రంలో సులభీకరణ పేరుతో ప్రసిద్ధ రచయితలు రాస్తున్న వ్యాకరణ విరుద్ధమైన రూపాలను గట్టిగా విమర్శించారు. 'వస్తాడు' మాదిరిగా 'స' కార 'త' కార సంశ్లిష్ట రూపాలు అనేకం విరివిగా వాడుకలో వున్న పండితులు వాటిని స్వీకరించడం లేదని విమర్శిస్తూ అనేక పత్రికలలోనూ, (దేశమాత - రాజమండ్రి, ఆంధ్రభారత - మచిలీపట్నం) జనరంజక గ్రంథాల్లోనూ, జానపద సాహిత్యంలోనూ, ఆ రూపాలు ఎంత విరివిగా వాడుకలో వున్నాయో తెలియడానికి అనేక ఉదాహరణలిచ్చారు.

**తెలుగు అకాడమి :** ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1966లో అప్పటి విద్యాశాఖ కార్యదర్శి జె.పి.యల్ గ్విన్ కమిటీ సిఫారసు ప్రకారం తెలుగు అకాడమి 1968లో ప్రారంభించబడింది.

**తెలుగు అకాడమి లక్ష్యాలు :** బోధనా భాషగా తెలుగు నమలు పరచటానికి అనుగుణంగా తెలుగు భాషను ఆధునీకరించటం.

తెలుగులో వివిధ విషయాలకు సంబంధించిన పాఠ్య గ్రంథాలను, రెఫరెన్స్ పుస్తకాలను, పదకోశాలను తయారు చేయడం.

విశ్వ విద్యాలయ స్థాయిలో బోధనా మాధ్యమంగా తెలుగును ఏర్పరచటానికి తగిన సూచనలు చేయడం.

అధికార భాషగా తెలుగును అమలు పరచడానికి తగిన సహాయాన్ని ప్రభుత్వానికి అందించటం.

తెలుగు భాషలోని శబ్ద సంపదను పెంపొందించడానికి పరిశోధనా కార్యక్రమాన్ని చేపట్టడం.

**తెలుగు అకాడమి ముద్రణలు :** ఇంటర్మీడియట్, డిగ్రీ స్థాయిలకు సంబంధించి అనేక విషయాలలో తెలుగులో పాఠ్య గ్రంధాలను తయారు చేసింది.

సమగ్రమైన తెలుగు వ్యాకరణాన్ని సిద్ధం చేయడానికి అనువుగా జిల్లా వారిగా తెలుగు మాండలికాల పరిశీలనను అకాడమి చేపట్టి సమగ్ర నిఘంటు నిర్మాణానికి కృషి చేస్తుంది.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వృత్తి పదకోశాల నిర్మాణాల ద్వారా ప్రజల వాడుకలో వుండి. నిఘంటువులకెక్కని తెలుగు పదాలను సేకరించడానికి, తెలుగు ఆధునిక భాషగా రూపొందటానికి దోహదం చేస్తుంది.

తెలుగు లిపిలో కోయ, గోండు జాతుల వారి భాషల పుస్తకాలను ముద్రించింది.

తెలుగు అకాడమి గతంలో "తెలుగు" త్రైమాసిక పత్రికను ప్రచురించి ప్రస్తుతం 'తెలుగు వైజ్ఞానికమాస పత్రికను ప్రచురిస్తున్నది.

అధికార భాషా సంఘం, రాష్ట్ర ప్రభుత్వ అనువాద విభాగం విశ్వ విద్యాలయాల తెలుగు విభాగాలు, గిరిజన సాంస్కృతిక పరిశోధన శిక్షణ సంస్థమొదలైన వీటి సహకారంతో తెలుగు అకాడమి తన కార్యకలాపాలను నిర్వహిస్తుంది.

తెలుగు అకాడమి ప్రచురించిన "పరిపాలన న్యాయ పదకోశం" తెలుగు అమలుకు ఎంతో తోడ్పడుతుంది.

తెలుగు రాని వారికి భాషా శిక్షణలో, పదకోశ ప్రచురణలో, తీర్పుల అనువాదంలో తెలుగు అకాడమి ఉత్తమ సహకారాన్ని అందించింది.

**మాతృభాషలో విద్యాబోధన :**

మనకు స్వాతంత్ర్యం రాకపూర్వం మన మాతృభాషలకు విశిష్టమైన స్థానం లేదు. మనదేశంలో ప్రథమ స్థానం సంస్కృతానిది. మన సాహిత్య గ్రంథాలు, ఆధ్యాత్మిక గ్రంథాలు, శాస్త్ర గ్రంథాలన్ని సంస్కృతంలో ఉన్నాయి.

పరిపాలనలో రాజకీయ ప్రయోజనాలకోసం పారశీకం, ఉర్దూ, అరబ్బీ, ఆంగ్ల భాషలు అభివృద్ధి చెందాయి. ఆధునిక విజ్ఞాన శాస్త్రమంతా ఆంగ్లభాషలో ఉన్నందువల్ల ఆంగ్లభాషకు ఎక్కువ ప్రాధాన్యత ఏర్పడింది.

1854లో చార్లెస్ ఉడ్స్ నివేదికలను, 1904 సంవత్సరం కేంద్ర ప్రభుత్వ విద్యా విధానంలోను, 1937లో ఉడ్స్ మరియు అబిడ్ నివేదికలలోను, 1938లో గాంధీజీ సూచించిన విద్యా విధానంలోను, 1962లో కేంద్ర ప్రభుత్వం నిర్ణయించిన త్రిభాషా సూత్రంలోను, 1966లో కొఠారి కమిషన్‌లోను క్రమంగా మాతృభాషలకు ప్రముఖ స్థానం కల్పించారు.

**పాఠశాలల్లో బోధనా భాషగా మాతృభాషను నిర్ణయించటం వలన కలిగే ప్రయోజనాలు :**

మాతృభాష ఉగ్గు పాలతో వచ్చింది కనుక విద్యార్థులకు మాతృభాష అలవడినంత సులభంగా ఏ భాషా అలవడదు.

విద్యార్థులు తమ భావాలను మాతృభాషలో చక్కగా వివరించగలరు, పరభాషలో అది సాధ్యం కాదు.

వంశపారంపర్యంగా లభించిన జాతీయ భావాలు, ఆదర్శాలు, సాంప్రదాయాలు, నీతి ధర్మాలు మొదలైనవి తెలుసుకోడానికి మాతృభాష మంచి సాధనం.

మాతృభాషాభిమానం దేశాభిమానానికి ప్రథమ సోపానం.

విద్యార్థులు మాతృభాషలో విషయాలను సులభంగా త్వరగా నేర్చుకొని మరల వాటిని సులభంగా వ్యక్తీకరింపగలరు.

పాఠశాలల్లో వివిధాంశాలు మాతృభాషలో బోధించడం వల్ల విద్యార్థుల స్వయం పఠనానికి, స్వయంకృషికి అవి తోడ్పడతాయి.

కాబట్టి పాఠశాలలో మాతృభాషకు మిక్కిలి ప్రాధాన్యత ఉంది. అందువల్ల మన రాష్ట్ర ప్రభుత్వం మొదటి తరగతి నుండి డిగ్రీ స్థాయి వరకు మాతృ భాషలో విద్యాబోధన జరగాలని సూచించింది.

త్రిభాషా సూత్రం : 1956 సంవత్సరంలో కేంద్ర విద్యా విషయక సలహా పరిషత్తు (కల్చరల్ ఎడ్వయిజరీ ఆఫ్ ఎడ్యుకేషన్) త్రిభాషా సూత్రాన్ని రూపొందించారు.

1. మాతృభాష లేదా ప్రాంతీయ భాష 2. అధికార భాష అయిన ఇంగ్లీషు 3. సహ అధికార భాష అయిన హిందీ

ఈ మూడు భాషలను ప్రతి విద్యార్థి నేర్చుకోవాలి.

తర్వాత త్రిభాషా సూత్రం సంస్కరింపబడింది. **(Modified three Language formula)**

1. మాతృభాష లేక ప్రాంతీయ భాష 2. జాతీయ భాష హిందీ 3. ఆధునిక భాష - ఇంగ్లీషు లేక ఏ యితర భాష

పాఠశాల విద్యార్థులు ఈ మూడు భాషలను నేర్చుకోవలసి వుంది.

మన దేశంలో కాకుండా అమెరికా, ఇంగ్లాండు మొదలైన దేశాలలో వారి మాతృభాషతో పాటు రెండు లేక మూడు ఇతర దేశ భాషలను కూడా నేర్చుకుంటారు.

అదే విధంగా మనం కూడా మాతృభాషనే కాకుండా యితర భాషను కూడా నేర్చుకోవచ్చు.

త్రిభాషా సూత్రం అన్ని రాష్ట్రాలలో సక్రమంగా నిర్వహింపబడలేదు. ఉత్తర భారతదేశంలో కొన్ని రాష్ట్రాల ప్రజలకు మాతృభాష హిందీ, జాతీయ భాష కూడా హిందీయే. అయితే వీరు మాతృభాషగాను, జాతీయ భాషగాను హిందీ భాషను మాత్రమే నేర్చుకొంటున్నారు.

మన పొరుగు రాష్ట్రమైన తమిళనాడులో వారి మాతృభాష తమిళం, అంతర్జాతీయ భాషయైన ఇంగ్లీషుని నేర్చుకుంటున్నారు. త్రిభాషా సూత్రాన్ని వీరు పాటించటం లేదు.

పింగళి లక్ష్మికాంతం సంఘం :- ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం 1965 ఆగష్టు 20 తేదీ విద్యాశాఖ జీవో 22 65 ద్వారా ఆచార్య పింగళి లక్ష్మికాంతం అధ్యక్షతన ఒక సంఘం నియమించి జాతీయం చేయబడిన పాఠశాలల్లో పాఠ్యపుస్తకాలు, శిష్ట వ్యవహారికం ఏ విధంగా వాడవలెనో నిర్దేశించ వలసిందిగా కోరారు.[4]

పింగళి లక్ష్మికాంతం సంఘం భాషేతర పాఠాలను, రెండవ భాష పాఠాలను మొదటి శిష్ట వ్యవహారికంగా వాడవలసిందని సూచించారు వీరి సూచనలను ప్రభుత్వం అంగీకరిస్తూ 1967 ఫిబ్రవరి 25 తేదీన మెమో జారీ చేసింది.[5]

ఈ సిఫారసుల మేరకు విద్యాశాఖ వారు భాషా పాఠశాలల్లో సరళ గ్రాంధికం, ఇతర పాఠ్య పుస్తకాలలో శిష్ట వ్యవహారికం వాడుతున్నారు.

ప్రభుత్వ వ్యవహారాలలో శిష్ట వ్యవహారికం అనేది కాకుండా సామాన్య జన భాషలో వ్యవహరించ వలసి వుంటుంది. భావం స్పష్టంగా వ్యక్తం కావడం పరిపాలనలో వున్న భాషకవసరం. ప్రజలకు సులభంగా బోధపడటం ముఖ్యం. వీటిని సంతృప్తి పరిచే విధంగా భాషల వ్యవహారం జరగాలి.

తెలుగు భాష యింతవరకు సాహిత్య భాషగా మాత్రమే వుంది. బోధనా భాషగా ప్రవేశ పెట్టడంతో బోధనలో రావలసిన శాస్త్రీయ, సాంకేతిక రంగాలకు కూడా సరిపడగల తెలుగు పదాలు అమలు జరపుకోవడంలో నిత్య వ్యవహారంలో వాడుతున్న తెలుగు పదాలు ప్రజలు వాడుతున్న పదజాలం నుండి సమీకరించి గ్రంథస్థం చేయాలి.

**బోధనా భాషగా తెలుగు నిర్ణయం :** 1966లో ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం శాసన రూపం దాల్చిన తర్వాత బోధనా భాషగా తెలుగును ఇంటర్మీడియట్, బి.ఎ; బి.కాం, బి.యస్సీలలో ప్రవేశ పెట్టడం జరిగింది. భారతదేశంలోని విద్యావిధానాన్ని సమూలంగా పరిశీలించి 1966లో కొఠారి కమిషన్ తన నివేదికను భారత ప్రభుత్వానికి సమర్పించింది. దాని ననుసరించి కేంద్ర ప్రభుత్వం జాతీయ విద్యా విధానాన్ని నిర్వచిస్తూ ప్రాధమిక, మాధ్యమిక, ఉన్నత, కళాశాల స్నాతకోత్తర స్థాయిలలో కూడా మాతృభాషను బోధనా భాషగా నిర్ణయించటం జరిగింది.

బోధనా భాషగా మాతృభాషను అమలు జరుపటంలో కొఠారి కమిషన్ విద్యావిషయ చర్చలకు వచ్చినప్పటికి ఇంటర్మీడియట్‌లో తెలుగును బోధనా భాషగా అమలు జరపాలని ప్రథమంగా నిర్ణయించిన రాష్ట్రం ఆంధ్ర ప్రదేశ్.

అప్పారావు కమిటి నివేదిక. (11-1-11971) విద్యా సంస్థలకు సంబంధించిన చర్చ సభలో శ్రీ పురిపండా అప్పలస్వామి కొన్ని తీర్మానాలను ప్రతిపాదించారు.

**అవి :** 1. శాస్త్ర విషయాలపై ప్రామాణిక రచనలు వ్యవహారిక భాషలో విరివిగా జరుగుతున్నాయి. కనుక ఆంధ్ర విశ్వ విద్యాలయంలో తెలుగులో పి.హెచ్.డీ. కై సమర్పించే పరిశోధన వ్యాసాలు వ్యవహారిక భాషలో రాయవచ్చు.

2. నేడు వ్యవహారిక భాష దేశమంతట ప్రచారంలో ఉండి పత్రికలు, రేడియోలు, సినిమాలు వ్యవహారికాన్ని వాడుతున్నాయి. పండితులు కూడా వ్యవహారిక భాషను ఉపయోగిస్తున్నారు. ప్రామాణిక శాస్త్ర గ్రంథాలు, ప్రభుత్వ వ్యవహారాలన్ని వ్యవహారిక భాషలో జరుగుతున్నాయి. కనుక ఆంధ్ర విశ్వ విద్యాలయంలోను అన్ని స్థాయిలోను తెలుగు పరీక్ష పత్రాలకు సమాధానాలు వ్యవహారిక భాషలో రాయవచ్చు. అన్ని తరగతుల పాఠ్యపుస్తకాలు వ్యవహారిక భాషలో ఉండవచ్చు.

ఈ తీర్మానాలమీద గణనీయమైన చర్చ జరిగిన తర్వాత తీర్మానాన్ని ఆమోదించటానికి నిపుణులతో కూడిన కమిటి ఏర్పరచి విద్యాసంస్థలకు సంబంధించిన కౌన్సిల్ ముందు నివేదిక వుంచటం జరిగింది.

శ్రీ యం.ఆర్. అప్పారావ్ (ఛైర్మెన్), సభ్యులుగా శ్రీ అబ్బూరి రామకృష్ణరావు, ప్రొఫెసర్ కె. లక్ష్మి రంజనం, ప్రొఫెసర్ బి.హెచ్. కృష్ణమూర్తి, ప్రొఫెసర్ జి.యన్. రెడ్డి, ప్రొఫెసర్ కె.వి.ఆర్. నరసింహం, శ్రీ పురిపండా అప్పలస్వామి, డా॥ ఎన్.వి.ఆర్. కృష్ణమాచార్యులు, డా॥ పి.యస్.ఆర్. అప్పారావు, డా॥ సి. రామారావు, డా॥ టి. దోణప్ప.

నివేదికలోని ముఖ్యాంశాలు :

1. విశ్వ విద్యాలయంలోని తెలుగు భాషలో ఇమిడిఉన్న విషయాలు లేదా పదాలు ఆధునిక విద్యా విధానాన్ని అనుసరించే విద్యార్థుల అవసరాలకనుగుణంగా ఉన్నాయా? సంఘంలో వారు నిర్వర్తించే పాత్రకు అనుగుణంగా ఉన్నాయా?

2. కళాశాల, విశ్వ విద్యాలయ స్థాయిలో తెలుగు భాష క్రమశిక్షణకు అనుగుణంగా వ్యవహారిక భాష అధ్యయనం జరుగుతుందా?

3. ప్రామాణికత విలువలలో వ్యవహారిక భాష గుర్తింపు సమస్యగా ఏర్పడినప్పుడు కమిటి ఎటువంటి సూచనల ద్వారా ఈ సమస్యను పూరిస్తుంది.

4. ఒకవేళ గ్రాంథిక భాష అన్ని స్థాయిలలోను అమలుపరిస్తే లేదా కొన్ని సందర్భాలలో కొనసాగిస్తే లేక అసలు లేకుండా ఉంటే.

5. వ్యవహారిక భాషలో ముద్రితమైన ఉన్న లేదా రాసివున్న పుస్తకాలను ఆధునిక గద్య, పద్య, నవలకు అనుగుణంగా సూచించినయెడల ఆధునిక భాషకనుగుణంగా ఒక ప్రతినిధిగా ఎంపిక చేసి తయారు చేయవచ్చు.

ఈ విషయాలపై చర్చించేందుకు కమిటి ఐదుసార్లు సమావేశం జరిపింది.

మొదటి సమావేశం 1971 మే 3,4 తారీఖుల్లో హైదరాబాదులో

రెండో సమావేశం 1971 మే 29న తారీఖున వాల్తేరులోని సి.ఆర్.ఆర్. విహారంలో

మూడో సమావేశం 1971 జూలై 10, 11వ తారీఖుల్లో తిరుపతి తిరుమల హిల్స్‌లో

నాల్గో సమావేశం 1971 ఆగష్టు 12, 13 తారీఖుల్లో హైదరాబాదు తెలుగు అకాడమిలో

ఐదో సమావేశం 1973 జూలై 4, 5 తారీఖుల్లో వాల్తేర్‌లోని సి.ఆర్.ఆర్. విహారంలో

**కమిటి నివేదిక సూచనలు :**

మొదట సమావేశం జరపటానికి ముందు చెర్మన్ ఎం.ఆర్. అప్పారావు గారు పైన పేర్కొన్న ఐదు విషయాలపై సభ్యుల అభిప్రాయాలను కోరారు. సభ్యులు తెలిపిన అభిప్రాయాలను క్రోడీకరించి ఈ సూచనలను అందరూ ఏకీభవించారు.

ప్రస్తుత పరిస్థితులలో తెలుగు భాషలో ఉన్నటువంటి సూచనలు చాలినంతగా లేకుండటం, పరిస్థితులు చక్కబరచటానికి మార్పులు చేయవలసిన అవసరం ఉంది.

కళాశాల, విశ్వ విద్యాలయ స్థాయిలో, తెలుగు భాష క్రమశిక్షణననుసరించి వ్యవహారిక భాషను అధ్యయనం చేయటం.

వ్యవహారిక భాషకు కొన్ని ప్రత్యేక సూచనలు పొందుపరచడం.

వివిధ కాలాల్లో రాయబడిన గ్రాంథిక భాషను విశ్వ విద్యాలయ స్థాయిలో కొనసాగించవలెనని సూచించాలి.

వ్యవహారిక భాషలో వాడబడినటువంటి పుస్తకాలను గద్య, పద్యభాగాలు, నవల, మొదలైన స్థాయిలలో తప్పనిసరిగా సూచించవలెను. దీనివల్ల ఆధునిక భాష ఒక ప్రతినిధిగా వ్యవహరించుటకు అవకాశం ఉంటుంది.

అదేవిధంగా మూడు విశ్వ విద్యాలయ పరిధిలోని రచయితలను, మేధావులను, విమర్శకులను, పత్రికా ప్రతినిధులను ఇంటర్వ్యూ చేయవలెనని తీర్మానం చేశారు.

ఆంధ్ర విశ్వ విద్యాలయ పరిధిలో - శ్రీ నార్ల వెంకటేశ్వరరావు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ, శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య, శ్రీ తెన్నేటి విశ్వనాథం.

శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం పరిధిలో శ్రీ గడియారం శేషశాస్త్రి,శ్రీ మదురాంతకం రాజారాం, డా॥ జి. చెన్నారెడ్డి, శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్ర మొదలైనవారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం పరిధిలో శ్రీ డి. రామానుజం, డా॥ డి.వి. అవధాని, శ్రీ బోయి భీమన్న, శ్రీమతి పి. సంస్వతీ దేవి, శ్రీ తాపి ధర్మారావు, డా॥ సి. నారాయణరెడ్డి, శ్రీమతి యన్. కృష్ణకుమారి.

వీరిని కలిసి ఇంటర్వ్యూచేసిన విషయాలను, వీరు వెలిబుచ్చిన అభిప్రాయాలను రెండో సమావేశంలో చర్చించారు. డా॥ బి.హెచ్. కృష్ణమూర్తి గారు శిష్ట వ్యవహారిక భాష గూర్చి తయారు చేసి వుంచిన ఒక ప్రతిని ఈ సమావేశం లో కమిటి సభ్యులకు పంచి దానిపై వారి సూచనలు, అభిప్రాయాలు కోరారు.

మూడో సమావేశంలో ముగ్గురు సభ్యులతో ఒక సబ్-కమిటి గా ఏర్పడి నివేదికను సమర్పించడం జరిగింది. వారు ప్రొ॥ బి.హెచ్. కృష్ణమూర్తి, ప్రొ॥ లక్ష్మి రంజనం, డా॥ సి. రాజారావు.

నాలుగో సమావేశంలో కమిటి విశ్వవిద్యాలయాల్లో నిర్వహించేటువంటి అన్ని తెలుగు పరీక్షల విధానంలో వ్యవహారిక భాష మాధ్యమంగా వుండేటటువంటి ప్రశ్నలను ప్రవేశ పెట్టవలెనని విశ్వవిద్యాలయ స్థాయిలో పరిశోధన వ్యాసం తయారు చేసేటప్పుడు వ్యవహారిక భాషను ప్రవేశవెట్టవలెననే విషయంపై చర్చించారు.

ఈ విధానం సరైనదేనని కమిటి సభ్యులందరు అభిప్రాయపడ్డారు. విద్యార్థులు జవాబులు రాసేటప్పుడు గ్రాంథిక భాషలో గాని, వ్యవహారిక భాషలోగాని రాయడానికి వారికి తగిన ఎంపిక తప్పనిసరిగా యివ్వవలెనని సభ్యులు అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

ఈ విషయంపై కమిటి చైర్మన్ ఓటుపద్ధతి నిర్వహించినపుడు తెలుగు పరీక్ష విధానంలో వ్యవహారిక భాషను మాత్రమే తీసుకొనవలెననే వాదనను ఆరుగురు సభ్యులు ఓటు చేయగా, గ్రాంథికం గాని వ్యవహారిక భాషను కాని ఎంపిక చేసుకొనే అవకాశం వుండాలని ముగ్గురు ఓటు వేయటం జరిగింది.

మెజారిటీ సభ్యులు వేసిన ఓటు ననుసరించి కమిటీ ఈ కింది తీర్మానం కమిటి చేసింది.

విశ్వవిద్యాలయాల స్థాయిలో అన్ని తెలుగు పరీక్ష విధానాలలో శిష్ట వ్యవహారిక భాష మాధ్యమంగా ఉండాలని, విశ్వవిద్యాలయ స్థాయిలో పరిశోదక వ్యాసాలు కుడా శిష్టవ్యవహారిక భాషలలో వుండాలని సూచిస్తూ తీర్మానం చేసినారు.

ముగ్గురు సభ్యులతో ఏర్పడిన సబ్ కమిటి 1997లో తమనివేదికను పూర్తిచేసింది. 16-04-1973 నాడు సబ్‌కమిటి ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని ఆర్ట్స్ కళాశాలలో సమావేశమై, కమిటిలోని సభ్యులకందరికి తమ నివేదికను ఇచ్చి దానిపై వారి అభిప్రాయాలను, సూచనలను కోరింది.

నాల్గో సమావేశంలో విద్యార్థులు పరీక్షలకు సమాధానాలు రాసేటప్పుడు తనకునచ్చిన గ్రాంథిక భాషను గాని వ్యావహారిక భాషను గాని ఎంపికచేసికోవడానికి వీలుకల్పించే విధంగా కమిటి సభ్యులందరు తీర్మానాన్ని ఆమోదించాలని సబ్‌కమిటి సూచించింది.

ఐదోసమావేశంలో సబ్ కమిటి చేసిన సూచన పై చర్చించి కొద్ది సవరణతో ఆ తీర్మానాన్ని ఆమోదించవలెనని కమిటి చర్చించింది.

**కమిటి ఏకగ్రీవంగా ఆమోదించి తీర్మానించిన నివేదిక :**

1) విశ్వవిద్యాలయాల్లో నిర్వహించేటువంటి తెలుగు పరీక్షలలో శిష్టవ్యవహారిక భాష మాధ్యమంగా వుండాలని, పరిశోధక స్థాయిలో వ్యాసాలకు వ్యవహారిక భాష మాధ్యమంగా ఉండాలని, ఈ తీర్మానాన్ని శ్రీకారం చేసిన తేదీ నుండి విశ్వవిద్యాలయాలలోని నూతన విద్యార్థులుకు అమలు చేయాలని కమిటీ తీర్మానించింది.

2) ప్రస్తుతం అమలులో విధానం ప్రకారం విద్యార్థులు పరీక్ష కాలంలో మాధ్యమంలో మార్పులు చేస్తే వారిపై నిర్బంధ చర్యలు తీసుకోకూడదని, యిటువంటి సమయంలో విద్యార్థులకు `ఎంపిక' అవకాశం కల్పించాలని తీర్మానించారు.

**గ్రాంథిక - ఆధునిక భాషా వివాదం :**

నన్నయ భారతంలో ఉపయోగించిన భాష సమకాలీన ప్రామాణిక భాష అంటే భాషాశాస్త్రం ఒప్పుకోదు ఏ ఒక్క రచయిత నన్నయ భాషను ప్రామాణికంగా తీర్చిదిద్దడానికి ఇప్పటివరకు ప్రయత్నించలేదు.

11వ శతాబ్దంలో రెండు విధాల భాష సమకాలంలో వుంది. ఒకటి అందరికి తెలిసిన గద్యశాసనం (వ్యవహారం) రెండవది పద్యాదికావ్యాలలో ఉన్నది.(సాహిత్యభాష) శబ్ద దోషముల వల్ల గాని, కొన్ని మార్పులవల్ల గాని మాట్లాడే భాషలో ఒక పద్ధతి ప్రకారంగా మార్పువచ్చినప్పటికి పద్యభాగంలోని పదపొందికలో మార్పురాలేదు. వాటికి బాధ్యత ఏర్పడింది. వ్యవహారాన్ని గ్రహించలేదడానికి రెండుకారణాలున్నాయి.

1) సమకాలీన గ్రాంథిక భాష కంటే 11, 13 శతాబ్దాలలో శాసనాలలోవున్న భాష 20వ శతాబ్దం నాటి వ్యవహారిక భాషకు దగ్గరగా వుంది.

2) నన్నయ ముందు కాలంలో భాష వాడుకలో వున్నప్పటికి నన్నయ ఉపయోగించిన భాషలో గణనీయమైన మార్పులున్నాయి.

| నన్నయ వాడిన భాష | 11, 14 శతాబ్దాల శిలాశాసనాల్లో |
|---|---|
| ఇచ్చితిమి | ఇస్తిమి |
| ఇచ్చినవాడు | ఇచ్చినాడు |
| నాల్గవ | నాలుగోం |

ఈ విధానాలలో కొంత పరిసరప్రభావం వుంది. పద్యశైలిలో ఎన్నో వ్యవహారిక భాషా పదాలు కనిపిస్తాయి. అదేవిధంగా శాసన భాష కూడా కొంత పద్యశైలిని అప్పుడప్పుడు ప్రదర్శిస్తుంది. దీనికి నిదర్శనం గిడుగు `గద్యచింతామణి' లో వ్యక్తం చేసిన అన్నమయ్య పదాలు.

ఈ రెండు విధానాల మధ్య కాలక్రమంగా వైవిధ్యం పెరిగింది.

1) పద్యభాగంలోని వివిధ రూపాలను మేధావులు రాజులు ఆదరించారు. గద్య భాగాన్ని సాహిత్య వ్యక్తీకరణ సాధనంగా తెలియచేయడానికి అవకాశం యివ్వలేదు. శాసనాల ప్రకారం వచనాన్ని (గద్యభాగం) సామాన్య ప్రజలకు చిన్నచిన్న సమాచారాలను తెలియచేయడానికి మాత్రమే ఉపయోగించారు

2) ప్రజా ప్రక్రియలు, జానపద ప్రక్రియలైన జానపద గాథా గేయాలు చాలా సంవత్సరాల పాటు భద్ర పరచకుండా వుండిపోయాయి. భద్రపరచటానికి తగిన సాహిత్యంగా వాటిని భావించలేదు. కాని అన్నమయ్య రచనలు రాగిఫలకాల మీద నిలిచి సమకాలీన భాషను అందిస్తున్నాయి. వీటిలో అప్పటి వాడుక భాషతో పాటు కొంత గ్రాంథిక భాష కూడ కలిసిఉంది. తర్వాత కాలంలో జానపద నృత్య రూపకమైన యక్షగానం కొంతసాహిత్య స్థాయిని, రాజరికపు గుర్తింపు, పోషణను పొందింది.

3) కవిత్రయ రచనను దృష్టిలో వుంచుకొని తెలుగు వ్యాకరణాలు గ్రాంథిక భాష కోసం రాయటం జరిగింది దీనికి అనుగుణంగా లేని ప్రతిదానిని తప్పని ఖండించారు. కవిత్రయం ఉపయోగించిన భాషకు లోబడి ఉండడమే కాదు, ప్రజావ్యవహారంలోని భాషకు వీలైనంత దూరంగా వుండాలి అదే సాహిత్య ప్రామాణికతకు గుర్తింపు. అందువల్ల వ్యాకరణవేత్తలు ప్రయత్నపూర్వకంగా వ్యవహారిక భాషకు దూరం అయ్యారు.

4) వ్యాకరణ కర్తలు, విద్యావంతుల భాషను, శిష్టుల భాషను నిషేధించారు. వ్యాకరణవేత్తలు కొన్ని సమయాలలో చదువురాని వారి వద్ద పద సంయోగాలనుపయోగించేవారు.

5) గద్యభాగాన్ని మాధ్యమికంగా వుంచి వ్యవహారిక భాషను స్థానిక పత్రికల ద్వారా, ప్రసంగాల ద్వారా, ఉత్తర ప్రత్యుత్తరాలు ద్వారా, ప్రసిద్ధి చెందిన కథలద్వారా పాఠ్యపుస్తకాల ద్వారా బోధించేవారని తెలుస్తుంది.

6) గద్యభాగాన్ని యోగ్యత లేని భాషగా స్పష్టంగా తెలియచేయలేదు. 19,20శతాబ్దాల వరకు ఏ రచయిత ఈ విధంగా తలచలేదు. 11, 14 శతాబ్దాలలో కవిత్రయం ఉపయోగించినటువంటి వాడుకను బట్టి తెలుగు భాష ఒక ఉన్నత ప్రమాణంగా తీసుకొని రాయబడింది. తెలుగు భాష ప్రజలు మాట్లాడే ప్రాంతాలన్నింటిలో ఒకే విధంగా ఉంటుంది. కారణం దీనిలో ప్రత్యేక నిబంధనలున్న వ్యాకరణాంశాలున్నాయి. అవి ఏది తప్పో- ఏది ఒప్పో నిర్ణయిస్తాయి.

అదే వ్యవహారిక భాష అయితే వ్యక్తి నుండి వ్యక్తులకు, ప్రదేశం నుండి వేరొక ప్రదేశానికి, మార్పుచెందుతూ ఉంటుంది. దీనికి భాష కాని వ్యాకరణం కాని లేవు.

7) వ్యాకరణ కర్తలందరు వాడుక భాషను 'గ్రామ్య' అని అంటారు దీని భాషా శైలిని మార్చవలెను.

8) వ్యవహారిక భాషను ఉపయోగిస్తే ముందు తరాలలో తెలివితేటలు లోపిస్తాయి. ఒక వేళ ఇదేవిదంగా కొనసాగించిన యెడల వంశ పారంపర్యంగా వస్తున్న సాంప్రదాయక భాష ఉనికిని కోల్పోవలసి వస్తుంది.

9) వ్యవహారిక భాషను, గ్రాంథిక భాషకు దగ్గరగా తీసుకురావడం మంచిది లేనియెడల గ్రాంథిక భాషకు ముప్పు రావచ్చు.

10) వ్యవహారిక భాషకు, వ్యాకరణ భాషకు గల తేడాను, స్టాండర్డ్ ఇంగ్లీషు [గ్రామర్ ఇంగ్లీషు] మాట్లాడే ఆంగ్లానికి సరిపోల్చవచ్చును. లేదా మిడిల్ ఇంగ్లీషు కు ఆధునిక ఆంగ్లానికి సరిపోల్చవచ్చు.

వ్యవహారిక భాష చాలా పురాతనమైనది, ప్రస్తుతానికి ఆధునిక విద్యావిధానంలో పెద్దమొత్తంలో మాధ్యమంగా ఉంచడానికి తగిన రీతిలో లేదు. వ్యాకరణ భాషను కొన్ని పాఠ్యపుస్తకాలకు మాత్రమే అన్వయించవచ్చు. చదువుకొన్నవారు సత్ప్రవర్తనతో మాట్లాడే తెలుగు భాష అయిన శిష్ట వ్యవహారిక భాషను మాధ్యమంగా గద్యభాగ పరిభాషలో, పరీక్షలలో ఉపయోగించాలని ఆధునిక భాషావాదులు అభిప్రాయ పడ్డారు.

**తెలుగు భాషా కమిటి సిఫారసులు :**

1) విశ్వవిద్యాలయ పరీక్షలలో, పరశోధన వ్యాసంగాలలో వ్యవహారిక తెలుగు భాషను మాత్రమే తప్పనిసరిగా ఉపయోగించవలెను.

2) విద్యార్థులు మన భాషా సంస్కృతిని మరచిపోకుండా వుండేందుకు కఠినమైన వృద్ధి చెందని గ్రాంథిక భాషను చదవటానికి ప్రోత్సహించి, వారికి అందుబాటులో ఉండేవిధంగా అమలుపరచాలి.

3) సరళ గ్రాంథికంలో రాయబడినటువంటి పుస్తకాలలో ఏవిధమైన ప్రత్యేకమైన భాషా పరిజ్ఞానం లేనటువంటి పాఠ్యాంశాలు, డిటైల్డ్ నాన్ డిటైల్డ్ పుస్తకాల నుండి తొలగించవలెను.

4) మంచి గ్రంధకర్తలు రాసిన వ్యవహారిక, గద్య భాగ పుస్తకాలను మాత్రమే విద్యార్థులకు సూచించవలెను.

5) విశ్వవిద్యాలయం కళాశాలల భాషా ఉపాధ్యాయులకు వేసవి శిక్షణా శిబిరాలు నిర్వహించవలెను.

6) బోధనా భాషలోని పాత పద్ధతులను, యితర సామాగ్రిని, వాటికి సంబంధించిన సిలబస్‌ను పునః పరిశీలించవలెను.

7) కమిటి సిఫారసు చేసిన విషయాలను ఎప్పటికప్పుడు పునః సమీక్షించవలెను.

8) ప్రచురితంకాని, ప్రచురితమైన అన్ని రకాల విషయాలను క్రోడీకరించి విశ్వవిద్యాలయం వారు ముద్రించి భద్రపరచవలెను.

డిగ్రీస్థాయిలో పుస్తకాలను సూచించేటపుడు పరిశీలించవలసిన విషయాలను కమిటీ సూచించింది.

1) ఏ పుస్తకాన్ని కూడా అది ముద్రితమైన తేదినుండి ఐదు సంవత్సరముల వరకు సూచింపరాదు.

2) ఆధునిక గద్యభాగం పద్య భాగంలోని ముఖ్యమైన అంశాలు విశ్వవిద్యాలయ కమీషను చే సూచింపబడినవై ఉండవలెను.

3) సంస్కృతం నుండి అనువదింపబడిన నాటకాలే కాకుండా, వ్యావహారిక భాషా నాటకాలను, ఆక్షేపణ లేనటువంటి నాటకాలను సూచించవలెను.

4) అనువదింప బడిన గద్యభాగాలను, క్రోడీకరించిన గద్యభాగాలను, విశ్వవిద్యాలయ కమీషనుచే సూచింపబడాలి. నవలలు, పద్యాలు, డ్రామాలకు ఈ అవసరం లేదు.

5) ప్రసిద్ధి చెందిన రచయితల పుస్తకాలను సూచించవలెను

**బోధనా భాషగా తెలుగు**

1969 వరకు 10వ తరగతి వరకు తెలుగు బోధనా భాషగా వుండగా 1969లో భారత దేశంలో అన్ని రాష్ట్రాల కన్నా ముందుగా ఇంటర్, డిగ్రీ తరగతులలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగును బోధనా భాషగా ప్రవేశ పెట్టింది.

తెలుగు బోధనా భాషగా చదివిన వారికి 1976 నుండి ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీసు కమీషను పరీక్షలలో ప్రతి పరీక్షా పత్రానికి ఐదు మార్కులు అదనంగా యివ్వడానికి కూడా ఏర్పాటు చేయబడింది.

తెలుగు యింతవరకు సాహిత్య భాషగా బోధించబడుతున్నది. ఇంటర్, డిగ్రీ తరగతులలో తెలుగును బోధనా భాషగా చేయడంలో ఆ తరగతులలో అన్ని పాఠ్యాంశాలకు వివిధ పాఠ్య గ్రంధాలు అవసరం అయ్యాయి. వాటిలో రచన, ప్రచురణలు నిర్వహించడానికి తెలుగు అకాడమికి అప్పగించడం జరిగింది.

ఆపై తరగతులలో అంటే పట్టభద్రానంతర తరగతులలో తెలుగు బోధనా భాషగా చేయనందున అంతవరకు తెలుగు భాషలో చదివిన విద్యార్థులు పట్టభద్రానంతర తరగతులకు ఇంగ్లీషులో దూకవలసి వచ్చింది. మరల ఇంగ్లీషు ప్రారంభింపక తప్పనిస్థితి ఏర్పడింది. దాని ఫలితంగా తెలుగు బోధనా భాషగా తీసుకొనుటలో మందకొడితనం ఏర్పడింది. అందువలన ఆ తరగతులకు తగిన పాఠ్యపుస్తకాలు తెలుగులో లేకపోవటానికి కారణమైంది.

ప్రాథమిక స్థాయి : ప్రాథమిక పాఠశాలలో తెలుగు బోధన తెలుగు సంప్రదాయాన్ని, సంస్కృతిని ప్రతిబింబించటంలేదు. పాఠశాలలో విద్యార్థి అడుగుపెట్టడానికి పూర్వమే మాతృభాషను విని, మాట్లాడగలిగే స్థితిలో విద్యార్థి వుంటాడు. పాఠశాలలో చేరిన తర్వాత రాయడం, చదవడం అనే భాషా నైపుణ్యాన్ని విద్యార్థి నేర్చుకోవాల్సి వుంటుంది.

1961 లో ప్రభుత్వం ప్రాథమిక చట్టాన్ని చేసినప్పటికి, రానురాను ప్రాథమిక విద్యలో చేరే వయస్సున్న విద్యార్థుల్లో సగంమంది బడికి రావడంలేదు. పాఠశాలకు వచ్చిన కొద్దిమందిలో నూటికి డెబ్బయిమంది ప్రాథమిక విద్యాస్థాయి ముగిసేటప్పటికే చదువుమానుకొంటున్నారు. దీనికి కారణాలేమైనప్పటికి "పాఠశాలల్లో ప్రాథమిక స్థాయిలో తెలుగు భాషా బోధన" ఎలా ఉండాలి అని పరిశీలిస్తే ఈ స్థాయిలో లేఖన, పఠన విషయాలకు ప్రాధాన్యం యివ్వాలి. లేఖన, పఠన నైపుణ్యాన్ని విద్యార్థికి మొదటి రెండు సంవత్సరాల్లో నేర్పించాలి.

పాఠ్యపుస్తకాల ప్రభావం ఈ నైపుణ్యాల మీద వుంటుంది. ఐదారు సంవత్సరాలవయస్సున్న పిల్లలు సులభంగా అక్షరాలు గుర్తుపట్టడానికి పాఠ్యపుస్తకాల్లో వాడవలసిన అక్షరాల సైజు ఎంత ఉండాలనేది యింకా నిర్ణయించలేదు. అలాగే లైనుకులైనుకు మధ్య దూరం ఎంత వుండాలి, వాక్యాలు ఎంత పొడవుండాలి అనేవి నిర్ణయించబడలేదు.

క్లాసులో ఎంతమంది విద్యార్థులున్నా సాయంత్రం పూట గుణింతాలు సామూహికంగా చెప్పించాలి. దీనివల్ల పఠన సౌలభ్యం పెరుగుతుంది. ఈ సమయంలో ఉచ్చారణ దోషాల సవరణ ముఖ్యం.

అక్షరాలు అంటే అచ్చులు, హల్లులు, గుణింతాలు, సులభంగా నేర్చుకొనేందుకు తగిన శిక్షణ యివ్వాలి.

ప్రాథమిక దశలో పాఠ్యపుస్తకాల్లో పిల్లలకు ఆకర్షణీయంగా వుండే బొమ్మలు, వాటికి తగిన రంగులు పుస్తకాల ముద్రణాలయాలకు సూచించాలి. ప్రాథమిక స్థాయిలో మొదటి రెండు సంవత్సరాలలో విద్యార్థి అక్షరాలన్ని రాసి స్పష్టంగా ఉచ్చరించగలగాలి.

ఇందుకు కావలసిన 'పెద్దబాలశిక్షలు' తయారుకావడం లేదు ప్రాథమిక స్థాయిలోని మొదటి మూడు నాలుగు సంవత్సరాలు భాషకు, గణితానికి ప్రాధాన్యత నివ్వాలి. దీని వల్ల విద్యార్థికి భాషా పాటవం పెరుగుతుంది. ఈ స్థాయిలో విద్యార్థికి పరభాషలను అలవరచకూడదు.

శ్రవణ భాషణా నైపుణ్యానికి తద్వారా పఠన లేఖనా నైపుణ్యానికి గేయాలు, గీతాలు, శతక పద్యాలు, సామెతలు, జాతీయాలు కంఠస్థం చేయించాలి.

మానవుణ్ణి చివరిదాకా అంటిపెట్టుకోని వుండేది, తరగని ఆస్తిగా, పెరిగేనిధిగా అడుగడుగున బాసటగా వుండేది మాతృభాషలో ఆతడు గడించుకొన్న పద సంచయమే.

ప్రాథమిక స్థాయిలో అచ్చులు, హల్లులు వచ్చిన తర్వాత వాటిలో రూపొందిన పదాలు గుణింతాలు వచ్చిన తర్వాత మొదటి వాచకం చివర చిట్టిగేయాలు. చిన్న కథలు కూడా చెప్పవచ్చు.

ఒత్తులు నేర్పడంలో ప్రారంభమయ్యే రెండవ తరగతిలో ఒక్కొక్క ఒత్తుకు ఒక పాఠం చొప్పున రూపకల్పన జరగాలి.

మూడు నాలుగు ఐదు తరగతులలో కూడా పాఠాలను విభజించి గద్యపాదాలు దానితోపాటు గేయం, గేయకధ, గాథ, నీతిపద్యాలు మొదలైనవి. జానపద కథలు, నీతి కథలు సంభాషణాత్మకమైన రూపకాలు పొందుపరచటం వల్ల విద్యార్థి అతిసులువుగా అర్థం చేసుకొని భాషను అభివృద్ది చేసుకోగలడు.

**మాధ్యమిక స్థాయి :** మాధ్యమిక స్థాయిలో విద్యార్థుల పాఠ్యపుస్తకాల్లో నియోజనాలు ముఖ్యంగా తెలుగు వాచకాల్లో అసంతృప్తికరంగా వుంటున్నాయి. ఈ స్థాయిలో రెండు, మూడు వాక్యాలలో జవాబులు వచ్చే ప్రశ్నలను చేర్చవచ్చు.

నామవాచకాలు, క్రియలు, సర్వనామాలు, విశేషణాలు మొదలైన వ్యాకరణ అంశాలను ఆగమన పద్దతిలో బోధించే వీలుండాలి. ఒక్కొక్క తరగతిలో అదనంగా కొంత శబ్దరాశి పిల్లల పదకోశానికి చేరేటట్టుగా కొత్తగా కొన్ని సామెతలు, కవులను గురించి చరిత్రకు చెందిన అంశాలను పొందుపరచాలి.

పదవ తరగతి, ఇంటర్మీడియట్ స్థాయికి వచ్చిన విద్యార్థులలో చాలామంది అక్షరదోషంలేకుండా తెలుగులో వాక్యం రాయలేకపోతున్నారన్నది నేటి నిజం. దీని నివారణ ప్రాథమిక, మాధ్యమిక స్థాయిలో మాతృభాష బోధన పకడ్బందీగా జరగడం.

అయితే పాఠశాలల్లో తెలుగు భాషాబోధన సఫలీకృతం కావడం వాచకాలు ఉపవాచకాలు, గ్రంథాలయాలు, మొదలైనవే కాకుండా అధ్యాపకుని పాత్ర ముఖ్యమైంది విద్యార్థి మాట్లాడే భాష, తరగతి గదిలో బోధనాభాషకు తేడా వుంటుంది. అందువల్ల ఉపధ్యాయుడు తను నిర్దుష్టంగా మాట్లాడుతూ విద్యార్థులను శిష్టవ్యవహారికం వైపు మళ్ళించాలి.

**కళాశాల స్థాయి :** ప్రభుత్వం అధికారభాషా సంఘాన్ని స్థాపించిన తర్వాత విద్యారంగంలో తెలుగు మాధ్యమం ఉండాలనే నిర్ణయించి తెలుగు అకాడమిని నెలకొల్పింది. వ్యవహారిక తెలుగు భాషలో శాస్త్రీయ దృక్పథాన్ని పెంపొందించడానికి 'స్టేట్ ఎడ్యుకేషనల్ రిసెర్చ్ ట్రైయినింగ్'ను స్థాపించింది. తమ సిద్ధాంతాలకు లక్ష్యాలుగా వుండవలసిన విద్యార్థులతో, అధ్యాపకులతో వీటికి ప్రత్యేక సంబంధం లేదు

స్థాయీభేదాన్ని బట్టి కళాశాలలను మూడురకాలుగా విభజించవచ్చు. అవి జూనియర్ కళాశాలలు, డిగ్రీ కళాశాలలు, స్నాతకోత్తర కళాశాలలు.

**ఇంటర్మీడియట్ కళాశాలలు :** పేరుకు తగ్గట్టుగా ఇది ఒక సంధి దశ పాఠశాల దశ వరకు ఎటువంటి ఐచ్ఛిక విషయాల ఎన్నిక లేకుండా అన్ని విషయాలు సమానంగా నేర్చుకొని ఇంటర్మీడియట్ కూడలిలో విద్యార్థులు అడుగుపెడతారు.

కాబట్టి భవిష్యత్‌లో వారు ఎన్నుకొనే వృత్తులను బట్టి వారికి నేర్పే విద్యాస్వరూపం యిక్కడే నిర్ణయింపబడాలి. కాని ఈ విషయంలో ప్రభుత్వంకాని విద్యాధికారులు కాని సరియైన ప్రాధాన్యతనివ్వడం లేదు.

తెలుగు విషయంలో ముఖ్యంగా ఐచ్ఛికంగా తీసుకొనే తెలుగుపట్ల ఎటువంటి రాయితీలు ఉండకూడదు. అన్ని జూనియర్ కళాశాలల్లోను రాష్ట్రభాషగా - తెలుగు బోధనతో పాటు, ఐచ్ఛికాంశంగా [ఆప్షనల్ సబ్జెక్ట్] తెలుగును కూడా ప్రవేశ పెట్టాలి.

ఇంటర్ స్థాయి నుండి ఎమ్.ఏ స్థాయి వరకు కళాశాలల్లో ఐచ్ఛికాంశంగా చెప్పే తెలుగును ఏడు సంవత్సరాల కాలం చెప్పేంత విస్తృత పరిధి కలదాన్నిగా రూపొందించాలి.

తెలుగుభాషా సాహిత్యాలలో సంపూర్ణ పాండిత్యాన్ని కలిగించే మొత్తం విజ్ఞానం అంతా ఈ ఏడు సంవత్సరాల కాలపరిమితిలో యిమిడి ఉంటుంది. ఈ ఏడు సంవత్సరాల పాఠ్యాంశ ప్రణాళికా ప్రారంభం ఇంటర్‌మీడియట్ స్థాయిలోనే జరగాలి.

కళాశాల నేపథ్యంతో తెలుగును ఐచ్ఛిక విషయంగా గ్రహించి ఆభాషా సాహిత్యాలను గురించి ప్రాచీన, అధునాతన భేదాలు లేకుండా క్షుణ్ణంగా పాండిత్యాన్ని పొందే మార్గం యిది. ఈ పద్ధతిలో తయారైన తెలుగు అధ్యాపకులు సాహిత్యంగా తెలుగును గాని, మాధ్యమంగా తెలుగును గాని, తెలుగు భాషను గాని ఏ స్థాయి విద్యార్థికైనా నేర్పగలిగే అర్హతను కలిగిఉంటారు.

**డిగ్రీ కళాశాలలు :** డిగ్రీస్థాయిలో కూడా తెలుగును నిర్బంధ పాఠ్యాంశంగా నిర్ణయించాలి. రాష్ట్రభాషగా విద్యార్థికి నేర్పే తెలుగుకు నాలుగు సంవత్సరాల పాఠ్యాంశ ప్రణాళికను తయారుచేయాలి. అందులో ప్రాథమిక బోధన ఇంటర్ లోను ఉన్నత స్థాయి బోధన డిగ్రీ రెండు సంవత్సరాలలోను జరగాలి.

ఈ పాఠ్యాంశాలు నిర్ణయించేటపుడు ఆ అంశాలు విద్యార్థి తరువాత చేపట్టబోయే వృత్తివిద్యలకు అనువైనవిగా రూపొందించాలి.

ఈ అంశాలను విద్యార్థి వ్యవహార భాషలోచదివి రాయటంవల్ల అతనికి భాషా విషయకమైన ఉపయోగ సామర్థ్యం లభిస్తుంది.

పై అంశాలకు తోడు తెలుగులో అనువాదం, భావక్లుప్తీకరణ పద్ధతి, వ్యాసరచన, లేఖల్లో పాలనా వ్యవహారాలు నడిపేపద్ధతి, వార్తాసంగ్రహం, న్యాయస్థాన భాష, సాంకేతిక పదాలు - వాటి తెలుగు ప్రత్యామ్నాయాలు వంటి అంశాలుతో విద్యార్థి తన నాలుగేళ్ళలో పరిపూర్ణత సాధించాలి.

ఈ కార్యసాధనకు రాష్ట్రవిశ్వవిద్యాలయాలు, తమతమతెలుగు శాఖల ఆధ్వర్యాన ప్రభుత్వ విద్యాశాఖ సహకారంతో ఉన్నతస్థాయి కమిటీలను నెలకొల్పాలి.

**తెలుగులో శాస్త్రవిద్యా బోధన :** భారతీయ భాషల్లో విశ్వవిద్యాలయ స్థాయిలో తెలుగులో శాస్త్ర విద్యాబోధన జరిపించడానికి కొంత కృషి జరిగింది. తెలుగులో శాస్త్రవిద్యాబోధన యింతవరకు ఇంటర్మీడియట్ డిగ్రీ తరగతులకు మాత్రమే పరిమితమై వుంది. పోస్ట్ గ్రాడ్యుయేట్ స్థాయికి విస్తరింపచేయాలని వుంది.

అంతేకాక వ్యవసాయశాస్త్రం, వైద్యశాస్త్రం, పశుపోషణ, పాడిపరిశ్రమ. ఇంజనీరింగు, టెక్నాలజి మొదలైన వృత్తివిద్యలకు సంబంధించిన కోర్సులలో ఇంతవరకు డిగ్రీ స్థాయిలో కూడా తెలుగులో విద్యాబోధన, గ్రంథప్రచురణ మొదలుపెట్టారు.

శానిటరి ఇన్స్పెక్టర్ కోర్సు. డిప్లొమా ఇన్ ఫిజికల్ ఎడ్యుకేషన్ ఏగ్రిసలరీ హెల్త్ వర్కర్స్ మొదలైన కోర్సులలో తెలుగులో విద్యాబోధన చేయడం ఇటీవల ప్రారంభించారు.

విజ్ఞానశాస్త్రాల బోధనలో చిత్రపటాలు, సంకేతాలు, సూత్రాలు, సమస్యలు, మొదలైనవి ప్రముఖపాత్ర వహిస్తాయి. మొక్కల పేర్లు, జంతువుల పేర్లు రసాయన నామాలు మార్పులేకుండా ఇంగ్లీషులో వాడినట్లే తెలుగులోకూడా వాడుతున్నారు. అంతేగాక సుదీర్ఘమైన చర్చలు, వివాదాస్పద అమూర్త భావనలు, తక్కువగా ఉంటాయి. చెప్పవలసింది సూటిగా, ఖచ్చితంగా, క్లుప్తంగా చెప్పడం శాస్త్ర విధానంలో ముఖ్యాంశం కనుక శాస్త్ర గ్రంధ రచనలలోను, బోధనలలోను భాషా పరమైన సమస్యలు ఎక్కువగా వుండవని చెప్పవచ్చు.

**తెలుగులో శాస్త్ర విద్యాబోధనలో ఎదురయ్యే సమస్యలు :**

**పాఠ్యపఠనీయ గ్రంథప్రచురణ :** 1) పాఠ్యపఠనీయ గ్రంధాలలో వైవిధ్యం లేకపోవటం. ప్రస్తుతం ఒక్కొక్క అంశానికి ఒక్కో పాఠ్యగ్రంథం గాని, పఠనీయగ్రంథం గాని అందుబాటులోఉంది.

ఒకే అంశం గురించి భిన్నరచయితలు రాసిన విభిన్న గ్రంథాలు, రిఫరెన్స్ గ్రంథాలుంటే అధ్యాపకులకు, విద్యార్థులకు కూడా సౌకర్యంగా ఉంటుంది. ఈ కొరత ఏర్పడడానికి తెలుగు అకాడమీ వారు కొన్ని ప్రామాణిక గ్రంథాల అనువాదాలను, కొన్ని ప్రధానాంశాలను గురించి మోనోగ్రాఫ్లను ప్రచురించే కార్యక్రమాన్ని చేపట్టి కొన్నింటిను ప్రచురించారు.

ఇవి డిగ్రీస్థాయివిద్యార్థులకు, అధ్యాపకులకే గాక ముందుముందు తెలుగుమాధ్యమంలో విద్యాభ్యాసం చేసే పోస్ట్గ్రాడ్యుయేట్ విద్యార్థులకు కూడా ఉపయోగపడతాయి.

**సాంకేతిక పదజాలం :** సాంకేతిక పదాలన్నింటిని యధాతథంగా ఇంగ్లీషులో మాదిరిగా అనువాదం చేయాలని కొందరు, ప్రతి సాంకేతిక పదాన్ని తెలుగులోకి అనువదించాలనే వారు కొందరు, తెలుగు అకాడమి వారు గ్రంథరచన చేపట్టడానికి ముందు ప్రతీ సబ్జెక్ట్లోను కొన్ని వేల పదాలు ప్రామాణీకరించి గ్రంథరచనలో వాటినుపయోగించారు. అవి విద్యార్థులలోను, అధ్యాపకులలోను బహుళ ప్రచారాన్ని పొందాయి. వీటితోపాటు తప్పనిసరిగా కుండలీకరణంలో ఇంగ్లీషు పదాలను ఇస్తున్నారు.

**తెలుగులో శాస్త్ర విద్యాబోధన మెరుగుపరచటానికి సూచనలు :**

ప్రజలలో ఆధునిక సాంకేతిక పదజాలం ఎంతవరకు వ్యాప్తి జరిగిందనే విషయంగురించి సర్వే జరిపించాలి.

మొక్కల, జంతువుల, ఖనిజాల, ప్రాంతీయ నామాలు తెలుగులో సేకరించి ప్రచురించాలి.

వైజ్ఞానిక గ్రంథానువాదకులకు శిక్షణ కార్యక్రమాలు నిర్వహించాలి.

ఇంగ్లీషేతర భాషలలో ప్రామాణిక, వైజ్ఞానిక, గ్రంథాలకు తెలుగులోకి అనువదించటానికి సన్నాహాలు ప్రారంభించాలి.

**పరిశోధనాంశంగా తెలుగు :**

1857 లో మద్రాసులో విశ్వవిద్యాలయం స్థాపించబడినపుడు తెలుగు భాషా సాహిత్యాల అభ్యసనంలో తెలుగు విద్యార్థులు పాశ్చాత్య విధానాన్ననుసరించారు. విశ్వవిద్యాలయాలు కొంతకాలం స్నాతక తరగతులకు కొంతకాలం స్నాతకోత్తర తరగతులకు పరిమితంగా వుండటంచేత ఈ శతాబ్దిలో కొన్ని సంవత్సరాలు గడిచేవరకు భాషా సాహిత్యాల పరశోధన కృషి జరగలేదు.

1927 లో చిలుకూరి నారాయణరావు గారు "11వ శతాబ్ది నాటి తెలుగు భాష" అనే సిద్ధాంతవ్యాసం రాసి మద్రాసు విశ్వ విద్యాలయంలో పిహెచ్.డి పట్టా పుచ్చుకొన్నారు చిలుకూరి వారితో తెలుగు పరిశోధన ఒక నియమిత మైన శాస్త్ర మార్గంలో ప్రవేశించి పరిశోధకులకు మార్గం చూపించింది.

అయితే మద్రాసు విశ్వవిద్యాలయంలో సిద్ధాంత వ్యాసం ఇంగ్లీషులో రాయవలసిన నిబంధన ఉండటంచేత చిలుకూరి నారాయణరావు తన సిద్ధాంత వ్యాసాన్ని ఇంగ్లీషులో సమర్పించారు. ఈ విధంగా తెలుగుభాషా సాహిత్యాలకు చెందిన మొదటి ఇంగ్లీషు సిద్ధాంత వ్యాసం వీరిదే.

పండితులు చాలాపూర్వకాలం నుండి తెలుగుభాషా సాహిత్యాలపై పరశోధన చేస్తున్నప్పటికి మనదేశంలో విశ్వవిద్యాలయాలు ఏర్పడిన తర్వాత ఈ పరిశోధనలలో నూతనదృక్పథం ఏర్పడిందని చెప్పవచ్చు.

**ఉస్మానియా విశ్వవిద్యాలయం :** తెలుగుదేశంలో ఉన్న విశ్వవిద్యాలయాల్లో కాలక్రమంగా చూస్తే ఉస్మానియా విశ్వవిద్యాలయానికి పరశోధనలలో ప్రథమ స్థానం లభిస్తుంది.

ఆచార్య ఖండవల్లి లక్ష్మి రంజనం గారు, డా॥ సూరిభాగవతం గార్ల కృషి ఫలితంగా తెలుగు శాఖలో 1953లో పరిశోధనకు అవకాశం లభించింది. ఫలితంకూడా డా॥ బి. రామరాజు గారు వెలువరించిన సిద్ధాంతవ్యాసరూపంలో కనిపించింది. తెలుగు పరశోధనా రజతోత్సవం జరుపుకొంది.

**ఆంధ్ర విశ్వవిద్యాలయం :** ఆంధ్ర విశ్వవిద్యాలయం స్థాపించబడిన నాటినుండి తెలుగు భాషా సాహిత్యాల అభివృద్ధికినిరంతరకృషి జరుగుతుంది. ప్రారంభదశలో రాధాకృష్ణ పండితుడు, కట్టమంచి రామలింగారెడ్డి వంటి ఉద్దండులు ఈ విశ్వవిద్యాలయంతో సంబంధం కలిగి ఉండటం వల్ల సాహితి సంప్రదాయం నెలకొనడానికి, పరిశోధనా శక్తి పెంపొందించడానికి కారణమైంది.

మొట్టమొదట శ్రీ కె.వి.ఆర్. నరసింహం "ఆంధ్ర ప్రబంధం" అనే సిద్ధాంత వ్యాసాన్ని రాసి తెలుగు సాహిత్య పరిశోధనలో పిహెచ్.డి పట్టంపొందారు.

**శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం :** శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం స్థాపించ బడేనాటికి తిరుపతిలో ప్రాచ్య పరిశోధనా సంస్థ నెలకొనబడి ఉండటం, సంస్థలో ప్రఖ్యాత పరిశోధకులైన మానవల్లి రామకృష్ణ కవి, వేటూరి ప్రభాకర శాస్త్రి వంటివారు వుండటంవల్ల ఈ విద్యాసంస్థలో తెలుగుపరిశోధనకు ఎక్కువ అవకాశాలు ఏర్పడ్డాయి.

అనేక కారణాలచేత ఈ విశ్వవిద్యాలయం సాహిత్యంపైకంటే భాషా విషయక అంశాలపై ఎక్కువ మక్కువను చూపించింది. ఫలితంగా వ్యాకరణాలగురించి, ఇతర అంశాలగురించి ప్రామాణికమైన సిద్ధాంత వ్యాసాలు వెలువడ్డాయి.

ఈ విధంగా కాలక్రమాన్నిబట్టిగాక, విషయగ్రహణంలోను ఈ విశ్వవిద్యాలయం తన ఆధునికత్వం నిలుపుకొన్నదని స్పష్టంగా చెప్పవచ్చు.

ఈ విశ్వవిద్యాలయం బ్రౌన్ సాహిత్య సంస్థను స్థాపించి చాలామంది పండితుల సేవలను వినియోగించుకొంటుంది. తెలుగు దేశంలో ఇతర విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధనా రంగంలో బహుముఖ కృషి జరుగుతుంది. చాలామంది విద్యార్థులు పూర్తి సమయాన్ని వెచ్చిస్తూ, మరికొందరు పాక్షికంగా తమకాలాన్ని వినియోగిస్తూ భాషాసాహిత్యాలలో నూతనాంశాలను వెల్లడించేందుకు ప్రయత్నిస్తున్నారు.

మిగిలిన విశ్వవిద్యాలయాలు తెలుగు పరిశోధనలలో ఇప్పుడిప్పుడే శైశవ దశను దాటుతున్నాయి.

అనువాద భాషగా తెలుగు:- "భారతీయభాషలన్నిటిలోను అన్య దేశపదాలను తెలుగు గ్రహించినంత సులభంగా ఏ భాషా స్వీకరించలేదు"[8] అని జె.బి.యస్. హాల్డేన్ అన్నారు.

తెలుగు సుసంపన్నమైన భాష. ప్రపంచంలోని ఏ భాషా సాహిత్యాన్నైనా సహృదయంతో స్వాగతం పలికే ఔదార్యం తెలుగుభాషకథనం. భారతీయభాషలనుంచేగాక ఇతరదేశాలనుంచి కూడా విస్తృతంగా సాహిత్యాన్ని అనువదించుకొన్నాం.

శరత్‌చంద్ర, రవీంద్రనాథ్ టాగూర్, ప్రేమ్‌చంద్, జయేంద్రకుమార్, కిషన్‌చందర్, భారతి, శివశంకర పిళ్ళై, రంగాచార్య మారువరేర్కర్, కాళిందిచరణపాణిగ్రాహి, ఉమాశంకరజోషి, భాయివీరసింగ్ వంటి వందలాది భారతీయ రచయితలే గాక షేక్స్పియర్, హిబ్సన్, షా, చెకో, టాల్‌స్టాయ్, మార్క్‌ట్వేన్ మొదలైన అన్యభాషారచయితలు తెలుగు వారేమో అన్నంతగా తెలుగు భాషను ఆదరించారు.

అనువాదపరంగా పరిశీలిస్తే తెలుగు సాహిత్యభాషగా శతాబ్దాల నుండి అభివృద్ధి చెందుతూవస్తుంది. వ్యవహారభాషగా ఒక అర్ధశతాబ్ది నుండి విద్యారంగంలో మూడుశతాబ్దాలు నుండి తెలుగు వికాసం చెందుతోంది.

నన్నయ నాటినుండి నేటి వరకు ఎందరెందరో మహనీయులు తమ అనువాదాలతో తెలుగు భాషను పరిపుష్ఠంచేసారు. ఈనాడు బోధనాభాషగా, అధికారభాషగా తెలుగు కొత్తబాధ్యతలు స్వీకరించింది.

విద్యారంగంలోను, పరిపాలనారంగంలోను తెలుగు ప్రముఖ స్థానం పొందుతున్న సమయంలో అనువాదాలు కీలక పాత్ర వహిస్తాయి. పరిణామదశలో వారధిగా ఉపయోగపడేవి ఈ అనువాదాలే. మార్పు అనేది సరళంగా, సమర్థవంతంగా, ప్రయోజనకరంగా ఉండాలి. ఈ మూడులక్షణాలలో ఏది లోపించినా ప్రజలకు, పరిపాలనా య ంత్రాంగానికి ఇబ్బంది కలగడమే కాకుండా పాలనా సామర్థ్యంలోపించే ప్రమాదంకూడా ఉంది.

**అనువాదంలోని ముఖ్యాంశాలు : 1) భావం :** సందర్భాన్ని, భావాన్ని సరిగా అర్థం చేసుకోకపోతే అనువాదంలో లోపాలు దొర్లుతాయి. అనువాదకులు మూలాన్ని జాగ్రత్తగా చదివి అర్థంచేసుకోవాలి.

**2. వాక్య నిర్మాణం :** తెలుగు భాష సహజ సౌందర్యానికి, వాక్య విన్యాసానికి భిన్నంగా ఇతర భాషలనుండి అనువదించి రచించినట్లైతే ఆ వాక్యానువాదం కృత్రిమంగా ఉంటుంది. వాక్యం తెలుగుభాషా నైజానికి అనుగుణంగా ఉండాలి. అనువాదంలో వాక్య నిర్మాణంచేసేటప్పుడు శ్రద్ధ, నేర్పు అవసరం.

**3. పదజాలం :** అనువాదంలో అవసరమైన తెలుగు సమానార్థక పదం ఉంటే దానిని స్వీకరించాలి, అట్టి పదం లభించక పోతే ఇతరభాషలలోని పదాన్ని స్వీకరించవచ్చు. స్వీకరించే పదం తెలుగులో విపరీతార్థం ఇచ్చేదిగా ఉండకూడదు. అన్యభాషాపదం స్వీకరించడం సాధ్యంకాకపోతే కొత్తపదాన్ని పుట్టించటం అవసరం.

**విశ్వవిద్యాలయాలలో బోధనా మాధ్యమంగా తెలుగు :**

అనేకసంవత్సరాలుగా భారతీయవిశ్వవిద్యాలయాలలో బోధనామాధ్యమాన్ని ఇంగ్లీష్ నుండి హిందీకి కాని, ప్రాంతీయభాషకుకాని మార్చాలనే భావన చాలాకాలంగా ఉంది.

మన రాష్ట్రంలో ఉస్మానియా విశ్వవిద్యాలయం ఉన్నత విద్యాలయాలలో ఉర్దూ బోధనామాధ్యమంగా గ్రహించి స్థాపించబడి 1948 వరకు కొనసాగింది, కాని తర్వాత చాల కోర్సులకు మాధ్యమం ఇంగ్లీషుగా మారింది.

**<u>వైస్ ఛాన్స్లర్ బి.హెచ్. కృష్ణమూర్తి</u> నివేదిక :** బోధనా మాధ్యమాన్ని విశ్వవిద్యాలయాలలో ఇంగ్లీషు నుండి తెలుగుకు మార్చడానికి రాష్ట్ర ప్రభుత్వంకాని, విశ్వవిద్యాలయాలుకాని ఖచ్చితమైన నిర్ణయంతీసుకోలేదు.

వైస్‌చాన్స్లర్, ప్రొఫెసర్లు అన్ని విశ్వవిద్యాలయాల వారితో కలిసి చర్చించినపుడు ఈ విషయం పై తీవ్రంగా ఆలోచించాలని, ఈ మార్పుకుతగిన మార్గాలేర్పచాలికాని తొందరపడి నిర్ణయాలు తీసుకోరాదని అన్నారు. అయితే ఈ మార్పువల్ల కలిగే లోపాలనుకూడా వ్యక్తంచేశారు.

ఈ మార్పు వలన విద్యార్థులు ఇబ్బందులు ఎదుర్కొనే అవకాశాలు ఉన్నాయి. ముఖ్యంగా సరియైన పుస్తకాలు అందుబాటులో లేకపోవడంవలన ఈ సమస్య తలెత్తే అవకాశం ఉంది.

అన్ని విశ్వవిద్యాలయాలలో ఒకే మాధ్యమంలో విద్యాబోధన జరగకపోతే విశ్వవిద్యాలయాల మధ్య ఉన్న సత్సంబంధాలు సన్నగిల్లే అవకాశం ఉంది. ప్రాంతీయ భాషా మాధ్యమంలో విద్యాభ్యాసం చేసినవారు ఇతర రాష్ట్రాలలోని ఉద్యోగాలకు అర్హులుకారు.

బోధనామాధ్యమాన్ని మార్చటంలో ఉన్న ఈ సమస్యలను పక్కకునెట్టివేయాలని రాష్ట్రంలోని అన్ని విశ్వవిద్యాలయాలు అభిప్రాయపడ్డాయి. ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆధ్వర్యంలో నియమితమైన కమిటి భాషామాధ్యమాన్ని సంపూర్ణంగా ప్రాంతీయభాషలుగా మార్చడానికి తగిన సమయంకలదని, జాతీయస్థాయిలో విద్యార్థులకు ఉద్యోగావకాశాలను దృష్టిలో వుంచుకోవాలని తన ఉద్దేశ్యాన్ని తెలిపింది.

ఈ ఉద్దేశాన్ని అన్ని విశ్వవిద్యాలయాల వైస్-చాన్సలర్లు అంగీకరించారు. 1966లో ఆంధ్ర విశ్వవిద్యాలయ సిండికేట్ తీర్మానం ఒక ప్రయోగంగా ఆర్ట్స్, కామర్స్ సబ్జెక్టులను ఒక ప్రభుత్వ కళాశాలలో ప్రవేశపెట్టడానికి ఎటువంటి అభ్యంతరం చెప్పలేదు. పట్టభద్రులకు ఉద్యోగావకాశాలను గూర్చి అనేక మందికి తలెత్తుతున్న సమస్య "ఉత్తమ-ఉన్నత ఉద్యోగావకాశాలు ఉన్నత విద్య ద్వారా లభిస్తాయి".

ఈ ఉన్నత విద్యాభాష ఆంగ్లం. ప్రస్తుతం ఉన్న భావన ప్రాంతీయ భాషలను విశ్వవిద్యాలయంలో మాధ్యమంగా ప్రవేశపెట్టడం కంటే పాఠశాల స్థాయినుంచే ఇంగ్లీషు ఉండాలనే బావన ఏర్పడింది. తమ పిల్లలు ఇతర సబ్జెక్టులన్ని ఇంగ్లీషు మాధ్యమంలో చదివితే ఇంగ్లీషు పరిజ్ఞానం పెరుగుతుందని తల్లితండ్రులు భావించారు.

ప్రాంతీయ భాషలను పాఠశాల, విశ్వవిద్యాలయాలలో మాధ్యమంగా వాడడంలో వున్న లాభనష్టాలను 1966లో కొఠారి కమిషన్ పేర్కొంది.

తెలుగు మాధ్యమంగా ప్రవేశ పెట్టడానికి మన విశ్వవిద్యాలయాలలో నిర్ణయించినప్పటికి కమిటీలు చేసే సూచనలు మాత్రం మొదట డిగ్రీ స్థాయి నుండి తెలుగు ఆరంభించాలన్నారు. సాంకేతిక పోస్ట్‌గ్రాడ్యుయేట్ కోర్సులలోను తర్వాత ఆర్ట్, సైన్స్, కామర్స్‌లలో తెలుగు మాధ్యమాన్ని ప్రవేశపెట్టాలన్నారు.

బోధనా మాధ్యమంగా, అధికారభాషగా తెలుగు రాష్ట్రంలో విద్యా సామాజిక రంగాలలో అర్థవంతమైన పాత్ర నిర్వహించవలసిన అవసరాన్ని ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖ గుర్తించింది. బోధనా భాషగా- అధికారభాషగా తెలుగును వివిధస్థాయిల్లో రూపొందించే ప్రయత్నంలో తెలుగుశాఖ, తెలుగుఅకాడమి డైరెక్టర్ గారిని ఆసంస్థ సహాయ సహకారాలను కోరింది.

తెలుగు అకాడమి విశ్వవిద్యాలయాల్లాంటి సంస్థలతో కలిసి విద్యా రంగంలో, భాషారంగంలో సమాజ ప్రయోజనాన్ని సాధింపకలిగే కార్యక్రమాలను నిర్వహించింది, ఆర్థికంగా,హార్థికంగా తెలుగు శాఖతోకలిసి పని చేయడానికి తెలుగు అకాడమి ముందుకు వచ్చింది.

పరిపాలన, న్యాయ, బోధనారంగాల్లో తెలుగు అమలుకు కొంత కృషి జరిగినా, ఇంకా ప్రభుత్వం పటిష్టమైన చర్యలు చేపట్టవలసి ఉంది.

## సూచికలు


1) తెలుగు వైజ్ఞానిక మాస పత్రిక (ఇరవైఏళ్ళ శుభ సందర్భ సంచిక) 1968-88 పు...55

2) పైదే పు....56

3) పైదే పు... 57

4) తెలుగు అధికార భాష : వావిలాలగోపాలకృష్ణయ్య పు 25

5) పైదే పు ... 25

6) ఎ రిపోర్ట్ సబ్‌మిటెడ్ టు ద అంధ్రాయూనివర్సిటి బైద తెలుగు లాంగ్వేజ్ కమిటి ఆన్ ద యూజ్ అఫ్ మోడ్రన్ స్టాండర్డ్ తెలుగు (శిష్ట వ్యవహారిక ) అంధ్రవిశ్వవిద్యాలయం వాల్తేర్. 1973 -యమ్. ఆర్. అప్పారావు పు ...8

7) తెలుగు వైజ్ఞానిక మాస పత్రిక [ఇరవైఏళ్ళ శుభ సంచిక] 1968-88 తెలుగు అకాడమి పు. 60

8) జె.బి.యస్. హాల్డేన్, దహిందు 27ఏప్రిల్ 1958కోటెడ్ ఇన్ గ్విన్ రిపోర్ట్ కమిటి. పు —20

9) పరిపాలనా భాష-వాడుకభాష : వావిలాల గోపాలకృష్ణయ్య పు. 14

10) భాష - ఆధునిక దృక్పధం : పోరంకి దక్షణామూర్తి పు.. 42

11) ప్రవంతి మాసపత్రిక నవంబర్ 1973 పు.. 3

12) ప్రవంతి సాహిత్య మాస పత్రిక మే 1974 పు.. 6

13) అభ్యుదయ వాడుక భాషా సదస్సు విశేష సంచిక ఏప్రిల్ 26 - 27 1980 పు ...87

14) ఈక్వల్ రెమ్యునరేషన్ యాక్ట్ 1976 :కాశీభట్ల సుబ్రహ్మణ్యం. పు.. ... 1

15) పైదే. పు ...7

16) పైదే. పు ....8

17) తెలుగు బోధనా పద్ధతులు : ఇలాపావులూరి పాండురంగారావు. పు ...4

మన జాతి తెలుగు, మన రాష్ట్రం తెలుగు, మన భాష తెలుగు. కాని మన భాష మన రాష్ట్రంలో పరిపాలనా భాషగా (అధికార భాషగా) ఏ స్థాయిలో అమలు పరచబడుతుంది? ఏ పరిమాణంలో వినియోగించబడుతుంది? జరుగుతున్న కృషి సంతృప్తికరంగా వుందా? ప్రకటనల వరకేనా? లేక ప్రభుత్వ కృషిగాని, ప్రజల ఆకాంక్ష గాని ఫలించే రోజు దగ్గరలో వుందా? అనే ప్రశ్నలు, సందేహాలు. తెలుగు భాషను అధికార భాషగా కళ్ళారా చూద్దామని, చెవులారా విందామనుకునే వారికి కలుగుతున్నాయి.

అధికార భాషగా తెలుగు అమలు చేయడానికి మూడు దశాబ్దాల క్రితం నుండి అధికారిక కృషి జరుగుతున్నా ఇప్పటికి ఆ ప్రయత్నాలింకా ప్రయత్న దశలోనే వుండటం భాషాభిమానులకు విచారాన్ని కలిగిస్తున్నది.

అధికార ఉత్తర ప్రత్యుత్తరాలకు తెలుగును ప్రవేశపెడితే ఏర్పడే ఇబ్బందులను పరిశీలించటానికి 1959లో ప్రభుత్వం ఒక ప్రత్యేకాధికారిని నియమించింది. 1960లో తాలూకా, అంతకు దిగువ స్థాయిలలో ఉత్తర ప్రత్యుత్తరాలకు ఉపయోగించే భాషగా, ప్రజలతో తరచుగా సంబంధం ఉండే 27 శాఖలలో తెలుగును ప్రవేశ పెట్టటం జరిగింది.

1961లో మరో నాలుగు శాఖలలో తెలుగును ప్రవేశపెడుతూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది.

ఇన్ని చేసి దశాబ్దం దాటిన తరువాత 1966లో తెలుగును అధికార భాషగా నిర్ణయిస్తూ ప్రభుత్వం శాసనం చేసింది. శాసనం తయారైన తర్వాత కూడా అందులోని తీర్మానాలు అమలు పంచటంలో మళ్ళీ చాలా కాలం నిర్లక్ష్యానికి గురైంది. అధికార భాషా చట్టం ఏర్పడిన 8 సంవత్సరాల తర్వాత 1974లో శ్రీ జలగం వెంగళరావు ప్రభుత్వం తాలూకా స్థాయిలో తెలుగును అధికార భాషగా అమలు చేయడానికి నిర్ణయించింది. దాని అమలు పర్యవేక్షణకు మొదటిసారిగా అధికార భాషా సంఘాన్ని ఏర్పరిచింది.

తర్వాత 1976లో జిల్లాస్థాయి వరకు 1979లో శాఖాధిపతుల స్థాయి వరకు శాసనేతర అంశాలన్నింటిలోనూ తెలుగును ప్రవేశపెడ్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది.

1983 ఏప్రిల్ లో రాష్ట్ర నూతన ప్రభుత్వం సచివాలయ స్థాయి వరకు తెలుగును అధికార భాషగా విస్తరింపచేస్తూ ఉత్తరువులు జారీ చేసింది. అంటే పంచాయితీల స్థాయినుండి. సచివాలయ స్థాయి వరకు తెలుగును అధికార భాషగా విస్తరింప చేస్తూ ఉత్తరువులు జారీ చేయడానికి 17 సంవత్సరాలు (1966 నుండి 1983 వరకు) పట్టింది.

అయితే ఈ ప్రభుత్వ ఉత్తరువులు ఎంతవరకు అమలు జరుగుతున్నాయనేది సందేహం, ప్రభుత్వోద్యోగులంతా అధికార కార్యకలాపాలన్ని తెలుగులోనే జరపాలని ఇంగ్లీషు ఉపయోగించకూడదని 1988లో ఎన్.టి. రామారావు ప్రభుత్వం చట్టం చేసినా ఆచరణలో అది విఫలమౌవుతుందని పరిశీలనలో వెల్లడైంది.

ప్రభుత్వం ఉత్తరువులైతే చేస్తుంది గాని వాటిని అమలు చేయడంలో జరుగుతున్న వైఫల్యం గురించి ఎందుకు పరిశీలించదో అందుకు బాధ్యులైన వారిపై ఎందుకు చర్యలుతీసుకోదో సామాన్యుల ఊహకు అందడం లేదు.

## 5.1 అధికార భాషగా తెలుగు అమలు జరగక పోవడానికి కారణాలు :

మన రాష్ట్రంలో తెలుగు అధికార భాషగా అమలు జరగకపోవడానికి గల కారణాలని ముఖ్యంగా ఐదు విధాలుగా చెప్పవచ్చు. అవి.

భాషా సంబంధమైనవి; ఉద్యోగులకు సంబంధించినవి; మరలకు సంబంధించినవి; ప్రభుత్వానికి సంబంధించినవి; ప్రజలకు సంబంధించినవి.

**1. భాషా సంబంధమైనవి :** ఉద్యోగులకు తెలుగులో ఫైళ్ళు రాసే అలవాటు లేకపోవడం.

ఉద్యోగులకు మొదటినుండి ఫైళ్ళు ఇంగ్లీషులో రాయడం అలవాటుండటం వలన దానిని మానకపోవడం.

ఇంగ్లీషు పదాలకు సరైన సమానార్థకాలు తెలుగులో వెంటనే స్ఫురించకపోవటం.

గ్రాంధిక, వ్యవహారిక వాదాలుండటం వలన ఫైళ్ళు ఏ భాషలో రాయాలనే సమస్య తలెత్తడం.

వివరణలు, ముసాయిదాలు రాయడానికి తరచుగా అవసరం అయ్యే నిబంధనలు, నమూనా లేఖలు, తెలుగులో లభ్యం కాకపోవటం.

టెక్నికల్ టెర్మినాలజి లేకపోవడం.

**2. ఉద్యోగులకు సంబంధించినవి :** ఉద్యోగుల మాతృభాష తెలుగైనా ఉత్తరాలు, ముసాయిదాలు తెలుగులో రాయలేని వారున్నారు.

మానసికంగా ఉద్యోగులు తెలుగు రాయడానికి ఆసక్తి చూపడం లేదు.

ఇంగ్లీషు రాయకూడదని ప్రభుత్వం శాసనం చేసినా అధికారులు, సిబ్బంది తెలుగులో రాయడం న్యూనతగా భావించి ఫైళ్ళు ఇంగ్లీషులో రాస్తున్నారు.

కార్యాలయాలధికార్లు తమ కార్యాలయాలలో తెలుగు అమలుపై శ్రద్ధ చూపటం లేదు.

ప్రభుత్వ ఉద్యోగులకు తెలుగుపై అభిమానం లేకపోవడం.

తెలుగులో సమగ్రమైన పదజాలం ఉన్నా ఇంగ్లీషు భాష మీద వ్యామోహంతో మాతృ భాషను తిరస్కరించి ఇంగ్లీషుని వాడుతున్నారు.

మాతృ భాషపట్ల ఉండవలసిన గౌరవభావం, చిత్త శుద్ధి అధికారులలో లోపించి మాతృభాష పట్ల అలసత్వం, నిర్లక్ష్యం చోటు చేసుకున్నాయి.

స్వతహాగ తెలుగును అధికార భాషగా అమలు పరిచే అభిమానం ప్రజలకు - ఉద్యోగులకు లేదు.

ఫైళ్ళు తెలుగులో రాయాలన్న విషయాన్ని అధికారులు పదే పదే సిబ్బంది పై ఒత్తిడి తీసుకురాకపోవడం.

**3. మరలకు సంబంధించినవి :** తెలుగు టైపు మిషన్లు లేకపోవడం :- తెలుగు అమలు జరగక పోవడానికి కార్యాలయాధికార్లు తెలుగు టైపు మిషన్లు లేవనే సాకు చెప్తున్నారు. చేతి ఉత్తరాలు రాసే అలవాటు ఇప్పటికి చాలా కార్యాలయాల్లో వుంది. వారికి టైపు మిషన్లు లేకపోవడం పెద్ద ఆటంకం మాత్రం కాదు. ఇది ఒక సాకు మాత్రమే.

తెలుగు టైపు రైటింగ్‌లో శిక్షణ పొందిన సిబ్బంది తక్కువగా వుండటం. శిక్షణ పొందిన వారున్నప్పటికి వారికి ఉద్యోగావకాశాలు లేకపోవటం.

**4. ప్రభుత్వానికి సంబంధించిన కారణాలు :** అధికార భాషా చట్టాన్ని ఒక చాప చుట్టలా చుట్టి మూలకు పెట్టారనేది ప్రభుత్వం వైపున లభించే కారణం.

ప్రభుత్వ యంత్రాంగంలోని అధికారులలో తెలుగు అమలు గురించి అభిమానం కాని, ఒక కమిట్‌మెంటు గాని లేకపోవడం.

ప్రభుత్వం నుండి కార్యాలయాలకు వెళ్ళే జి.వోలు. ఉత్తరువులు, స్టాండింగ్ ఆర్డర్లు ఎక్కువగా ఆంగ్లంలో ఉండటం. పై అధికారులు కింది స్థాయి కార్యాలయాలతో జరిపే ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ ఆంగ్లంలో ఉంటున్నాయి.

ప్రభుత్వం మీటింగులలో తెలుగు అమలు గురించి చర్చించక పోవటం.

**5. ప్రజల పరంగా లభించే కారణాలు :** తెలుగు అధికార భాషగా చెలామణి కాకపోవడానికి ప్రభుత్వమే కాక ప్రజలు కూడా కారణ భూతులే.

తెలుగు పరిపాలనా భాషగా అమలు జరగక పోవడానికి ప్రభుత్వ యంత్రాంగం ఎంత కారణమో ప్రజల మనస్తత్వం కూడా అంతే కారణమని చెప్పవచ్చు.

1. ప్రజలకు అధికార భాషగా తెలుగునమలు పరచాలనే పట్టుదల లేకపోవడం

2. ప్రజలకు తెలుగుపై విశేషమైన ఆదరణ కుతూహలం లేకపోవడం.

చాలామంది ప్రజలకు సచివాలయంలోని సాధారణ పరిపాలన శాఖలో అధికార భాషకు సంబంధించిన కార్యాలయం వున్నట్లు తెలియక పోవడం.

పత్రికలవారు అధికార భాషగా తెలుగునమలు జరపటం ఒక సమస్యగా తీసుకొని ప్రచారం చేయకపోవడం.

## 5.2 తెలుగు అమలు - లోపాలు :

1. ఉద్యోగస్తులు వివరణలు, ముసాయిదాలు రాయడానికి తరచు అవసరమయ్యే నియమ నిబంధనలు తెలుగులో లభ్యం కాకపోవడం.

2. కార్యాలయ ముఖ్యాధికారులకు తెలుగు రాకపోవడం.

3. సివిల్ సర్వీసులు, అయినటువంటి ఐ.ఎ.ఎస్. ఐ.పి.యస్. లాంటి ప్రిలిమినరి పరీక్షలు ఇంగ్లీషులో వుండటం.

4. ఇంగ్లీషు భాషమీద ఆసక్తితో తల్లిదండ్రులు తమ పిల్లలను పై చదువుల నిమిత్తం విదేశాలకు పంపటం.

5. ప్రజలకు ప్రభుత్వం నుంచి వచ్చే లేఖలు, తెలుగులో కాక ఇంగ్లీషులో వుండటం.

6. భవనాలు, ఇళ్ళు, సంస్థలు, వంతెనలు మొదలైన వాటిని శంఖుస్థాపన చేసినపుడు వాటి శిలా ఫలకాలు ఇంగ్లీషులో వేయించడం అధికార భాషా లోపంగా పేర్కొనవచ్చు. వీలైనంత వరకు వాటిని తెలుగులో వేయించాలి.

7. ఇంటర్మీడియట్ నుండి పోస్ట్ గ్రాడ్యుయేట్ స్థాయిలో కూడా అప్లికేషన్స్ మొదలైనవి ఇంగ్లీషులో ఉండటం.

8. ఇంజనీరు, బ్యాంకు, జైలు, ట్రెజరీ మొదలైన శాఖల సంబంధి ఇంగ్లీషు పదాలకు తెలుగులో సమానార్ధకాలు లేకపోవడం వల్ల ఇంగ్లీషు పదాలను వాడటం జరుగుతుంది.

9. సభలు, సమావేశాలలో మంత్రులు ఎక్కువగా తెలుగు భాష మాట్లాడకుండా ఆంగ్లభాషని మాట్లాడి ఆంగ్లానికి ప్రాధాన్యనివ్వటం.

**అధికార భాషగా తెలుగు అమలు జరగకపోవటం పై విమర్శ :**

మన రాజ్యాంగం నిర్వచించిన విధంగా భాషా రాష్ట్రాల ఏర్పాటు ప్రారంభమై ఈనాడు భారతదేశం భాషా రాష్ట్రాల కూడలిగా మారింది. కాని భాషా అమలులో లక్ష్యాన్ని చేరుకున్న రాష్ట్రాలు చాలా తక్కువ. ఫెడరల్ రాష్ట్రాలకు మధ్య వైషమ్యం, ప్రాంతీయతలే తప్ప భాష సంబంధమైన వృద్ధి గాని, ఆయా భాషలకు ప్రేరణ గాని ప్రభుత్వ పరంగా లభించటం లేదు.

ఇటువంటి రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. అధికారికంగా శాసనం చేసి ఆదేశించుటలో ప్రభుత్వం సంతృప్తి పడింది కాని దాని లక్ష్య సిద్ధికి చిత్తశుద్ధితో చేసిన కృషి చాలా తక్కువ అని చెప్పవచ్చు.

ప్రాంతీయాభిలాష పెరిగినంతగా ఏ ఒక్క నాయకునికి తెలుగు భాషపై గౌరవంగాని దాన్ని అభివృద్ధి చేయాలనే తలంపు గాని కలగలేదు.

నడచిన బాటనే నడవడానికి అలవాటు పడిన సాధారణ వ్యక్తులు ప్రస్తుతం ఆంగ్లభాషలో వ్యవహారాలు సజావుగా జరుగుతున్నాయి. కదా! తెలుగును పట్టించుకోవడమెందుకని భావించక తెలుగు అమలుకు శ్రద్ధ వహించాలి.

మన రాష్ట్రంలో ఎంతోమంది సామాన్య ప్రజలు ఆంగ్ల భాషా పరిజ్ఞానం లేక ప్రభుత్వ పరంగా వచ్చే శాసనాలను అర్థం చేసుకోలేక సతమతమవుతున్నారు.

ప్రభుత్వ శాసనముంది, కాని తెలుగుని అమలుపరచవలసిన అధికారులకు తెలుగు భాషపై తేలిక భావముంది. పాశ్చాత్యులు పోయినా వారి భాషపైన, వారి విధానాలపైన, వారి సంస్కృతిపైన అభిమానులైన వారి సంఖ్య నేడు బాగా పెరిగిపోయింది. అందువల్ల తెలుగుపై అయిష్టత ప్రారంభమైంది.

భారతదేశంలో ప్రప్రథమంగా భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణం ఆవశ్యకతను గూర్చి శంఖారావం పూరించింది మన ఆంధ్రులే. ప్రత్యేక భాషా రాష్ట్ర సిద్ధాంతాలను ప్రబోధించింది ఆంధ్ర నాయకులే.

1952లో పొట్టి శ్రీరాములు గారి ఆత్మార్పణతో ఏర్పడ్డ ఆంధ్రరాష్ట్రం 1956లో ఆంధ్రప్రదేశ్‌గా ఆవిర్భవించాక 1966లో రాష్ట్ర ప్రభుత్వం తెలుగు భాషా చట్టాన్ని ఏర్పరిచింది. 1974లో అధికార భాషా సంఘం అమలులోకి వచ్చింది.

1977లో రాష్ట్ర ప్రభుత్వం జి.ఓ. నెం. 472 ద్వారా తెలుగు భాషను పరిపాలనా భాషగా ప్రకటించింది. అప్పటినుండి ప్రభుత్వానికి తెలుగు భాషా అమలు విషయంలో మౌలిక సిద్ధాంతాలు, నిర్దిష్ట విధానాలు లేక తెలుగు భాషా అమలుపై నిర్లిప్త వైఖరి ప్రదర్శిస్తోంది.

1982 మే నెల 28న తెలుగుదేశం పార్టీవారు తిరుపతిలో జరిగిన ప్రథమ మహానాడులో స్పష్టమైన భాషా విధానాలను కొన్నింటిని ప్రతిపాదించి, ప్రకటించారు. కాని అది అంతా ప్రచార, ప్రసార, ప్రబోధ కార్యక్రమంగానే నిలిచిపోయింది.

తెలుగు గడ్డమీద పుట్టిన మహామహులలో వేమన యోగి అగ్రగణ్యుడు. ఈయన పలికిన పలుకులు "పట్టుపట్టరాదు - పట్టి విడువరాదు". ఈ అమూల్య సూత్రాన్ని మన అధినేతలు ఏమాత్రమైనా పాటిస్తున్నారా?

తెలుగు-తెలుగు అంటూ ప్రతి సంస్థకు, ప్రతి కార్యక్రమానికి తెలుగును వాడిన అధినేతలు తెలుగు పేర్ల వాడకంతోటే వారు కృత కృత్యులైనామని భావించే కన్నా కార్యాలయాలలో తెలుగు అమలవుతుందా? లేదా? అని సమీక్షింపవలసిన అవసరం, తెలుగు అమలుకు పటిష్ఠమైన చర్యలు తీసుకోవలసి ఉంది.

ఇంగ్లీషు భాషకు తెరవెనుక పట్టాభిషేకం చేయడం తెలుగు ప్రజలకు, భాషకు ద్రోహం చేసినట్టే. తెలుగును జన జీవన పాలనా భాషగా ప్రవేశ పెట్టలేకపోవటం మన పాలకుల నిర్లక్ష్య వైఖరి తప్ప మరోటికాదు.

1983, 88 ఉగాది పండుగల సందర్భంగా తెలుగును అధికార భాషగా చేస్తూ ప్రభుత్వ కార్యాలయాల ఉత్తర ప్రత్యుత్తరాలు అన్ని తెలుగులో జరగాలని చెప్పటం జరిగింది. ఆ విషయాలను పరిశీలించిందెవరు?

అధికార భాషను ఎంతమంది అమలు జరుపుతున్నారు? ఎక్కడ జరుపుతున్నారు? ఏ కార్యాలయాల్లో ఎలా అమలవుతుంది? తెలుగు టైపు మిషన్లు ఎన్ని కార్యాలయాల్లో వాడుతున్నారు? అని ఆలోచించేందుకు ప్రభుత్వం సమయం కేటాయించటం లేదు.

ప్రభుత్వానికి అధికార భాష అమలులో చిత్త శుద్ధి, సంకల్పం లేదన్నది నిర్ద్వందం. ముఖ్యంగా అధికారాభాషా సంఘానికి అధికారాలు లేకపోవడం. అవిలేనప్పుడు వారి సలహాలను, సూచనలు పాటించేదెవరు? కనుక ఈ అధికార భాషా సంఘానికి అవసరమైన అధికారాలు చట్టం ద్వారా, నిబంధనల ద్వారా, జి.ఓ.ల ద్వారా అందజేసి ఆ సంస్థకు న్యాయంగా ఇవ్వవలసిన ప్రతిష్ఠను చేకూర్చాలి.

తల్లిదండ్రులు తమ పిల్లలకు ఎల్.కె.జి. నుండే ఆంగ్ల విద్యాబోధన చేయించడం చూస్తే భావితరాల వారికి, తెలుగు భాషకు ఎంతో అపరాధం చేస్తున్నారని ఆలోచించాలి. పరాయి భాషలో పిల్లలకి విద్యాబోధన గావించడం మన సంస్కృతికి, నాగరికతకు, భాషకు, ఆత్మ గౌరవానికి ఎంతో అపకారం చేస్తున్నామని భావించాలి.

ఈ మమ్మి డాడి సంస్కృతి ఇలానే కొనసాగిస్తే మన భాషకే గాక మన సమాజానికి కూడా ద్రోహం చేసిన వారమవుతాం. మాతృభాషను ప్రధానంగా పెట్టుకొని విద్యాబోధన గావించుకొని యితర భాషలు నేర్చుకోవచ్చు.

రాష్ట్ర ప్రభుత్వం యిలాంటి కాన్వెంట్లను ప్రోత్సహిస్తూ, గుర్తింపునిస్తూ, మరోవైపు తెలుగు భాషమీద అభిమానం చూపటం హాస్యాస్పదం.

తమిళ ప్రభుత్వం తమిళ భాషా ఉద్యమాన్ని కేవలం ప్రచార సాధనంగానే గాక సామాన్య ప్రజలకు సత్వర, సమగ్ర ప్రగతికి జనవాణిగా, ప్రజావేదికగా రూపొందించి, జన జీవన పాలనా, బోధన రంగాలలో భావ దీప్తిని కలుగజేసి విద్యార్థుల భవిష్యత్తుకు బంగారుబాట వేయగలిగింది.

మన తెలుగు రాజ అధినేతలు, తెలుగు భాషపై ఉవ్వెత్తున ఉపన్యాసాలిస్తున్న అధికారులు అధికార భాషగా తెలుగును అమలుచేయటంలో ఎందుకు విఫలమౌతున్నారో అర్థంకాని ప్రశ్న.

ప్రభుత్వ వైఫల్యాన్ని గురించి ఆలోచించి తెలుగు భాషా అమలు ఉద్యమానికి తోడ్పడేందుకు తెలుగు, భాష సత్వర అమలు కొరకు కార్యచరణ పథకం రూపొందించాల్సిన అవసరం వుంది.

**అధికార భాషా సంఘంపై విమర్శ :**

1966లో అధికార భాషా చట్టం, 1974లో అధికార భాషా సంఘం ఏర్పడ్డాయి. ప్రతి మూడు సంవత్సరాలకు అధికార భాషా సంఘం చైర్మన్ మారుతుంటాడు. ఏ అధికారం లేని, కేవలం అలంకార ప్రాయమైన చైర్మన్ పదవిలో ఎవరున్నా, లేకపోయినా భాషాభివృద్ధికి ఒరిగేది లేదు, తరిగేది లేదు. కనుక వారికి స్వయం నిర్ణయాధికారాలు కల్పిస్తే భాషాభివృద్ధికి ఎక్కువగా సేవలందించగలరు.

కొందరు అధికార భాషా సంఘం అధ్యక్షులు తెలుగు భాషను అమలు పరచటానికి ఏ విధమైన చర్యలు తీసుకోకుండా తమ పదవీ కాలాన్ని ముగించుకొని వెళుతున్నారు. తెలుగు భాషాభివృద్ధిపై నిమ్మకు నీరెత్తినట్లు వ్యవహరిస్తున్నారు.

అధికార భాషా చట్టం ఏర్పడిన మొదటలో తెలుగు అకాడమి వారు కొంత ఆర్భాటం చేశారు. కాని అది కూడ ప్రభుత్వంపై ఆధారపడిన స్వయం ప్రతిపత్తి లేని సంస్థ కనుక దీని పనితీరు కూడా అంతంత మాత్రం గానే వుంది.

అధికార భాషా సంఘం విహార, వినోద, సాహిత్య యాత్రలకు పరిమితం కాకుండా ప్రభుత్వాధికారులలో తెలుగు భాషపట్ల ఆదరణను, ఆసక్తిని కలిగించాలి.

## 5.3 అధికార భాష సమగ్రంగా అమలు జరగటానికి సూచనలు :

రాష్ట్రంలో అధికార భాషగా తెలుగు అమలు జరగాలంటే ఈ కింది సూచనలు పాటించాలి.

1. ప్రాథమిక స్థాయి ప్రభుత్వ కార్యాలయాలకు ఎలాంటి నిబంధనలతో అధికార భాషను ఉపయోగించాలని సూచిస్తారో అలాంటి నిబంధనలే అత్యున్నత స్థాయి కార్యాలయాల్లో వర్తించేటట్లు శాసనం చేయాలి.

2. అధికార భాషగా తెలుగు అమలు కావాలన్న ధ్యేయం పూర్తి స్థాయిలో విజయవంతం కావాలంటే ప్రతి ప్రభుత్వ ఉద్యోగి తెలుగు భాషలో స్వయంగా ఉత్తర ప్రత్యుత్తరాలు రాయగల నేర్పు కలిగి వుండాలి. ప్రభుత్వం అందుకు కావలసిన శిక్షణను ఉద్యోగాలను భర్తి చేసేటపుడే చేరే అభ్యర్థులందరికి యివ్వాలి.

3. తెలుగు టైపులో శిక్షణ పొందిన వారికి ప్రభుత్వం ఉద్యోగ అవకాశం కల్పించాలి. టైపిస్టు ఉద్యోగులకు తప్పనిసరిగా తెలుగు టైపురైటింగ్ శిక్షణా ప్రావీణ్యం వుండి తీరాలి.

4. తెలుగు టైపు మిషన్ల వాడుకను విస్తృత పరచటమే కాక అవసరానికి కావలసినన్ని టైపు మిషన్లను ఆయా కార్యాలయాలలో అందుబాటులో ఉండేటట్లు ప్రభుత్వం చర్యలు తీసుకోవాలి.

5. ప్రభుత్వ సంఘాలలోను, ప్రభుత్వేతర సంస్థలలోను, ప్రభుత్వ అనుసంధాన సంస్థలలోను జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలన్ని తెలుగులోనే జరగాలని శాసనం చేయడం గాకుండా జరిగేటట్లు చూసే బాధ్యతను, జరుగని పక్షంలో శిక్షించే బాధ్యతను అధికార భాషా సంఘానికి ప్రభుత్వం ఇవ్వాలి.

6. ప్రాథమిక స్థాయి నుండి కళాశాల స్థాయి వరకు తెలుగు భాషను తప్పనిసరిగా బోధించాలి. ప్రాంతీయ భాష పాఠ్య ప్రణాళికను విస్తృతపరచి మరిన్ని తరగతుల్లో తెలుగు భాష బోధించేలా చేయాలి.

7. ఆధునిక ప్రామాణిక భాషలో ఆధునికవసరాలకనుగుణమైన పాఠ్యప్రణాళికను, పాఠ్య గ్రంథాలలో చేర్చాలి.

8. పారిభాషిక పదాలను సరళీకరించవలసిన ఆవశ్యకత చాలా వుంది. పారిభాషిక పదాలలోని క్లిష్టత కూడా అధికార భాషగా తెలుగు అభివృద్ధికి ఆటంకం కలుగుతుంది. అనువాదం కన్నా ఆదానం వల్ల భాషాభివృద్ధి ఎక్కువ జరగవచ్చు.

9. తెలుగులో రాసే ఉత్తరాలు, ఆంగ్ల ఉత్తరాల తీరు అనే చట్రంలోంచి బయటపడి వాస్తవికంగా తెలుగు సమాజంలోని ఉత్తరాలవలె రాయడం ప్రారంభించాలి. అధికారిక ఉత్తరాలలోని ఇంగ్లీషు ఉత్తరాల శైలిని తగ్గించుకోవాలి. తెలుగులో అధికారిక ఉత్తరాలు రాసే విధానాన్ని శిక్షణా రూపంలో గాని, నమూనా గ్రంధాల రూపంలో గాని ప్రభుత్వం అన్ని కార్యాలయాలకు అందచేయాలి.

10. అల్పసంఖ్యాక భాషా వర్గాలకు చెందిన ప్రభుత్వ ఉద్యోగులకు కూడా తెలుగు నేర్చుకోవడం తప్పనిసరి అని చట్టం చేయాలి.

11. ప్రభుత్వోగిలో తెలుగు భాషను అభివృద్ధి పరచాలనే మానసిక పరిపక్వత రానంతవరకు తెలుగు అధికార భాషగా అమలు జరగటం చాలా కష్టం.

12. ఆయా ప్రభుత్వ కార్యాలయాలను నుంచి పంపే లేఖలు, మెమోలు మొదలైన వాటిని తెలుగు భాషలో పంపడానికి వీలుగా భాషా శాస్త్రం, ఆంధ్ర భాషావాఙ్మయం చదివిన ఒక భాషా పర్యవేక్షకుడిని ప్రతి ప్రధాన కార్యాలయంలోను కనీసం 10 సంవత్సరాల పాటు నియమించాలి.

13. అధికార భాష సక్రమంగా అమలు కావాలంటే ప్రభుత్వం పాలనా వ్యవహారాలు తెలుగు వారికి స్వయంగా అర్థం కావాలంటే, పరిపాలనలో ఉపయోగించే భాష మనం రోజు మాట్లాడే భాషలాగ సినిమాలలో, రేడియాలలో వినే భాషలాగ ఆధునిక ప్రామాణిక తెలుగులో వుండాలి. అట్లాగాక గ్రాంధిక భాషను పయోగిస్తే భావవినిమయం దెబ్బతిని, అధికార భాషా లక్ష్యాలు దెబ్బతింటాయి.

14. అనువాద పద్దతులకు ఆధునిక ప్రామాణిక భాషకు సంబంధించిన పరిజ్ఞానాన్ని కలుగచేసే గ్రంథాలను భాషా విజ్ఞులతో, పాత్రికేయులతో రాయించి ఉద్యోగులకందుబాటులో వుంచాలి.

15. బ్రిటిష్ పరిపాలనా కాలం నుండి తెలుగులో సాగిన ఆయా శాఖల పరిపాలనా వ్యవహారాలకు సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలను, శాసనాల అనువాదాలను ప్రభుత్వం సేకరించి ప్రచురించి ఉద్యోగుల కందుబాటులో వుంచాలి.

16. తెలుగు భాషపట్ల, అనువాద విధానాల పట్ల శాస్త్రీయ దృష్టిని అందరికి కలిగించిన నాడే తెలుగు బహుముఖంగా పరిపాలనా, విద్యారంగాలలో వినిపిస్తుంది. ఇంగ్లీషు భాష అనుకూలమైంది, అజేయమైంది అనుకొనే బానిస బుద్ధి వున్నంత కాలం తెలుగు అధికార భాషగా అమలు జంగదు.

17. ఆయా పరిపాలనా శాఖలో ఉత్తర ప్రత్యుత్తరాలలో, శాసనాలలో బాగా తెలిసిన పదజాలాన్ని, పలుకుబడిలోని పరిపాలనా సంబంధ పదజాలాన్ని ప్రాంతాల వారిగా స్వీకరించి వాటినే ఉపయోగించాలని ప్రభుత్వం ఉద్యోగులను ఆదేశించాలి.

18. ఉద్యోగులు ఫైళ్ళు రాసేటపుడు సరైన తెలుగు పదాలు గుర్తుకు రానపుడు, లేదా తెలియనపుడు ఆ పదాలకు బదులుగా ఆంగ్ల పదాలను తెలుగు లిపిలో రాయమని ఆదేశించాలి.

19. అధికార భాషగా తెలుగును అమలు చేసేటప్పుడు అనువాదానికి ప్రాముఖ్యత వుంటుంది. 'పిల్లి' అంటే 'మార్జాలం'లాగా అనువాదం ఉండకూడదు. ప్రతి ఇంగ్లీషు పదానికి తెలుగు పదం ఉండాలన్న నియమం లేదు. బస్సు టిక్కెట్టు, రైలు లాగ కొన్ని ఇంగ్లీషు పదాలను వాడవచ్చు. అదేవిధంగా హిందీ పదాలు కూడా వాడవచ్చు.

20. అధికార భాషలో సాహిత్యాంశాలు తక్కువగా ఉండాలి. అసలు సాహిత్యాంశం లోపించినా పర్వాలేదు. వాడుకలో వున్న పదాలను సేకరించి పారిభాషిక పదాలను ఎంపిక చేయాలి. చట్టాలను, ప్రభుత్వ ఉత్తరువులను అనువదించేటప్పుడు ఆయా రంగాలకు చెందిన వారితో పాటు, భాషావేత్తలను కూడా సంప్రదించాలి.

21. ముఖ్యంగా అధికార భాషా సంఘానికి ప్రత్యేక అధికారాలు ప్రభుత్వం కల్పించాలి. కేవలం ఫిర్యాదుల వరకే అధికారాన్ని పరిమితం చేయకుండా కొన్ని చర్యలు తీసుకునే స్వేచ్ఛ అధికార భాషా సంఘానికి కల్పిస్తే తెలుగు భాష అమలు సమర్ధవంతంగా ఉంటుంది.

22. జిల్లా కలెక్టర్లకు పనిభారం ఎక్కువగా ఉంటుంది. కాబట్టి వారిని ఈ సంఘానికి జిల్లాస్థాయి అధ్యక్షులుగా నియమించేబదులు వారి స్థానంలో సమన్వయకర్తను నియమించాలి.

23. తెలుగు మాధ్యమంలో చదివిన వారికి ప్రభుత్వోగాలలో ప్రాధాన్యాతనిచ్చి ప్రోత్సహించాలి.

అధికార భాషగా తెలుగును అమలు పరచటంలో యిన్ని లోపాలున్నప్పటికి తెలుగును అన్ని రంగాలలో అమలు చేయటానికి ప్రభుత్వ యంత్రాంగం, అధికార భాష సంఘం, తెలుగు అకాడమి మాత్రమే పాటుపడితే చాలదు. ప్రజల సహకారం కూడా కావాలి.

కృషి ఉంటే చాలదు. విత్తు ముందా, చెట్టు ముందా అన్నట్లు ఈ స్ఫూర్తి ప్రజలలో రావాలా? లేక ప్రభుత్వంలో ఉండాలా? అంటే ఇక్కడ ఏ ఒక్క అంశానికి ప్రాధాన్యత లేదు. రెండూ ముఖ్యం.

ఇపుడు మనకు చట్టాలున్నాయి. చాలా వరకు అనువదించబడిన గ్రంధాలు, పారిభాషిక పదకోశాలున్నాయి. తెలుగు అమలు జరిగే విధానాన్ని పరిశీలించేందుకు, తగిన సూచనలు చేసేందుకు అధికార భాషా సంఘం వుంది. తెలుగులో టైపురైటర్లు ఉన్నాయి. అధికార్లకు, ఉద్యోగులకు తెలుగు టైపు శిక్షణ ఇస్తున్నారు.

అధికార భాషగా తెలుగు అమలు కావాలంటే ప్రయత్నలోపం ఉండకూడదు మాతృభాషాభిమానం వుండాలి. అశ్రద్ధ, చులకన భావం పనికిరాదు. "కృతకభాష"ను అధికారులపై రుద్దకూడదు. అందరి సహకారాన్ని ఆశిస్తూ ప్రభుత్వం ప్రజలను భాగస్వాములను చేసి తెలుగు భాషాభివృద్ధికి తోడ్పడాలి.

అధికార భాషా చట్టం ఏర్పడి 33 సంవత్సరాలు గడిచినా యింతవరకు తెలుగు అధికార భాషగా పూర్తి అమలుకు నోచుకోలేదు.

ఇది తెలుగు ప్రజల అందరి సమస్యగా భావించి ప్రభుత్వం, ప్రజలు పూనుకోకపోతే తెలుగు అధికార భాషగా సముచిత స్థానాన్ని పొందలేదు.

భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత భాషా ప్రాతిపదికపై రాష్ట్ర విభజన జరిగింది. 1956 నవంబర్ 1వ తేదీన ఆంధ్ర రాష్ట్రం విభజించబడ్డ తర్వాత ఆంధ్రులు ఎక్కువగా నివసించే ప్రాంతాలు యితర రాష్ట్రాల్లో కలిసి పోయాయి.

అంతేగాక నిరుద్యోగ సమస్య వల్ల తెలుగువారు అనేక మంది కూలీలనుండి విద్యావంతులవరకు ఇతరరాష్ట్రాలకు ఇతర దేశాలకు వలసపోయి స్థిరనివాసాలేర్పరచుకున్నారు.

## 6.1 రాష్ట్రేతరాంధ్రులు :

ఇతర రాష్ట్రాల్లో ఇతర దేశాల్లో తెలుగు ప్రజల ఉనికి, జీవన స్థితిగతుల గూర్చికొన్ని వివరాలు కింద పొందుపరచబడ్డాయి.

తమిళనాడులో తెలుగువారు :- ఆంధ్రప్రదేశ్ తర్వాత అత్యధిక సంఖ్యలో తెలుగువారు నివసించే రాష్ట్రం తమిళనాడు. ఆంధ్ర, తమిళ ప్రాంతాలను కలిపి పాలించిన పల్లవ, చాళుక్య, చోళ రాజుల కాలంలో, క్రీ.శ 15వ శతాబ్దం తంజావూరు, మధురలను పాలించిన రాజుల కాలంలో తెలుగువారు అనేకులు తమిళ ప్రాంతాల్లో స్థిరనివాసమేర్పరచుకున్నారు.

తెలుగు సాహితీ లోకంలో దక్షిణాంధ్రయుగంలో ఆనాటి పాలకులైన నాయకరాజులు, వారి సామంతులు, తంజావూరు రాజులు తెలుగు మాటకు, తెలుగు పాటకు ఒక కొత్త సోయగాన్ని చేకూర్చారు.

తమిళనాడు దక్షిణ ప్రాంతంలో స్థిర నివాస మేర్పరచుకున్న తెలుగువారు జీవన సౌకర్యాలను కల్పించుకొని సాంఘికంగా, రాజకీయంగా, ఆర్థికంగా, ఉన్నతస్థానంలో వుంటూ తమ ప్రత్యేకతను నిలుపుకుంటూ గౌరవ జీవితం గడుపుతున్నారు. ఇక్కడి తెలుగువారి భాషావేషాలు, సంబంధ బాంధవ్యాలు కుల ప్రత్యేకతలతో వుంటున్నాయి.

డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు, సాహితీ వేత్తగా ఆరుద్ర, కె. రామలక్ష్మి, స్వాతంత్ర్య సమరయోధులు పి. వరద రాజులు నాయుడు, వైజ్ఞానికులు జి.డి. నాయుడు, పారిశ్రామిక వేత్తలు పి.ఆర్.రామ సుబ్రమణ్యరాడు, జి.కె. సుందరం దామోదరన్, సంగీత కళానిధి త్యాగరాజు, గాయని ఎమ్.ఎస్ సుబ్బలక్ష్మి, ఇలాఎందరో రాజకీయ నాయకులు, సంఘసంస్కర్తలు, నటీనటులు, కళాకారులు, చలన చిత్రపారిశ్రామికులు, కవులు, రచయితలు, ఉద్యోగులు మొదలైనవారు తమిళనాడులో స్థిరనివాసమేర్పరచుకొన్నారు.

### తమిళనాడులో జిల్లాల వారిగా తెలుగు మాట్లాడే వారిసంఖ్య

| జిల్లాపేరు | తెలుగు మాట్లాడేవారు (1971 ప్రకారం) | మొత్తం జనాభా శాతం | తెలుగు మాట్లాడేవారు 1977 ప్రకారం. |
|---|---|---|---|
| చెంగల్పట్టు | 3,51,209 | 12.0 | 373,907 |
| కోయంబత్తూరు | 8,24,302 | 19.0 | 8,49,684 |
| ధర్మపురి | 3,06,205 | 18.2 | 3,25,095 |
| కన్యాకుమారి | 2,365,0 | 0.1 | 2,470 |
| మధురై | 4,09,952 | 10.4 | 4,22,580 |
| నీలగిరి | 31,004 | 6.2 | 31,956 |
| ఉత్తర ఆర్కాట్ | 3,68,494 | 9.7 | 3,91,229 |
| రామానంతపురం | 2,16,913 | 7.5 | 2,23,630 |
| సేలం | 3,03,778 | 10.1 | 3,13,144 |
| దక్షిణ ఆర్కాట్ | 1,39,677 | 3.8 | 1.43,949 |
| తిరుచ్చినాపల్లి | 1,76,967 | 4.5 | 8,82,420 |
| తిరునల్వేలి | 1,25,598 | 3.9 | 1,29,476 |
| తంజావూరు | 46,426 | 1.1 | 47,840 |
| మద్రాసు నగరం | 2,97,188 | 12.0 | 3,21,652 |
| తమిళనాడు | 36,00,078 | 8.7 | 37,59,032 |
| రూరల్ (గ్రామ) | 24,02,823 | | |
| అర్బన్ (పట్టణ) | 11,97,255 | | |

తమిళనాడులోని ప్రవాసాంధ్రులను ప్రాంతీయంగా విభజించి పరిశీలిస్తే ప్రవాసాంధ్రుల సంఖ్యకు కోయంబత్తూరు జిల్లా మొదటి స్థానంగాను, ధర్మపురి జిల్లా రెండవస్థానంగాను, మద్రాసు నగరం, చెంగల్పట్టు జిల్లాలలో తెలుగువారు సమానంగా నివసిస్తున్నారని ఈ పట్టిక తెలుపుతుంది.

**తెలుగువారు** : భాషా ప్రయుక్త రాష్ట్రాలు విభజించబడినప్పుడు బళ్ళారి, కోలారు, కోసూరు, ప్రాంతాలను ఆంధ్ర దేశంలో చేర్చమని ఆంధ్రులు కోరారు, కాని రాజకీయ కారణాల వల్ల వాటిని కర్ణాటకలో చేర్చారు.

కోలారు, బళ్లారి, రాయచూరు ప్రాంతాలేకాక చిత్రదుర్గ, బెంగుళూరు, తుంపూరు మొదలైన ప్రాంతాల్లో స్థిరనివాసాలేర్పరచుకున్న తెలుగువారు అనేకులున్నారు. (1971 భారత ప్రభుత్వ గణాంక వివరాలు)

**కర్ణాటకలో తెలుగువారు :**

| ప్రాంతం | తెలుగు జనాభా (లక్షలలో) |
|---|---|
| మైసూరు | 24,000 |
| బెంగుళూరు | 5,37,299 |
| బళ్ళారి | 1,11,973 |
| చిత్రదుర్గ | 1,82,94 |
| గుల్బర్గా | 1,19,726 |
| రాయచూరు | 1,22,652 |
| తుంపూరు | 1,68,920 |
| కోలార్ | 8,28,720 |
| షిమోగా | 52,094 |
| చిత్కుందుళూరు | 20,970 |
| బీదర్ | 43,531 |
| హసన్ | 27,698 |

మోక్షగుండం విశ్వేశ్వరయ్య, మైసూరు రాష్ట్ర మొదటి ముఖ్యమంత్రి చెంగల్‌రాయరెడ్డి, రంగస్థల నటుడు బళ్ళారి రాఘవ, నాటక కర్త కోలాచలం శ్రీనివాసరావు, ధర్మవరం రామక్రిష్ణాచార్యులు వంటి ప్రముఖులే కాక అనేక మంది విద్యావేత్తలు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ సంస్థల్లో, పారిశ్రామిక సంస్థల్లో ఉన్నత స్థానాల్లో వున్నారు.

**ఒరిస్సాలో తెలుగువారు :** 1936లో ఒరిస్సా ప్రత్యేక రాష్ట్రంగా విభజించబడ్డప్పుడు తెలుగువారు అధికంగా నివసిస్తున్న "కోరాపుట్" జిల్లాలోని ప్రాంతాలు, బరంపురం తాలూకాలోని తీరప్రాంతం, బరంపురం పట్టణం, చత్రపూర్ తాలూకా, గంజాం జిల్లాలోని పర్లాకిడి తాలూకా ఒరిస్సాలో చేరిపోయాయి.

ఈ ప్రాంతాలను విడదీయరాదని నాటి ఉమ్మడి మద్రాసు శాసన మండలి ఒక తీర్మానం చేసింది. అధిక సంఖ్యలో వున్న తెలుగువారిని వారి ప్రాంతాలను ఇతర రాష్ట్రాలలో చేర్చటం వల్ల వారికి అనేక యిబ్బందులు ఎదురవుతాయని చెప్పినప్పటికి రాజకీయ నాయకులు పట్టించుకోలేదు. 12 తెలుగు తాలూకాలు ఒరిస్సా రాష్ట్రంలో చేరిపోయాయి. 1971 లెక్కల ప్రకారం ఒరిస్సాలో గంజాం, కోరాపూట్, పూరి, సంబల్‌పూర్, బాలాసూర్ జిల్లాలలో 5 లక్షల మంది తెలుగు వారున్నారని అంచనా.

ఆంధ్రులు అక్కడి సాంఘిక, రాజకీయ పరిపాలనా రంగాలలో ఉన్నతస్థానాలను అధిరోహించివున్నారు. రాష్ట్రపతిగా శ్రీ వి.వి.గిరి, సుప్రీంకోర్టు న్యాయమూర్తిగా పి.వి. బాలకృష్ణారావు, ప్రముఖ న్యాయవాదిగా సంఘ సేవకునిగా సి.వామనమూర్తి, సాహితీ వేత్తగా పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, తాపీ ధర్మారావు, కాంచనపల్లి రంగారావు, కృష్ణారావు మొదలైనవారు ముఖ్యులు.

**మహారాష్ట్రలో తెలుగువారు :** సుమారు 150 సంవత్సరాల పూర్వంనుండి తెలుగువారు మహారాష్ట్ర ప్రాంతానికి కొన్ని వేల మంది వలసపోయారు. మహారాష్ట్రలో సుమారు 15 లక్షల మంది తెలుగు వారున్నారని అంచనా. వీరిలో అధిక సంఖ్యాకులు తెలంగాణా జిల్లాలకు చెందిన వారే. మహారాష్ట్రలోని కామాటాపురం తెలంగాణా ప్రజల తెలుగు ప్రాంతం. ఈ ప్రాంతంలోనే సుమారు 60 వేలకు పైగా తెలుగు వారున్నారు. బొంబాయి నగరం పారిశ్రామిక నగరం కావడం వలన అనేకులు ఉద్యోగాల కోసం ఈ ప్రాంతాలకు వలస వచ్చారు. తెలంగాణా ప్రాంతం నుండి వచ్చిన తెలుగువారిలో అనేకులు 'పద్మశాలీ' కులస్థులు. బొంబాయిలోని మిల్లు పరిశ్రమలలో సామాన్య ఉద్యోగిగా చేరి నేటికి యజమానులుగా కూడా ప్రఖ్యాతి వహించిన వారున్నారు.

మహారాష్ట్రలోని దానా, పూనా, సోలాపూర్, చంద్రాపూర్, నాగపూర్, నాంధేడ్, ఔరంగాబాదు, అహమ్మదాబాద్, నగరాలలో తెలుగువారు అధిక సంఖ్యలో వున్నారు. వీరు మాతృభాషను చాలావరకు మరచిపోయారు. బొంబాయి మహానగరంలో 1949 సంవత్సరంలో ఆంధ్రసారస్వత పరిషత్తు అనే విద్యాసంస్థను స్థాపించారు. ఈ సంస్థద్వారా ప్రాథమిక, ప్రవేశ, విశారద తెలుగు పరీక్షలు జరిపి మాతృభాషాభివృద్ధికి కృషి చేస్తున్నారు.

**బెంగాల్‌లో తెలుగువారు :** వంగదేశంలో తరతరాలుగా లక్షలాది భక్తులచేత నిత్యం పూజలందుకునే విశ్వమత ప్రవక్త శ్రీ త్రైలింగస్వామి.

శిల్పకళ, చిత్రలేఖనంలో కూడా ఆంధ్రులు, వంగీయులు అపూర్వసహోదరులవలె కృషిచేశారు. మచిలీపట్నం జాతీయ కళాశాలలో ప్రమోద్‌కుమార్ బెనర్జీ ఆచార్యులుగా వుండి అడవి బాపిరాజు గారిని తెలుగుదేశానికి పరిచయం చేశారు. దేవి ప్రసాద్‌రాయ్ చౌదరి ఆధ్వర్యంలో అనేక మంది ఆంధ్ర శిల్పులు శిల్పకళారహస్యాలను గ్రహించారు. శాంతినికేతన్‌లోని "స్కూల్ ఆఫ్ ఆర్ట్స్" కు చిత్రభద్రారావు కొంతకాలం వైస్ ప్రిన్సిపాల్‌గా పని చేశారు. శాంతినికేతన్ లోని నందలాల్ బోసు దగ్గర ఆర్ట్ నేర్చుకున్న చిత్రకారులలో రత్నాల కమలాభాయి, జి.వి. సుబ్బారావు, వేలూరు రాధాకృష్ణ, నగ్రా వెంకటరత్నం ముఖ్యులు.

తెలుగు తొలి చిత్రాలు వంగీయ సాంకేతిక నిపుణుల ఆధ్వర్యాన కలకత్తాలో తయారైనాయి. తరువాత మద్రాసుకు రంగం తరలడంతో ఛాయాచిత్ర నిపుణుడు కమల్‌ఘోష్, మేకప్ ఆర్టిస్ట్ హరిబాబు మద్రాసు నివాసులై తెలుగు చిత్రాలకు పని చేసారు. ఎందరో తెలుగు ప్రముఖులు వంగ దేశంలో అగ్ర స్థానాలలో పని చేశారు. సినీనటి జానకి తండ్రి టేకుమళ్ళ వెంకాజిరావు బెంగాల్ ప్రభుత్వానికి పేపర్ టెక్నాలిజిస్ట్‌గా పనిచేశారు. ఆల్ ఇండియా ఇన్స్టిట్యూట్ ఆఫ్ హైజీన్ అండ్ హెల్త్‌కు డైరెక్టరుగా పనిచేసిన డాక్టర్ మంత్రి ప్రగడ నరసింహారావు ఇండియన్ స్టాటిస్టికల్ ఇన్స్టిట్యూట్ డైరెక్టర్‌గా పనిచేసిన డా॥ సి.ఆర్.రావు వంగీయాంధ్రుల గౌరవ ప్రపత్తులను యినుమడింపచేశారు. కలకత్తాలో కొద్దికాలమే పనిచేసినా డా॥ ఇలపావులూరి పాండురంగారావు, ఇచ్ఛాపురపు జగన్నధరావు సాహితీవర్గాల్లో తెలుగుకు గౌరవం సమకూర్చారు.

ప్రొ. జె.బి ఎన్. హాల్డెన్ కలకత్తాలో వుంటూ తెలుగు భారత దేశపు అధికార భాష కావాలని 'హిందు' దిన పత్రికలో వ్యాస పరంపర కురిపించారు. అవసరాల వెంకటనరసుగారు కలకత్తా నివాసిగా

వుంటూ ప్రముఖ తెలుగు పత్రికలన్నింటిలో అమూల్యరచనలు ప్రచురించారు. మహాకవి గురజాడ కన్యాశుల్కాన్ని ఆంగ్లంలోనికి తర్జుమాచేసి ముద్రించిన ఖ్యాతి కలకత్తా ఆంధ్రుడైన ఎస్. ఎస్ జయంతి గారికి దక్కింది.

1814లో కలకత్తాకు 13 కి.మీ. దూరంలో గల శ్రీరాంపూర్‌లో రెవరెండ్ విలియంకారె రాసిన తెలుగు వ్యాకరణం ముద్రింపబడింది. దీనినే తొలి తెలుగు వ్యాకరణంగా పేర్కొంటారు. తొలి తెలుగు టైపు అక్షరాలు కూడా శ్రీరాంపూర్‌లోనే తయారయ్యాయని ప్రతీతి.

**బీహార్‌లో తెలుగువారు** : 19వ శతాబ్దం నుంచి ఆంధ్రులు బీహార్‌లోని పలు ప్రాంతాలకు వలస వెళ్ళటం ప్రారంభించారు. ముఖ్యంగా ఆనాటి బెంగాల్, నాగపూర్ రైల్వేలలో ఉద్యోగాల నిమిత్తం బెంగాల్, బీహార్, రాష్ట్రాలకు ఎందరో తెలుగువారు చేరుకున్నారు.

70 సంవత్సరాల క్రితం జంషెడ్‌పూర్‌లో టాటా ఉక్కుకర్మాగారం ప్రారంభమైన తర్వాత దానిమీద ఆధారపడ్డ ఎన్నో పరిశ్రమలు కూడా అక్కడ ప్రారంభమైనాయి. వేల సంఖ్యలో తెలుగు వారు జంషెడ్‌పూర్ చేరారు. యితర ప్రదేశాలకు కూడా వలస వెళ్ళారు.

రాంచీలోని వివిధ భారీ పరిశ్రమలు ధన్‌బార్, పరిసరాలలోని బొగ్గు గనులు, సింద్రీలోని ఎరువుల కర్మాగారం, జాదుగుడాలోని యురేనియం మిల్లు, రాకీమైన్స్‌లోని రాగి పరిశ్రమ కేంద్రం, కొత్తగా పెరుగుతున్న చిన్న, పెద్ద కర్మాగారాల్లో జీవనోపాధికోసం వివిధ నగరాలలో తెలుగువారు నివసిస్తున్నారు.

బీహార్‌లోని యితర రాష్ట్రాలలో కూడా తెలుగువారిలో కార్మికులేగాక గవర్నర్లు మహారచయితలు, వ్యాపార నిపుణులు, రాజకీయ నాయకులు, విద్వాంసులు, శాస్త్రపారంగతులూ ఉన్నారు.

సాధారణంగా యిక్కడ వుంటున్న తెలుగువారు ఒక్కొక్క ఊరిలో 20 కుటుంబాలుంటే ఒక సంఘంగా ఏర్పడి వారి ఆచార వ్యవహారాలను పాటిస్తూ పండుగ పబ్బాలు జరుపుకుంటూ తెలుగు సంస్కృతిని కాపాడుకుంటున్నారు.

**మధ్యప్రదేశ్‌లో తెలుగువారు** : మధ్యప్రదేశ్‌లోని రాయపూర్, బిలాస్‌పూర్ మొదలైన జల్లాలలో తెలుగువారిలో కొందరు రైల్వేలో ఉద్యోగరీత్యా వచ్చినవారు. బెంగాల్, నాగపూర్ రైల్వేలో చేరిన వారిలో చాలామంది విజయ నగరం, విశాఖపట్టణం, తూర్పుగోదావరి నుంచి వచ్చారు. ఇంకా కొందరు కృష్ణాజిల్లా నుంచి, వ్యాపారరీత్యాగాని, వృత్తిరీత్యాగాని వచ్చారు. వీరిలో బిలాస్‌పూర్‌కు చెందిన ఈడ్పుగంటి రాఘవేంద్రరావుగారు మధ్యప్రదేశ్‌లో మొదటి భాంతీయ గవర్నర్‌గా పనిచేశారు. నాగపూర్ విశ్వ విద్యాలయంలో రాజనీతి శాస్త్ర విభాగాన్ని నిర్మించి దానికి తన పుస్తకాలన్నింటిని దానం చేశాడు.

ప్రాచీన భారత ఇతిహాసశాఖకు శ్రీనియోగిగారు, తాంత్రిక సంస్థకు శ్రీలక్ష్మీనారాయణగారు, రాజనీతి శాఖకు శ్రీ రాఘవేంద్రరావుగారు, సహాయంచేయటంవల్ల నాగపూర్ విశ్వవిద్యాలయం అభివృద్ధి చెందింది. శ్రీ రాఘవేంద్రరావుగారి బంధువైన శ్రీ కౌసవేంద్రరావుగారు నాగపూర్‌లో హైకోర్టు జడ్జిగా పని చేశారు. నాగ్‌పూర్‌లో గల ఆంధ్ర సంఘం భవనానికి శ్రీ కౌసవేంద్రరావుగారి పేరు పెట్టారు.

పోతుకూచి హృషికేశ శర్మగారు నాగపూర్‌లో రాష్ట్ర జనాభా ప్రచార సమితి నిర్వహించారు. వారి తోడల్లుడైన శ్రీ జి.వి. భట్టుగారు మధ్యప్రదేశ్ హైకోర్టులో ప్రధాన న్యాయమూర్తిగా పనిచేసి సాగర విశ్వ విద్యాలయానికి ఉపాధ్యక్షులైనారు.

మధ్య ప్రదేశ్‌లోని విదర్భలో గల తెలుగువారి జీవితవిధానం విశిష్టమైంది. నాగపూర్‌కు తూర్పుగా వున్న నగరాలలోని వారు విశాఖ పట్టణంలోనివారి ఆచార వ్యవహారాలను చాలావరకు పాటిస్తారు. విదర్భలోని వారు తెలంగాణాలోని ఆచారాలను కొంతవరకు అనుసరిస్తారు. స్థానిక సంస్కృతి కూడా అలవడింది.

**గుజరాత్‌లో తెలుగువారు :** గుజరాత్‌లో 20వ శతాబ్దం ప్రారంభంలో నూలు మిల్లులు అనేకం ప్రారంభమైనాయి తెలంగాణాలోని అనేకమంది పద్మశాలీలు యిక్కడికి వలస వచ్చారు.

అహ్మదాబాద్‌లోని మిల్లులలోని కార్మికులలో సగంమంది ఆంధ్రులున్నారు. ఉన్నత విద్యనభ్యసించిన విద్యావేత్తలు, విద్యార్థులు అహమ్మదాబాదులోని ఇండియన్ ఇన్సిట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంట్, ఫిజికల్ రీసెర్చి లేబొరెటరీ మొదలైన వానిలో పారిశ్రామికాభివృద్ధి పథకాలకు, ఐ.ఎఫ్ఎఫ్.సి.ఓ, ఎ.టి.ఐ.ఆర్.ఎ, ఐ.పి.ఐ.ఎల్ వంటి వాటిలో ఆంధ్రులు ఉన్నతోద్యోగులుగా వున్నారు.

బరోడాలోని విశ్వవిద్యాలయం, ఆనంద్‌లోని పాల పరిశ్రమ కేంద్రంలో, సూరత్ విశ్వవిద్యాలయంలో రాజకోట కళాశాలలో తెలుగువారు ఉన్నత పదవులలో వున్నారు. ఈ రాష్ట్రానికి కొత్తగా వచ్చిన ఆంధ్రులు ఆహార వ్యవహారిక విషయంలో అవస్థ పడక తప్పదు. గుజరాతీయులకు భాషాభిమానం ఎక్కువ. బిల్లులు రాయటం, ప్రభుత్వాఫీసులకు సంబంధించిన కాగితాలు గుజరాత్ భాషలోనే రాస్తారు. అది తెలుగువారికి ఒక యజ్ఞం లాంటిది.

గుజరాతీయుల ఆచారాలను కొన్నింటిని ఆంధ్రులు స్వీకరించినప్పటికి కూడా తమ ఆచారాలను మరవలేదు. శ్రావణ మంగళవారపు నోములు, కార్తీక మాసంలో వనభోజనాలు, వినాయక చవితి పూజలు, బతుకమ్మ పండుగలు శ్రద్ధతో జరుపుకుంటారు. ముంగిట రంగవల్లులు తీర్చటం, తులసిమొక్క పూజించటం యిక్కడి ఆంధ్రులు మర్చిపోలేదు.

అలవాట్లు, ఆచారాలు యిలా పొందుపరచుకుంటూ ఆంధ్రులు అహ్మదాబాదులో 50 సంవత్సరాల వరకు ఏ పాఠశాల లేకుండా వున్నారు. తెలుగు బాల బాలికలు గుజరాతీ, మరాఠీ, హిందీ, మొదలైన అన్యభాషలను నేర్చుకొనేవారు. ఉన్నతోద్యోగులు తమ పిల్లలను ఇంగ్లీషు కాన్వెంట్‌కు పంపుతున్నారు. చాలా మంది కార్మికులు తెలంగాణా మరాఠి, దేశాల నుండి వచ్చిన వారు కనుక తమ పిల్లలను మరాఠి పాఠశాలలకు పంపుతున్నారు.

## 6.2 విదేశాంధ్రులు :

భారత దేశంలోని వివిధ రాష్ట్రాలలోనే కాక తెలుగువారు విదేశాలలో కూడ నివసిస్తున్నారు.

**మారిషస్‌లో తెలుగువారు :** 1850లో మొదటిసారిగా తెలుగవారు ఈ దీవిలో నివాసాలేర్పరుచుకొన్నారు. వారి పిల్లలను మాత్రం తెలుగు సంస్కృతి నుంచి దూరం కానివ్వలేదు.

1927లో మారిషస్ తెలుగు సంఘం "రాజ్‌హిల్" ప్రాంతంలో ప్రథమ సమావేశం జరుపుకున్నారు. శ్రీ నరసింహదాసు, రామస్వామి పడయా తదితరుల ఆధ్వర్యంలో ఈ సంఘాన్ని "మారిషస్ ఆంధ్ర మహాసభ" అని మార్చారు. శ్రీ రాజగిరి నంసింహదాసు అధ్యక్షతన పోర్టులూయిస్‌లో ఫిబ్రవరి 16న ఒక సమావేశం జరిగింది.

ఈ సమావేశానికి సుమారు 800 మంది తెలుగువారు హాజరయ్యారు. 1945లో మారిషస్ ఆంధ్ర మహాసభ సుస్పష్టమైన రూపాన్ని ఏర్పరచుకొంది. 1948 ఆగస్టు 4న శ్రీకృష్ణయ్యగారు మొదటి అధ్యక్షుడుగా, శ్రీ కొమిరికి రామసనిగారు కార్యదర్శిగా, శ్రీ.కె. అప్పడుగారు కోశాధికారిగా ఎన్నికయ్యారు.

**బర్మాలో తెలుగువారు :** 1834లో బ్రిటీష్ వారు అధికారాన్ని సంపాదించారు. బర్మాదేశ ఆర్థికోత్పత్తికి కార్మిక వర్గాలనుండి ఎక్కువ మంది తెలుగు వారిని ఉద్యోగస్థులుగా నియమించారు. ఈ విధంగా ఉద్యోగులైన తెలుగు ప్రజలు క్రమంగా స్థిర నివాసులైనారు.

1885లో రెండవ బర్మాను బ్రిటీష్ వారు పూర్తిగా మార్చివేసినపుడు కొందరు విద్యావంతులను, ఎక్కువ మంది తెలుగు కార్మికులను అసంపూర్ణ విద్యావంతులుగాను, ప్రభుత్వ ప్రభుత్వేతర రంగాలలో ఉద్యోగులుగా నియమించారు.

రెండవ ప్రపంచ యుద్ధం మొదలయ్యే నాటికి బర్మాలోని తెలుగు జనాభా సుమారు పది లక్షలని అంచనా వీరిలో 95శాతం మంది దిగువస్థాయి జీవితాలను గడుపుతున్నారు.

రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో చాలా మంది వెనుదిరిగి వచ్చేశారు. బర్మాదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత బర్మా ప్రజలు అన్ని రంగాలలో ఆధిపత్యం వహించినందువల్ల తెలుగు ప్రజలు బర్మాను వదిలి పెట్టారు.

పరిస్థితుల కనుగుణంగా నివసించటానికి అలవాటు పడ్డ ప్రజలు మాత్రం బర్మాలో మిగిలి పోయారు. ఈ కారణంగా తెలుగు ప్రజల సంఖ్య 6000లకు తగ్గిపోయింది. మిగిలినవారు ఎక్కువమంది శ్రామికులు గుంపులు గుంపులుగా కొన్ని ప్రత్యేక స్థలాలలో నివసించేవారు. చెప్పుకోదగినంతగా బర్మా సంస్కృతి వీరికి అలవడలేదు.

బర్మాదేశ చట్ట ప్రకారం విదేశీయులు ఆదేశాన్ని విడిచి పెట్టడానికి, యితరులకు ఆర్థిక సహాయం చేయడానికి వీలులేదు. బర్మాలో స్థిర నివాసం ఏర్పరచుకొన్న వారికి పాస్‌పోర్టు యిచ్చారు. కాని విదేశీ మారకం దొరకదు.

ఇలా సరైన వసతులులేక, సాంఘిక హోదాలు లేక బర్మాలోని తెలుగువారు ఎన్నో విషమ పరిస్థితుల నెదుర్కొంటూ అసంతృప్తిగా జీవితాన్ని గడుపుతూ తమ సమస్య పరిష్కారమయ్యే రోజుకోసం ఎదురుచూస్తున్నారు.

**జాంబియాలో తెలుగువారు :** ఆఫ్రికా ఖండాంతర్గతమైన జాంబియా దేశంలో 12 కుటుంబాలకు చెందిన సుమారు 30 మంది తెలుగువారున్నారు. ఉద్యోగంలోను, వ్యాపారంలోను వారు స్థిరపడి పోయారు. ఉన్నత విద్యావంతులు ప్రపంచంలోని తెలుగు వారందరికి ఉపయుక్తంగా ఉండేటట్లు రావాలన్నది వారి కోరిక.

**ఫిజీలో తెలుగువారు :** ఫిజీ దీవికి 1918లో యితర భారతీయులతోపాటు తెలుగువారు చేరారు. నాడు ఫిజీ బ్రిటీష్ పాలనలో వుండేది. కాంట్రాక్ట్ లేబర్ విధానం ఆధారంగా వీరంతా ఫిజీకి చేరారు.

ఈ కారణంగానే బ్రిటీష్ ప్రభుత్వం భారతీయులను ఫిజీకి రప్పించింది. ఫిజీలో వీరి జీవితం యితర భారతీయుల జీవన విధానంలాగానే వుంది. భారతీయ అధ్యాపకులు బోధన చేసే పాఠశాలలకే తెలుగువారి పిల్లలు వెళ్ళి విద్యాభ్యాసం చేస్తుంటారు.

అయితే వీరికి మాతృభాష తెలుగు మాత్రం బోధించటం లేదు. ఈ కారణంగా ఇక్కడివారు క్రమంగా తెలుగు మర్చిపోతున్నారు. సంఘం, పాఠశాలలు చాలా పనిచేస్తున్నా దక్షిణ భారత భాషలు మాత్రం బోధనా మాధ్యమం కావటంలేదు.

తెలుగు భాషాభివృద్ధికి విశేష కృషి జరగక పోతే తెలుగు భాష నశించే అవకాశం వుంది. ఫిజిలోని తెలుగు విద్యార్థులకు ఆంధ్ర ప్రభుత్వం స్కాలర్‌షిప్పులిస్తున్నది. వీరు తమ విద్యాభ్యాసం ఇండియాలో చేస్తున్నారు. వీరికి విద్యాభ్యాసంతోపాటు సాంఘిక, సాంస్కృతిక రంగాలలో తగిన శిక్షణ యివ్వాలి. నిత్యం జరిగే తెలుగు మహాసభలు ప్రపంచ మహాసభలు తెలుగు వారికే కాక అన్ని దేశాలలోని తెలుగువారి సంస్కృతుల వికాసానికి, సమాజ అభ్యున్నతికి కృషి చేసేందుకు దోహద పడేదిగా ఉండాలని వీరి కోరిక.

**శ్రీలంకలో తెలుగువారు :** అతి ప్రాచీన కాలం నుండే ఆంధ్రదేశానికి శ్రీలంకకు సంబంధాలున్నాయి. 13.14 శతాబ్దాలలో ఆర్య చక్రవర్తులు శ్రీలంకను పరిపాలించారు. వారందరు తెలుగు, చోళ, పారంపర్యానికి చెందినవారు. ఆ చక్రవర్తుల కాలంలో కాంచీపురం నుండి ఆంధ్ర దేశం నుండి నేత పనివారిని తెప్పించి వలసలేర్పరచారనే వృత్తాంతం వుంది.

14.15వ శతాబ్దాలలో శ్రీలంక ఉత్తర భాగంలో యాళ్వాణ ప్రదేశం విజయనగర సామ్రాజ్యాధిపతుల వశంలోవుంది. ఆసమయంలో సైనికులుగా, కళాకారులుగా శ్రీలంకకు వచ్చినవారు తెలుగువారే అయివుండవచ్చు ననడానికి నిదర్శనాలున్నాయి.

విజయనగర సామ్రాజ్యంలో వెలసిన వైష్ణవ మతం, యాళ్వాణ దేశంలో కూడా ప్రాబల్యంలో ఉంది. వైష్ణవాలయాలు అనేకం వున్నాయి. ఒక్కొక్క కుటుంబంలో వృద్ధులు మాత్రం తెలుగు మాట్లాడతారు. వైష్ణవాలయంలోని ధర్మకర్తలందరూ తెలుగు పరంపరలోని వారైనా ప్రస్తుతం తెలుగు మాట్లాడటంలేదు. కొందరు సింహళరాజులు యుద్ధ నిమిత్తం హిందూ దేశం నుండి తెప్పించిన సైనికులలో ఎక్కువమంది తెలుగువారే.

శ్రీలంక మధ్య భాగం కండీ రాజ్యం పూర్వం సింహళ రాజుల పరిపాలనాధికారంలో వుంది. ఆరాజులు మధుర, తంజావూరు, ప్రదేశాలలో నాయక వంశస్థులతో వివాహసంబంధాల నేర్పరచుకొనటం వల్ల రాణులతో సహా, పరిచారికలు, కళాకారులు, బంధుమిత్రులందరూ శ్రీలంకకు వచ్చారట. కండీ రాజ్యాన్ని పాలించిన నలుగురు రాజులు తెలుగు నాయక వంశస్థులని దృఢంగా చెప్పవచ్చు.

కొలంబోలోని వస్తు ప్రదర్శన శాలలో భద్రపరచిన తాళపత్ర గ్రంధాలలో సంగీత శాస్త్రం, నాట్యశాస్త్రం, అమరం మొదలైనవి అర్థసహితంగా ఉన్నాయి.

నాగార్జున కొండ, అమరావతి శిల్పవాస్తు శాస్త్ర విధానంలో నిర్మించబడిన బౌద్ధ స్థూపాలు, విహారాలు శ్రీలంకలో పెక్కుచోట్ల వున్నాయి.

శ్రీలంకలో యాళ్పాణ, కండీ రాజ్యాలలోకాక, వవునియా ప్రదేశంలో కూడా యిపుడు తెలుగు వారున్నారు. వ్యవసాయం, రావి పరిశ్రమవీరి వృత్తులు.

కొలంబోలో పాములాడించేవారు, సోదిచెప్పేవారు చక్కని తెలుగు మాట్లాడతారు. శ్రీలంక బ్రిటీష్‌వారి అధికారంలో ఉన్నపుడు రబ్బరు, తేయాకు తోటలలో పనిచేయడానికి దక్షిణ హిందూ దేశంనుంచి తెచ్చిన కృషీవరులలో మూడు వంతులు తెలుగువారున్నారు. వీరి తెలుగు భాష తమిళ మిశ్రమం కాలక్రమేణ తమిళ, సింహళ భాషల ప్రభావం వల్ల తెలుగు మరుగున పడిపోయింది.

**కెనడాలో తెలుగువారు :** రెండవ ప్రపంచ యుద్ధానంతరం కెనడాలోని అనేక అభివృద్ధి పథకాలవల్ల శాస్త్ర, ఇంజనీరింగ్, విషయాలలో ఉన్నత విద్యనభ్యసించటానికి, శిక్షణ పొందడానికి తెలుగువారు కెనడా చేరారు.

ఇక్కడున్న తెలుగువారిలో కొంతమంది అమెరికా దక్షిణాఫ్రికా మొదలైన దేశాలనుండి వలస వచ్చారు. కెనడాకు చాలా మంది విద్యార్థులను ఆంధ్రప్రదేశ్ విశ్వవిద్యాలయాలు, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం పంపింది.

పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన అంటారియో, బ్రిటీష్, కొలంబియా, ఆల్బర్టా రాష్ట్రాలలోని ముఖ్యనగరాలలో తెలుగువారు ఎక్కువగా స్థిర నివాసమేర్పరచుకున్నారు.

కెనడా దేశపు పండుగలలో, వారి జాతీయ, సాంస్కృతిక కార్యక్రమాల్లో తెలుగువారు పాల్గొంటారు. వీరు కెనడా దేశపు పండుగలతోపాటు తెలుగు పండుగలన్నీ జరుపుకుంటారు. ఈ సందర్భాలలో తెలుగువారి ఆహారపుటలవాట్లు, వినోద కార్యక్రమాలుంటాయి. ఒక్కొక్కప్పుడు తెలుగు సాహిత్యాన్ని గురించి చర్చలు, కావ్యపఠనం, ఉపన్యాసాలు కూడా ఉంటాయి. తెలుగువారి సంఘం అక్కడున్న భారతీయ సంఘాలతో సహకరించి స్వాతంత్ర్య దినోత్సవం, రిపబ్లిక్‌దినోత్సవాలలో పాల్గొంటుంది.

**దక్షిణాఫ్రికాలో తెలుగువారు :** దాదాపు ఈ శతాబ్దాంతం వరకు తెలుగువారు దక్షిణాఫ్రికాకు వలసవస్తూనే వున్నారు. భారతీయులు దక్షిణాఫ్రికాకు వలస రావడంపైన 1911లో నిషేధం విధించబడింది.

వలస వచ్చిన ఆంధ్రులలో ఎక్కువమంది రైతులుగాను, వ్యవసాయ కార్మికులుగాను ఉన్నారు. డాక్టర్లు, గుమస్తాలు, సైనికులు, ఉపాధ్యాయులేకాక కంసాలి, కుమ్మరి వంటి చేనేత పనివారు కూడా వలస వచ్చారు.

ఇక్కడివారి స్థిరనివాసం భారతదేశంలోని గ్రామాల ఏర్పాటు పద్ధతి వలె వుండేది. కులం, భాష ముఖ్యపాత్ర వహిస్తాయి.

వ్యవసాయ పనులలో అభిరుచి వున్న తెలుగువారు తీర ప్రాంతాలలో స్థిరపడ్డారు. వీరికి డర్బన్ కేంద్రం. నెటాల్ బొగ్గు గనులలో పనిచేయడానికి కొందరు కుదురుకున్నారు. డర్బన్‌కు చుట్టుపట్ల చెరుకు తోటలలో పనిచేయడానికి చాలా మంది తెలుగు వారు వచ్చారు. ట్రాన్స్‌వాల్ దగ్గర బంగారు గనులలో పనిచేయడానికి కూడా తెలుగువారు వచ్చారు.

కాలక్రమంగా ట్రాన్స్‌వాల్‌లో తెలుగుభాష సన్నగిల్లింది. 1914 వరకు మహాత్మాగాంధి నడిపిన సత్యాగ్రహోద్యమంలో స్వర్గీయ శ్రీజి.బి. తంబినాయుడు, శ్రీ పి.కె.నాయుడు ప్రముఖ పాత్ర వహించారు.

కేప్‌టౌన్‌లోను, పోర్ట్ ఎలిజిబెత్‌లోను తెలుగుమాట వినిపిస్తుంది. దక్షిణాఫ్రికాలో ఉన్న మొత్తం భారతీయుల సంఖ్య 6,50,000 వీరిలో తెలుగువారు 50,600, తమిళులు 2,50,000.

**అమెరికాలో తెలుగువారు :** అమెరికాలోను ఆంధ్రులను మూడు రకాలుగా విభజింపవచ్చు :

1) ఉన్నత విద్యాభ్యాసాలు చేస్తున్న విద్యార్థులు.

2) పోస్ట్‌గ్రాడ్యుయేటు విద్యనభ్యసించి శాశ్వతంగా అమెరికాలో స్థిరపడినవారు.

3) వృత్తి కళాకారులుగా అమెరికా వచ్చినవారు.

ఈ విభజనలో మొదటి వర్గానికి చెందినవారు సాధారణంగా మూడు నుంచి ఐదు సంవత్సరాల వరకు అమెరికాలో గడుపుతారు. వీరిలో చాలామంది ఆర్థిక అవసరాలను వారికి విద్యనేర్పుతున్న విద్యాసంస్థ భరిస్తుంది.

రెండవవర్గంవారు అమెరికాలో దీర్ఘకాలం నివసించేవర్గం. వీరిలో చాలా మంది విద్యాలయాలలో, ఉపాధ్యాయ వృత్తిలోనో, సాంకేతిక పారిశ్రామిక రంగాలలో ఇంజనీర్లుగానో స్థిరపడిపోయారు. ఇతర వర్గాల కంటె ఎక్కువగా ఈ వర్గమే అమెరికా సంఘంలో బలంగా పాతుకుపోయింది.

భారతదేశంలో విద్యాభ్యాసం, శిక్షణ పూర్తిచేసి, సంపాదన వున్న మంచి ఉద్యోగాలు చేసి ఆ తరువాత అమెరికాలో ప్రవేశించిన వృత్తికారులు మూడవవర్గం.

వీరిలో భారత దేశంలోని సామాజిక పరిస్థితులలో అసంతృప్తి చెంది లేక యింకానైపుణ్యం సంపాదించాలనే తపనతోగాని అమెరికాకు వచ్చిన డాక్టర్లు ఎక్కువ సంఖ్యలో వున్నారు. సరైన లెక్కలు తెలియకుండా వారిలో ఎందరు శాశ్వత నివాసం ఏర్పరచుకున్నవారో, ఎందరు తాత్కాలికంగా వుంటున్నవారో చెప్పడం కష్టం.

అమెరికాలో అధికమైన ఆదాయం వచ్చేది డాక్టర్లకే ఈ కారణంచేత పెక్కు మంది డాక్టర్లు అమెరికావైపు ఆకర్షింపబడుతున్నారు.

అమెరికాలో తెలుగువారు మధ్యతరహా ఆదాయ వర్గానికి చెందిన వృత్తికారులుగాను, తక్కువ రాబడి వర్గానికి చెంది యిప్పుడు తీవ్రమైన మార్పులకు లోనవుతున్న విద్యార్థులుగాను ఉంటున్నారని చెప్పవచ్చు.

వ్యక్తిగతంగా తమ ఆర్థిక శక్తిని బట్టిగాక, సాంఘికంగా తమ సాంస్కృతిక మేథా సంపత్తితో తెలుగువారు తమదైన ప్రత్యేక వ్యక్తిత్వాన్ని పెంపొందించుకొన్నారు. వీరిలో చాలామంది విద్యారంగంలో ఉపన్యాసకులుగా వుంటూ తమతోటి అమెరికన్ సహచరులు, అమెరికన్ ప్రొఫెసర్లు అనుభవిస్తున్న హోదాను అన్నివిధాలుగా అనుభవిస్తున్నారు. తమ తమ ఉద్యోగాలలో, పదవులలో యితర అమెరికన్లతో సమానంగా, అధికంగా పురోగ మిస్తున్నారు.

**మలేషియాలో తెలుగువారు :** మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత 1920 - 1940 మధ్యకాలంలో తెలుగువారు కార్మికులుగా మలయాకు వచ్చారు.

వీరు తెలుగు, అరవం, కలిగిన ఒక రకమైన భాష మాట్లాడతారు. చాలా కుటుంబాలలో కేవలం పెద్దవారే కల్తీ తెలుగు మాట్లాడతారు. వారి బిడ్డలకు తెలుగు ఏమాత్రం రాదు.

మలేషియాలో లక్షా యాభైవేల మంది తెలుగు వారున్నారని మలేషియా ఆంధ్ర సంఘం అంచనా వేసింది. కాని జనాభా లెక్కలలో 25 వేలమంది మాత్రమే తమను తెలుగు వారుగా గుర్తించుకొన్నారు.

మలేషియా తెలుగువారిలో అధిక సంఖ్యాకులు హిందూ మతానికి చెందినవారు, స్వల్పసంఖ్యలో క్రైస్తవులు, ముస్లింలున్నారు. వీరు ఆయామతాలకు సంబంధించిన పండుగలతోపాటు ప్రాంతీయ పండుగలను కూడా జరుపుకొంటున్నారు. తమిళ భాషా ప్రాబల్యానికి ఎక్కువగా గురై తెలుగు తనానికి దూరమౌతున్నారు. హిందువులు కొందరు దేవాలయాలను నిర్మించుకున్నారు.

ఆంధ్రులు యితర రాష్ట్రాలలో, విదేశాలలో తమ ఉనికిని, ప్రాతినిధ్యాన్ని కాపాడుకుంటున్నారు. తెలుగు సంస్కృతిని మర్చిపోకుండా పండుగలు, పబ్బాలు జరుపు కుంటున్నారు. ఆచార వ్యవహారాలు పాటిస్తున్నారు. సమాంతరంగా ఆయా ప్రాంతాల సంస్కృతి అలవడుతుంది. మాతృభాషను, సంస్కృతిని తరువాత తరాలకు అందివ్వటానికి కృషిచేస్తున్నారు. పాఠశాలలు నడుపుకొంటున్నారు. సాంస్కృతిక కార్యకలాపాలు నిర్వహించుకొంటున్నారు. ఈ కార్యక్రమ నిర్వహణలో అనేక సమస్యలనెదుర్కొంటున్నారు.[2]

## 6.3 రాష్ట్రేతరాంధ్రుల విద్యా సాంస్కృతిక సమస్యలు :

**పాఠశాలలు :** తమిళనాడులో మద్రాసు పట్టణం, చెంగల్పట్టు, అర్కాట్, ధర్మపురి జిల్లాలలో సుమారు 1800 నుండి 2000 వరకు పాఠశాలల్లో తెలుగు బోధన జరుగుతుంది.

మహారాష్ట్రలో బొంబాయి మున్సిపల్ కార్పొరేషన్‌లో మరియు దాని జిల్లాలోని నాందేడ్, షోలాపూర్‌లోని సుమారు 50 పాఠశాలల్లో తెలుగుభాష బోధింప బడుతుంది.

కర్నాటకలో బెంగుళూరు పట్టణం, కోలార్ బంగారుగని ప్రాంతాలలో ఉన్న సుమారు 75 నుండి 100 పాఠశాలల్లో తెలుగుబోధన జరుగుతుంది.

ఒరిస్సాలోని బరంపూర్, కుర్దా, రహదారులందుగల ప్రాంతాలలో సుమారు 500 పాఠశాలల్లో తెలుగు బోధన జరుగుతుంది.

పశ్చిమ బెంగాల్‌లో కలకత్తా పట్టణం, ఖరగ్‌పూర్ ప్రాంతాలలో సుమారు 200 పాఠశాలల్లో తెలుగు బోధింపబడుతుంది.3

**సమస్యలు :**

1) మహారాష్ట్ర, పశ్చిమబెంగాలు తెలుగు మీడియం పాఠశాలలో తెలుగు విద్యార్థులు తెలుగు పాఠ్యగ్రంథాలు లేక సమస్యల నెదుర్కొంటున్నారు. ఈ విషయంలో మహారాష్ట్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్‌లోని తెలుగు విశ్వవిద్యాలయం తగిన సహాయ, సహకారాలు అందించాలని కోరింది.

2) కర్నాటక ప్రాంతంలో తెలుగుభాషా అభివృద్ధికి స్థానిక ప్రభుత్వం చొరవ చూపనందున తెలుగువారు అనేకులు కన్నడ భాషనే నేర్చుకొని, విద్యనభ్యసిస్తున్నారు.

3) తెలుగు భాషలో ప్రావీణ్యం సరిగాలేని ఆ ప్రాంతాల ఉపాధ్యాయులతో తెలుగు భాషాబోధన గావించటం వల్ల తెలుగు భాషాభివృద్ధి జరగక, విద్యార్థులు తెలుగు నేర్చుకోవటం సమస్యగా వుంది.

4) ఇతర రాష్ట్రాలలో తెలుగు భాష అభివృద్ధి చెందాలంటే ప్రధానంగా అక్కడి తెలుగుభాషకు సంబంధించిన గ్రంథాలయాల అభివృద్ధికి ప్రోత్సాహం అవసరం.

5) గుజరాత్ రాష్ట్రంలో కనీసం ఒక్క కాలేజీలోనైనా తెలుగును ద్వితీయ భాషగా ప్రవేశ పెట్టేందుకు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం కృషిచేయాలని అక్కడి తెలుగువారు కోరుతున్నారు.

6) అనేక రాష్ట్రాలలో తెలుగు పాఠశాలలు ఆయా రాష్ట్ర ప్రభుత్వాల గుర్తింపు లేక అవి అభివృద్ధి చెందటం లేదు.

7) ఉన్నతస్థాయి, వృత్తి విద్యాకోర్సులలో చేరేముందు స్థానిక, స్థానికేతర అని ఉదహరించడం వల్ల తెలుగు విద్యార్థులకు సీట్లు కేటాయింపుల్లో సమస్యలు తలెత్తుతున్నాయి.

**పాఠ్యగ్రంథాలు :** ప్రవాసాంధ్రులలో పాఠ్యగ్రంథాల విషయం ముఖ్యమైన సమస్యగా వుంది. వివిధ రాష్ట్రాలలో తెలుగుమీడియం పాఠశాలలు పెట్టుకోవడాన్ని ఆయా ప్రభుత్వాలు అంగీకరించిన సందర్భాలలో వారి పాఠ్య ప్రణాళికలకు పాఠ్యగ్రంథాలను సమకూర్చడానికి మూడు పరిష్కార మార్గాలను సూచించవచ్చు.[4]

ఆయా రాష్ట్ర ప్రభుత్వాలే స్థానికాంధ్రుల సహకారంతో తెలుగులో పాఠ్య గ్రంథాలు ప్రచురించేటట్లు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం సంప్రదింపులు జరపటం.

ఆయా రాష్ట్రాలలో వుండే వర్తకులు, సంస్థలు ముందుకు వస్తే ఆ పుస్తకాలను ముద్రించటంతో అంతర్జాతీయ సంస్థ సహాయం చేసిపెట్టడం.

అంతర్జాతీయ తెలుగు సంస్థ వివిధ రాష్ట్రాల సిలబస్‌లకనుకూలంగా పుస్తకాలు తయారు చేయించి, ముద్రించి లాభనష్టాలు లేని పద్ధతిలో సరఫరా చేయడం.

ఇతర రాష్ట్రాలలో వివిధ తెలుగు పాఠశాలలు, ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు నిర్దేశించిన తెలుగు పాఠ్య ప్రణాళికలను అనుసరించి విద్యార్థులకు ఆయా తరగతులలో తర్ఫీదును యిస్తున్నారు. అయితే ప్రతి రాష్ట్రంలోను పాఠ్య ప్రణాళికలు వేరువేరుగా వుండటం చేత పాఠ్యగ్రంథాలు తయారు చేసుకోవడం కష్టమవుతోంది.

కొన్ని పాఠశాలలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు ప్రచురించిన పాఠ్య గ్రంథాలను ఉపయోగిస్తుండగా ఆయా రాష్ట్రప్రభుత్వాలు అభ్యంతరం చెప్పటం వల్ల విద్యావకాశాలు దెబ్బతింటున్నాయి. ఈ పరిస్థితులను దృష్టిలో వుంచుకొని కొన్ని సూచనలు చేయటం జరిగింది.[5]

అవి :

1) తెలుగు విద్యార్థులు అధిక సంఖ్యలో అక్కడ పాఠ్య ప్రణాళిక ప్రకారం ప్రచురణ చేయగల సంస్థలున్నచోట ఆ గ్రంథ ప్రచురణప్రణాళికకు అంతర్జాతీయ సంస్థద్వారా ప్రభుత్వం ఆర్థిక సహాయాన్ని అందచేయాలి.

2) తగినంత మంది తెలుగు విద్యార్థులు లేనిచోట అక్కడి పాఠ్య ప్రణాళికను అనుసరించి పాఠ్య గ్రంథాలను తయారుచేసి ప్రచురించడం కష్టసాధ్యంకాబట్టి. ఉభయ రాష్ట్రాల విద్యాశాఖలు సంప్రదించుకొని అర్హులైన రచయితలతో యోగ్యమైన పాఠ్యగ్రంథాలను సిద్ధంచేసి ఆయా ప్రాంతాల అధ్యయన సౌకర్యాలను పెంపుచేసేటట్లు అంతర్జాతీయ తెలుగు సంస్థ కృషి చేయాలి.

3) పాఠ్యగ్రంథాల సదవగాహనకు, బోధనకు సంబంధించిన విద్యార్థులకు, ఉపాధ్యాయులకు సహకారిగా వుండే సంప్రదింపు సహాయక గ్రంథాలు యితర రాష్ట్రాలలోని ప్రవాసాంధ్రులకు సరఫరా చేయాలి.

ఉదా : లఘుదీపికలు, నిఘంటువులు, బోధనా పద్ధతులు.

4) యితర రాష్ట్రాలలో తెలుగు నేర్చుకోదలచిన పిల్లలకు, పెద్దలకు ఉపయోగపడే పుస్తకాలను, వ్యాకరణాలు, మొదలైన గ్రంథాలను తెలుగు సంస్థవారు ప్రచురించాలి.

5) తెలుగు మాతృభాషగా కలిగిన వారికి రెండు రకాల స్థితులున్నాయి.

అ) ఇంటా బయట వాడే భాష.

ఆ) ఇంట్లో మాత్రమే వాడే భాష.

మొదటి స్థితి తెలుగును తెలుగుదేశంలో వాడితే, రెండోస్థితి ప్రవాసాంధ్రులకు వుంటుంది.

ఇంట్లో నేర్చుకొనే భాష పరిమిత వ్యవహారానికి సంబంధించింది. కనుక పిల్లలకు మాతృభాష నేర్చుకోవటానికి సరియైన వాతావరణం లేనట్లే. ఆపిల్లల ఉచ్చారణ, వాక్యనిర్మాణాలు, పదజాలం వీటిలో కొరత వుంటుంది. చాలా మందికి లిపిరాదు. కనుక తెలుగు సాహిత్యాన్ని గురించి తెలుసుకోలేరు. కావున వీరికి తెలుగులిపి నేర్పటంలో పాతపద్ధతి కంటే రాతలోని సామాన్యులను ఆధారంగా చేసుకొన్న "గ్రెసిడ్ గ్రాఫిమిన్" పద్ధతి మంచిది.

ఉచ్చారణ నేర్పటంలో ఆయా ప్రాంతాల ఉచ్చారణ ప్రభావం పోయేటందుకు 'రెమిడియల్' పద్ధతిని అనుసరించాలి. వాక్యనిర్మాణంలో పరిసర భాష ప్రభావం లేకుండా ఆభాషలను తెలుగుకు తులనాత్మక పరిశీలన చేసి సామాగ్రి తయారు చేయాలి పిల్లల పాఠ్య పుస్తకాలతో పాటు ఉపాధ్యాయులు మార్గోపదేశిక పుస్తకాలు, అభ్యసనాలతో కూడిన పుస్తకాలు ఏర్పరచాలి.

**తెలుగు వాచకాలు :**

తెలుగు మాతృ భాషగా వుండి అందులో విశేష ప్రావీణ్యం కోరే వారికి, తెలుగు వారుగాక తెలుగు నేర్చుకోవాలనే ఆసక్తి వున్నవారికి వేరు, వేరు తెలుగు వాచకాలు తయారు చేయాలి.

ఇతర ప్రాంతాలలో తెలుగువారి పదజాలం మీద వాక్యరీతుల మీద ఆ స్థానిక భాషా ప్రభావం వుంటుంది. కొన్ని కొన్ని వాడుక పదాలకు అర్థంకూడా మారిపోయి వుంటుంది. వారికి లిపి క్షుణంగా బోధించి ఆ తరువాత ప్రామాణిక శైలి పట్టుపడేటట్లు చూడాలి.

**తెలుగు భాష కొత్తగా నేర్చుకోవాలనే వారికోసం ఆధునిక భాషాశాస్త్ర పద్దతిలో వాచకాలను తయారు చేయాలి**

1) తెలుగురాని వారికి భాష నేర్పే వాచకంలో మొదట సులభమైన వ్యాకరణాంశాల మీద దృష్టి కేంద్రీకరించాలి. విద్వర్థక క్రియలు, భూతకాల క్రియలు, వర్తమాన కాల క్రియలు వీటిలో వచ్చే చిన్న చిన్న వాక్యాలు కూడా యిచ్చి వాటి అర్థం వివరించాలి.

2) సంక్షిప్త వాక్యాలు, సంయుక్తవాక్యాలు, మొదలైన క్లిష్ట వ్యాకరణాంశాలు వాటిలో వచ్చే ప్రత్యేక పదాలు, పదబంధాలు వీటిని గ్రంథం చివర వుంచాలి.

3) మొదట రోమన్ లిపిని ఉపయోగించి విద్యార్థులకు కొంత భాష వచ్చిన తరువాత లిపి నేర్పితే లిపి నేర్చుకోవడం వారికి సులభం అవుతుంది.

అంతర్జాతీయ తెలుగు సంస్థవారు తయారు చేయవలసిన పుస్తకాలు మూడు రకాలుగా వుండాలి.

అ) అసలు తెలుగురాని వారికి తెలుగుభాషను, లిపిని నేర్పేగ్రంథాలు

ఆ) తెలుగు మాట్లాడటం వచ్చినవారికి తెలుగు లిపి నేర్పి వారు చదవటానికి తగిన వ్యాసాలు, కథలు ఏర్చి కూర్చి అర్థవివరణతోవున్న గ్రంథాలు.

ఇ) ఆధునిక భాష గురించి గ్రంథాలద్వారా నేర్చుకున్నవారికి ప్రాచీన కావ్యం గురించి నేర్పటానికి తగిన గ్రంథం.

ప్రవాసాంధ్రుల కోసం ఉపయోగించే పుస్తకాలు తెలుగునాడులో అదే తరగతులలో ఉపయోగించే పుస్తకాల కంటే భిన్నంగా వుంటాయి.

తులనాత్మక అంశాలను, అభ్యాసాలను దృష్టిలో వుంచుకొని ఈ పుస్తకాలు తయారు చేయాలి. ఇది ఏ తరగతి వరకు వుండాలన్నది మనం ఏ తరగతి వరకు తెలుగు ప్రవేశ పెట్టబోతున్నామో దాని మీద ఆధారపడివుంటుంది. తయారు చేయటానికి ఒక కేంద్రం కావాలి.

ప్రవాసాంధ్రులకు ఏర్పరచిన పుస్తకాలు ఎక్కువ దేశభక్తిని తెలిపే పుస్తకాలుగా వుండాలి. అందులో మహా ప్రాణాక్షరాలు వుండరాదు. సరళ వాక్యాలలో వుండి సులభంగా అర్థంకావాలి.

ఈ పాఠ్య గ్రంధ ప్రచురణ కొరకు అంతర్జాతీయ తెలుగు సంస్థ ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం వారు ఎక్కువ కృషి చేస్తున్నారు.

ప్రవాసాంధ్రుల కంటూ ఖర్చు ప్రభుత్వ పరిధిలో లేకపోవడం, ప్రాథమికస్థాయిలో వున్నట్లు ఉన్నతస్థాయి పాఠశాల్లోనూ, కళాశాలల్లో తెలుగులేక పోవటం, డిగ్రీస్థాయిలో ఆధునిక అవసరాలకు అనుగుణమైన గ్రూపును ఎంచుకునే విద్యార్థికి రెండవ భాషగా తెలుగు ఆ కళాశాలలో లేకపోవడం లాంటి పరిస్థితులున్నాయి.

గ్రంథాలయాలు నెలకొల్పటమే గాక తెలుగువారు వాటిని ఉపయోగించుకునేటట్లు చూడాలి. ప్రవాసాంధ్రులకు ఆయా ప్రాంతాలలో అల్ప సంఖ్యాక వర్గాల వారికి యివ్వ వలసిన గుర్తింపు రాష్ట్ర ప్రభుత్వాలు ఏర్పరచాలి.

తెలుగు చదివినంత మాత్రాన ఉద్యోగాలు రావన్న భ్రమను తొలగించే విధంగా అల్పసంఖ్యాక వర్గాలైన వారికి ఆ రాష్ట్ర ప్రభుత్వం ఉద్యోగాలిచ్చేటట్లు అంతర్జాతీయ తెలుగు సంస్థ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కృషి చేయాలి.

చారిత్రక బ్రిటిష్ వలసపాలన, కరవుకాటకాలు, బ్రతుకు తెరువు, మొదలైన కారణాల వలన వలసపోవటం జరిగింది. విదేశాలలో మేధాశక్తికి గుర్తింపు దొరుకుతుందన్న అభిలాష, నైపుణ్యాన్ని అభివృద్ధి పరచుకోవటానికి విదేశాలు సముచిత స్థానం అన్న అభిప్రాయం వలసకు కారణాలు.

అన్ని రాష్ట్రాలలోని తెలుగువారి గురించి వివరించాలి. దేశంలో ఆంధ్రరాష్ట్ర సరిహద్దు ప్రాంతానికి దూరంగా వున్న రాష్ట్రాలలో తెలుగు బోధన కొరత ఎక్కువగావుంది. తెలుగు చదివిన వారికి ఉద్యోగ వసతి కల్పించాలి.

ప్రవాసాంధ్రుల తెలుగు భాషను పరిశోధన చేసి ప్రాచీన పదజాలాన్ని సేకరించాల్సిన అవసరం ఎంతోవుంది. అధ్యయనానికి పదజాలం ఎంతో ఉపయోగపడగలదు.

భాషాపరంగాను, సాంస్కృతిక పరంగాను ప్రవాసాంధ్రులపై స్థానిక ప్రభావం ఎక్కువగా వుంటుంది. ప్రాచీన తెలుగు స్వరూపాన్ని, ప్రాచీన తెలుగు సంస్కృతిని ప్రవాసాంధ్రుల్లో గుర్తించవచ్చు.

1) సాధ్యమైనంత వరకు తెలుగు ప్రత్యేక విషయంగా బోధించే పాఠశాలలు నిర్మించాలి.

2) వసతి గృహాలు నిర్మించాలి

ఆంధ్రేతరులకు మన పత్రికలు అందించాలి. ఆసక్తికరమైన విషయాలతో ఆకర్షణీయంగా ప్రచురించాలి. అంతర్జాతీయ సంస్థవారు ప్రకటించిన 1984 సంవత్సర లెక్కల ప్రకారం భారతదేశ జనాభాలో తెలుగువారు ఐదుకోట్ల తొంబై రెండు లక్షలు. మనదేశంలో హిందీ, బెంగాలీ భాషల తరువాత తెలుగు మాట్లాడేవారి సంఖ్య ఎక్కువ.

అంతర్జాతీయ భాష నేర్చుకోవడం వల్ల అల్పసంఖ్యాక వర్గాలవారి మధ్య సత్సంబంధాలు పెంపొందుతాయి, అల్పసంఖ్యాక మాతృభాషలో బోధన జరగటానికి ప్రభుత్వం కృషి చేయాలి.

ప్రవాసాంధ్రులకు ఆధునిక పాఠ్యాంశాలున్న పుస్తకాలు లభ్యంకావు. ప్రాచీన గ్రంథాలుంటాయి. ఆయా రాష్ట్రాలలో మాతృభాషకు సంబంధించిన ఉపాధ్యాయులు తక్కువగా వున్నందువల్ల కూడ యిబ్బందులు ఎదుర్కొంటారు. పుట్టినప్పటినుండి ఆయా రాష్ట్రాలలో పెరిగినవారు ఆ ప్రాంతీయభాష మాత్రమే నేర్చుకొంటారు కాని మాతృభాష నేర్చుకోరు. వారికి సరిపడ సాంస్కృతిక భవనాలుండవు. భాషాపరంగా కూడా యిబ్బందులు ఎదుర్కొంటారు.

వ్యాపార, ఉద్యోగరీత్యా యితర రాష్ట్రాలకు వెళ్ళిస్థిరపడినవారు తమ పిల్లలకు మాతృభాష నేర్పడంలో సమస్యలను ఎదుర్కొంటున్నారు. ఉద్యోగరీత్యా ఇతర ప్రాంతాలకు వెళ్ళినపుడు మాతృభాషను అభ్యసించటానికి అవకాశం వుండదు. అందువల్ల వారి పిల్లలు తమ భాషా ప్రాముఖ్యత, తెలుగు సంస్కృతి, నాగరికతలను తెలుసుకోలేకపోతున్నారు.

ప్రవాసాంధ్రులు మాతృభాష నేర్చుకోకపోయినా స్థానికంగా వుండే ప్రాంతీయ భాషను అభ్యసిస్తే ఉద్యోగాలు దొరుకుతాయని అభిప్రాయపడి మాతృభాషా అధ్యయనం చేయక బతుకు తెరువుకోసం ప్రాంతీయ భాషను అభ్యసించవలసి వస్తుంది.

**పరిష్కారాలు :**

1) ప్రవాసాంధ్రులకు ఆకాశవాణి, దూరదర్శన్‌లో తెలుగు కార్యక్రమాలను ప్రసారం చేయాలి.

2) ఆర్థికంగా వెనుకబడినవారికి, తెలుగు చదివే వారికి ఆర్థికంగా సహాయం చేయాలి.

3) సంస్థలకు సంబంధించిన భవనాలకు కూడా ఆర్థికంగా సహాయం చేయాలి.

4) గ్రంథాలయాలలో తెలుగుభాష, సంస్కృతి, ఇతిహాసాలకు సంబంధించిన గ్రంథాలు ప్రవేశ పెట్టాలి. ఆధునిక తెలుగు రచనలతో గ్రంథాలయాల అభివృద్ధికి తోడ్పడాలి.

5) హిందూ ధర్మ రక్షణకు సంబంధించిన పుస్తకాలు టి.టి.డి వారు యితర రాష్ట్రాలలో వుండే తెలుగు వారికి అందించాలి.

6) తెలుగువారికి ముఖ్య పండుగలైన సంక్రాంతి, ఉగాది, పండుగల విశిష్టతను, ప్రాముఖ్యతను తెలియ జేయాలి. సమాజ శ్రేయస్సు, భాషను, తెలుగు జాతిని గురించి ఉపన్యాసాలు, నాటికలు, నాటకాలు ఏర్పాటు చేయాలి.

7) తెలుగు కవుల జయంతులను నిర్వహించడంద్వారా ప్రవాసాంధ్రులకేకాక ఆంధ్రేతరులకు కూడా తెలుగు ప్రాముఖ్యతను తెలిపితే సాంస్కృతిక సాహిత్య భావాలు పెంపొందుతాయి.

8) రాత్రిపూట పాఠశాలలు/కళాశాలలు స్థాపించి తెలుగు భాషను ప్రవాసాంధ్రులకు బోధించాలి. వీటన్నింటికి రెండు రాష్ట్రాల, కేంద్ర ప్రభుత్వాలవారు సహాయపడాలి.

9) ప్రవాసాంధ్రులలో తెలుగు దనాన్ని నిలపడానికి పారితోషికాలతో కూడిన నృత్య, వక్తృత్వ పోటీలను పిల్లలకు నిర్వహించాలి.

10) భాషా దురభిమానాన్ని కాక భాషాభిమానాన్ని వారిలో పెంపొందించాలి.

11) వార్తా పత్రికలు, మాస పత్రికలు తెలుగువారికి అందుబాటులో వుండేటట్లు తోడ్పడాలి.

12) పండుగలు, పెళ్ళిళ్ళు, సాంప్రదాయాలు, ఆచారాల ప్రకారం జరుపుకోవటానికి వాళ్ళకు సమాన పద్ధతులను ఏర్పాటు చేయాలి.

13) విదేశాలలో కూడా తెలుగు వారున్నారు. భాషను, సంస్కృతికి సంబంధించిన సాంస్కృతిక సంఘాలను ఏర్పాటు చేసుకోవాలి. ఈ సాంస్కృతిక సంఘాలు సాంస్కృతిక బృందాలను తయారుచేసి ఇతర దేశాలకు ప్రభుత్వం వారు పంపించాలి.

14) ప్రవాసాంధ్రులు సంవత్సరానికి రెండు, మూడు సమావేశాలను ఏర్పాటు చేసుకొని తమ అభిప్రాయాలను, సమస్యలను అందరూ చర్చించుకోవాలి, మాతృభాష అల్పసంఖ్యాక వర్గంవారి అభివృద్ధికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కృషి చేయాలి.

15) తెలుగు లిపి ప్రవాసాంధ్రులకు నేర్చుకోవటం చాలా కష్టంగా వుంది. ప్రవాసాంధ్రులందరికి కలిపి పుస్తకాలను రోమన్ లిపిలో ముద్రించి పుస్తకాలను సరఫరా చేయాలి. ఇది వారిలో తెలుగుభాష చిరస్థాయిలో నిలవడానికి కారణమవుతుంది.

16) ఊష్మాలు, అంతస్థాలు, పరుష సరళాలతో వున్న అసంయుక్త పదాలను ఎక్కువగా ప్రవాసాంధ్రుల పుస్తకాలలో ఉండేటట్లు చూడాలి. స్థిరాలను పలకటం, రాయటం ప్రవాసాంధ్రులు కష్టంగా తలుస్తారు.

17) సరళ వాక్య నిర్మాణాన్ని ప్రాథమికంగా తెలియజెప్పి ఆధునిక ప్రామాణిక భాషలోని వాక్యాలను పరిచయం చేయాలి.

ఉదా : దినపత్రికలు, కవితలు, నవలలు, కథలు, ఆధునిక సరళమైన భాషలో ఉండేటట్లు చూడాలి.

అన్ని సరిహద్దు రాష్ట్రాలలోని ప్రాథమిక పాఠశాలలో తెలుగువుంటుంది. ఉన్నత పాఠశాలలోకి వచ్చేసరికి తెలుగు మాధ్యమంగా వుండటంలేదు. అదేవిధంగా కళాశాలలో కూడా తెలుగు మాధ్యమం వుండటంలేదు.

ప్రవాసాంధ్రులను ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు అల్పసంఖ్యాక భాషా వర్గాలుగా గుర్తించి వారికి ఉద్యోగ నియామకాల్లో సముచిత స్థానం కల్పించేటట్లు రాష్ట్ర ప్రభుత్వం శ్రద్ధ తీసుకోవాలి.

కళాశాలలు - విశ్వవిద్యాలయాలు

ఇతర రాష్ట్రాలలో వివిధ విశ్వవిద్యాలయాల్లో తెలుగు విభాగపు కోర్సులు కొన్ని అందుబాటులో ఉన్నాయి.

మద్రాసు విశ్వ విద్యాలయంలో ఎమ్.ఎ. ఎమ్.ఫిల్. పిహెచ్.డి కోర్సులు తెలుగులో ఉన్నాయి. మద్రాసు చుట్టు పక్కల ప్రాంతాలలో కూడా తెలుగు భాషను బోధించేందుకు కావలసిన ఏర్పాట్లు జరుగుతున్నాయి.

అన్నామలై విశ్వవిద్యాలయంలో ఎమ్.ఎలో ఒక పేపరు. ఎమ్.ఫిల్., పిహెచ్.డిలు తెలుగులో చేయడానికి అందుబాటులో వున్నాయి.

మధురై కామరాజ్ విశ్వవిద్యాలయంలో తెలుగు డిప్లొమా కోర్సుతోపాటు ఎమ్.ఎ., పిహెచ్.డి కూడా అందుబాటులో ఉంది.

బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో ఎమ్.ఎ., పిహెచ్.డి.లు తెలుగులో చేసే అవకాశం ఉంది.

బరంపూర్ విశ్వవిద్యాలయం తెలుగు ఎమ్.ఎ., పిహెచ్.డి చేసే అవకాశం కల్పించింది.

ఒరిస్సాలోని ఇతర పట్టణాలలోని కళాశాలల్లో తెలుగును ఒక పేపరుగా ఉపయోగించటం జరుగుతుంది.

బెంగుళూరు విశ్వవిద్యాలయంలో ఎమ్.ఎ, ఎమ్.ఫిల్, పిహెచ్.డిలు తెలుగులో చేసే అవకాశం ఉంది.

మైసూరు విశ్వవిద్యాలయంలో కరస్పాండెన్స్ కోర్సుద్వారా ఎమ్.ఎ. తెలుగు చేసే అవకాశం ఉంది.

విద్యాసాంస్కృతిక సమస్యలు :

మధ్యప్రదేశ్ : ఇక్కడి తెలుగు వారికి విద్యావిషయంలో అనేక ఇబ్బందులున్నాయి.

త్రిభాషా సూత్రం కింద హిందీ, ఇంగ్లీషు, మరాఠీ, భాషలను మాత్రమే ఇక్కడి విద్యార్థులు నేర్చుకోవాలి తెలుగుకు స్థానం లేదు.

నాగపూర్ విశ్వవిద్యాలయంలో తెలుగుకుస్థానం లేదు

మహాకోసల, చత్తీస్‌ఘడ్‌లలో కూడా ఒక్క హిందీ భాషనే పాఠశాలలో ఉపయోగిస్తున్నారు. తెలుగు పాఠాలు చెప్పటానికిగాని, ఏర్పాట్లు చేయడానికి గాని ఆర్థిక సహాయంలేదు. ఇక్కడ తెలుగు వారిలో చాలామంది తెలుగును రాయలేరు, చదవలేరు.

ఇన్ని సమస్యలున్నా సాంస్కృతిక కార్యకలాపాలు జరుపుకునేటప్పుడు నాటకాలలో పాత్రధారణ చేసేవారు కొంతమంది తమ సంభాషణలను నాగరి లిపిలో రాసుకొని చదువుతుంటారు.

**బీహార్ :** ఇక్కడ తెలుగు పిల్లలున్నా పాఠశాలల్లో వారు తెలుగు నేర్చుకొనే అవకాశంలేదు, ఒరియా, బెంగాలీ, ఉర్దూ భాషలు ఇక్కడ బోధనామాధ్యమాలు ఇక్కడ తెలుగుభాష పతనీయమైందిగా వుందిగాని తెలుగుకు స్థానం లేదు.

జంషెడ్ పూర్‌లో ఆంధ్ర సంఘాలు నడుపుతున్న పాఠశాలల్లో కూడ తెలుగుకు స్థానంలేదు. వందలాది మంది తెలుగు పిల్లలు హిందీలో చదువుకుంటున్నారు. వీరిలో నూటికి పది మందికి తెలుగు రాయడం, చదవటం వచ్చు మిగతా వారికి తెలుగు చదవటం మాత్రమే వచ్చు.

ఇందుకు కారణం తెలుగుకు ఆదరణ లేకపోవడం, ప్రభుత్వం తెలుగుకు పాఠశాలల్లో స్థానం కల్పించేందుకు ఆంధ్ర ప్రభుత్వం కృషి చేయాలి.

**హర్యానా :** ఈ రాష్ట్రంలో సుమారు 40 పాఠశాలల్లో తెలుగును ద్వితీయభాషగా బోధిస్తున్నారు. కాని ఉపాధ్యాయులు, పాఠ్యపుస్తకాల కొరత వల్ల అనుకున్న స్థాయిలో తెలుగు విద్యాబోధన సాగటంలేదు.

**ఢిల్లీ :** ఆంధ్ర విద్యాసంస్థ న్యూఢిల్లీ పేరుతో బహదూర్‌షా మార్గ్, రామకృష్ణాపురం ప్రాంతాలలో పాఠశాలల్లో తెలుగు బోధించటం జరుగుతుంది.

తెలుగు సంస్కృతికి సంబంధించిన సాంస్కృతిక కార్యకలాపాలనేర్పరచుకోడానికి, వాటిద్వారా తెలుగు సంస్కృతిని మరచిపోకుండా నిలుపుకోడానికి దోహదం చేసే విధంగా ప్రవాసాంధ్రులకు ప్రత్యేకంగా సభాస్థలాలుండాలి.

ప్రవాసాంధ్రులకు ఆంధ్ర దేశం పంపించే ప్రతి వస్తువు తెలుగు తనం తెలుగుభాషకు, తెలుగు సంస్కృతికి, సంబంధించిన వస్తువుగా వుండాలి. ప్రాచీనతకే గాక, ఆధునికంగా సమకాలీనంగా వుండేటట్లు చూడాలి.

ఉదా : సాహిత్యం, సినిమా, నాటకం, సాంస్కృతిక కార్యక్రమాలు మొదలైనవి.

భాషకు, సంస్కృతికి సంబంధించిన సాంస్కృతిక సంఘాలనేర్పాటుచేసి ప్రభుత్వం ఆబృందాలను ఇతర రాష్ట్రాలకు పంపాలి.

ఈ విషయంలో సంగీత నాటక అకాడమీగాని, ప్రభుత్వంగాని అంతర్జాతీయ తెలుగు సంస్థకాని ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి. యితర రాష్ట్రాలలోని సాంస్కృతిక బృందాలను కూడా మన రాష్ట్రంలోకి ఆహ్వానించినట్లైతే దేశాభిమానం, సంస్కృతి అనే సమైక్య భావం పెంపొందుతుంది.

సాంస్కృతిక విషయాలలో ప్రవాసాంధ్రులకు తగినన్నీ అవకాశాలు లేవు. వారు తమ పిల్లలను ఈ కార్యక్రమాలలో బహిర్గతం చేయటానికి యిష్టపడుతున్నారు. కాని వారికి తగిన సహాయసహకారం, ప్రోత్సాహంలేదు.

ఎవరో కొంతమంది కళాకారులు వచ్చి ఈ కార్యక్రమాలు ఇవ్వటం జరుగుతుంది. హరికథ, నాటకాలు, మొదలైన కార్యక్రమాలలో పాల్గొనటానికి ప్రయత్నం చేస్తూనే ఉన్నారు. తెలుగు సినీరంగంలో కూడా తగినన్ని అవకాశాలకోసం ఎదురుచూస్తున్నారు.

కొంతమంది ప్రవాసాంధ్రుల సంఘాల ఆధ్వర్యంలో వివిధ రకాల సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. ఈ కార్యక్రమాలవల్ల వచ్చిన రాబడిని గ్రంథాలయాల, ఆడిటోరియాల నిర్వహణకు వినియోగిస్తున్నారు.

మన నాటకాలను ఇతర రాష్ట్రాలకు, దేశాలకు పంపటం వల్ల కేవలం మన తెలుగువారు ఆనందించడమే కాక ఇతరులకు కూడా మన సంస్కృతి కళారూపాలను, వైభవాన్ని తెలుసుకొనే వీలుంటుంది. ఈ విధమైన ఏర్పాట్లు చేయటం వల్ల ప్రవాసాంధ్రులకు తాము తెలుగువారమన్న భావన మర్చిపోకుండా తమ భాష, సంస్కృతి ఒకటున్నదన్న చైతన్యాన్ని కలిగివుంటారు. అంతర్జాతీయ తెలుగు సంస్థ ఈ విషయంలో రాష్ట్ర ప్రభుత్వంతో సంప్రదించి తగు ఏర్పాట్లుచేసే విషయం పరిశీలించాల్సిన అవసరం వుంది.

## 6.4 విదేశాంధ్రుల విద్యాసాంస్కృతిక సమస్యలు :

కెనడాలో తెలుగువారి పిల్లలకు తెలుగు నేర్పేందుకు ప్రత్యేకంగా పాఠశాలలు లేవు. ఇష్టం వున్న తల్లిదండ్రులు తమ పిల్లలకు తామే స్వయంగా తెలుగు నేర్పుకుంటారు.

శ్రీలంకలో ఏ కొద్ది మందో స్వచ్ఛంగా తెలుగు మాట్లాడేవారున్నారు. వారి పిల్లలు ఇంట్లో తెలుగు మాట్లాడినా పాఠశాలల్లో సింహళం, తమిళం లేక ఆంగ్లం మాధ్యమంగా ఉంటుంది.

మారిషస్‌లో తెలుగు పిల్లలకు "మారిషస్ ఆంధ్రమహాసభ" వారు కొన్ని పాఠశాలలు స్థాపించారు. తెలుగువారు ఎక్కువగా వున్న ప్రాంతాలలోని పాఠశాలల్లో తెలుగు విద్యాబోధన జరుగుతుంది.

బర్మాలోని తెలుగువారిలో 90 శాతం నిరక్షరాస్యులు వారి పిల్లలకు మాత్రం ఆంధ్రభాషలో విద్య నేర్పించాలనే కోరిక కలిగి ఉండేవారు. రంహాన్, ఒసీన్, పెగు, పెరు లాంటి ప్రాంతాలలో తెలుగు ప్రాథమిక పాఠశాలలున్నాయి.

ఇక్కడి విదేశీయులకు వారి స్వంతభాష నేర్చుకునే అవకాశం లేనందున వారు ఆంగ్లం, బర్మా భాషలను కూడా నేర్చుకోవలసి వస్తుంది.

బర్మాలో తెలుగు అస్థిత్వ పోరాటం సాగిస్తుందని చెప్పవచ్చు.

సూచనలు :

వివిధ దేశాలలోని ఆంధ్ర సంఘాలు తెలుగు భాషాభివృద్ధికోసం సూచనలు ఇచ్చాయి. విదేశాంధ్రుల భాషా, సమస్యను పరిష్కరించేందుకు వారికి తెలుగు భాషా బోధన జరిగేట్లు చేయడానికి ఆంధ్ర ప్రభుత్వం అనేక విధాలుగా తోడ్పడాలి. ముఖ్యంగా అవసరమైన తెలుగు గ్రంధాలయాలను స్థాపించటం, ఆయాదేశాలలో ఉన్న తెలుగు గ్రంధాలయాలను విస్తరించేందుకు కృషిచేయడం ముఖ్యకర్తవ్యం.

తెలుగు తరగతులు సక్రమంగా నడపడానికి తెలుగువాచకాలు పంపించడం. శాస్త్రజ్ఞులు తెలుగులో శాస్త్రీయగ్రంధాలు రాయడానికి, అనువదించడానికి ప్రోత్సాహమివ్వడం.

రాష్ట్ర తెలుగు అకాడమి ప్రచురణలను తక్కువధరలకు ప్రవాసాంధ్రులకు లభింపజేయడం తెలుగు సాంస్కృతిక బృందాలను పంపడం, తెలుగువారి నిమిత్తం 16 మిల్లీమీటర్ల తెలుగు ఫిలింల తయారీ, పంపిణీలకు సహాయ సహకారాలు అందించడం ఆంధ్ర ప్రభుత్వ కర్తవ్యంగా భావించాలి.

మన దేశపు నాగరికతను వెల్లడి చేసేందుకు, ఆంధ్ర దేశం సమాచారం గ్రహించడంకోసం తెలుగు పత్రికలను విదేశాంధ్రులకు అందించే ఏర్పాటు చేయాలి.

విదేశాంధ్రులకు ప్రత్యేక అంతర్జాతీయ శాఖను ఆంధ్ర ప్రభుత్వం ఏర్పాటు చేసి దాని ద్వారా తెలుగు భాషాసంస్కృతి వికాసానికి తగిన కృషి చేయాలి. అఖిల భారత రేడియో కేంద్రంలోను, ప్రాంతీయ కేంద్రాలలోను ప్రవాసాంధ్రులకు ప్రత్యేక తెలుగు కార్యక్రమాలకు ప్రసారం చేయాలి. ఏదేశంలో తెలుగు వారి సంఖ్య ఎక్కువగా వుంటుందో ఆదేశాలలోని భారత రాయభార కార్యాలయాల్లో తెలుగు సంతతికి చెందిన ఉద్యోగులు కొందరైనా ఉండేటట్లు కేంద్ర ప్రభుత్వాన్ని ఆంధ్ర ప్రభుత్వం కోరాలి.

ఉచిత విద్యా విరాళానికి, ఆంధ్ర భవనాలు కట్టడానికి విరాళాలు విదేశాంధ్రులు వసూలు చేసే కార్యక్రమాలలో ఆంధ్ర కళాకారులు పాల్గొనే అవకాశం ఆంధ్ర ప్రభుత్వం కల్పించి ఏ ఆటంకాలు లేకుండా వారిని విదేశాలు పంపేందుకు ఏర్పాటు చేయాలి .

విదేశాంధ్రులు జరిపే ఉత్సవాలలో, ఆంధ్రసంఘ మహాసభలలో, తెలుగు గురించి జరిపే సమావేశాలల్లో పాల్గొని సాహిత్యోపన్యాసాలివ్వడానికి తెలుగు పండితులను కవులను ఆంధ్రప్రభుత్వం పంపించాలి.

విదేశాంధ్రులకోసం ప్రపంచ తెలుగు సంఘాల ప్రతినిధులను సంవత్సరానికో లేక రెండు సంవత్సరాలకో ఒక్కచోట సమావేశ పరచి తెలుగుభాష అభివృద్ధిని సమీక్షించేందుకు, విదేశాంధ్రులకు అవసరమైన సలహాలనిచ్చేందుకు ఆంధ్ర ప్రభుత్వం కృషిచేయాలి.

అంతర్జాతీయ చలన చిత్రోత్సావాలకు పంపే తెలుగు చిత్రాలను విదేశాంధ్రులకు ప్రదర్శన నిమిత్తం ఆయా దేశాల తెలుగు సంఘాలకి ఆ చిత్రాలను పంపే ఏర్పాటు ప్రభుత్వం చేపట్టాలి.

విదేశాంధ్రుల అభివృద్ధికి, ఆంధ్ర సంస్కృతికి, సేవచేస్తున్న ఆయాదేశాల ఆంధ్ర సంఘాలకు తెలుగు టైపు మిషన్లను ఆంధ్రప్రభుత్వం ఉచితంగా పంపిణీ చేయాలి.

ఆంధ్ర ప్రదేశ్‌లోని అన్ని విశ్వవిద్యాలయాలు, కళాశాలల్లో విదేశాంధ్రుల సంతతికి చెందిన వారికై ప్రతిఏటా కనీసం 10 సీట్లు కేటాయించాలి.

## సూచికలు

1) ద పొజిషన్ అండ్ ఫంక్షన్ ఆఫ్ తెలుగు. మోటూరి సత్యనారాయణ పు. 24

2) తెలుగు వాణి, మూడవ అఖిలభారత తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక. 1990. మార్చి 10-11-12 పు... 51

3) పైదే. పు ...53

4) ఇతర రాష్ట్రాలలో తెలుగువారు విద్యాసాంస్కృతిక సమస్యలు సదస్సు నివేదిక. ఫిబ్రవరి 1976 పు. 18

5) పైదే. పు... 59

# ఉపసంహారం

సుదీర్ఘకాలం పరపాలన పీడనలో జవజీవాలు కోల్పోయి బానిసలుగా జీవించిన భారత జాతి స్వేచ్ఛావాయువులు పీల్చుకొంది. దేశభాషలైన, సంస్కృతంపైన అభిమానం పెంచుకొంది. భారతదేశ పురోగమనానికి రాచబాటగా రాజ్యాంగాన్ని రచించారు.

రాజ్యాంగం 18 భాషలను గుర్తించింది. మైనారిటీ భాషల అభివృద్ధికి, సంరక్షణకు హక్కులు కల్పించింది. జాతీయ భాష హిందీ, ఆయా రాష్ట్రాల అధికార భాషలకు సంబంధించిన అంశాలు పొందు పరచబడినాయి భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు వాదానికి ఆంధ్రప్రదేశ్ నాంది పలికింది. ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు అధికారభాషగా 1966 లో చట్టం చేయబడింది. తెలుగుకుఅధికార స్థాయి కల్పించటానికి వావిలాల గోపాల కృష్ణయ్యగారి కృషి అభినందనీయం

అంతవరకు వివిధ స్థాయిల్లో రాజ్యమేలిన ఆంగ్ల భాష స్థానంలో తెలుగు అమలుకు అనేక ఉత్తరువులు జారీ అయ్యాయి. అధికార భాషగా తెలుగున్నపుడు అది ఏ రూపంలో ఉండాలనేది ప్రధాన అంశం. తెలుగు సాహిత్య భాషగా అత్యుత్తమ స్థానం సంపాదించింది. ఆధునిక సాహిత్య ప్రక్రియల్లో వ్యవహారిక భాషకే పట్టం కట్టబడింది. ప్రజా వ్యవహారానికి సన్నిహితంగా పత్రికలు, రేడియోలు, సినిమాల్లో వాడే భాషా రూపమే అధికార భాషకుండాలని కోరుతున్నారు.

పరిపాలన రంగంలో తెలుగు అమలుకు ముఖ్యంగా ప్రభుత్వం నుండి కార్యాలయాలకు వెళ్ళే జి.వోలు ఉత్తరువులు ఎక్కువ భాగం ఆంగ్లంలో వుండటం వల్ల వాటిని తెలుగులో అనువదించటంలో ఉద్యోగులు ఇబ్బందులకు గురవుతున్నారు. అన్ని శాఖల పదకోశాలు పూర్తిస్థాయిలో అందుబాటులో లేకపోవటం, అనువాదాలకు అవరోధంగా వుంది. కొన్ని పదకోశాలున్నప్పటికి అవసరానికి తగినంత పదజాలాన్ని అందివ్వలేక పోతున్నాయి. పదకోశాల్లోని తెలుగు పదాలు కృతకంగా ఉన్నాయి.

పై స్థాయి కార్యాలయాల నుండి కింది స్థాయి కార్యాలయాలకు వచ్చే ఉత్తర ప్రత్యుత్తరాలన్ని ఆంగ్లంలోనే వుండటం, ఉద్యోగులకు తెలుగు శిక్షణ సరిగా అందివ్వకపోవడం, ప్రభుత్వ కార్యాలయాల్లో తెలుగు టైపు మిషన్లు కొరత, కొన్ని కార్యాలయాల్లో టైపు మిషన్లు ఉండి టైపిస్టుల కొరత మొదలైన కారణాలు పరిపాలనా రంగంలో తెలుగు అమలుకు అవరోధాలుగా వుంటున్నాయి.

న్యాయ రంగం విషయంలో తెలుగు తప్ప మరొక భాషరాని సామాన్య ప్రజలు ఎందరో ఉన్నప్పటికీ కొన్ని నోటీసులు సమన్లు, తెలుగులో దశాబ్దాలుగా ఉన్న నిర్ణయాలు కూడా ఇంగ్లీషులో ఉంటున్నాయి అయితే న్యాయస్థానాల్లో తెలుగును ప్రయోగాత్మకంగా ప్రవేశ పెట్టారు. ఈ పరిస్థితుల్లో ప్రస్తుత రాజ్యాంగం ప్రకారం హైకోర్టుల్లో తెలుగు వాడుక గగన కుసుమంగా భావించాలి.

బ్రిటిష్ వారి హయాంలో తెలుగు భాష ప్రాథమిక స్థాయి నుండి ఉన్నత విద్యాస్థాయి వరకు బోధనలో ఉపయోగించటం జరిగింది. 50 సంవత్సరాల తర్వాత 1968 నుండి కళాశాలల స్థాయికి తెలుగు బోధనా మాధ్యమంగా మారింది. ఐతే ఇది ఐచ్చికమే.

కాన్వెంట్ల విద్యా సంస్కృతి, రోజు రోజుకి పెరుగుతున్న ఆంగ్ల భాషపై మోజు, ఎక్కువ మంది ఆంగ్ల మాధ్యమం నుండి వచ్చిన వారే ఉద్యోగులుగా మారుతున్న ఈ రోజుల్లో ఎన్ని తెలుగు టైపు రైటర్లు వచ్చినా, కేవలం కార్యాలయాల బోర్డులను తెలుగులో మార్చినంత మాత్రాన తెలుగు అధికార భాష కాదు. బోధనా భాషగా తెలుగును విస్తృత స్థాయిలో అమలు పరచి ఆంగ్ల మాధ్యమాన్ని క్రమంగా తొలగించినపుడు తెలుగుకు అధికార హోదా లభిస్తుంది.

తెలుగును అధికార భాషగా ఉపయోగిస్తూ వుంటే క్రమంగా వివిధ రంగాల్లో వినియోగానికి పరిపుష్టమవుతుంది. తెలుగు మాండలికాల్లోను, వివిధ యుగాల్లో తెలుగు పరిపాలనా భాషగా ఉన్నప్పటి శాసనాలు రికార్డులు కైఫీయత్తులు మొదలైన వాటినుంచి పదజాలాన్ని సేకరించి నిఘంటువులు నిర్మించాలి. ప్రజలకు ఉద్యోగులకు అందుబాటులోకి తేవాలి.

పారిభాషిక పదాలకు కృతక మైన అనువాదాలు కాకుండా తెలుగు భాష సహజ సుందరంగా వుండడానికి అవసరమైన పదజాలం సేకరించాలి కల్పించాలి. కొత్త అర్థాలతో వాడుకోవాలి. మరీ అవసరమైతే అన్య దేశ్యాలు వాడాలి.

వివిధరంగాల్లో తెలుగు అమలు సమగ్రంగా జంగాలంటే ప్రభుత్వం పటిష్టమైన చర్యలు చేపట్టాలి. వివిధ స్థాయిల్లో తెలుగు అమలు తీరుతెన్నులను ఖచ్చితంగా సమీక్షించాలి. లోపాలున్నచోట పటిష్టమైన చర్యలు చేపట్టాలి. విద్యాశాఖ బాధ్యతలను, విశ్వ విద్యాలయ కృషిని, తెలుగు అకాడమీ, అధికార భాషా సంఘం కర్తవ్యాలను సమన్వయ పరచి ప్రభుత్వం చిత్తశుద్దితో కృషి చేస్తే తెలుగు అధికార భాషగా పూర్తి స్థాయిలో అమలవుతుంది.

# అనుబంధాలు

| క్రమ సంఖ్య | విషయం |
| --- | --- |
| 1. | తొలి తెలుగు పదం "నాగబు" |
| 2. | ధనుంజయుని 'కలమళ్ళ శాసనం' |
| 3. | పన్దరంగని 'అద్దంకి శాసనం' (తొలి తెలుగు పద్య శాసనం) |
| 4. | తెలుగు భాషను అదనంగా ఉర్దూ లేక ఇతరభాషల ఉపయోగం |
| 4.A | తెలుగుకు అదనంగా ఉర్దూ లేక ఇతర భాషల వాడకం చట్టానికి స్వల్ప సవరణ |
| 5. | ఆంధ్ర ప్రదేశ్ అధికార భాషా శాసనం. |
| 6. | అధికార భాష శాసనం 3, 11, విభాగం కింద 23 ప్రభుత్వ శాఖల్లో తెలుగు వాడకం గురించి ప్రకటన జారీ |
| 7. | అధికార భాషా కమీషను ఏర్పాటు |
| 7.A.B. | అధికారభాషా కమీషను సభ్యుల జీతభత్యాలు |
| 8. | గ్రామ పంచాయితీ, పంచాయితీ స్థాయిలో తెలుగు వాడకం |
| 8.A | మున్సిపాలిటీల స్థాయిలో తెలుగు వాడకం. |
| 9. | తాలూకా, జిల్లా స్థాయిలో ఉత్తర ప్రత్యుత్తరాలను తెలుగు వాడకం |
| 10. | ఇంగ్లీషు, స్టెనోలు, టైపిస్టులకు తెలుగు టైపు రైటింగు శిక్షణ |
| 11. | తెలుగు సరిగా రాని ఉద్యోగులకు తెలుగు శిక్షణ. |
| 12. | అధికార భాష సంవత్సరంగా 'విభవ' నామ సంవత్సరాన్ని ప్రకటిస్తూ ఉత్తరువులు ఉత్తరువులు జారీ. |
| 12.A. | అధికారా భాష -'విభవ' తెలుగు సంవత్సరంలో పరిపాలనా భాషగా తెలుగు. |
| 13. | ఉద్యోగులకు ప్రోత్సాహకాలు. |
| 14. | ప్రభుత్వ కార్యాలయాలకు విద్యుత్ మీటల ఫలకాల సరఫరా. |
| 15. | అన్ని ప్రభుత్వ కార్యాలయాల్లో ఉత్తర ప్రత్యుత్తరాలకు తెలుగు వాడకం. |
| 16. | ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీసు కమీషను పరీక్షల్లో తెలుగు మాధ్యమ అభ్యర్థులకు 5 మార్కులు కలుపుట. |
| 17.ఎఎ | కింది న్యాయ స్థానాల్లో తెలుగు అమలు. |



తొలి తెలుగు పదం నాగబు



## 2. ధనంజయుని కలమళ్ల శాసనము.

### (సుమారు క్రీ. 575) - కమలాపురం తాలూక.

ఎపి. ఇం. XXVII - పు. 221.

1. ............
2. క ల్ము [తు]రా
3. జు ధనంజ
4. యుదు రేనా
5. ణ్డు ఏళవ్
6. చిఱుంబూరి
7. రేవణకాలు [వం]
8. పు చెనూరుకాఱు
9. అఱి కళా ఊరి [-]
10. ణ్డ వారు ఊరి ... ...
11. ... ... ... ... ...
12. ... ... ... ... ...
13. ... ... ... ... ...
14. ... ... ... ... ...
15. ... ... ... వఞ్చ [మ]
16. హాపాతకస
17. కు.

ఈ శాసనములో ఱ, ఴ, ఌ, ణ (ణ్డు, ణ్డలలో) అక్షరము లున్నవి. 'వారు' అను బహువచనము కానవచ్చుచున్నది.

భా లెక్కల సమపరించి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో తెలుగుకు అదనంగా కొన్ని అధికార వ్యవహారాలలో ఉర్దూ తదితర భాషలు ఉపయోగించవలసిన ప్రాంతాలు— అధికారభాషా చట్టం 7వ విభాగం క్రింద ప్రకటన.

[జి. ఓ. యం. యస్. నెం. 358, ప్రధాన పరిపాలన (అధికార భాష), తేది: 26వ జూలై, 1985.]

## ప్రకటన.

1966, ఆంధ్ర ప్రదేశ్ అధికార భాషా చట్టం ( 1966 లో ఆంధ్రప్రదేశ్ 9వ చట్టం ) లోని 7వ విభాగం ద్వారా లభ్యమైన అధికారాలను వినియోగించుకొని ఆంధ్రప్రదేశ్ గవర్నరు దిగువ అనుసూచిలోని 3 (అ) 3 (ఆ) గడులలో సూచించిన ఆయా ప్రాంతాలలో 4వ గడిలో సూచించిన భాషలను, 5వ గడిలో తెల్పిన ఆయా అధికార వ్యవహారాలకు తెలుగుకు అదనంగా ఉపయోగించాలని ఇందుమూలంగా ఆదేశిస్తున్నారు.

## అనుసూచి

| జిల్లా పేరు | ప్రాంతం పేరు | | భాష పేరు | అధికార వ్యవహారాలు |
|---|---|---|---|---|
| | మునిసిపల్ ప్రాంతం పేరు | మునిసిపల్ పరిధి క్రింద కురాని తాలూకా ప్రాంతం పేరు | | |
| (2) | (3—అ) | (3—ఆ) | (4) | (5) |
| శ్రీకాకుళం | ఇచ్ఛాపురం | ఇచ్ఛాపురం | ఒరియా | 1. రోడ్లు భవనాల శాఖలో తాలూకా లేదా అందలి భాగం అధికార పరిధిగా ఉన్న సెక్షన్ ఆఫీసర్ల కార్యాలయాలలో భవనాల విభాగానికి చెందిన చిన్న పనులలో టెండరు నోటీసులు, వేలం నోటీసులు చిట్ టెండరు నోటీసులు జారీచేయడం. |
| | సోంపేట | సోంపేట | ఒరియా | |
| | మందస | — | ,, | |
| | టెక్కలి | — | ,, | |
| విశాఖపట్టణం | — | పాడేరు | ఒరియా | 2. తెలంగాణా ప్రాంతంలోని అబ్కారి సర్కిలు ఇన్‌స్పెక్టర్లు సబ్ ఇన్‌స్పెక్టర్ల కార్యాలయాల్లో వేలం నోటీసులు జారీచేయడం. |
| గుంటూరు | గుంటూరు | — | ఉర్దూ | |
| చిత్తూరు | చిత్తూరు | చిత్తూరు | తమిళం. | 3. మత్స్యశాఖ ఇన్‌స్పెక్టర్ల కార్యాలయాల్లోను, వారి తాబేదార్ కార్యాలయాలలోనూ, ప్రజలకు, ప్రజాహితానికి సంబంధించి సాధారణ నోటీసులు, వేలం నోటీసులు జారీచేయుటం. |
| | | బంగారుపాలెం. | ,, | |
| | — | కుప్పం | ,, | |
| | — | సత్యవేడు | ,, | |
| | | పుత్తూరు | ,, | 4. తాలూకా, అంతకు క్రింది స్థాయిలో అటవీశాఖ రేంజి అధికార కార్యాలయాలలో అమ్మకం నోటీసులు జారీచేయుటం. |
| | మదనపల్లి | — | ఉర్దూ | |
| కడప. | కడప | కడప | ఉర్దూ | 5. పంచాయతి సమితి, గ్రామ పంచాయతీ కార్యాలయాలలో టెండరు నోటీసులు జారీచేయడం. |
| | రాయచోటి | రాయచోటి | ,, | |
| | ప్రొద్దుటూరు | ప్రొద్దుటూరు | ఉర్దూ | 6. పౌరనిర్మాణాల శాఖలో తాలూకా స్థాయికి చెందిన సెక్షన్ ఆఫీసర కార్యాలయాలలో రూ. 10,000— అంతకు లోపు చిన్నతరహా పనులకు చెందిన చిట్ టెండరు నోటీసులు జారీ చేయడం. |
| అనంతపురం | అనంతపురం | — | ఉర్దూ | 7. తహసీల్దారు కార్యాలయములోనూ, తాలూకా అంతకు క్రింది స్థాయిలో రెవిన్యూ శాఖలోని ఇతర కార్యాలయాలలోనూ టెండరు నోటీసులు జారీచేయడం ఏదైనా ప్రతిపాదనకు సంబంధించి ప్రజల అభ్యంతరాలు తెలుప దలచినట్లయితే, వాటిని తెలుపవలసిందని కోరుతూ నోటీసును ప్రకటించడం. |
| | గుత్తి | — | ,, | |
| | ధర్మవరం | — | ,, | |
| | రాయదుర్గ్ | — | ,, | |
| | గుంతకల్ | — | ,, | |
| | కదిరి | — | ,, | |
| | హిందూపూర్ | — | ,, | |
| | తాడిపత్రి | — | ,, | |




# AN EXTRACT OF PART I
# OF
# ANDHRA PRADESH GAZETTE

ISSUE No. 1. DATED 7th JANUARY 1988
PUBLISHED AT PAGES 11-12.

URDU IN ADDITION TO TELUGU
AGE IN ANDHRA PRADESH STATE
MENTS TO NOTIFICATION ISSUED
Ms. No. 472, GENERAL ADMINIST-
(OL-I) DEPARTMENT, DATED
Y, 1977.

No. 603, General Administration (OL-I),
5th December, 1987.]

wing amendments to the Notification
O. Ms. No. 472, General Administration
partment, dated 4th July, 1977 are pub-
Para 1 (3) :

Words:—"Guntur, Kurnool and Cuddapah

'Guntur, Kurnool, Cuddapah and Anan-
cts"

(9) :

Words:—"Anantapur, Cuddapah Kurnool

'Guntur, Anantapur, Cuddapah Kurnool

D. NARAYANA RAO,
Deputy Secretary to Government.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో తెలుగు భాషకు అదనంగా, ఉర్దూ వాడక - సవరణ
చట్టం 7వ విభాగం క్రింద జి. ఓ. ఎం. ఎస్. నెం. 472, ప్రధాన పరిపాలన
(అభా-1) శాఖ, తేది 4-7-1977లో జారీ చేసిన ప్రకటనకు సవరణలు

[జి. ఓ. ఎం. ఎస్. నెం. 603, ప్రధాన పరిపాలన (అభా 1) తే:
5-12-1987.]

జి. ఓ. ఎం. ఎస్. నెం. 472, ప్రధాన పరిపాలన (అభా-1) శాఖ తేది
4-7-1977 లో 1966వ సంవత్సరపు అధికార భాషా చట్టంలోని 7వ విభాగం
క్రింద జారీచేసిన ప్రకటనకు క్రింది సవరణలను ఆంధ్రప్రదేశ్ గెజిట్ [illegible]
సంచికలో ప్రచురించాలి.

పేరా 1 (9) యందు:

"గుంటూరు, కర్నూలు, కడప జిల్లాలలోను ........." కు బదులుగా
"గుంటూరు, కర్నూలు, కడప, అనంతపురం జిల్లాలలోను ......."
గా చదవాలి.

పేరా 1(9) యందు:

"అనంతపురం, కడప, కర్నూలు ..............." కు బదులుగా
"గుంటూరు, అనంతపురం, కడప, కర్నూలు ..........." గా [illegible]

డి. నారాయణరావు.
ప్రభుత్వ ఉపకార్యదర్శి, ([illegible])

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము.
ప్రధాన పరిపాలన (అధికార భాష-1) శాఖ

4-B.

---

మెమో నం. ౧౧౯/అధికార భాష-1/[illegible]. తేదీ 31-3-1983

---

విషయము:- [illegible] లోని 7వ విభాగం [illegible] ఉర్దూలో కూడా ఉంచడం గురించి.

నిర్దేశము:- ప్రధాన పరిపాలన (అధికార భాష-1) శాఖ, జి.ఓ.ఎం.ఎస్. నెం. 472, తేదీ 4-7-1977

---

అధికార భాష అయిన తెలుగుకు అదనంగా ఉర్దూను కొన్ని కార్యకలాపములకు [illegible] విషయమై పై నిర్దేశంలోని జి.ఓ.లో ఉత్తరువులు ఇచ్చారు. దరిమిలా ఈ ఉత్తరువులు [illegible]గా అమలు పరచమని జ్ఞాపికలు పంపించడమయింది.

ఇతర అంశాలతో పాటు ఉర్దూ భాష చదువు, మాట్లాడు ప్రజలు అధిక సంఖ్యలో [illegible] ప్రదేశాలలో [illegible] బోర్డులను ఉర్దూలో కూడా ప్రదర్శించాలని పై నిర్దేశంలో ఉత్తరువులీయడ[illegible]యింది. దిగువ తెలిపిన ప్రాంతాలలో ఉర్దూ మాట్లాడు, చదువు ప్రజలు అధిక సంఖ్యలో [illegible]న్నారు.

| | |
|---|---|
| . గుంటూరు జిల్లా: | గుంటూరు పట్టణ ప్రాంతం. |
| 2. చిత్తూరు జిల్లా: | మదనపల్లె పట్టణ ప్రాంతం. |
| 3. కడప జిల్లా: | కడప, రాయచోటి, ప్రొద్దుటూరు పట్టణ ప్రాంతాలు మరియు పట్టణ ప్రాంతాల వెలుపల కడప, రాయచోటి, ప్రొద్దుటూరు తాలూకా ప్రాంతాలు. |
| 4. అనంతపురం జిల్లా: | అనంతపురం, ధర్మవరం, రాయదుర్గం, గుత్తి, [illegible] కదిరి, హిందుపురం, తాడిపత్రి [illegible] ప్రాంతాలు. |
| 5. కర్నూలు జిల్లా: | కర్నూలు, ఆదోని, నంద్యాల, ఆత్మకూరు, ఎమ్మిగనూరు పట్టణ ప్రాంతాలు. కర్నూలు, ఆదోని, ఆళ్ళగడ్డ పట్టణ ప్రాంతాల వెలుపల ఆ తాలుకా ప్రాంతాలు. |
| 6. ప్రకాశం జిల్లా: | మార్కాపురం పట్టణ ప్రాంతం. |
| 7. నెల్లూరు జిల్లా: | నెల్లూరు పట్టణ ప్రాంతం. |
| 8. మహబూబ్‌నగర్ జిల్లా: | మహబూబ్‌నగర్, గద్వాల, నారాయణపేట పట్టణ ప్రాంతాలు, మహబూబ్‌నగర్ పట్టణ ప్రాంతాల వెలుపల ఆ తాలూకా ప్రాంతం. |
| 9. హైదరాబాదు జిల్లా: | జిల్లాలోని అన్ని ప్రాంతాలు. |

12. కరీంనగర్ జిల్లా: కరీంనగర్, జగిత్యాల పట్టణ
13. వరంగల్లు జిల్లా: వరంగల్లు పట్టణ ప్రాంతం.
14. ఖమ్మం జిల్లా ఖమ్మం పట్టణ ప్రాంతం.
15. నిజామాబాదు జిల్లా: నిజామాబాదు, కామారెడ్డి, బోధన్
నిజామాబాదు, బోధన్ పట్టణ
తాలూకా ప్రాంతాలు.
16. ఆదిలాబాదు జిల్లా: ఆదిలాబాదు, కాగజ్‌నగర్
నిర్మాలు పట్టణ ప్రాంతాలు,
ముధోల్ పట్టణ ప్రాంతం వెలుపల
ప్రాంతాలు.
17. నల్గొండ జిల్లా: నల్గొండ, భువనగిరి పట్టణ ప్రాం

3. అయితే ఈ ప్రాంతాలలో కార్యాలయాల పేరు బోర్డులు ఉర్దూ ప్రదర్శించడం లేదని ఫిర్యాదులు అందుతున్నవి. అందువల్ల పై తెలిపిన జిల్లాలలో ... ప్రాంతాలు, పట్టణ ప్రాంతాల వెలుపలగల తాలూకా ప్రాంతాలలో గల అన్ని కార్యాలయాల కార్యాలయాల బోర్డులు తెలుగుతో పాటు ఉర్దూలో కూడా ప్రదర్శించాలి. ... ఇంగ్లీషు వ్రాయవలసిన అవసరం లేదు.

4. పైన పేర్కొన్న జిల్లాల కలెక్టర్లు పురపాలక సంఘాలతో సహా పరిధిలోని అన్ని కార్యాలయాలు తమ పేరు బోర్డులను తెలుగుతో పాటు ఉర్దూలో కూడా ... ఆదేశాలివ్వడం మాత్రమే కాక అవి అమలు అయినట్లు తెలుసుకుని మరి ప్రభుత్వానికి ... 1983 జూన్ మాసాంతంలోగా పంపమని కోరడమైంది.

శ్రావణ్‌కుమార్,
ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి

జిల్లా కలెక్టర్లు,
గుంటూరు, చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు, ప్రకాశం,
నెల్లూరు, హైదరాబాదు, రంగారెడ్డి, మెదకు, కరీంనగర్, వరంగల్లు,
ఖమ్మం, నిజామాబాదు, ఆదిలాబాదు, నల్గొండ జిల్లాలు.

ఇతర జిల్లా కలెక్టర్లకు సమాచారం నిమిత్తం.

అధికార భాష తనిఖీ అధికార్లకు.

/ఉత్తర్వు మేరకు పంపడమయింది/

విభాగాధికారి

